# పీఠిక

కడచిన యాభై సంవత్సరాలమధ్య ఆంధ్రదేశంలోనూ, ఆంధ్రదేశానికి వెలుపలనూ ఆంధ్రదేశాభ్యున్నతికై కృషి చేసిన, చేస్తూవున్న ఆంధ్రప్రముఖులను ఒకచోటచేర్చి, వారి కృషిని వివరించి 'విశాలాంధ్రము' అనే పేరున యీ పుస్తకాన్ని ఆంధ్రులకు సమర్పిస్తున్నాను.

ఇది తారీఖులకున్నూ, జీవితవివరాలకున్నూ సంబంధించిన జీవితచరిత్రల పుస్తకం కాదు. ప్రముఖుల దేశహితైక జీవనాన్ని వివరించడానికిన్నీ, వారి చిత్తరువును గీయడానికిన్నీ ప్రయత్నం చేయబడింది. ఈలాటి వుద్దేశంతో ఆంధ్రంలో వ్రాయబడ్డ పుస్తకాల్లో యిదే మొదటిదని నా అభిప్రాయము.

ఈ పుస్తకంలో చేర్చవలసిన చిన్నలూ, పెద్దలూ యింకా కొందరు వున్నారు. అయితే, వారివివరాలు తెలియకపోవడంచేత వారిని దీనిలో చేర్చేగౌరవం నాకు లభించిందికాదు. దీనిలోని శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారి కథ 'ప్రజామిత్ర' నుండిన్నీ, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి కథ 'భారతి' నుండిన్నీ తగుమార్పులతో గ్రహింపబడ్డవి. ఈ పుస్తకం అందరికీ తెలిసేటట్టుగా వాడుకభాషయందు వ్రాయబడింది. దీనిని రచించడంలో తోడ్పడిన మిత్రులందరికీ నా కృతజ్ఞతను విశదీకరించుకొంటున్నాను.

ఈ 'విశాలాంధ్రము' దేశంలోనూ దేశంవెలుపలనూ వుండే ఆంధ్రుల ఆదరణకు పాత్రంకాగలదని తలుస్తాను.

ఆవటపల్లి నారాయణరావు.
225/8 లూయీస్ట్రీటు, రంగూను.

# విషయసూచిక

విషయసూచిక

విషయసూచిక

విషయసూచిక



మహారాజా శ్రీ రావు వేంకటమహీపతి
సూర్యారావు బహద్దరుగారు



మహారాజా శ్రీ విక్రమదేవవర్మ మహాప్రభుగారు

# విశాలాంధ్రము



## మహారాజా శ్రీ రావు వేంకటమహీపతి సూర్యారావు బహద్దరు గారు

సాయంకాలం నాలుగు గంట లయింది. మహారాజావారు ధోవతిని, ఆఫ్ ఆరమ్ చొక్కాను ధరించి కూర్చున్నారు. ఆంధ్ర దేశ సేవావిధానాని కంతకూ కర్తయైన ఆ సేవా ధురంధరుని, నవనవాదర్శ ప్రేరితుడైన ఆ మానవోత్తముని చూడ్డంతోనే నాకు ఒకవిధమైన వుద్రేకం కలిగి, నా సంభాషణ తెలుగులోనే అయినప్పటికీ, కొంచెం తొట్రుపాటు పుట్టింది. అంతట మహారాజావారు "నాయుడుగారికీ నాకూ భేదం యేముంది? వారితో మాట్లాడినట్టుగానే నాతోనూ మాట్లాడండి. అంతా వొక్కటే" అన్నారు. ఈ మాటలు మహారాజావారి ఆంతర్యాన్ని వ్యక్తపరచడమే కాదు, అవి యిప్పటికిన్నీ నాచెవిలో మ్రోగుతూనే వున్నవి.

ముప్పయి యేండ్ల క్రిందట కాబోలు, నరసారావుపేటలో కృష్ణామండల సంఘసంస్కరణ సభ జరిగింది.

దానికి మహర్షి వేంకటరత్నం నాయుడుగారు ఆధిపత్యం వహించారు. అధ్యక్షులవారు సంఘ సంస్కరణం యొక్క అర్థాన్ని విశదీకరిస్తూ "సంస్కరణం అంటే స్త్రీ పునర్వివాహాలు చేయడంమాత్రమే కాదు; నిమ్నజాతీయులకు వసతిగృహాలు, స్త్రీలకు ప్రసవవైద్యాలయాలు, బీదలకు ధర్మశాలలు, కార్మికులకు అనుకూలమైన ఏర్పాటులు, అనాథ బాలబాలికలకు శరణాలయాలు స్థాపించడంకూడాను" అని మహోపన్యాసం చేశారు. కాని, ఈ పని చేసేదానికి విద్య, పలుకుబడి, తీరికగల మనుష్యులు లేక యీ కార్యక్రమం కేవలం వాగ్రూపంగానే వుంటూవచ్చింది. ఇక ప్రజాభిప్రాయం చూస్తే, సంఘ సంస్కరణం అనే పేరు చెప్పితేనే పూర్వాచారప్రియులు ఒంటికాలుమీద లేచి, బుస్సులు కొట్టుతూ వచ్చేవారు. బిపిన చంద్రపాలుతో కలిసి తేనీరు పుచ్చుకొంటే వెలి. స్త్రీ పునర్వివాహాలకు వెళ్లి తాంబూలం పుచ్చుకొంటే వెలి. సముద్రయానం చేసిన వారితో భోజనం చేస్తే వెలి. ఆదిమాంధ్రులను పౌర సభలకు రానిస్తే వెలి. యుక్తవయసు వచ్చిన ఆడపిల్లలను పాఠశాలకు పంపితే వెలి. మెదిలితే వెలి. కదిలితే వెలి.—ప్రజాభిప్రాయం యిట్లా ఘనీభవించిపోయి, ఏమి

చేసేదానికిని తగిన మనుష్యులున్ను, తగిన ద్రవ్యమున్ను లేక పెనగులాడుతున్న కాలంలో (శ్రీ) వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు పీఠికాపుర సంస్థానాధిపత్యం వహించారు.

శ్రీ సూర్యారావు బహద్దరువారు యువకులు, విద్యావంతులు, సంస్కరణాభిలాషులు, సేవాభిరతులు అనే ప్రతిష్ఠతో వచ్చారు. దేశంయొక్క అదృష్టంవల్ల పిఠాపురం రాజావారి కళాశాలకు వేంకటరత్నం నాయుడుగారు అధ్యక్షులుగా ఉండడం తటస్థించింది. నాయుడుగారివద్ద ఏదో మచ్చుమందు వున్న దంటారు. వారు ఈ మందును చల్లి శ్రీ డాక్టరు పట్టాభి సీతారామయ్య, ముట్నూరు కృష్ణారావు, అయ్యదేవర కాళేశ్వరరావు, డాక్టరు వేమూరి రామకృష్ణారావు, పిల్లలమఱ్ఱి ఆంజనేయులు, కోపల్లి హనుమంతరావు మొదలైనవారిని దేశహితైకాభిలాషులనుగా మార్చి దేశానికి అర్పించారు. వీరినేకాక అక్కడపిఠాపురంలో సంస్కరణాభిలాషతో వుబుకుచున్న శ్రీ రాజావారిమీదకూడా యీ మందును చల్లి వారిని ప్రజాభిమానులుగాను, పరోపకార పరాయణులుగాను, దేశసేవా ధురంధరులుగాను మార్చారు. నాయుడుగారికి తోడు మొక్కపాటి సుబ్బారాయుడుగారి

వంటి సుగుణధనులున్ను, ప్రజాభిమానులున్ను దివానుగా వుండి రాజావారి సంకల్పాలను ప్రోత్సహిస్తూ వచ్చారు.

ప్రాణంకాపాడేదానికిన్ని, బీదల జీవితాన్ని సుఖప్రదం చేసేదానికిన్ని, జ్ఞానాన్ని వ్యాపింపచేయడానికిన్ని, ప్రాచీన విద్యలను ఆదరించేదానికిన్ని కడచిన ముప్పయియేండ్లనుండి శ్రీ సూర్యారావు బహద్దరువారు చేస్తూ వున్న అపారమైన కృషికి సాటి లేదు. ఒకసారి పిఠాపురంలో దసరా వచ్చింది. గుమ్మాలకు పసుపు కుంకుమలు పెట్టి తోరణాలు కట్టారు. కోటగుమ్మం దగ్గర మంగళవాద్యాలు మ్రోగుతూవున్నవి. దర్బారుహాలులో మహారాజావారి యెదుట కవులు తమ కావ్యాలను వినిపిస్తున్నారు; గాయకులు గానంచేస్తున్నారు; పండితులు వాక్యార్థాలు చేస్తున్నారు. నాకు బ్రహ్మానంద మనిపించింది. విద్యాపోషకులును, కళోద్ధారకులును అయిన శ్రీ సూర్యరాయ ప్రభువు అచిరకాలంలోనే అభినవభోజుడని, అభినవ కృష్ణదేవరాయలని పేరు మ్రోగారు. వారియాదరణ ఫలితంగా ప్రాచీన విద్యలు చిగురుటాకులను వేస్తున్నవి; పండితులు తలలెత్తుకొని తిరుగుతున్నారు. పిఠాపురం అందరికీ పుణ్యక్షేత్ర మయింది.

ఆ రోజుల్లో మనకు తగినన్ని విద్యాలయాలే లేవు. యువకుల మనస్సులు బీడుపడ్డవి. దేశహితైకజీవనం లేదు. దేశాభివృద్ధికి గాఢప్రయత్నం లేదు. సమస్త సదుద్యమాలకున్నూ ప్రోద్బలహేతువైన విద్యను అభివృద్ధిపరచేదానికికూడా శ్రీ సూర్యరాయప్రభువే సాహసించారు. వారు పిఠాపురంలోను, రాజమహేంద్రవరంలోను వున్నతపాఠశాలలను స్థాపించారు. కాకినాడలోని తమ రెండవతరగతి కళాశాలను మొదటి తరగతికి మార్చారు. ఉన్నత విద్యాభ్యాసానికై తగుమైన వారిని విదేశ విద్యాలయాలకు పంపి జ్ఞానాభివృద్ధికి తోడ్పడ్డారు. ఎక్కడి కలకత్తా, ఎక్కడి పిఠాపురం? సిటీ కాలేజీకి వ్రాపిరాడడం లేదు. కలకత్తా అంతా గాలించారు : సహాయం దొరికిందికాదు. బ్రాహ్మోధనికులను కదిలించారు : ప్రయోజనం కలిగిందికాదు. చివరకు నిస్పృహతో శ్రీ సూర్యరాయ ప్రభువువంక పెద్దలు తమ దృష్టిని పరపేసరికి 'లేదు' అనే మాట యెరుగని మన ప్రభువే వారికి అడ్డుపడి ఆ గొప్ప ప్రతిష్ఠాపనను నిలువబెట్టారు. విశ్వభారతీ ఆచార్యులైన శ్రీ రవీంద్రనాథ ఠాకూరు తమ భారతిని మహారాజావారి కెరుకపరచినప్పుడుకూడా శ్రీ సూర్యరాయ ప్రభువు

తన సహజౌదార్యంతో పుష్పవర్షంతోపాటు కనక వర్షాన్నికూడా కురిపించి, ఆ విశ్వభారతిని గౌరవించారు. వారు గొప్ప విద్యాభిమానులు.

మహారాజావారి హృదయం యావత్తూ దీనజన సేవాభిలాషతో అల్లుకొనిపోయింది. మహాత్ముడింకా తన హరిజనోద్యమాన్ని ప్రారంభించలేదు. అంటరానితనం బిగుసుకు పోయింది. దేవాలయ ద్వారాలను మూశారు. హరిజనులకు ఆర్థికంగా నిలబడే శక్తి లేదు; నైతికంగా సంఘదౌష్ట్యాన్ని యెదిరించే ధైర్యం లేదు. చెమటబిందువులు రాలితేగాని కూడుగుడ్డలు దొరకని వాళ్లకు విద్యా సౌకర్యం యెట్లా కలుగుతుంది? అట్టడుగున పడి, నలిగి, నుసియైపోయే యీ దిక్కులేని ప్రాణులకు మహారాజావారే దిక్కై, నిమ్నజాత్యుద్ధరణానికి పూనుకొని, అమోఘమైన ఉపకారం చేశారు. హరిజన విద్యార్థులకు సవర్ణులతోపాటు సమానస్థానాలిప్పించారు. పిఠాపురంలోను, కాకినాడలోను వసతి గృహాలను స్థాపించి, భోజనాది సౌకర్యాలను కల్పించి హరిజనులకు విద్యాదానం చేయిస్తున్నారు. రాత్రి పాఠశాలలను స్థాపించి వయోజనవిద్యను ప్రోత్సహిస్తున్నారు. హరిజనుల కీవిధంగా తోడ్పడడమేకాక,

గాంధీమహాత్ముడు తన హరిజనోద్యమాన్ని ప్రారంభించడంతోనే మహారాజావారు తమ కానుకను అర్పించి, హరిజనబాంధవు డనే ప్రతిష్ఠను పొందారు. మహారాజావారి కృపచేత హరిజనులు తరతరాలనుండి చుట్టుకొన్న దాస్యంనుండి విముక్తి చెంది, స్వాతంత్ర్యపథాన నడువగలుగుతున్నారు.

ఆకుపసందు మొక్కలమధ్య, పూల తీగెల మధ్య, పెద్ద నీడచెట్ల మధ్య తలయెత్తుకొని కనుపించే ఆ సుందర మందిరాన్ని, పచ్చనిపచ్చికలపై కేలింతలు కొట్టుతూ తిరిగే ఆ పిల్లలను, సంతోషభరితమైన వారి మొగాలను చూస్తే మహారాజావారే జ్ఞాపకంవస్తారు. ఆ ప్రతిష్ఠాపన యొక్క వాతావరణంలో సదా వారి దివ్యసంకీర్తనమే వినబడుతూ వుంటుంది. ఆ పిల్లలకు తల్లిదండ్రులు లేరు; అన్న వస్త్రాలు లేవు; ఏ పాడుపడ్డ వసారాలోనో నివాసం. దిక్కులేని ఆ పసిసంతానానికి మహారాజావారే తండ్రియై, వారికి అన్నవస్త్రాదు లిచ్చి, విద్యాబుద్ధులను, బ్రతుకునకు అక్కరకువచ్చే వృత్తి విద్యను గరపి, పెద్దలనుచేసి, జీవితసంగ్రామానికి పంపుతున్నారు. యీలాటి వుత్కృష్టసంస్థ మన ఆంధ్రదేశంలో యింకొకటి లేనే లేదు. డాక్టరు బార్నార్డోవలె శ్రీ సూర్యారాయప్రభువు

దిక్కు లేని పిల్లలను తమ శరణాలయంలో పెంచుతూ భారత వర్షమంతటా మన ఆంధ్ర ప్రతిష్ఠను చాటుతున్నారు.

స్త్రీవిద్య అంటేనూ, స్త్రీలకు ప్రత్యేక వైద్యాలయా లంటేనూ, బీదలకు ధర్మశాలలంటేనూ మహారాజావారికి మొదటినుంచీ చాలా అభిమానం. రాజమండ్రిలో కంమ కూరి వీరేశలింగంపంతులుగారు స్థాపించిన శరణాలయం తప్పితే వితంతువులకు చెప్పదగిన శరణాలయం యింకొకటి లేదు. ఆ వొక్కటికూడా పంతులుగారి అనంతరం తగిన వసతులు లేక యెత్తివేయబడే స్థితికి వచ్చింది. మహారాజావారి కిది తెలిసి, వారు దాన్ని తమపోషకత్వం లోకి తీసుకొని, దాని కయ్యే వ్యయం యావత్తూ తామే భరిస్తూ దానిని మిక్కిలి జయప్రదంగా నిర్వహిస్తున్నారు. ఆంధ్ర దేశంలో తగినంత వైద్యసహాయం లేదు. అందునా స్త్రీలకు మరీ తక్కువ. ఈలోటును తీర్చేనిమిత్తమై మహారాజావారు పిఠాపురంలోని బెత్సడా వైద్యాలయానికి అనుబంధంగా స్త్రీలకూ, శిశువులకూ ప్రత్యేకంగా వొక వార్డును కట్టించారు. చికిత్సార్థమై వెళ్లేవారు వుండేదానికి చోటులేక కష్టపడుతూవుంటే ఒక ధర్మసత్రాన్ని ఏర్పర చారు. వారు పడవుజీవనంపాలు కావలసిన ఆడపిల్ల లెందరికో ధర్మ వివాహాలు చేయించి, సంసారిణులుగా

చేసి, స్త్రీయొక్క గౌరవాన్ని, స్త్రీ యొక్క క్షేమాన్ని కాపాడిన మానవోత్తములు. కాకినాడ పెద్దబస్తీ: మేడ లకూ, భాగ్యానికీ తక్కువలేదు. అయినా, ఉండేదానికి యిల్లు, తినేదానికి అన్నం, కట్టుకొనేదానికి బట్ట లేక బీదవారు పడే శ్రమ మనకు అలవాటై పోయింది. ప్రాణ రక్షణాన్ని ప్రధానకర్తవ్యంగా ఎంచుకొనే మహారాజా వారు యీ దరిద్రజీవులకు కట్టించిన దివ్యమైనశాలనూ, పర్వదినాల్లో పిండివంటలతోసహా చేయించే అన్నదా నాన్నీ చూస్తే వారు దరిద్రజనరక్షకులని విశద మవుతుంది. బీదలకును, స్త్రీలకును మహారాజావారు చేసినంత సేవను యింకెవరూ చేయలేదు.

ఐరోపామహాసంగ్రామం వచ్చింది. ప్రభుత్వంవారికి ద్రవ్యసహాయంచేసి, బీదలకు వుచితంగా బియ్యమిప్పించి మహారాజావారు తోడ్పడ్డారు. భారతీయ యుద్ధనిధి కిచ్చారు. చెన్నపురియుద్ధనిధి కిచ్చారు. ఇట్లా యీ యుద్ధ నిధులకు మాత్రమేకాదు, దక్షిణాఫ్రికా భారతీయ సహా యనిధి, బీహారు, క్వెట్టా భూకంపనిధి, సప్తమ యెడ్వర్డు చక్రవర్తి జ్ఞాపకనిధి, జార్జిచక్రవర్తి జూబిలీనిధి, జ్ఞాపకనిధి, క్షయనివారణనిధి, యీలాటివాటి కెన్నిటికో పుష్కలం గా ధనసహాయం చేస్తూవచ్చిన మహోదారులు వారు.

ఇక మహారాజావారు మనభాషకున్ను, మన ధర్మానికిన్ని చేసిన మహాసేవ తరతరాలవారూ జ్ఞప్తియం దుంచుకోతగివుంది. వారు మహాభాష్యానికి ఆంధ్రీకరణం చేయించారు. సీతానాథ తత్వభూషణుని తత్వగ్రంథా లను ముద్రింపించారు. ఆంధ్ర నిఘంటువును వుద్ధరిం చారు. పరిశుద్ధాస్తిక ధర్మప్రచారానికి పెద్ద మొత్తాన్ని మూలధనంగా సమర్పించారు. బ్రహ్మోపాసకులకు కాకి నాడలో దివ్యమైన మందిరాన్ని నిర్మించారు. మహా రాజావారి కథను తలచినకొద్దీ వారిలో కరుణరసమే, మానవసేవే ప్రధాన లక్షణంగా కనిపిస్తోంది. పండిత శివనాథశాస్త్రి, హేమచంద్ర సర్కారు మొదలయిన సుప్రసిద్ధ ఆచార్య పురుషులను వారు ఆదరించారు. పాటో, పద్దెమో, వుపన్యాసమో ఏదో ఒకదాని ద్వారా ఆస్తికధర్మాన్ని, సంస్కరణ బీజాన్ని ప్రజాహృదయంలో నాట ప్రయత్నించినవా రెందరో మహారాజావారి ఆదర ణకు పాత్రులు ఐనారు. విసుగుపుట్టే పరిస్థితులలో కూడా విసువు చెందకుండా మహారాజావారు యీలాటివారికి సంతోష పూర్వకంగా చేస్తూవచ్చిన సహాయం మన యితిహాసంలో ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఆ పుచ్చుకొనే పెద్దలు పుచ్చుకొనిపుచ్చుకొని విసుగుచెందే

వరకున్నూ, ఆ తీసుకొనే సంస్కర్తలు తీసుకొనితీసుకొని సిగ్గుపడేవరకున్నూ యిస్తూనేవచ్చారు ఆ దానకర్ణులు.

మహారాజావారిని గురించి అనేక కవులు నుతించారు; గాయకులు కీర్తించారు. ప్రజాభిప్రాయాన్ని సూచించుటకున్నూ, శ్రీవారి స్వరూపాన్ని తెలుపుటకున్నూ యీ క్రింది పద్యములను ఉదాహరిస్తున్నాను :

సీ. వేదముల్ లాభము లేదంచు వదలిన
బ్రాహ్మణుల్ మరలఁ జేపట్టినారు
శాస్త్రంబులెల్ల నిష్ఫలములే యనుకొన్న
భూసురుల్ పఠియింపఁ బూనినారు
కావ్యంబు లిఁకఁ గొఱగావంచు విడిచిన
విప్రసత్తములు సేవించినారు
కవిత ముమ్మాటికి కక్కఱకు రా దనుకొన్న
ద్విజవరుల్ దాని నర్థించినారు

తే. గానము వృథా యటంచును మానుకొన్న
పుడమివేల్పులు నేర్వంగఁ గడఁగినారు
నీకటాక్షంబుకలిమిని నేఁడు మరల
సూరిజనరక్షణోపాయ, సూర్యరాయ!

సీ. స్థాపించుచున్నావు శరణాలయము లనా
థజనంబులకు నెల్ల దయ దలిర్ప
నెలకొల్పుచున్నావు నిశిపాఠశాలల
నిఱుపేదలకు నెల్ల నెనరు మిగులఁ
బాలించుచున్నావు ప్రసవశాలల స్త్రీల
కష్టముల్ గట్టెక్కఁ గరుణ దనరఁ

గట్టించుచున్నావు ఘనవైద్యశాలలఁ
నోరు లేనట్టి జంతువుల కెల్ల

తే. నిలుపుచున్నావు సత్రముల్ నిండువేడ్క
నార్తులకు నెల్ల నిత్యంబు నన్న మిడఁగ
నీ యుదారత వర్ణన సేయఁ దరమె
యార్యజనగేయ, శ్రీరావు సూర్యరాయ!

సీ. హూణవిద్యాపోషణోత్సుకుండ వనఁగ
నీ కళాశాలలే నిత్య సాక్షి
సరసగీర్వాణభాషాభిమాని వనంగ
శాస్త్రవిద్యాపరిషత్తు సాక్షి
ఆంధ్రకవిత్వతత్త్వాప్లోగుఁడ వనంగ
నవ్యప్రబంధావనంబె సాక్షి
మానినీవిద్యాభిమానమాన్యుఁడ వన
బాలికాజనపాఠశాల సాక్షి

తే. నిర్మలాస్తిక్యపరుఁడవు నీ వనంగ
బ్రహ్మమతతత్త్వరత్నంబె ప్రబలసాక్షి.
నీకు సరిసేయఁదగునట్టి నృపతు లెవరు
సూరిజనగేయ, శ్రీరావు సూర్యరాయ!

సీ. ఇనుఁడ! నీసాయ మ్మపేక్షింపకుండ నే
పాఠశాలయుఁ గట్టఁబడుట లేదు
అనఘ! నీతోడ్పాటు నందకుండంగ నే
భజనాలయము నిల్పఁబడుట లేదు
ధర్మజ్ఞ! నీదానధనము లేకుండ నే
పఠనమందిరము నేర్పడుట లేదు
జనమిత్ర! నీదుబాసట లేకయుండ నే
పరిషత్తు స్థాపింపఁబడుట లేదు

తే. భూపరత్నమ ! యే ప్రతిష్ఠాపనమును
సాఁగుటయె లేదు నీదు ప్రశస్త్యంబు లేక
చినుకులను జుక్కలను లెక్కచేయవచ్చు
నీదు ధర్మంబుల గణింపరాదుసుమ్ము !

తే. గాయకుం డైన బుధుఁ డైనఁ గవియు నైన
వాయువును బిల్చుకుండినవాఁడు, నీదు
సాయమొందనివాఁడు భూస్థలిని లేఁడు
బళిర ! శ్రీసూర్యరాయ ! విద్వద్విధేయ !

మన ఆంధ్రదేశంయొక్క సర్వతోముఖాభివృద్ధికై మహారాజావారు చేసిన కృషి, చేసిన సేవ, చూపిన ఔదార్యం ఆధునికాంధ్ర చరిత్రలో సాటిలేనివిగా వున్నవి. మన ఆధునిక ధార్మిక, సాంఘిక, నైతికాభివృద్ధి శ్రీ సూర్యరాయ ప్రభువునే ఆశ్రయించుకొని వుం దని నా విశ్వాసం. కడచిన యిరవై అయిదేండ్లలోను మనఅభివృద్ధికై జరిగిన అపారమైన కృషిలో శ్రీ సూర్యరాయ ప్రభువుకు ప్రథమస్థానం యివ్వవలసివుంది. మహారాజా శ్రీ రావు వేంకట మహీపతి సూర్యారావు బహద్దరులాంటి విద్వత్ప్రభువు, భాషాభిమాని, పండిత పోషకుడు, సేవాభిలాషి, సంస్కర్త, పరోపకారపరాయణుడు, దయాళువు, మానవోత్తముడు యీ మధ్యకాలంలో మన ఆంధ్రదేశంలో పుట్టలేదు. " పరమార్థ చింతయే మాకు లక్ష్యము. దైవమే మాకు తోడు."

అని యీ మధ్య మహారాజావారు పలికిన వాక్యమే వారి జీవితానికి మూలసూత్రంగా వుంది. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఈ క్రింది గీతికను మన ఆంధ్రదేశం నేడు శ్రీ సూర్యరాయ ప్రభువుయొక్క ఋణాన్ని కొంతవరకైనా తీర్చుకొనే ఉద్దేశంతో—

జయము! జయము!

లలిత సుమనోజ్ఞ కావ్యమంజుల లతాంత
మాలికాభరణా వినిర్మల విశేష
సుగుణమాణిక్య దివ్యతేజో విరాజి
దీనజన హృదయాంతర స్థిరవిహార
రామరాజేంద్ర శ్రీ సూర్యరాయ

జయము! జయము!

అని సుస్వరంతో గానంచేస్తోంది.

---

## మహారాజా

## శ్రీ విక్రమదేవవర్మ బహద్దరు గారు

విశాఖపట్టణ సముద్రతీరంలో వుంది ఒక చక్కని సౌధం. అది శ్రీ జయపురం మహారాజాగారి రమ్య హర్మ్యం.

మహారాజాగా రానాడు కొంచెం శుష్కించి వున్నారు. కాని ముఖవికాసంలో తపోత్ర తేజంమాత్రం ముద్రించినట్టుగా వుంది. ఆయన వస్తుతః ఆజాను బాహులైన స్ఫురద్రూపులు. ఆయనవి గంభీరభావ గర్భితమైన చూపులు. ఆయన తెల్లని దేశీయవస్త్రాలు ధరించి, విశాలమైన తమ కార్యస్థానంలో విశ్రమించి వున్నారు. అప్పుడు శ్రీవారు ఆంధ్రపత్రిక చదువు తున్నారు. దగ్గరగా వొక చిన్న బల్లమీద కృష్ణా పత్రిక, భారతి వున్నవి. నేను నమస్కరించడంతోటే "ఎప్పుడు వచ్చారు ?" అని ప్రశ్నించి, బర్మా ఆంధ్రుల యోగక్షేమాలనుగురించి, ఉత్కళుల పరిస్థితు లనుగురించి సంగ్రహంగా నేను చెప్పిన విషయాలను ఆలకించారు.

శ్రీ విక్రమదేవవర్మ బహద్దరుగారు సంస్థానాధి పత్యం రాకపూర్వం యెంత నిరాడంబరంగా వుండే

వారో ఆ ఆధిపత్యం వచ్చినతరువాతకూడా అంత నిరాడంబరంగానే వున్నారు. సహజమైన ప్రతిభకు పూత మెఱుగులతోటి పనిలేదు. వారు ఆంధ్ర సాహిత్యంలోనూ, శాస్త్రమీమాంసలలోనూ నిమగ్నులై నిత్యానుష్ఠానంగా కృషిచేయడం అప్పుడూ వున్నది; ఇప్పుడూ వున్నది.

శ్రీమహారాజాగారి ఎస్టేటు చాలా పెద్దది. కాని దానికంటె పెద్దది వారి హృదయం. "రవి కాననిచో కవికాంచు" నన్నట్టుగా వారి కావ్యసృష్టిలో మానవ దృష్టికి గోచరింపని, అద్భుతమైన, ఆనందకందములైన విచిత్రవిశేషము లనేకములు కనిపిస్తాయి. వారు రచించిన మానవతీ చరిత్రము, శ్రీనివాస కల్యాణము, రాధామాధవము ఆంధ్రసరస్వతికి సమర్పింపబడిన పూజా పుష్పాలు. ఆ పుష్పాలలో సువాసనలే కాదు, వర్ణాలంకార సౌందర్యమే కాదు, మధురమైన మకరందంకూడా ఉన్నది. రాధామాధవము ముఖ్యంగా చదివి తీరవలెను. అందులో రాధామాధవుల ప్రేమను విశుద్ధమైన ఆకాశ గంగవలె, అమృతప్రవాహములాగున చిత్రించినారు. చిత్రించడమే కాదు, మానవహృదయ విపంచీ తంత్రులమీద ఆలాపన చేసినారు.

శరన్నవరాత్రులలో ప్రతిసంవత్సరం జయపురంలో పూజలు జరుగుతూ వుంటాయి. ఆ నవరాత్రులలో జయపురం ఒక బ్రహ్మాండమైన ఆంధ్రవిశ్వకళాపరిషత్తులాగున వుంటుంది. పండితులు, కవులు, గాయకులు, ధనుర్విద్యా ప్రవీణులు, మల్లవీరులు మొదలైనవా రందరూ తమతమ నేర్పుతీర్పులన్నీ మహారాజావారియెదుట ప్రదర్శించిప్రశంసలూ, ప్రత్యేకసత్కారాలూ పొందిపోతూవుంటారు.

మహారాజావారు పండితప్రియులే కాకుండా, సామాన్యజనపోషకులున్నూ. వారిది ఆర్తనాదం వినలేని జాలిగుండె. శరన్నవరాత్రులలో అహోరాత్రాలూ అన్నదానం జరగవలసిందే.

మహారాజావారితో సన్నిహితులుగావుండి ఆయన అంతరాత్మ ఎటువంటిదో పరిశీలించి ప్రశంసించిన ప్రముఖు లున్నారు. ఆయనలో యెంత క్షాత్రం వుందో అంత సాధుస్వభావమూ వుంది ; ఎంత రాచఠీవి శోభిస్తుందో అంత తపస్సంపన్నత్వమూ ప్రకాశిస్తుంది. ఆర్థికం, పారమార్థికం రెండూ ఆయనలో అతిసహజంగా అవినాభావ సంబంధం కలిగివున్నాయి. ద్రవ్యం దివ్యంగా వుపయోగించే భవ్యమూర్తి ఆయన. జయపురాధీశ్వరులు జగద్వంద్యులని విద్వద్వరేణ్యులచేతను, విశ్వవిద్యా

లయాధిపతులచేతను వినుతింపబడ్డారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం శ్రీ మహారాజావారికి డి. లిట్. (అనగా డాక్టరు ఆఫ్ లిటరేచరు) బిరుదం యిచ్చి ఆ గౌరవబిరుదానికి వొక నూతన ప్రతిష్ఠా గౌరవం కల్పించింది.

శ్రీ మహారాజావారికి ఆంతరంగిక సచివులూ, సహచరులూ, వారి ఉదారతారసాస్వాదన మొనర్చినవారూ అయిన కవిభూషణ శెట్టి లక్ష్మీనరసింహంగారు ఆనందపరవశులై తాము మహారాజావారికి కానుకగా సమర్పించిన "ప్రభాసశాపవిమోచనం" అనే కావ్యంలో మహారాజావారి గుణాతిశయాలను తనివితీరేటట్టుగా కర్ణపేయంగా వర్ణించారు. ఆంధ్రభాష ఉన్నంత కాలమూ ఉండవలసిన శిలాశాసనమువంటిది యిది:

మహితమైన భరద్వాజమౌనిగోత్ర
హారమునకు నాయకమణియై జనించి,
రామరాజ్యం బనఁగ మహారాజగుచును
జయపురం బేలుచున్నట్టి జనవిభుండు,

శ్రీకృష్ణచరణవారిజమధులిట్టు, దీ
నాగ్రిబంధురముల కంబురుట్టు,
విద్యాధనమునకు విరివి యౌ కొట్టు, క
విప్రకాండమునకు వేల్పుఁజెట్టు,
క్రమమైన నడవడికి మనికిపట్టు, సు
స్థిరధైర్యమునకుఁ బసిండిగట్టు,

మనుజసంఘమున కెల్లను దలకట్టు, సౌ
శీల్యసంపత్తికిఁ జివరి మెట్టు,
దేహ మూను కట్టు, సాహిత్యసమ్రాట్టు,
వచనములఁ ద్రిశంకుపట్టి జట్టు,
వక్రతలకుఁ బెట్టు, విక్రమదేవవ
ర్మవరరాట్టు, మను విరాట్టునట్టు!

సాటిగాఁ జెల్లు భోజనృపాలునకుఁ గృష్ణ
దేవరాయలకు నేకోవిదుండును,
హిమధామమల్లికాకుసుమదామసమమై జ
గమ్ములఁ గ్రమ్మె నేఘనుని కీర్తి,
త్యజియింపఁబో దాశ్రయముఁ గోరి వచ్చిన
జనముల నేదయాశాలిచేయి,
సత్యశౌచాదులౌ సద్గుణంబుల కేమ
హాత్ముని మానసం బాటపట్టు,

మానుపడఁజేసి ధిషణా నే ప్రభుఁడు ధీప
టుత్వమున గడించెను డీలిటు బిరుద, మతఁ
డీశుపదపద్మముల నిల్పు హృదయము మధు
లిట్ సరణిఁ గృష్ణచంద్రదేవేట్ సుతుండు.

శెట్టి లక్ష్మీనరసింహముగారు వ్రాసినది వట్టి గాలి మాట కాదు; స్వయముగా శ్రీ మహారాజావారి హృదయమును సోదాచేసి వ్రాసినది.

శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు జయపుర రాజ్యాధిపత్యమును వహించి ఇప్పటికి పది సంవత్సరాలు మాత్రమే అయింది. ఇంత కొద్ది కాలములోనే వారు

ప్రజాహృదయ సామ్రాజ్యాన్ని కూడా వశంచేసుకున్నారు. వారు పోషించే సంస్థలు వారి దాతృత్వమునూ, వారి ప్రజాభిమానాన్నీ ప్రత్యక్షంగా లోకానికి చూపిస్తున్నాయి. విద్యాశాల అయితేనేమి వైద్యశాల అయితేనేమి, ముక్తికొఱకైతేనేమి భుక్తికొఱకైతేనేమి, సత్కార్యమైతే చాలు, సత్కారం జరిగిందన్నమాటే. ధర్మనిర్వహణం మహారాజా విక్రమదేవవర్మగారి సహజ ధర్మం. ఈ విధంగా వారు అనేక సత్కార్యాలకు సమర్పించే ద్రవ్యం వారి ఖజానాలోనుంచి బయలుదేరిన ప్రవాహం లాగుంటుంది. మచ్చుకు నాకు లభించిన కొన్ని పద్దులు మాత్రం చూపిస్తాను :

| | | |
|---|---|---|
| ఉత్కళ నిఘంటువుకు | రూ. | 20,000 |
| గౌడీయ మఠమునకు | ,, | 12,000 |
| డఫరిన్ గోషా ఆస్పత్రికి | ,, | 10,000 |
| రామకృష్ణా వసతిగృహానికి | ,, | 10,000 |
| లింలిత్గో ప్రభ్వీ క్షయ చికిత్సా నిధికి | ,, | 10,000 |
| విద్యార్థి వేతనములకు | ,, | 6,000 |
| హిందీభాషాభివృద్ధికి | ,, | 5,000 |
| సెంచురీ క్లబ్బుకు | ,, | 4,000 |
| డాక్టరు మూంజీ సైనిక విద్యాలయానికి | ,, | 3,000 |

శ్రీవారి దానధర్మాల కవిలెలో యివి అన్నీ చిల్లర పద్దులే. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి సాలుకు వొక లక్ష రూపాయలు పునరావృత్తిగా యివ్వడానికి వారు గట్టి యేర్పాటు చేసివున్నారు. ఇంత సంతత ధారగా వస్తూవున్న ధారాళమైన యీ విరాళం మన విశ్వవిద్యాలయ భాగ్యవిశేష మనక తప్పదు. త్రికరణ శుద్ధిగా దీవించి యిచ్చే కట్నము లివి. వారి సత్సంగత్వమే వారిని యీ పుణ్యాలకు పురికొల్పుతున్నది. వయస్సుతోపాటు వారి యశస్సూ వృద్ధి అవుతున్నది. ఆంధ్రదేశము జయపురాధీశ్వరులకు జేజేలు పల్కుతున్నది.



## శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు

అప్పటికి అసలైన మందువేసంగి యింకను సమీపించలేదు. నా జట్కాబండి రాజాగారి దివాణాన్ని సమీపిస్తున్నది. మంచి లేమావిగున్నల మధ్యనుంచి గుఱ్ఱపుబండి నడుస్తున్నది. శాలరసాలసాల నవపల్లవాల మధ్య మామిడికాయల గుత్తులు నాకు స్వాగత మివ్వడానికి రాజావారు కల్పించిన అలంకార తోరణంవలె నేత్రోత్సవంగా వున్నవి.

రాజమందిరం ప్రవేశించాను. ప్రాకారద్వారంవద్ద రాతిలో చెక్కబడిన యేనుగులు శుభప్రదంగా తొండాలు సారించి, పహరాయిస్తున్నవో అన్నట్లుగా ప్రతిష్ఠింపబడి వున్నాయి. ఆద్వారం దాటి వెళ్లగానే మొగసాల వొకటి వసారాలవరుసతో కన్పించింది. అది దాటి లోపలికి పోవాలంటే యథేచ్ఛగా యెవరంతట వారు పోవడానికి వీలులేదు. అక్కడ పహరావుంటుంది. పహరాదాటి ప్రవేశించడానికి ప్రభువుల అనుమతి వుండాలి. మొదటి ద్వారం నుంచి చివరిద్వారంవరకు పహరాజవానులు ఆ దివాణంలో మాత్రం అంత ఆర్భాటంగా లేరు. వచ్చినవారికి వారు హెచ్చుగా మర్యాదలు చేస్తారు కాని అందరాని ద్రాక్షపండులాగా అంతఃపురంలో కూర్చుండి ఆప్తులు గాని, ఆశ్రితులుగాని, ఆపన్నులుగాని వస్తే "యిప్పుడు

కాదు. ఇంకొకప్పుడు రండి " అని కబురు చేయడం ఆ దివాణంలో ఆచారంగాని, అభ్యాసంగాని కాదు.

రాజాగారు తమమందిరంముందర వుండే ముఖ మండపాన్నే హాలుగా మార్చి, అక్కడే కొలువుదీర్చి, తమ కార్యకలాపంగాని, ఇష్టాగోష్ఠిగాని, పండిత ప్రసంగాలుగాని జరుపుతూవుంటారు. నేను వారి దర్శనానికి వెళ్లినప్పుడు రాజాగారొక చిత్రపటరచనావ్యాసంగంలో నిమగ్నులై వున్నారు. చిత్రరచనలో ఆయన సిద్ధహస్తుడు. ఆయన స్వయంగా వ్రాసిన చిత్తరువులు కొన్ని ఆ గోడలమీద తగిలింపబడివున్నాయి. తలుపురెక్కల మీద రాజాగారి జనకతండ్రిగారి చిత్తరువొకటి చిత్తాకర్షణీయంగా, ఉత్తమ క్షాత్ర తేజం ఉట్టిపడుతూవున్నది. రాజాగారి పూర్వులైన వెలమవీరుల శిలా ప్రతిమలు కూడా జీవకళ లుట్టిపడేటట్లుగా అక్కడ ప్రతిష్ఠింపజేసి వున్నారు. రసపిపాస ఆయనరక్తంలో జీర్ణించివుంది.

నూజవీడుజమీందార్లలో వుయ్యూరురాజాగారైన శ్రీ వేంకటాద్రి అప్పారావుబహద్దరుగారు పెద్ద యెస్టేటుకు ప్రభువులు, పట్టభద్రులు, కావ్యకళాప్రపూర్ణులు. శ్రీ రాజాగారు సర్వసాధారణమైన తెల్లని దుస్తులు ధరించి కల్లకపటాలెరగని నిర్మలహృద

యంతో మనతో మాట్లాడుతున్నప్పుడు ఆ వెలమదొర యీ కాలానికి వొక వింత తేజోమూర్తిగా కన్పిస్తారు. అనేకతరాలనుండి అవిచ్ఛిన్నంగా వస్తూవున్న అచ్ఛమైన క్షాత్రం ఆ వెలమరక్తంలో అంతర్గతమై ఆయనలో మరింత వన్నెకెక్కింది. కృష్ణా జిల్లాబోర్డు ఎన్నికల సమయంలో శ్రీ రాజాగారిని బెజవాడప్లాటుఫారం మీద ఒకమారు చూచాను. ఈమారు వారి దివాణానికి వెళ్లి సన్నిహితంగా సందర్శించాను. జమీందారు అనగానే భోగలాలసు డనేభావం ప్రజల్లో యేర్పడింది. జమీందార్లు స్వసౌఖ్యమేగాని ప్రజాక్షేమం చూడరనే సిద్ధాంతం ప్రసిద్ధమైపోయింది. కాని వుయ్యూరు రాజాగారిని చూచినవారికి ఆ భావాలు కలగవు. వారు లోకోత్తరపురుషులుగా, సత్యకాలపు మానవులుగా కన్పిస్తారు. వారు నూతనధర్మాలను, నూతనాదర్శాలను సవిమర్శగా గ్రహించి, సంస్కారవాసనలతో సంచరింపగల సమర్థులు, సరసులు, సజ్జనులు అని వొప్పుకోకతప్పదు. ఆయనలోని చిత్తసంస్కారము పాదరసంవలె ఎప్పటికప్పుడు తళతళలాడుతూ సమయస్ఫూర్తిగా, కాలవేగంతో ప్రవహిస్తూవుంటుంది. ఆయనకుగల దాక్షిణ్యంలో ప్రావీణ్యం అతిసహజంగా వుంటుంది.

పండితులతోటి ప్రసంగం ఆయనకు విందుభోజనం. కావ్యరచన, కళోపాసన—యీ రెంటికీ ఆయన ఆనంద గజపతిలాగున ఆనందతరంగాల్లో ఓలలాడుతారు. ప్రత్యేకనాటకశాలను, నాటక ప్రదర్శన పరికరాలను ఏర్పాటుచేయించి నటబృందంచేత నాటకప్రదర్శనం చేయిస్తూవుంటారు. నిత్యానందజీవికి, నిర్మలహృదయానికి కల్లకపటా లుండవు. వారిని ధర్మరాజని ప్రజామిత్ర పార్టీవారు అనడంలో అతిశయోక్తి యేమీ లేదు.

శ్రీవుయ్యూరురాజాగారికి వున్న విద్యాభిమానమే వారి ఉత్తమగుణాలన్నింటికీ మూలబీజంగా వుంది. ఎంత యెస్టేటు వున్నా విద్యకంటె మించిన స్థిరాస్తి ప్రపంచంలో మరొకటి లేదు. చిత్తసంస్కారం లేక భ్రష్టులై పరగణాలు సహితం అమ్ముకొని, ఆస్తి నాశనంచేసినవారు వున్నారు. అట్లుకాక విద్యా వినయసంపత్తి వుండడంచేత వృద్ధిలో వున్న యెస్టేట్లలో వుయ్యూరు చెప్పుకోతగిందిగా వుంది. వారి విద్యాగోష్ఠిమాత్రమే కాకుండా వారు స్థాపించిన విద్యాలయాలుకూడా యిందుకు ప్రబలతార్కాణాలు. గుడివాడ తాలూకాలోని వానపాముల సెకండరీ పాఠశాల, నూజవీడులో వున్న హైస్కూలు, బెజవాడలో వున్న కాలేజీ—ఇవి వారుస్థాపించి పోషించుతూవున్నవే.

తమ గ్రామాల్లో క్రొత్తగా పాఠశాల ఏర్పడితేచాలు-తమ గ్రామానికి క్రొత్తగా కాలవ త్రవ్వబడినట్లూ, తమ జమీా భూములన్నీ క్రొత్తగా ఆయకట్టులోకి వచ్చినట్లూ ఆనందిస్తారు. ఆ విద్యాభిమాని ఆంధ్ర విశ్వవిద్యాలయానికి భూరివిరాళం యిచ్చి ఆచంద్రతారార్కమైన సత్కార్యం చేసినారు. గుంటూరులో వున్న శారదానికేతనం మొదలైన విద్యాసంస్థలకున్నూ, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల, విజ్ఞానచంద్రికాగ్రంథమాల మొదలైనవాటికీన్నీ, మరికొన్ని గ్రంథభాండాగారాలకున్నూ వారు చేసిన, చేసే సహాయం వినడానికీ చెప్పుకోడానికీ చేసిందికాదు.

విద్య విద్య విద్య అని పలవరించే ప్రభువు ఎన్ని విద్యాలయాలైనా దర్శించి, ఎన్ని విద్యాలయాలైనా కట్టించి ప్రతిష్ఠలు చేయించి, అటువంటి భారతీపుణ్యక్షేత్రాలలో కనకాభిషేకాలు జరిపించి, భూరిదానాలు చేసి, కడుపులో కోరికలు ఫలించడానికి ఎన్ని ఆత్మప్రదక్షిణాలైనా చేయగలరు. ఆయనకు ఖగోళశాస్త్రంలోనూ, జ్యోతిశ్శాస్త్రంలోనూ విసువూవిరామంలేని పిపాస. ఆంధ్ర సాహిత్యంలో వారు ఎప్పుడూ ఏదో సాధకం చేస్తూనే వుంటారు. దుర్యోధనాంతం, గోవర్ధనోద్ధరణం, రామదాసు, జ్యోతిర్లీల అను నాటకాలు శ్రీరాజావారి

కావ్య కుసుమాలై వున్నవి. ఆంధ్రగీతగోవిందం అమృత తుల్యంగా వుంటుంది. జ్యోతిర్లీల అభినవ భావశోభితం. గీతావళి, స్నేహలత, శోభనాచల మాహాత్మ్యం—ఇవి దివ్యమైన కావ్యాలు. రుద్రమదేవి అనే హరికథ నిజంగా మనస్సును హరిస్తుంది. గోవర్ధనోద్ధరణం అనే గ్రంథం వొకసారి యింటర్మీడియటు పరీక్షకు పాఠ్యగ్రంథంగా వుంది. జ్యోతిర్లీల అనే కావ్యం కాకతీయవీరుల శౌర్య ప్రతాపాలకు మంగళ నీరాజనజ్యోతిగా వెల్గుతోంది. వారు ఆంధ్రభాషలో ఎంతకృషి చేశారో అంతకృషి ఆర్యభాష అయిన సంస్కృతంలోకూడా చేశారు. ఆంధ్రభాష మీద యెంత అభిమానమో అంతపట్టుదలతో ఆంధ్రత్వాన్ని కాపాడడానికి కూడా అనేకవిధాల ప్రయత్నిస్తూవుంటారు. ఆంధ్రజాతీయ క్రీడలు అంతరించకూడదని వాటిని ప్రోత్సహించి ఆదరిస్తారు. స్వయంగా నడుము కట్టి బాలభటసంఘానికి నాయకత్వం వహించారు. వేటలో సాటిలేని మేటి. ఆంధ్రజాతీయ క్రీడలనుగురించి, ఆంధ్రోద్యమమునుగురించి యేలూరులో జరిగిన ఆంధ్ర మహాసభలో ఆయనప్రయోగించిన శంఖారావం యిప్పటికిన్నీ ప్రజాహృదయాల్లో మారుమోగుతూనే వుంది. ఆయన ఆంధ్రరాష్ట్రం వచ్చితీరవలెనని వాదించే ఆంధ్రా

భిమాని. ఆంధ్ర తేజం ఆంధ్రుల ఆటలలోను, పాటలలోను అంతర్గతంగా ప్రకాశిస్తున్నదని గ్రహించగల్గిన మహనీయుడు. ఆ మకరందాన్ని ఆయన ఆస్వాదించినట్లుగా ఇంకొకరు ఆస్వాదించడం నేను చూడలేదు. పురాణ శ్రవణం, వీధి భాగవతం, తోలుబొమ్మలాటలు, బొబ్బిలి కథలు మొదలైన ప్రాత కాలపు సత్కాలక్షేపాల్లో కూడా సారస్యం వుందని సగర్వంగా సంతోషించి అట్టి కాలక్షేపాలు చేసినవారిని వారు సన్మానిస్తూవుంటారు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుగారి జీవితం ఆంధ్రాభిమానపూరితం. ఆయన గ్రంథరచన చేసినా, శిల్పులనూ చిత్రకారులనూ పోషించినా, హరిజనులనుద్ధరించినా, విద్యాదానం చేసినా, ఏ కార్యం తలపెట్టినా ఆంధ్రాభ్యుదయం ఆంధ్రాభ్యుదయం అనే మంత్రం జపిస్తూనే వుంటారు. ఆంధ్రుల అభివృద్ధికోసం పరితపించే అటువంటి జమీందార్లు, అటువంటి ఆంధ్రాభిమానులు యింకా చాలామంది ఆంధ్ర దేశానికి కావాలి.

శ్రీ రాజావారి జీవితం యిట్టి పుణ్యకార్య సంకల్ప సోపానాలతో వుత్తమాదర్శ మార్గదర్శిగా వుంది. వారి నివాసమైన నూజవీడు పూజనీయమైంది.

---



శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు



శ్రీయుత రాజా యార్లగడ్డ
శివరామప్రసాద్ బహద్దరుగారు

## శ్రీమంతు రాజా

## యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరుగారు

దీపాలు పెట్టుతూ పెట్టుతూ వున్నారు. పెద్దచెవులు, అడ్డకాళ్లు, కురచ శరీరం గల జాతికుక్కలు తమ కాపరి కనుపించినపుడెల్లా అన్నపువేళ అయిందని తెలిపేదానికి కాబోలు, బే! బే! అని ధ్వనిచేస్తూవున్నవి. వస్తూ పోతూవున్న మనుష్యులను చూస్తూ, మధ్యమధ్య పొంచి పొంచి పడుకొని, కాస్తదగ్గరగా వచ్చినవారిపైకి అమాంతంగా దూక ప్రయత్నిస్తూ, తమ స్వాభావిక లక్షణాన్ని కనుపరుస్తూవున్నవి చిరుతపులిపిల్లలు. పల్టీలు కొట్టుతూ కొన్ని, మెడలు వెనక్కువంచి ఠీవిగా నడుస్తూ మరికొన్ని, గుంపులుగుంపులుగా యింటిపైన తిరుగుతూ చీకటిపడడంచేత తమ గూళ్లలోకి పోతూవున్నాయి పావురాయి పిట్టలు. విడికాగితాలు కొందరు, కవర్లు మరికొందరు పట్టుకొని అరుగుమీద కాసేపూ, చెట్ల క్రింద కాసేపూ కూర్చుంటూ, లేస్తూ తమ్ము యెప్పుడు రమ్మంటారో అని తాబేదార్లు నిరీక్షిస్తూవుంటే, సరాసరి లోపలికి పోయి తమ పనులు చేసుకొని వెళ్లిపోతున్నారు సాహసంగలవారు. ఇక లాభంలేదనుకొని, బట్టలు సవరిం

చుకొని, యింటికిపోదామని నేను అనుకొంటూవున్న సమయంలో డఫేదారు వచ్చి "మిమ్ములను రాజాగారు రమ్మంటున్నారు" అని చెప్పి నన్ను వెంటతీసుకొని వెళ్లి వొకగది గుమ్మందగ్గర వదలిపెట్టి పోయాడు. గదిలోపలికి వెళ్లాను. అక్కడ వొకబల్ల, ఆ బల్లమీద కాగితాల కట్టలు వున్నాయి. విద్యుద్దీపం వెలుగుతూవుంది. చాలా వదులుగావున్న వొక పట్టుచొక్కాను, తెల్లని ధోవతిని ధరించి, బల్లమీది కాగితాల కట్టలను విప్పి వొక్కొక్క కాగితాన్నే తీసి చదివి దస్కత్తుచేస్తూ కుర్చీలో కూర్చున్నారు వొకరు—బందరు బచ్చుపేటలోని బంగళాలో. ఆ నిండువిగ్రహం, ఆ చల్లని చూపులు, ఆ దయగల మాటలు, చిరునవ్వుతో కూడిన ఆ ఆదరణ—యివన్నీ వారి నిగర్వాన్ని, కనికర హృదయాన్ని, నిష్కపట్యాన్ని సూచిస్తూ వున్నాయి. వారే చల్లపల్లి జమీందారులు, ఆనాటి కృష్ణా జిల్లాబోర్డు అధ్యక్షులు, చెన్నపురి శాసన సభ్యులు, శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరు గారు.

శ్రీ శివరామప్రసాద్ బహద్దరు యువకులు, విద్యావంతులు, నిరాడంబరులు, నిష్కపటులు; చిన్నతనంలోనే పరిపాలనాబాధ్యతను వహింపవలసివచ్చినా తమ

యోగ్యతవల్లనూ, సత్కార్యాభిరతిచేతనూ ప్రజాభిమానాన్ని గడించిన జమీందారులు. తమ పట్టాభిషేక సమయంలో పండితులకు, కవులకు, గాయకులకు, విద్యాలయాలకు, గ్రంథాలయాలకు భూరివిరాళాలిచ్చిన దాతలనీ, బీదలకు అన్నవస్త్రదానం, అతిథులకు వుత్కృష్టసత్కారం చేసిన విద్వత్ప్రభువులనీ ఖ్యాతితో తమ పరిపాలనాన్ని ప్రారంభించిన భాగ్యశాలి. రాజాగారు తమ యెస్టేటు ఆధిపత్యాన్ని వహించి యెంతోకాలంకాలేదు. అయినా, యీ స్వల్పకాలంలోనే తమ పట్టాభిషేక సమయంలో చేసిన వాగ్దానాలను, యింకా తదితర ప్రజోపయోగ కార్యాలను నెరవేర్చి ప్రజల కృతజ్ఞతకు పాత్రులయినారు. ఇంతే కాదు, లోకులతో సంబంధం లేక, యెవరికీ కనుపించక, భోగభాగ్యాదులందు ప్రొద్దు పుచ్చుతూ, ద్రవ్యాన్ని పేరుస్తూ అంతఃపురంలో కూర్చుండేవారివలెగాక యెంత బీదలైనా సరే దర్శనమిచ్చి, వారు చెప్పుకొనే కష్టాలను విని సాధ్యమైనంత వరకూ వుపకారంచేసి పంపే దయాళువు శ్రీ శివరామప్రసాద్ బహద్దరు. వారి గుణసంపదను కవులు కీర్తించారు; గాయకులు పాడారు; పత్రికలు నుతించాయి; కాని ఆదిమాంధ్రులవంటి నిమ్నజాతీయులు

"కరుణఁ జూచు టెకాని కఠినంబుగా పల్కఁ
డైన నెఱుంగని యతిసదయుఁడు
చేయిచాఁచిన సదాశ్రితులఁ దన్ను టెకాని
నాస్తియనని యీవి నమరు ఘనుఁడు
దీనుల మొఱల శాంతిని వినుటయెకాని
కన్నులుస్సనురీతిఁ గనని విభుఁడు"

అని చేసిన వర్ణనమే వారి ప్రజానురాగానికి దృష్టాంతంగా వుంది. పుట్టింది, పెరిగింది జమీందారీ వంశమైనా వారు ప్రజాసేవను ప్రేమించారు. అలవాటుపడింది భోగభాగ్యాలకైనా దేశహితైక జీవనంలోని వడుదొడుకులకు తలయొగ్గారు. వయసున పిన్నలయినా కార్యదక్షతకున్నూ, నిరాఘాటపు ఈవికిన్నీ పేరుపొందారు. వారి యాదరణకు పాత్రముకాని సత్కార్యాలు, వారి సాహాయ్యం అభిలషింపని ప్రతిష్ఠాపనలు చాలా తక్కువ. వారి ప్రజాహితజీవనం విస్తృతమైనకొద్దీ దానితోపాటు వారి దాతృత్వమున్నూ గూఢంగా పెరుగుతూనేవుంది. ఇందువల్ల వారి దాతృత్వాన్ని విడదీసి చెప్పడం తేలికైన పనికాదు. అయినా, బెజవాడ జింఖానా, బందరు కాస్మపాలిటన్ క్లబ్బు, జగ్గయ్యపేట సోషల్ క్లబ్బు, అంగలూరు పెడసనగల్లు గ్రంథాలయాలు, క్వెట్టా భూకంపం, జార్జిప్రభువు జూబిలీనిధి, విద్యార్థుల వసతి

గృహాలు, కొప్పరపు కవుల సన్మానం, నాగభూషణం రామమూర్తిగార్ల సత్కారం, ఆంధ్రవిశ్వ విద్యాలయం లో విద్యార్థి వేతనం, క్షయ నివారణ నిధి—యిలాటి వాటిని యెన్నిటినో వారి దాతృత్వబాహుళ్యానికి మచ్చు ముక్కలుగా చూపవచ్చు. ఇక స్వస్థానమైన చల్లపల్లిలో శ్రీమంతు క్లబ్బు, వైద్యాలయం, వున్నత పాఠశాల, అన్నసత్రం—ఇవి వారి పోషణక్రింద నేవున్నాయి. పెదకళ్లేపల్లి, శివగంగ, శ్రీకాకుళం, మోపిదేవి క్షేత్రాల మహోత్సవాలు వారి యాదరణక్రిందనే జయప్రదంగా నిర్వహింపబడుతూవున్నాయి. వారి కృషివల్లనే యీస్టుబ్యాంకు కెనాల్ అనే కరవుకాలువ వల్లూరుపాలెంనుంచి దివి అయిలెండువరకు పడింది. కృష్ణ వరదలవల్ల కలుగుతూవచ్చిన వుపద్రవాన్ని తప్పించే నిమిత్తమై అయోధ్యనుంచి యాదరవాడసాలెంవరకు కట్ట వేయబడింది వారివల్లనే. సుమారు పదమూడు లక్షల రూపాయల మూలధనంతో వుయ్యూరులో స్థాపింపబడ్డ పంచదార ఫ్యాక్టరీకి వారు పెద్ద అండ.

కాని, యీలాటి కార్యాలనన్నిటినీ ఒక యెత్తుగాను, కృష్ణాజిల్లాబోర్డు పరిపాలనాన్ని మార్చేదానికై వారు చేసిన శ్రమను మరియొక యెత్తుగాను నేను తలు

స్తాను. ఇప్పటికి అయిదేండ్ల క్రిందట, అప్పటి కృష్ణాజిల్లా బోర్డు అధ్యక్షులపై ప్రజలలో కాస్తో కూస్తో అసంతుష్టి బయలుదేరి, క్రొత్త పాలకవర్గానికై తపించారుగాని అది అంత సులభమైన పనిగా కనుపించింది కాదు. ఇట్టి స్థితిలో సాహసులైన చల్లపల్లి రాజాగారు ప్రజామిత్ర పార్టీని లేవదీసి, సామాన్యులకు అలవికాని పనిని మీద వేసుకొన్నారు. ద్రవ్యవంతులుసహా ప్రవేశించుటకు సాహసం లేని దుర్ఘట కార్యరంగంలో ప్రవేశించారు. కార్యభారాన్ని చూస్తే నాయకత్వానికీ, శిక్షణకూ అలవాటుపడని సామాన్యప్రజను కూడగట్టుకొని రావడం తేలికపనిగా తోచదు. అందుకు ద్రవ్యం, పత్రికలు, ప్రచారకులు, అనుభవం, ప్రజలతో స్నేహము కావాలి. ఈలాంటి స్థితిలో రాజాగారు వెనక్కు చూడ కుండా ముందుకు దుమికి, వీటి నన్నిటిని ప్రజామిత్ర పక్షానికి సనుకూల్చే ప్రయత్నంలో యెంతబరువు మోయాలో అంతబరువూ మోశారు. ఎంతశ్రమ పడాలో అంతా పడ్డారు. ఒక సణుగు లేదు, ఒక గొణుగు లేదు, ఒక విసుగు లేదు. ఎండకాలం: వేళకు భోజనం లేదు. రాత్రులందు సరిగానిద్ర లేదు. చెట్లక్రిందా, చెరువు కట్టలమీదా సభలుచేస్తూ, జమీందార్లు సామా

న్యులు అనే వ్యత్యాసాన్ని మరచి సామాన్యజన ప్రబో ధానికి నడుముకట్టారు. బెజవాడలోని తమ బంగళాను అన్నసత్రంగా మార్చి, తమ ప్రచారకార్యక్రమాన్ని తామే స్వయంగా నిర్వహించుకొన్నారు. తుద కీకృషి ఫలితంగా ప్రజామిత్రపక్ష సభ్యులే యెన్నికలందు అధి కంగా జయంపొందారు. ఈ పక్షభారాన్ని వహించిన శ్రీ శివరామప్రసాద్ బహద్దరుగారే జిల్లాబోర్డు అధ్యక్షు లుగా నియుక్తులయినారు. ప్రజోత్సాహం తెగబడింది. సన్మానాలపైన సన్మానాలు, విందులపైన విందులు జరిగి నాయి. కాని, కొండపల్లిలో జరిగిన సన్మానానికి సాటి యింకొకటి లేదు. వేలకొలది ప్రజలు దూరపు గ్రామాలనుండి విరగబడి, అక్కడి విందులు, వేడు కలు, వుత్సవాల్లో పాల్గొన్నారు. జయధ్వానాలు చెలరేగాయి. ఆ మహాసభయందు సమావేశమైన ప్రజ లకు రాజాగారు తమ కృతజ్ఞతను ప్రకటిస్తూ

మీ సన్మానానికి నేనెంతో కృతజ్ఞుడను. చాలా దూరపు గ్రామాలనుంచి మీరంతా వచ్చి, నన్నాదరించి, మీ ప్రతినిధిగా యెన్నుకోవడంచేతనే నా కీయధ్యక్షపదవి లభించింది. మన మండల వాసుల యభివృద్ధికిన్నీ, క్షేమానికిన్నీ నా శక్తికొలది ప్రయత్నించ డంకంటె నాకు సంతోషకరమైన కార్యం వేరేలేదు. అయితే, యిప్పటివలెనే యికముందున్ను మీరంతా నాకు తోడ్పడినట్ట

యితే నేను చేయవలసిన పనిని తేలికగా చేయడానికి వీలవుతుంది. నేను వహింపవలసిన భారాన్ని తేలికగా వహించడానికి సాధ్యమవుతుంది.

అని చెప్పారు. ఈ మాటలు చాలు, వారి అంతర్యాన్నీ, వారి సుహృదయాన్నీ విశదీకరించేదానికి.

రాజాసాహెబ్ గారు జిల్లాబోర్డు అధ్యక్షులై రెండు ఆవృతాలు పూర్తి అయినాయి. వారి హయాములో స్వకులాభిమానం బయలుదేరిం దంటారు. అయితే మన మీ కులాభిమానంయొక్క తత్వాన్ని ఆలోచిస్తే, మనకు కులాభిమానంవలె దేశాభిమానం యింకా అలవాటు కానట్లు తోస్తుంది. మనగ్రామాల్లో యిప్పటికిన్నీ వ్యక్తిపరమైన పార్టీలు వున్నాయిగాని రాజ్యాంగకక్షలింకా ప్రవేశించలేదు. గ్రామానికి సంబంధించిన మేదో రోడ్డు, వంతెన, పాఠశాల యీలాటి సమస్యల రాజకీయాలు మినహా విశాలమైన జాతీయ జీవనం ఇంకా అభ్యాసంకాలేదు. ఈ రోడ్డు రప్పలను మాత్రమే ఆశయంగా పెట్టుకొన్న జీవికలకు కాంగ్రెసూ వొకటే, జస్టిసూ వొకటే, పీపిల్సూ వొకటే. వీటి అన్నిటి అడుగునా చాటుగానో, బహిరంగంగానో చివరకు పనిచేసేది కులాభిమానంగాని ఆ కక్షయొక్క ఆదర్శం కాదు. దేశానికి రాజకీయస్వాతంత్ర్యం వచ్చే

వరకూ మన పల్లెటూళ్ల ఆర్థికజీవనం పునరుద్ధరింపబడ దనీ, అసలీ కష్టాలన్నీ అందాకా పడేది తామేననీ మన గ్రామవాసు లింకా గ్రహించినట్టే కనుపించదు. మన ప్రాతపునాదులను పెల్లగించి క్రొత్తవాటిని వేయ నుద్య మించినా, కులానికీ జాతీయతకూ తీవ్రమైన సంఘట్టన ప్రారంభమైనా, యింకా చాలా కాలంవరకూ కులాభి మానమే మన దేశహితైకజీవనాన్ని నడిపిస్తూవుండే టట్టుగా వుంది. మన పల్లెటూళ్లపార్టీలు వ్యక్తిపరంగా వున్నప్పుడు, కృష్ణామండలంలోని కమ్మమహాజనులకు చల్లపల్లి జమీందారుగారు తన ద్రవ్యబలంచేత నైతే నేమి, విద్యాధిక్యతచేత నైతేనేమి కులమూర్తిగాను, నాయకులుగాను వుండడంలో ఆశ్చర్యం యేమీా లేదు.

శ్రీ శివరామ ప్రసాద్ బహద్దరుగారు కమ్మవారికి నాయకస్థానంలో వున్నమాట నిశ్చయం. మన సంప్ర దాయాన్నిబట్టి నాయకుడు యెట్లామారితే అనుచరు లున్నూ అట్లాగున మారుతారు. ఇక్కడప్రధానవిషయం శ్రీ శివరామప్రసాద్ బహద్దరుగారుగాని ప్రజామిత్రా కాదు, జస్టిసూకాదు, యేమీాకాదు. కులతత్వ ప్రభు త్వాన్ని ఒక వైపున ప్రభుత్వంవారున్నూ, యింకొక వైపున ప్రధానమంత్రులున్నూ పోషిస్తూవచ్చిన

కాలంలో, పరిసరాలచే మార్చివేయబడే వ్యక్తులను విమర్శించి ప్రయోజనం లేదు. దేశస్వాతంత్ర్యం ముందు, తరువాత కులం అనే తత్వం వ్యాప్తిలోకి రావాలి.

ఇక శ్రీ శివరామప్రసాద్ బహద్దరుగారి పరిపాలనలోకి దిగితే యిది తక్కిన మండలాలలోని యే మంచిపనికిన్నీ తీసిపోవడం లేదు. రాజాగారు సుగ్రామాలను సహితం దర్శించి, ప్రజల కష్టాలను ఓపికతో వింటారు. చేతనయిన సహాయం చేస్తారు. వారు అధ్యక్షులయిన తర్వాత చేసిన పనిని ఒకటి రెండు మాటల్లో చెప్పవలసివస్తే అంతకు పూర్వం ఔదాసీన్యంతో చూడబడ్డ గ్రామాల సౌకర్యాలకున్నూ, విద్య-ఆరోగ్యం-రోడ్లు-వంతెనలకున్నూ ప్రాముఖ్యం యివ్వబడిందని చెప్పవలసివస్తుంది. వారి హయాంలోనే పులిగడ్డదగ్గర కృష్ణానదిమీదను, వుప్పలూరుదగ్గర రవీసు కాలువమీదను, తిరువూరు తాలూకాలో కాకర్లవాగుమీదను, గుడ్లవల్లేరుదగ్గర కాలువమీదను వంతెనలు వేయబడ్డాయి. రోడ్లు లేని గ్రామాలకు రోడ్లువచ్చాయి. మాధ్యమిక పాఠశాలల్లో వ్యాయామ విద్యకు ప్రోత్సాహం కల్పించారు. వైద్యశాలలు లేని చోట వైద్యశాలలను స్థాపించారు. శిశురక్షణానికి సౌకర్యాలను యేర్పరచారు. ఇంకా, స్త్రీలకు వైద్య

సహాయాన్ని, విద్యార్థులకు క్రీడా వినోదాలను, గ్రంథాలయాలకు ద్రవ్యసహాయాన్ని, ఉన్నతపాఠశాలలో హిందీని, పశ్వభివృద్ధికై సజాతీయమైన ఆబోతులను మరిచిపోలేదు. ఇట్లా గ్రామస్థుల అవసరాలను గ్రహించి చేతనయినంతవరకూ, సాధ్యమయినంతవరకూ తోడ్పడుతూనే వున్నారు. వ్యవసాయాన్ని నురువక అనుకూలమైనచోట వొక వ్యవసాయపాఠశాలను స్థాపించుటకున్నూ సంకల్పించివున్నారు. జిల్లాబోర్డు అధ్యక్షులుగా చేసే సర్కార్యటుఖర్చులను పుచ్చుకోవడం మానుకొన్నారు. ఈపాలనాన్ని మెచ్చుకొంటూ అభినందన పత్రికలు చాలా గ్రామాలలో సమర్పింపబడ్డాయి. వాటిలో కొవ్వలిపంచాయతీబోర్డువారు రాజాగారి పరిపాలనాన్ని విమర్శిస్తూ

తమరు గ్రామవాసుల, రైతుల, ప్రజల క్షేమాన్ని కోరి విద్య, గ్రామపారిశుద్ధ్యం, వ్యవసాయం మున్నగు సౌకర్యాలకు సహాయంచేస్తూవున్న మహాశయులు. జన్మచే శ్రీమంతులయినా బీదసాదల కష్టనిష్ఠూరాలను గమనిస్తూవున్న ప్రభువులు . . . మదరాసురాజధానిలో జిల్లాబోర్డు అధ్యక్షులందరిలోను తామే పిన్నలయ్యు పరిపాలనయం దెక్కువ శ్రద్ధబూని, అన్నిపక్షాలవారి మన్ననలకున్నూ పాత్రులవుతూవున్న మహాశయులు.

అని వ్రాశారు. దీన్ని ప్రజాభిప్రాయానికి మచ్చుగా తీసుకొంటే వారి పరిపాలనాన్నిగురించి బయటివారు యేమనుకుంటున్నారో కాస్త తెలుస్తుంది.

రాజాగారు స్వకీయవ్యవహారాలను చూచుకోవడంతోనే తృప్తిపడి కూర్చోవడం లేదు; ప్రజాహిత జీవనంలో కూడా శ్రద్ధవహిస్తున్నారు. అనేకసభలకు అధ్యక్షులై, నిరాశకు బదులు ఆశను, నిరుత్సాహానికి బదులు వుత్సాహాన్ని పూరిస్తూ, మన జాత్యభిమానానికి క్రొత్త ఆకులను వేయిస్తున్నారు. "ఏనాటి ఆంధ్రోద్యమము? ఎప్పటిమాటలు? ఎప్పటి ప్రత్యేకరాష్ట్రము? మొన్నటి బీహారుకు ప్రత్యేకరాష్ట్రము లభించినది . . . . లెండు! ఆంధ్రరాష్ట్ర సంపాదనమునకై నేడు బద్ధదీక్షులుగండు!" అని గుంటూరుమండల ద్వితీయాంధ్రమహాసభాధ్యక్షులుగా వారు గావించిన శంఖారావములు శరీరమును పులకలెత్తించి, కార్యరంగానికి పురికొల్పుతూవున్నాయి. ఒకప్రక్క ఆత్మపరీక్షను, యింకొకప్రక్క ఆత్మగౌరవాన్ని పురికొల్పే యీలాటి ప్రబోధం యీ మధ్య కాలంలో ఆంధ్రసభావేదికలపైన మ్రోగలేదు.

శ్రీ శివరామప్రసాద్ బహద్దరువారికి ఆంధ్రరాష్ట్రమంటేనూ, రైతుక్షేమమంటేనూ యెంతో అభిమానం. శ్రీ రాజావారి ఔదార్యంవల్లనే నిద్రపోతూ వుండిన ఆంధ్రమహాసభ తిరిగీ మేల్కొన గల్గింది; బెజవాడలో రజతోత్సవం జయప్రదంగా జరగడం

పొసగింది. శ్రీ రాజావారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగావుండి చేసిన వుపన్యాసాన్ని చూస్తే వారి మనసు ఆంధ్రాభిమానంతో యెట్లా వుబికివున్నదీ తెలుస్తుంది:

ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతనుగురించి తీవ్రముగ ప్రచారముచేసిన సోదరులే అధికారస్వీకారముతో తమ అభిప్రాయములను మార్చుకొని, వ్యతిరేకప్రసంగములను చేయసాగిరి. మహాసభలలో ఉపన్యసించిన నాయకులకు మాంద్య మేర్పడెను. విశ్వవిద్యాలయవిషయములో తగవులాడి మనము రాయలసీమసోదరుల ఆదరాభిమానములను పోగొట్టుకొంటిమి. జాతీయోద్యమావేశములోబడి స్వవిషయమును మరచితిమి. పర్యవసానమేమి? ఇరువదియైదు సంవత్సరముల కృషిఫలితముగ తిరిగి యీ నాడు యిచట సమావేశమై యీ సమస్యనుగురించి ఆలోచించుటయే.

అని ప్రత్యేకరాష్ట్ర సమస్యను లేవనెత్తారు.

రాజావారిది ఏ పనిని మొదలుపెట్టినా జయప్రదంగా నిర్వహించే స్వభావం. 1937-వ సంవత్సరపు యెన్నికల మహాప్రవాహంలో పొర్లివచ్చిన కాంగ్రెసు స్రవంతికి యెదురీది ఒడ్డుకుచేరగలిగింది శ్రీ రాజావారొక్కరే. వారి ప్రజాభిమానమే వారికి సామాన్య నియోజక వర్గమునుండి యెన్నుకొనబడు గౌరవాన్ని చేకూర్చింది. ప్రభుత్వాధికారాన్ని చలాయిస్తూవుండిన యోధానయోధులు కాంగ్రెసున కాహుతులైపోగా జమీందారులలో శ్రీ చల్లపల్లి జమీందారుగా రొక్కరే

సామాన్యజనసానుభూతికి పాత్రులై, విజయదుందుభిని ప్రమోగింపగలిగారు. రాజాగారు యెన్నికలలో తమప్రకృతికి విరుద్ధమైన కక్షియందు చేరినట్లు ప్రకటించినా ప్రజలా సంగతికి అంత ప్రాముఖ్యమిచ్చినట్టే కనుపించదు. నిశ్చయానికి వారు రైతుపక్షాభిమానులు. ప్రభుత్వం వారు ప్రవేశపెట్టదలచిన వ్యవసాయకుల ఋణవిమోచనశాసనాన్ని ప్రతిఘటించేదానికి ధనికులు ఆలోచిస్తూవుంటే, జమీందారులలో చల్లపల్లి రాజాగారొక్కరే ముందుకు వచ్చి, చెన్నపురి ప్రభుత్వంవారి బడ్జెటు చర్చ సందర్భంలో అప్పు డిమాండుమీద కోతను ప్రతిపాదిస్తూ యేమన్నారో చూడండి :

వ్యవసాయదారుల ఋణపుచట్టంక్రింద ఋణాన్ని నిర్మూలం చేయటం అసంభవం. డెటర్సు ప్రొటెక్షను చట్టంక్రింద చేసినట్టు 500 రూపాయలకు లోపుగా ఉన్న అప్పుకే వర్తించే మార్గాలను ప్రవేశపెట్టడం మంచిదికాదు. విపరీతంగా ఉన్న వడ్డీరేటును సబబైనరేటుకు తగ్గించవలసి వుంటుంది. డెటర్సు ప్రొటెక్షను చట్టంలో సూచించినట్టు అప్పు యిచ్చేవాళ్లు, పుచ్చుకొనేవాళ్లు ఋణాలను తమంతట తాము సమాధానపరుచుకొనేపద్ధతి మంచిది కాదు. నిర్బంధవిధానాన్ని ప్రవేశపెట్టాలి. రాజధాని అంతటా ఋణసమాధానపు చట్టాలను ప్రవేశపెట్టాలి. ఇలాటి సంస్కారణాల కోసం రైతులంతా గగ్గోలుపెట్టుతున్నారు. ప్రభుత్వం వారు తక్షణమే శాసనంచేయవలసి వుంటుంది.

అని చెప్పివున్నారు. శ్రీ శివరామప్రసాద్‌గారు జమీం

దారులు. తమ సలహా తమకే ప్రతిబంధకమయిందైనా రైతుల క్షేమాన్నే కోరు సుజనులు. సుహృదయులు. స్వలాభానికి అడ్డంవచ్చేటట్టుగా ఉన్నా సామాన్య జనుల క్షేమాన్నే అభిలషించు విశాలహృదయులు.

ఈవిధంగా కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులున్ను, ఆంధ్ర విశ్వవిద్యాలయపు సెనేటర్లున్ను, చెన్నపురి శాసనసభ్యులున్ను అయిన శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దరుగారు ప్రజాహితజీవనంలో మొన్న మొన్ననే ప్రవేశించారన్నసంగతి మరువతగిందికాదు. ఈస్వల్పకాలంలోనే వారు తమ కాలాన్ని, ద్రవ్యాన్ని, జ్ఞానాన్ని దేశక్షేమంకోసమూ, ప్రజోపయోగంకోసమూ వినియోగించే వుదారహృదయులనే ఖ్యాతిని గడించారు. మరిన్నీ, యెంతశాంతచిత్తులో అంత కార్యోత్సాహులనీ, యెంత మితసంభాషులో అంత స్థిరసంకల్పులనీ, యెంత విచక్షణశీలురో అంత విశాలహృదయులనీ వారు పేరు పొందారు. ఇంత స్వల్పకాలంలో యింతముందుకు త్రోసుకువచ్చిన శ్రీ శివరామప్రసాద్ బహద్దరుగారింకనూ యువకులే. అయినా, వారిలో యువకులసాహసం, పెద్దలనెమ్మది, నాయకుల పట్టుదల, గర్వంలేని వర్తనం, కపటమెరుగని గుణం, తడవుకోని దాతృత్వం కనిపిస్తాయి.

ప్రతిజీవకణంలోనూ మంచితనం, కారుణ్యం, దాతృత్వం ప్రధానలక్షణాలుగాగల శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరుగారి ప్రవేశంతో మన దేశ హితైకజీవనం ఒక క్రొత్తఘట్టాన్ని త్రొక్కింది. వారు ఆంధ్రరాష్ట్రానికి ప్రాణంపోశారు. రైతుపక్ష మవలం బించారు. ప్రజాక్షేమాన్నే ప్రధానంగా చేశారు. వారు ప్రజామిత్రను వదలి జస్టిసును వరించినా, ప్రయోజనం లేకపోతే, జస్టిసునే పట్టుకొని ప్రేలాడేటంత పిరికివారు. రాజకీయసిద్ధాంతాలకున్నూ, సామాన్యజనజీవనాని కిన్నీ యేర్పడే స్పర్ధనుండి పుట్టే ఫలితమే అభివృద్ధి. దీన్ని సాధించుటకే కృష్ణామండలవాసులు శ్రీ శివరామ ప్రసాద్ బహద్దరుగారిని జిల్లాబోర్డుఅధ్యక్షులుగాను, శాసనసభ్యులుగాను యెన్నుకొన్నారు. ప్రజలక్షేమము నందే తమక్షేమమున్నూ, వారికష్టమునందే తమకష్ట మున్నూ వున్నవని తమ నాయకధర్మాన్ని నిర్వహించి నట్టయితే ఆమండలం—రాజకీయ, సాంఘిక, ఆర్థిక వ్యవహారాలలో ముందడుగు వేస్తూవున్న ఆమండలం తక్కినవాటి అన్నిటికంటే ప్రాముఖ్యం వహించితీరు తుంది; ప్రజలవిశ్వాసం సార్థక మవుతుంది.



శ్రీమంతు రాజా వాసిరెడ్డి
చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దరుగారు

## శ్రీమంతు రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దరుగారు

క్రమంగా క్షీణించి పోతూవున్న హిందూశాస్త్రాల మీద భక్తి, వైదికసంప్రదాయాలమీద ఆసక్తి—ఇవి యింకా నిలిచివున్నట్టిన్నీ, నిరాడంబరాకృతి, దయా సంకలితహృదయం, అప్రతిహతవితరణ—వీటికి ప్రసిద్ధి పొందినట్టిన్నీ ఆంధ్రదేశపు జమీందారులలో శ్రీమంతు రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దరు గారు అగ్రగణనకు అర్హులు.

ముక్త్యాలలో శ్రీవారి మేడపైనుంచి మన చూపులను రవంత పరిసరాలకు పరిస్తే, యెదురుగా గంభీరస్వనాలతో ప్రవహించే కృష్ణవేణి, ఆరవశాన వంగిపోయివున్న మొక్కజొన్న చేలు, కడుపునిండామేసి మందలు మందలుగా స్వేచ్ఛా విహారాలు చేసే గోగణాలు, తమ యభిమానపు పశువు నెక్కి పశులకాపరులు పాడే పాటలు—యివన్నీ బస్తీ నాగరకులకు అమితానందాన్ని కూరుస్తూవుంటాయి.

ముక్త్యాల ఆధునిక నాగరక తరంగాల తాకిడికి తొలిగివున్న గ్రామం. అయినా, రాజావారి విద్యాభి

మానం, వారి లలితకళాభిలాష, వారి దేశహితైక కార్యోత్సాహం—యివి ఆ గ్రామాన్ని పండితులకూ సంఘసేవాభిరతులకూ యాత్రాస్థలంగా చేశాయి. రాజావారి సంకల్పవాహిని యొక్కొక్కప్పుడు వుత్తుంగితమయి, యొక్కొక్క మహత్కార్యక్షేత్రాన్ని ఫలవంతం చేస్తూ వుంటుంది. ఈతరంగ పరంపరలో యొకటి మహాభారత ఆంధ్రీకరణం. ఇదివరకు నన్నయాదులు భారతాన్ని తెనిగించినా, మళ్లీ దాన్ని వ్రాయిద్దామనే సంకల్పం రాజావారికి కలిగింది. అంతే. దానితో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని పిలిపించి, వారిని ఆ మహాభారత ఆంధ్రీకరణానికి నియోగించారు.

కృష్ణమూర్తిశాస్త్రిగారు భారతాన్ని ఆంధ్రీకరించారు. సరే. దానిలోని ముఖ్య ఘట్టాలకు చిత్తరువులు కూడా వుంటే చాలా ముచ్చటగా వుంటుందనుకొన్నారు రాజావారు. అంతే. వెంటనే ఆత్మూరి రామమోహన రాయిగారిని రప్పించారు. వారు వ్రాసివ్రాసి తయారుచేసిన చిత్తరువులు అనేక సహస్రాలు యిప్పటికిన్నీ రాజావారి మేడచావడిలో వ్రేలాడుతూ వున్నాయి. ఈ భారత దృశ్యాలతోపాటు తమ పరిసరాల స్వాభావిక చిత్రాలుకూడా వుంటే మెరుగ్గావుంటుందనుకొని

రాజావారు ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా యీలాటి దూరదేశాలనుంచి ప్రశస్తమయిన ఫోటోగ్రఫీ పనిముట్లను, ఆ విద్యలో ఆరితేరినవారలను రప్పించి, తాముస్నూ ఆ శాస్త్రాన్ని అభ్యసించి ప్రావీణ్యం సంపాదించి, యెన్నో రమణీయమైన దృశ్యాలను తయారుచేయించారు. ఈ ఫోటోగ్రఫీ యంత్రాలు యిప్పటికిన్నీ వున్నాయి. వీటిలో దేనికైనా గ్రహచార వశాత్తు జబ్బుచేసిందా అంటే ఇక అది పుట్టినచోటకు పోవలసిందేగాని యింకోచోట దాని మరామతు సాధ్య పడదు. అంత సున్నితమైన యంత్రాలివి.

మంచిది. కృష్ణమూర్తిశాస్త్రిగారు భారతం వ్రాసినంతమాత్రంచేత యేమైనట్టు? అది అచ్చుపడాలి. ఇదిగాక, రాజావారియొద్ద ఉద్భటారాధ్యచరిత్ర, నాచికేతోపాఖ్యానం, కృష్ణామాహాత్మ్యం, శ్రీరాజ్యలక్ష్మీ పరిణయం, కాలనిర్ణయ చంద్రిక, వేంకటాద్రిరత్నావళి— యీలాటి అముద్రిత తాళపత్రగ్రంథాలెన్నోవున్నాయి. ఇవన్నీ అచ్చుపడాలి. ఇంత ముఖ్యమైన పనిని యింకో ముద్రాలయంవారి కిస్తే వారంతజాగ్రత్తగా చేయరేమో? పనితనం బాగుండదేమో? దిద్దేదానికి పండితులు వుండరేమో?—యీలాటి అనుమానాలు

రాజావారిని బాధించగా, చివరకు వారు ముక్త్యాలలోనే ప్రశస్తమైన ఒక ముద్రాలయాన్ని పెట్టి, తగు పనివాండ్రను రప్పించి, పనులు సాగించేదానికి నిశ్చయించుకొన్నారు.

క్రమంగా రాజావారిదృష్టి యీ భౌతిక వ్యవహారాలమీదనుంచి పారమార్థిక విషయాలపైకి పోయింది. శ్రీవారికి శాస్త్రాలమీద అభిమానమూ, చక్కని ప్రవేశమూ వున్నాయి. ఇంకా యీ సంబంధమైన రహస్యాలను తెలుసుకోవాలనే ప్రద్దేశంకలిగి, వారికి గుంటూరులోని శ్రీ సచ్చిదానంద సరస్వతీ స్వాముల వారిమీద కన్నుపడింది. స్వాములవారు వచ్చారు. పందిళ్లూ, పాకలూ, పూజలూ, సమారాధనలూ— వీటితో ముక్త్యాల హోరెత్తింది. ఇంతలో శ్రావణమాసం వచ్చింది. శ్రావణంలోనే, స్వాములవారి గురువులు శ్రీ బ్రహ్మానందతీర్థులవారి జయంతికూడా పడింది. ఈ జయంత్యుత్సవాన్ని సహా ముక్త్యాలలోనే జరిపించడానికి రాజావారు సంకల్పించుకొన్నారు. చివరకీ స్వాములవారి జయంతి సాహిత్య, శాస్త్ర సప్తాహంగా పరిణమించింది. పండితులకు, గాయకులకు, హరిదాసులకు, భజనపరులకు ముక్త్యాల పుణ్యస్థలమయింది. ఆ

రోజులలో ముక్త్యాలలో యెక్కడ చూచినా వేద ఘోషే, త్యాగరాయ కృతులే, తరంగాలే, హరికథలే, అన్నదానమే ! ఒక్కొక్కరికి రూ. 1,116 లు, రెండు రూ. 1,116 లు సన్మానం ! ఇక రూ. 116 లకు లెక్కే లేదు. ఈ విధంగా రెండుమూడు వారాలు జరిగింది.

భారతం, చిత్తరువులు, అచ్చు ఆఫీసు, ఫొటోగ్రఫీ, స్వాములవారు—నీటికేంగాని, రాజావారి హృదయాన్ని విప్పిచూపే కథ లెన్నో వున్నాయి. జగ్గయ్యపేట హైస్కూలు బోర్డువారి ఆధీనంలోకి వచ్చేవరకూ రాజా వారి ఆదరణే లేకుంటే అది మొదటిలోనే చచ్చి వుండేది. భవననిర్మాణం, వుపాధ్యాయుల జీతాలు, విద్యార్థుల భోజనాలు—యీలాటి బరువులను మోస్తూ, ఆ విద్యాలయాన్ని నిలబెట్టి కాపాడుకొని వచ్చింది రాజావారే. ఒకసారి యెవరో పండితుడు ఒక శుభలేఖను పంపినాడట. దాన్ని అందుకొని, ఒకసారి కాదు రెండుసార్లు, రెండు నూటపదహార్లను మని యార్డరుద్వారా యెవ రీ కాలంలో పంపిస్తారు—రాజా వారు తప్పితే ? చుట్టుపట్ల గ్రామాలవారికి చాలినంత వైద్యసహాయం లేదు. రాజావారికి మొదటినుంచీ ఆయు ర్వేదమంటే అభిమానం. అందుచేత సింహాళంనుంచి

ముత్యాలు, కాశ్మీరంనుంచి పచ్చకర్పూరం, త్రివిష్టపం నుంచి కస్తూరి, హిమవత్ప్రాంతాలనుంచి మూలికలు తెప్పించి, శాస్త్రీయమైన ఔషధాలను చేయించి, తమ ఆస్థానంలో ఒక ఆయుర్వేద ఔషధాలయాన్ని స్థాపించి, యీ విలువైన ఔషధాలను వాడిస్తూ, ప్రజలకు వైద్య సహాయాన్ని లభింపజేసి, వారి ఆరోగ్యాన్ని కాపాడు కొని వస్తున్నాడు ఆ ప్రభువు. ఐరోపాయుద్ధం వచ్చింది, వెనుక. ఆహారపదార్థాలను కంట్రోలు చేయడంచేత వాటి ధరలు పెరిగి, బియ్యం దొరక్క బీదసాదలు కష్టపడుతూ వచ్చారు. అంతా బియ్యపు వ్యాపారం చేసి డబ్బు సంపాదిస్తూవుంటే రాజావారు ప్రాంతీయ గ్రామా లవారికి అన్నం పెట్టించి, బట్టలిచ్చి, వారి ప్రాణాలు కాపాడుతూ వచ్చారు. నేతపనివాండ్లకు పనిపాటులు లేవు; మగ్గాలు మూలబడ్డాయి. ఈలాటివారికి రాజా వారు దివాణపుబట్టలు నేసే పని కల్పించి పోషిస్తూ వుంటారు. వడ్రంగి, కమ్మరి, తాపీ మొదలయిన కార్మిక జనావళికి మరమ్మతని, కట్టడమని, గోడని ఏవో పనులను కల్పించి నిర్వ్యాపార బాధను తప్పిస్తూ వుంటారు.

శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దరువారు పూర్వాచారపరాయణులు. పూజాపునస్కారాలను

ముగించుకొని, మేడ యెక్కినారం టే క్రిందికి దిగడమూ, దర్శనమివ్వడమూ తక్కువ. దేవతార్చన బ్రాహ్మణులూ, ఆలయంలో పూజచేసే అర్చకులూ తెచ్చి యిచ్చే తీర్థాన్ని సేవించిన పిమ్మటగాని భోజనంచేయని శ్రోత్రియులు వారు. కొన్నాళ్లు అపక్వాహార నియమం అవలంబించి, నిగ్రహశక్తిని సంపాదించుకొన్న సాధకులు.

దేశాభిమానులు, భాషాభిమానులు, దీనజనపోషకులు, జమీందారులు నగు శ్రీమంతు రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దరువారు నాగరక ప్రదేశానికి దూరస్థులై, అభేద్యములైన అరణ్యాల, వానర సమూహాల, పచ్చికబయళ్ల, సెలయేళ్ల మధ్య నివసిస్తూ, యిప్పటికి నలభైయేండ్లకుపైగా ఆంధ్రదేశాభ్యున్నతికై చేస్తూవున్న అపారమగు సేవకూ, వుపకృతికీ ఆంధ్రదేశం కృతజ్ఞతాపూర్వకమైన ధన్యవాక్కులను అర్పిస్తోంది.

---

## రావుబహద్దూరు శ్రీ మోతే గంగరాజుగారు

ప్రొద్దుటిపూట ఎనిమిది గంటల ప్రాంతంలో, ఒక యెఱ్ఱ చెంగావిబట్ట కట్టుకొని, కప్పుపెట్టిన షర్టు తొడుక్కొని, పట్టెనామాలు ధరించివున్నవారొకరు లోపలినుండివచ్చి తమ కచేరీచావడిలో నేలమీద పరచిన ఒక చిన్న కుషన్ మీద కూర్చున్నారు. వారికి సుమారు అరవైయేళ్ల వయసు వుంటుంది. చిన్నప్పుడు దట్టంగా పోసిన స్ఫోటకపుమచ్చలింకా ఆ మొగంమీద కనిపిస్తూనేవున్నాయి. కొంచెం స్థూలకాయం; నలుపు చాయ. డాబులేదు; దర్పంలేదు. వారు కూర్చున్నచోట ఎడమవైపున ఒక చందుకాపెట్టె, ముందుప్రక్క ఒక డస్కుపెట్టె వున్నాయి. వచ్చిన పెద్దలూ, పిన్నలూ అందరూ అక్కడి తివాచీలమీదనే కూర్చుండి పోతూ వచ్చారు. దానధర్మాలకూ, పారిశ్రామిక కార్యనిర్వాహకత్వానికీ ఖ్యాతికెక్కిన రావుబహద్దూరు మోతే గంగరాజుగారు వారే అంటే ఆశ్చర్యం వేస్తుంది.

ఏలూరు నగరాభివృద్ధికి జరిగిన కృషి. యావత్తూ ముగ్గురు నలుగురు ప్రముఖులకు సంబంధించినదిగా కని



రావుబహద్దూరు శ్రీ మోతే గంగరాజుగారు



కీ. శే. దేశోద్ధారక
శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

పిస్తుంది. దివాన్ బహద్దూరు సర్ మోచర్ల రామచంద్రరావు పంతులు, రావుబహద్దూరు బడేటి వెంకట రామయ్యనాయుడుగార్లు మునిసిపల్ సంఘంద్వారా నగరాభివృద్ధిని సాధిస్తే, రావు బహద్దూరు మోతే గంగరాజుగారు విసుగులేని తమ పరోపకార కార్యాల ద్వారానూ, ప్రజోపయోగమగు సంస్థల పోషణద్వారానూ ప్రజా సౌఖ్యాన్ని పెంపొందిస్తున్నారు. గంగరాజుగారు సహజంగా పూర్వాచారపరాయణులు. అయినా, వారి దాతృత్వం బహుముఖాల విస్తరిస్తూ వారు గొప్ప దాతగా పేరుపడ్డారు. ఏలూరులో ఏ వైపునపోయినా గంగరాజుగారి ధర్మశీలతకూ, పరోపకారనిరతికీ సంబంధించిన సత్రమో, విద్యాలయమో, దేవాలయమో, సమాజమో, తటాకమో యేదోఒకటి కనిపిస్తూనే వుంటుంది.

వారు పూనుకొనేవరకూ విద్యావంతులూ విద్యార్థులూ, చిన్నలూ పెద్దలూ, ధనికులూ బీదలూ ఒకచోట సమావేశంకాదగిన సంస్థ లేదు; ఆధునిక విజ్ఞాన సముపార్జనకు తోడుపడే పుస్తకాలయమే లేదు; సామాన్యజనులు వార్తాపత్రికలు చదువుకోవడానికి పఠనమందిరమే లేదు. గంగరాజుగారి దయవల్ల ఈ అన్ని లోటులూ తీరినాయి. వారు సుమారు యాభైవేల

రూపాయలు వ్యయంచేసి, ఒక చక్కని భవనం కట్టించి హిందూయువజనసంఘంవారి కిచ్చివేశారు. అది ఇప్పుడు చక్కని పుస్తకభాండాగారంతోనూ, పఠన మందిరంతోనూ విద్యోపాసకులకు ఆలయంగా ప్రకాశిస్తూవున్నది. పొరుగూళ్లనుండి నిత్యమూ ఏలూరుకు యెందరో వచ్చిపోతూ వుంటారు. ఈలాంటివారికిగాను అన్నివసతులూ వున్న సత్రం వొకటి పవరుపేట పెద్ద వంతెనదగ్గర నిర్మించి గంగరాజుగారు పుణ్యంకట్టుకొన్నారు. అది బీదలకూ భాగ్యవంతులకూ, ఉద్యోగులకూ సామాన్యులకూ అందరికీ యెంతో ఉపయోగంగా వుంది. ఆ సత్రంలో సదా వడుగులూ, పెళ్లిళ్లూ జరుగుతూ మంగళవాద్యాలు వినవస్తూ వుంటాయి.

ఏలూరులో గంగరాజుగారు, గంగరాజుగారిలో యేలూరు అని అంతా అంటారు. గొప్ప శ్రీమంతులయినా గంగరాజుగారు బీదల కష్టసుఖాలు మరచిన గర్వాంధులు కారు. ఇందుకు వారి అన్నవస్త్రదాన సమాజమే నిదర్శనం. ఆ సమాజానికి సుమారు 60,000 రూపాయల మూలధనం వుంది. నిత్యమూ ఎంతమంది బీదలువచ్చినా అందులో అన్నంపెట్టుతారు; పండుగ పర్వాలలో పిండివంటలతో సంతర్పణలు చేస్తారు; చలి

కాలంలో బట్టలు యిస్తారు. ఆంధ్రదేశంలో ఆలాటి సంస్థ మరొకటి ఉన్నదా అంటే, అనుమానమే. ఆ సంస్థకు గంగరాజుగారు శాశ్వతధర్మకర్తలుగా వుండి జాగ్రత్తగా నిర్వహిస్తున్నారు. అన్నదాన సమాజమైనా సరే, గో రక్షణ సంఘమయినా సరే, గంగరాజుగారు ఉన్నారంటే అది నిరాఘాటంగా, జయప్రదంగా సాగిపోవలసిందే.

జ్ఞానాన్ని, సాంఘిక జీవనాన్ని, పౌరక్షేమాన్ని వృద్ధిచేసే కృషి ఏదిగానీ గంగరాజుగారి ఆదరణకు పాత్రంకాకుండాపోవడం అంటూ లేదు. ఇచ్చేదానికి త్రిప్పడం అంటూ లేదు; సణుగుకోవడం అంటూ అంతకంటే లేదు. ఒకప్పుడు ఏలూరులో విద్యావ్యాప్తికి తోడుపడుతూవుండిన మిషన్ హైస్కూలును యెత్తివేస్తా రనుకొన్నారు. ఆలాటి సమయంలో రావు బహద్దూరు వెంకటరామయ్య నాయుడుగారికి అండగా నిలిచి ఆ వుపద్రవం తప్పించింది గంగరాజుగారే. ఏలూరు, బందరు, బెజవాడ మొదలయిన చోట్ల బయలుదేరిన దేశీయవిద్యాలయాలకు సహాయంచేసిన విద్యాపోషకులూ వారే. ఏలూరులోని గాంధీ విద్యాలయానికి 25 వేల రూపాయల భూరివిరాళం యిచ్చిన మహోదారులూ వారే. గంగరాజుగారు వైశ్యులు. అందుచేత

వారు వైశ్యుల నిమిత్తం స్థాపించిన వైశ్య మహాసభకూ, కన్యకాపరమేశ్వరీ సత్రానికీ చెరి పదివేల రూపాయలు ఇచ్చి తమ కులాభిమానం కనబరచారు. జనార్దన స్వామి, కన్యకాపరమేశ్వరీ ఆలయాలను మహాస్థలాలుగా చేశారు. కుమార్తెల వివాహాలు వచ్చినా సరే, యితర శుభకార్యాలు వచ్చినా సరే, వారు వాటిని కవి, పండిత, కళావేత్తల పరిషత్తులుగావర్చి పండితాదరము చూపుతూవుంటారు. ఆ విశాల హృదయులు స్త్రీసమాజాలను, పురమందిరాలను సైతం మరువలేదు. ఒక్కమాటలో చెబితే వారు గొప్పదాత.

గంగరాజుగారి నిర్వాహణశక్తీ, వ్యాపార నైపుణ్యమూ, మితవ్యయధర్మమూ వారు స్థాపించిన జూటుమిల్లు విషయంలో వ్యక్తమవుతాయి. ముప్పైఏళ్ల క్రిందట మన ఆంధ్రదేశంలో జాయింటుస్టాకు పద్ధతిని—అనగా, వాటాల పద్ధతిని స్థాపించిన యంత్రశాలలే ఎక్కువ. ఒకవేళ స్థాపించివుండినా నిర్వహించే సామర్థ్యంలేక కొన్నీ, అనుభవజ్ఞులైన ఉద్యోగులులేక మరికొన్నీ ఎగిరిపోతూ వుండేవి. ఇటువంటి పరిస్థితుల్లో గంగరాజుగారు జూటుమిల్లును స్థాపించి దానిని యూరోపియనులక్రింద వున్న మిల్లులమాదిరిగా జయప్రదంగా నిర్వహించారు. వారి

హయాములో ఆ మిల్లుయొక్క కదుళ్లసంఖ్య పెరిగింది; వర్కుషాపు వృద్ధి అయింది; అదివరకు ఉన్న అప్పు తీరిపోయింది. ఇవన్నీగాక, వాటాదార్లకు ఇరవైఅయిదు లక్షల రూపాయలు పంచిపెట్టారు. ఇన్ని విధాలుగా మిల్లును వృద్ధిపరచిన గంగరాజుగారిని కదిల్చి, చివరకు, ఇంకొకరిమీద దాని భారం పెట్టేసరికి మూలధనం రూావస్తూ హరించుకొనిపోవడమే కాకుండా, అప్పులు పెరిగి, మిల్లు పనిచేయని పరిస్థితులుకూడా ఏర్పడ్డాయి; సుమారు వేయిమంది పనివాళ్లు అల్లాడుతున్నారు.

గంగరాజుగారికి అరవైయేళ్లు నిండినాయి. వారు ఈ అవకాశాన్ని పురస్కరించుకొని, తమ జీవితాశయాల్లో ఒకటయిన తులాభారోత్సవం జరుపుకోవడానికి సంకల్పించుకొన్నారు. 1933-వ సంవత్సరం మే నెల 14-వ తేదీ గంగరాజుగారి జీవిత చరిత్రలోనే కాదు—ఆంధ్రదేశచరిత్రలోనే ఒక గొప్ప సుదినం. ఆనాడు గంగరాజుగారి సౌధావరణలో అలంకృతమయిన ఒక వేదికను అమర్చారు. మంగళవాద్యాలు మ్రోగుతున్నవి. పండితులు ఆశీర్వాదవర్షం కురిపిస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ ఆనందంతో కరతాళధ్వనులు చేస్తున్నారు. గంగరాజుగారు కాటాలో ఒక

వైపున కూర్చున్నారు. రెండో వైపున పెట్టిన వెండిగంగా ళంలో రూపాయలు కుమ్మరిస్తున్నారు. చివరకు కాటా ముల్లు మధ్యకు చేరింది. హర్షధ్వనులమధ్య, పండితుల ఆశీర్వాదాలతో రాజుగారు కాటానుంచి దిగారు. ఆ మహోత్సవసమయంలో రాజుగారు 20,000 రూపాయలు దేశోపయోగసంస్థలకూ, పండితులకూ, ఆప్తులకూ పంచిపెట్టారు.

ఇక గంగరాజుగారి ప్రజాహితైక జీవనం చూదామా ?—వారు వహించని గౌరవపదవులు, వారి వుపకారం పొందని సంస్థలు చాలా తక్కువ. ఆనరరీ మేజస్ట్రేటు ; పంచాయతీ కోర్టు, సహకార బ్యాంకుల ప్రెసిడెంటు ; తాలూకా బోర్డు, జిల్లా బోర్డు, మునిసిపాలిటీ, శాసనసభల సభ్యులు ! ఆయన ఇన్ని పదవులలో వుండినీ్న అపకారంమెరుగని గొప్ప వ్యక్తి. పండితులకు కవులకు విద్యార్థులకే కాదు, సప్తాహాలకు, సంతర్పణలకు, వివాహాలకు, దేవాలయాలకు, సత్రాలకు—ఇంకా ఇలాంటి సమస్త దేశోపయోగ కార్యాల కున్ను వారి సహాయం లభించకపోవడంఅంటూ లేదు.

గంగరాజుగారు గుండేపూడి,విస్సన్నపేటల జమీందారులు. అయినా, వారిలో జమీందారీ తత్వం

కంటే సామాన్య జనాభిమానం, దీనజనసేవానురాగం అధికంగా కనిపిస్తూ, వారి మనస్సు యెప్పుడూ ఏదో వొక పరోపకార కార్యంమీదికే పరుగెత్తుతూ వుంటుంది. ప్రజలు వారిని రాజా అని ప్రీతిపూర్వకంగా అంటూ వుంటే ప్రభుత్వంవారు రావుబహద్దూ రని పిలుస్తున్నారు.



## దేశోద్ధారక

## శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

ఇప్పటికి ముప్పైఏండ్లకుపైగా అవుతుంది. కీర్తి శేషులైన కోపల్లె హనుమంతరావు పంతులుగారున్ను, ముట్నూరు కృష్ణారావు, చిట్టా సుందరరామయ్య, చిల్లరిగె శ్రీనివాసరావు, కవుతా శ్రీరామశాస్త్రిగార్లున్ను, నేనున్ను కలిసి సూరతులో జరుగుచుండిన కాంగ్రెసుమహాసభకు బయలుదేరి, బొంబాయిలో సుప్రసిద్ధభోజనశాల అయిన సర్దారుగృహంలో బసచేశాము. కారం, పులుసు, గోంగూరపచ్చడి లేని మహారాష్ట్రుల చప్పిడిభోజనం మాకు రుచించిందికాదు. ఇట్లా తంటాలుపడే మమ్ములను చూచి జాలిపడి, "ఈ వూళ్లో మన బందరువారే అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు వున్నారు. మనం వారియింటికి వెళ్లినట్టయితే వారు అన్ని సౌకర్యాలూ చేయిస్తారు. అక్కడకు వెళ్లితే బాగా వుంటుం" దని హనుమంతరావుగారన్నారు. మేమంతా సరే అని, గిర్గాంలో వున్న నాగేశ్వరరావుపంతులుగారి బసకు బయలుదేరాం.

అహమ్మదాబాదు మిల్లుధోవతీ కట్టుకొని, చిక్కని బనియను తొడుక్కొని, మెడలో చిన్న రుద్రాక్షతావళం

వేసుకొనివున్న వొకవ్యక్తి చిరునవ్వు నవ్వుకొంటూ, మాకు యెదురుగా వచ్చి స్వాగత మిచ్చారు. వారికి 35 సంవత్సరాల వయ స్సుంటుంది. పసిమివర్ణం, పలు చనిశరీరం, చక్కని మీసకట్టు, మృదువైన చెక్కిళ్లు, విశాలమైన ముఖమండలం, దయనూ, కనికరాన్నీ, శాంతాన్నీ, కోమలహృదయాన్నీ చూపే కన్నులు, పట్టుదలనూ, కార్యశూరత్వాన్నీ ప్రకటించే నిడివైన ముక్కు గలిగి, తెలుగుతో మాట్లాడేదానికి ప్రారం భించిన వారిని చూడడంతోనే మా ప్రాణాలన్నీ లేచి వచ్చాయి. అప్పట్లో నాగేశ్వరరావుపంతులుగారింకా ఆంధ్రపత్రికను స్థాపించ లేదు. అమృతాంజనం వ్యాపారం కూడా భారీగా జరగడంలేదు. సామాన్యగృహస్థులుగానే వుండి, ట్రాములో ఆఫీసుకు పోతూవస్తూ వుండేవారు. అయినప్పటికిన్నీ అతిథిసత్కారంలోమాత్రం అప్పటిదాని కిన్నీ, చరమదశనాటిదానికిన్నీ భేదం యేమీ కన పడదు. ప్రొద్దున్నే మా అందరికీ వేన్నీళ్ల స్నానం, వెన్నతో చేసిన బిస్కట్లు, చిక్కని పాలతో తయారైన కాఫీ యేర్పాటుచేయించి, పదిగంటలకల్లా మంచి ఊరగాయలు, పిండివంటలు, కూరలు, అప్పడాలు, వడి యాలు, వెన్నకాచిన నెయ్యి, తోడుపెట్టిన పెరుగు—

యీ ప్రకారంగా మాకు భోజనాలు పెట్టించారు. సర్దారుగృహాంభోజనంతో కారానికి మొగంవాచిన మే మంతా పంతులుగారు పెట్టించిన ఆవకాయ, మాగాయజాడీలను సగంనంతు ఖాళీచేసివేశాం. సూరతు వెళ్ళేరోజున మా అందరకున్నూ ప్రత్యేకమైన విందు చేసి, దేశానికి వెళ్ళేటప్పుడు బొంబాయిలో దిగి తప్పకుండా తమ యింటికే రమ్మన్నారు.

అయిదారేండ్ల తరువాత, అదృష్టవశాత్తు, పంతులు గారు 1908 సెప్టెంబరు 9-వ తారీఖు బుధవారంనాడు బొంబాయిలో స్థాపించిన ఆంధ్రపత్రికకు నేను సంపాదకుడుగా వెళ్లడం తటస్థించింది. వారు ఎవరు వుద్యోగానికి వెళ్లినా ముందు తమ యింటిలోనే బస చేయించే వారు; తమ సహాపంక్తిని భోజనాలు పెట్టించేవారు. ఈ ఆచారాన్ని అనుసరించి, నేనుకూడా వారియింట్లోనే వొక నెలరోజులకు తక్కువ కాకుండా భోజనంచేశాను. ఆ రోజులలో ఆంధ్రపత్రిక కార్యస్థానం అంతా రెండు చిన్న గదులలో ఇమిడివుండేది.

సంవత్సరాదిసంచిక మూలంగా ఆంధ్ర మండలం లోని ప్రముఖులతో పంతులుగారికి సన్నిహితబాంధవ్యం కలిగింది. బొంబాయిలోనూ తెలుగువారు చాలామంది

ఉన్నారు. అయితే, వీ రంతా ఒకచోట కలుసుకోవడం గాని, మంచిచెడ్డలు మాట్లాడుకోవడంగాని లేవు. వీరందరినీ కూడగట్టుకొనిరాగల ప్రముఖుడున్నూ లేడు. ఇట్టి స్థితిలో బొంబాయిఆంధ్రుల సమావేశంయొక్క ఆవశ్యకతను గ్రహించి, ముందుగా, కీర్తిశేషులయిన గంటి లక్ష్మీనరసింహంగారియింట్లో ఆంధ్రుల సమావేశం వొకటి పంతులుగారే యేర్పాటు చేయించి, ఆ పిమ్మట నెలకొకరింట్లోయిట్టి సాంఘిక సమావేశాలను జరిపిస్తూవచ్చారు. ఒకటో, రెండో సంవత్సరాదిసభలుకూడా జరిగినాయి. కామాటిపురంలోని తెలుగువారితో సంబంధం కల్పించారు. ఈ విధంగా ఆంధ్రదేశంయొక్క భావ్యభివృద్ధికి ఆధారమైన ప్రత్యేకరాష్ట్రనిర్మాణం, ఆంధ్రజాతీయాభిమానవ్యాప్తి మొదలయిన గొప్పసంకల్పా లన్నీ నాగేశ్వరరావుపంతులుగారు తమవద్ద పనిచేస్తూవచ్చిన అయిదార్గురు తెలుగువారితోనే ప్రారంభించారు.

అయితే, నాగేశ్వరరావుపంతులుగారి సంకల్పాలు, ప్రజాభిమానం, కార్యదీక్ష విస్తరించినకొద్దీ ఆంధ్రప్రాబల్యంలేని బొంబాయినగరం వారికి సంకుచితప్రదేశంగా కనపడివుంటుంది. అందువల్ల, వారు తమసంకల్పాలను సాధించేదానికై బెజవాడకు పోతే బాగావుంటుందా,

లేకుంటే చెన్నపట్టణం అనుకూలంగా వుంటుందా అనే ఆందోళనలో పడి, దృష్టి బెజవాడమీదనే వుండినప్పటికీ రాజకీయ ప్రాముఖ్యంవల్లనూ, ప్రభుత్వంవారి ముఖ్య స్థానం కావడంచేతనూ, చివరకు తమ కార్యరంగాన్ని చెన్నపట్టణానికే మార్చడానికి నిశ్చయించుకొని, ఆంధ్ర పత్రికను, తమ కుటుంబాన్ని, మనుష్యులను అక్కడకు లేవదీసి, వారపత్రికతోపాటు, 1914 ఏప్రిలు 1-వ తేదీని దైనికపత్రికనుకూడా ప్రారంభించారు. అప్పట్లో ఆంధ్రప్రకాశిక, శశిలేఖ, కృష్ణాపత్రికలు తప్పితే చెప్ప తగ్గ తెలుగుపత్రికలే అంతగా లేవు. ఆంధ్రపత్రిక దైనిక పత్రికగా మారడంతోనే ఆంధ్రోద్యమానికిన్ని, ఆంధ్ర జాతీయభావ వికాసానికిన్ని నూతనజీవం, క్రొత్త తేజస్సు కలిగి, చీలికలుచీలికలుగాను, విడివిడిగాను, ఒకరి యొక్క సంగతి ఒకరికి తెలియకుండాను వుంటే మన ఆంధ్రమహాజనులను దగ్గరగా చేర్చి, క్రొత్త ఆశలను, క్రొత్త అభిలాషలను పుట్టించి, ఒకజాతిగా ప్రకాశించే దానికి కావలసిన దోహదానికి ప్రారంభం అయింది.

పంతులుగారి అంతస్తు యెంతపెద్దదో వారి కార్యాసక్తి, ప్రజాభిమానం, సేవాభిలాష, క్రియా శక్తి - అంత పెద్దవి. పంతులుగారిపేరు వొక్క

ఆంధ్రపత్రికా నిర్వాహకత్వంవల్లనే స్థిరంగా జ్ఞప్తియం దుంచుకోబడగలిగివున్నా, యీమాత్రంపనితోనే పంతులుగారికి తృప్తి కలగలేదు. కొంచెం లోతుగా ఆలోచించి చూచినట్టయితే వారి సేవావిధానంలో ఒక గీత గీచి, 'దీన్ని దాటిపోగూడ' దనే ప్రసక్తే కనిపించదు. ప్రజాప్రబోధానికై ఆధునికాంధ్రులలో యింత బాహుళ్యమైన కృషి చేస్తూవున్నవారు మరివొకరు వున్నారో లేదో, అనుమానం. ఆంధ్ర గ్రంథమాల అనే పేరుతో, డబ్బు పెట్టి స్వయంగా అచ్చువేయించుకో శక్తిలేని యెందరో కవుల, యెందరో గాయకుల, యెందరో పండితుల, యెందరో విద్యార్థికుల గ్రంథాలను వారు వుచితంగా అచ్చువేయించి యిచ్చినారు. కీర్తిశేషులయిన కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు అసంపూర్తిగా వదలిపెట్టిన ఆంధ్రవిజ్ఞానసర్వస్వంయొక్క ప్రకటనభారాన్ని మీద వేసుకొన్నారు. సుమారు మూడుసంవత్సరాలకు పైగా కృషిచేసి, ఆంధ్రసారస్వతంయొక్క విషయసూచికను ప్రకటించి తరతరాల పండితులకు, విద్యార్థులకు మహోపకారం చేశారు. భారతిమూలంగా మాసమాసమున్నూ పండితులతో పరిచయం కల్పించి భాషాసేవ చేశారు. ఆంధ్రపత్రిక, భారతి, విజ్ఞానసర్వస్వం, ఆంధ్రగ్రంథ

మాల, ఆంధ్రవాఙ్మయసూచిక వీటిమూలంగా వారు చేసిన అఖండమయిన సేవను ఒకయెత్తుగాను, దాతలుగా, అన్నదాతలుగా చేసిన సేవను యింకొకయెత్తుగాను భావింపవలసివుంటుంది.

పంతులుగారి దాతృత్వస్వరూపాన్ని గ్రహించాలంటే మన దృష్టిని కాస్త బెజవాడలోని శ్రీ దుర్గావిలాసంమీదకున్ను, చెన్నపట్టణంలోని ఆంధ్రపత్రికా కార్యాలయంమీదకున్ను త్రిప్పవలసివుంటుంది. బెజవాడలో ప్రొద్దుటిపూటను, చెన్నపట్టణంలో సాయంకాలమున్ను పంతులుగారిదగ్గర నిలుచుంటే సరి, శాలువలు కప్పుకొని కొందరు, ఖద్దరుటోపీలు పెట్టుకొని కొందరు, లాగులు వేసుకొని కొందరు, పుస్తకాలు చేతబట్టుకొని కొందరు, కన్నీరుకారుస్తూ కొందరున్ను, యిండ్లు కట్టుకొంటున్నామనీ, పెండ్లి చేసుకొంటున్నామనీ, పుస్తకాలు అచ్చువేసేదానికి డబ్బులేదనీ, శరణాలయాలకనీ, విద్యాలయాలకనీ, సంతర్పణలకనీ, విదేశప్రయాణాలకనీ, పుణ్యక్షేత్రాలకనీ, స్థాలుజీతాలకనీ, యీవిధంగా మరియెందరోనున్ను, లోకంలో యెన్నితరగతుల అవసరాలు, కష్టాలు; దుఃఖాలు, సుఖాలు వున్నవో అన్నితరగతుల మనుష్యులున్ను కనపడేవారు. ఎవరో అదృష్టహీనులుతప్ప ప్రతి

మనిషిన్ని, అప్పుడు పంతులుగారి ఖజానాలో వుండే నిలువనుబట్టి, పదులు వందలు పట్టుకొని పోనివారు లేరు. ఇవ్వడం అంటేను, భోజనంపెట్టడం అంటేను పంతులుగారికి ఒకవిధమైన సంతోషం. ఆ యివ్వడంలో ఒక హద్దు లేదు, ఒక నిర్ణయం లేదు; తడుముకోవడంలేదు, సందేహించడంలేదు. ఆ రావడం, ఆ యివ్వడం అంతా ఒక మహాప్రవాహం! దేశంలో పంతులుగారికన్నా భాగ్యవంతులు లేరా? ఉన్నారు. అయితే భాగ్యానికిన్నీ, దాతృత్వానికిన్నీ సంబంధం వున్నట్టు తోచదు. అన్ని గుణాలవలెనే యిదిన్నీ పుట్టుకతో యేర్పడే ఒక గుణం. ఈ గుణం పంతులుగారిలో అత్యధికంగా వుండడంవల్లనే వారు తమ ప్రియపుత్రిక శ్రీమతి కామాక్షమ్మగారి వివాహసమయంలో సంచిలో చేయిపెట్టి చేతికి వచ్చినన్ని రూపాయలు పండితుల కిచ్చివేయగలిగారు. నవరాత్రాలలో బెజవాడలో జరుగు పూజలందు పండితులకు ధారాళంగా, వెనక్కు తీయకుండా యిచ్చివేశారు.

విశ్వదాత శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి దయాళుత్వానికిన్ని, దాతృత్వానికిన్ని సంబంధించిన గాథలెన్ని అయినా చెప్పవచ్చును. ఏదో ఒక సందర్భంలో పంతులుగారొకవూరు వెళ్లారు. అక్కడ ఒక పెద్దమనిషి

తానుమాత్రమే కాకుండా తన భార్యను, నలుగురు పిల్లలను వెంటబెట్టుకొని పంతులుగారి బసకు వెళ్లాడు. వెళ్లి, పంతులుగారియెదుట వారంతా కండ్ల నీరు పెట్టుకోవడం మొదలుపెట్టారు. ఇట్లా కన్నీరు పెట్టుకొంటూ ఆయన భార్యా, పిల్లలు రివ్వున పంతులుగారి పాదాలపై పడి, ఆవురుమని యేడుస్తూ "అయ్యా, మీరు ఎందరికో ధర్మం చేస్తున్నారు. అన్నం పెట్టుతున్నారు. ఉద్యోగా లిస్తున్నారు. పోషిస్తున్నారు. మాకు అన్నం లేదు. చేతిలో దమ్మిడీ లేదు. మాకు పట్టెడు అన్నం దొరికే మార్గం చూపిస్తారనే ఆశతో మీ పాదాలు పట్టుకొన్నాం. రక్షిస్తారా, రక్షించండి. లేదా, మమ్మల్ని చచ్చిపొమ్మంటే చచ్చిపోతాం" అని ఆ ఆడమనిషీ, పిల్లలు అనేటప్పటికి పంతులుగారుకూడా కంట నీరుపెట్టుకొని, "ఏం కావాలి, యేం కావాలి" అని యెంతో ఆదుర్దాతో అడిగి, చివరకు వారు అడిగినది యిచ్చి పంపివేశారు.

మరొకసారి, ఒకవిద్యార్థి పరీక్షకు రుసుము కట్టవలసివుండి, ఒక పెద్దమనిషిదగ్గిర సగము అప్పుతీసుకొని మిగతా సొమ్ముకోసం బ్రహ్మప్రయత్నం చేశాడు. ఎక్కడా దొరకలేదు. చివరకా పెద్దమనిషిదగ్గిరనుంచే సిఫారసుపుత్తరం వ్రాయించుకొని పంతులవారిని చూచా

డు. ఆ వుత్తరం చూచుకొని వారు నలభైరూపాయల కొక చీటీవ్రాసియిచ్చారు. కుర్రాడు నిర్విణ్ణు డయిపోయాడు. ఇరవై యిమ్మంటే నలభై యివ్వడం! పంతులుగారా సంగతి గ్రహించి "ఈ పైకం మళ్లీ నాకు యివ్వనక్కర లేదు. ఈ వుత్తరం వ్రాసియిచ్చినవారి పైకంకూడా యిప్పుడీయకు. నా పైకం పరీక్షకూ, వారిపైకం పై ఖర్చులకూ వాడుకొని యింటిదగ్గరనుంచి పైకంవచ్చింతరవాత వారికియ్యి" అన్నారు. విద్యార్థి నోట మాటరాక పంతుల వారికి సాష్టాంగపడి ఆనందాశ్రువులతో వెళ్లిపోయాడు.

నేను యెరిగినంతలో బహుఆశ్చర్యమైన గాథ యింకొకటి వుంది. ఆనాడు శనివారం. ఆరుగంటలయింది. ఇంటికి వెళ్లేదానికై తంబుశెట్టివీథిలో మోటారు సిద్ధంగా వుంది. తోలుసంచిలో కాగితాలు వేసుకొని, లేవబోతున్నారు పంతులుగారు. ఇంతలో ఖద్దరుటోపీ పెట్టుకొన్న ఒకాయన వచ్చి కుర్చీమీద కూర్చున్నాడు.

ఖద్దరుటోపీమనిషి—అయ్యా......గారు ఇవ్వేళనే వచ్చారు. జ్వరంగా వుంది. రాలేకపోయారు. ఖర్చుకేమీ లేదు. మీతో చెప్పి, యేమైనాతీసుకొని రమ్మన్నారు.

పంతులుగారు—మంచిది. ఇప్పుడు యింటికి వెళ్లుతున్నాను. సోమవారం రండి.

ఖద్దరుటోపీ—ఎవరు వస్తారయ్యా సోమవారం మళ్లీ ? నాకు యేమీ పని లేదనుకొన్నారా ? ఈ భాగ్యానికి తిప్పడంకూడా యెందుకు ? ఆ యిచ్చేది యేమిటో యిప్పుడే యివ్వరాదా, పోతాను.

పంతులుగారు—నాకష్టాలు మీకేమి తెలుస్తాయండీ ? అంతా నన్నే పట్టుకొని పీక్కొనితింటా మంటారు. ఇంటికి పోతూవుంటేసమయంలో ఇట్లా వచ్చి తే, తే అంటే యెట్లా ? సోమవారంనాడు రాకూడదా ?

ఖద్దరుటోపీ—మీ కష్టాలకు నన్నేమి చేయమంటారు ? మీరు నాకోసమే కష్టపడుతున్నారా ? ఈ మాత్రానికి యిన్నిసార్లు తిప్పాలా యేమిటి ? లేదని చెప్పరాదా, పోతాను.

పంతులుగారు మళ్లీ మాట్లాడకుండా సొంతఖర్చుకు తీసుకొనిపోతూవున్న సొమ్ములోనుండి కొంతసొమ్ము తీసి ఆయనచేతిలో పెట్టి "క్షమించండి" అని వెళ్లిపోయారు.

పంతులుగారి సదుపాయంచూడకుండా అడిగేవారు యెందరో వున్నారు. ఇంటికి వెళ్లేసమయమైనా సరే, కారులో వెళ్లేటప్పుడైనా సరే, రైలుబండి యెక్కుతున్నప్పుడైనాసరే, యేవూరైనాసరే, పగలు రాత్రి అనే భేదం లేకుండా, వారి మనస్సునయినా కనిపెట్టకుండా, కఠినంగా

మాట్లాడి, నిర్బంధంచేసి, సహాయం పొందినవారు యెందరో వున్నారు. ఇట్లా యెందరు పీడించినా, తిప్పలు పెట్టినా పంతులుగారి మనస్సుమాత్రం యెప్పుడూ సంతోషంగాను, నిర్మలంగాను, నిష్కళంకంగాను వుండేదేగాని అనుమానం, అసూయత కనపడేవి కావు.

ఇక వారి అన్నదానవిషయంలోను, మిత్రుల ఆదరణవిషయంలోను యెంత చెప్పినప్పటికిన్ని తృప్తితీరదు. బెజవాడలోని శ్రీ దుర్గావిలాసం యెప్పుడూ పచ్చతోరణాలు కలిగి పెండ్లిండ్లు, వడుగులు, వేడుకలు మొదలయినవాటికి సంబంధించిన వాద్యాలతో మ్రోగుతూనే వుంటుంది. పంతులుగారు అక్కడ వున్నప్పుడల్లా, యెంత మంది వచ్చినా సరే వారిసహాపంక్తిని భోజనం చేయవలసిందే. పొయ్యిమీద బియ్యపుగుండిగ వుడుకుతూనే వుంటుంది, మధ్యాహ్నం పంౘండు గంటలదాకా. రాష్ట్రీయసభలు వచ్చినా, హరిజనసభలు వచ్చినా, యే సభలు వచ్చినా, వందలు వచ్చినా వేలు వచ్చినా, భోజనపుఖర్చు యెప్పుడూ పంతులుగారిమీదనే పడడం రివాజు అయిపోయింది. కరాచీకి, బొంబాయికి వెళ్లే పెద్దలంతా బొంబాయిలో వారిఅతిథులుగానే వుండి పిండివంటలతో సహా భుజించి వెళ్లడం ఆచారమయింది. ఇక చెన్నపట్టణంలో

పంతులుగారి 'శ్రీబాగ్' స్త్రీపురుషుల కందరకూ అడ్డం లేని ఆతిథ్యక్షేత్రంగా వుంది. ఎక్కడ యే మూలప్రదేశంలో జరిగేసభలకు పిలిచినా ప్రయాణపు ఖర్చులన్నీ తామే భరించి, పైగా అక్కడ అధమం నూరు రూపాయల కట్నమైనా యిచ్చిరావడం వారికి అభ్యాసమైంది. హరిజనోద్ధరణవిషయంలో పంతులుగారి తోడ్పాటే లేనియెడల యింతప్రచారం, యింతపని ఒక్కనాటికీ జరిగివుండవు.

పరిసరాలు వ్యక్తుల నెట్లా మార్చివేస్తాయో చూడాలంటే పంతులుగారినే నిదర్శనంగా చూపవచ్చు. బంగాళా విభజనానంతరం బయలుదేరిన వుద్యమంలో నాబోటి వాళ్లకు దాదాభాయి, డిగ్బీ, దత్తు, వాచా, తిలక్కుగార్ల రచనలు వేదప్రామాణ్యంగా వుండేవి. ఒకనాటి సాయంకాలం బొంబాయిహార్బరులో పంతులుగారూ, నేనూ ఒక చిన్నపడవలో షికారుకుబయలుదేరాము. నేనుఉన్నవాణ్ణి వుండకుండా హిందూదేశపు దారిద్ర్యం, కరవులు, ధనప్రవాహం, గృహపరిశ్రమల నాశనం వీటిమీాద పడ్డాను. ఈ సంభాషణ అప్పట్లో వారి కంత సమ్మతంగా వుండినట్టు కనపడలేదు. వారిమనస్సుకు కొంచెం కష్టం తోపింపచేసినట్టు జ్ఞాపకం. ఆ తరువాత చెన్నపట్టణంచేరాము. అది రుష్యా, జపాను యుద్ధసమయం. ఒకరోజున రుష్యా

ప్రభుత్వపు ప్రజాపీడనానికి సంబంధించిన ఒక వ్యాసాన్ని 'నేషన్' పత్రికనుండి భాషాంతరం చేసివేస్తిమి. దానిలో ఎక్కడనో ఒకచోట "యీలాటి ప్రభుత్వానికి ఆంగ్లేయ ప్రభుత్వంవారు తోడ్పడుతున్నా"రని ఒకముక్క దొర్లిందని అప్పుడు పోలీసుకమీషనరుగా వుండిన ఆర్మిటేజిగారు పంతులుగారిని పిలిపించి హెచ్చరించి పంపారు. ఇది పంతులుగారికి కష్టంగా తోచింది. అప్పుడు కరుకైన తల కట్టులు పెట్టడంకూడా రాజద్రోహమే అన్నారు. ఆ రోజుల్లో పంతులుగారు ఖరీదుగల సూట్లు వేస్తూ ఆంగ్లేయ ప్రభుత్వం అంటే యెంతో అభిమానం కలిగివుంటూ వచ్చారు. ఆలాటి నాగేశ్వరరావుపంతులుగారు గాంధీ మహాత్ముని వుద్యమంలో కొట్టుకొనిపోయి, ఆసూటులను, ఆ లాలిమ్లీతువాళ్లను, ఆకూటికురాదిసోపులను ఒకతన్ను తన్నారు. గాంధీవుద్యమంలో పడి ముతకబట్టలను కట్టినారు. తమ ఆరోగ్యానికి భంగంకలుగుతుందేమో అనే ఆలోచనకూడా లేక వూరూరా తిరిగారు. ఈ వుద్యమ ఫలితంగా ఖద్దరువ్యాప్తికై ఆంధ్రపత్రికాలయంలో స్థాపించిన స్టోర్సువ్యవహారంలో వేలకొద్దీ హరించుకొనిపోయినా మళ్లీ మాట్లాడలేదు. కాంగ్రెసు వాఙ్మయోత్పత్తి నిమిత్తమై కొన్నివేలతో స్థాపింపబడ్డ ముద్రాలయంవారు

చివరకు యినుపముక్కలను, పనికిరాని కాగితాలను చేతి కిచ్చినా కిక్కురుమన లేదు. ఇక కాంగ్రెసుపక్షీయుల సహాయానికనీ, వారి యెన్నికలలో ఖర్చులకనీ చేసిన వ్యయం యిప్పటికీ రహస్యగాథగానే వుంది. ఇట్లా ఆంధ్రోద్యమం, హరిజనోద్యమం, భాండాగారోద్యమం, కృత్తివెన్ను సున్నంపాడు దేవాలయాలు, శ్రీశైలసోపానాలు, భద్రాచలవిద్యుద్దీపాలు, కాంగ్రెస్సు మొదలగువాటి కెన్నిటికో అలవికాని ఖర్చుచేస్తూ, సమస్త సదుద్యమాలకూ తోడ్పడుతూ, దేశహితైక కార్యాభిలాషులను పోషిస్తూ, తాము స్వయంగా వూరూరా ప్రజాప్రబోధం చేస్తూ, చివరకు వుప్పుసత్యాగ్రహసమయంలో, మిక్కిలి అనారోగ్యంగా వున్న సమయంలో జెయిలులోకూడా కూర్చుండివచ్చారు. జెయిలుకు పోయినా తమకు సహజమైన విందులు, సంతర్పణలు, బీదలకు సహాయం తప్పలేదు. చివరకు యీనాటి పరోపకారిజోలికి పోవడం మంచిదికాదని ప్రభుత్వసభ్యులుగా వుండిన ఆనరబిలు క్యాంబెలుగారు నాగేశ్వరరావు పంతులుగారిజోక్యానికిక పోవద్దని తమ తోడిసభ్యులను హెచ్చరించినట్లుగాకూడ అప్పుడు చెప్పుకొన్నారు.

దేశసేవాపరాయణులు, త్యాగమూర్తులు, దీనజనోద్ధారకులు అయిన దేశోద్ధారక, విశ్వదాత శ్రీకాశీ

నాథుని నాగేశ్వరరావు పంతులుగారు కడచిన ముప్ఫై యేండ్లనుండి చేస్తూవచ్చిన అఖండసేవకు కృతజ్ఞతాసూచకంగా బెజవాడలోను, రంగూనులోను మన ఆంధ్రులు చాలాగొప్పగాసన్మానంచేసి ధన్యులయ్యారు. కేంద్రశాసనసభ యెన్నికలలో స్త్రీలు, పురుషులు, చిన్నలు, పెద్దలు అందరూ తమఓట్లను పంతులుగారికేయిచ్చి తమ పూజ్యభావాన్ని విశదీకరించారు. ఆధునికాంధ్రులలో నాగేశ్వరరావుపంతులుగారు చేసినంత సర్వతోముఖమైన సేవను యెవరూ చేసినట్లు తోచదు. స్వయంకృషిచేతనే, స్వసాహాయ్యంవల్లనే ద్రవ్యాన్ని ఆర్జించారు. ప్రజోపయోగం నిమిత్తమై ఆద్రవ్యాన్ని ధారాళంగా యిచ్చివేశారు.

ప్రస్తుతకాలపు సారస్వతంలో, సంస్కారణంలో, దేశకల్యాణవిషయంలో ప్రముఖస్థానాన్ని వహించి, ప్రజలయొక్కయు, ప్రభుత్వంయొక్కయు గౌరవానికి పాత్రులై, దాతలై, దీనజనబాంధవులై, ఆశ్రితపోషకులై, దేశోద్ధారకులై, ఆంధ్రజాతీయమూర్తిగా కీర్తివహించిన నాగేశ్వరరావుపంతులుగారు 1938–వ సం॥ ఏప్రిల్ 11–వ తేదీని మృతిచెందినారు. దేశోద్ధారకుని మరణంచేత దేశం ఒకగొప్ప భక్తుని పోగొట్టుకొంది. ప్రజలొక గొప్ప దాతను, పరోపకారపారీణుని పోగొట్టుకొన్నారు.

## రావుబహద్దూరు,
## సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు

బెజవాడలోని దుర్గాకళామందిరంలో ప్రత్యేకాంధ్రమహాసభ సమావేశ మయింది. అగ్రాసనాధిపతి స్థానంలో నలుపురంగు, ఏకో వ్రాలుసంబంధమైన సూటు, కాస్త వెనక్కు వాలివున్న తెల్ల మస్లిన్ తలగుడ్డ గల ఒక వ్యక్తి వెనక్కూ ముందుకూ వూగుతూ, కొంచెం గట్టిగా చెప్పవలసినచోట కుడిచేతిని ఎత్తుతూ, కాసేపు ఇంగ్లీషులోను, కాసేపు ఆంధ్రంలోను వుపన్యసిస్తూ నిలబడ్డారు. శరీరచ్ఛాయ నలుపుగా వుండినప్పటికీ వికారమయింది కాదు. బంగారపుచట్రం గల కంటిజోడు ఆ నీలమేఘచ్ఛాయమీద తళతళలాడుతూ వుండింది. ఆ విశాలమైన మొగం, ప్రకాశమైన నేత్రాలు, నిడివైన విగ్రహం—యివన్నీ వారిప్రాముఖ్యాన్ని సూచిస్తున్నాయి. వారే రావుబహద్దూరు, సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు.

వెంకటరెడ్డినాయుడుగారు ఏలూరులో వున్నప్పుడే న్యాయవాదివర్గంలో పేరును, స్థానికసంస్థల పాలనలో అనుభవాన్ని, ఆంధ్ర ఆంగ్లభాషలలో మంచి వక్తృత్వాన్ని సంపాదించుకొన్నారు. దేశహితైకకార్యాలపట్ల

వారు చూపుతూవచ్చిన శ్రద్ధవల్లనూ, ప్రజోపయోగ వ్యవహారాలలో కనపరుస్తూవచ్చిన అభిమానంవల్లనూ, యెన్నటికయినా వారు ముందుకు [illegible] రనే అభిప్రాయం అప్పటికే ప్ర[illegible] బయలు దేరింది.

ఏదో సమయానికై కాచుకొనివున్న వెంకటరెడ్డి గారికే కాదు, యింకా యెందరో బ్రాహ్మణేతరులకు కీ॥ శే॥ డాక్టరు నాయరు, సర్ పి. టి. త్యాగరాయ శెట్టి గార్లు లేవదీసిన బ్రాహ్మణేతరోద్యమం, లేదా జస్టిస్ పార్టీ వొకవిధమైన వుత్సాహాన్ని, అవకాశాన్ని కల్పించి, 20 యేండ్లపాటు మన చెన్నరాజధానిని యావత్తూ కలవరపరచింది; కులతత్వాలను రగిల్చింది. మాంటేగూ - చెమ్సుఫర్డుసంస్కరణలఫలితంగా బయలుదేరిన యెన్నికల సందర్భంలో యీ వుద్యమం చిరకాలంనుంచి పాదుకొనివున్న అభిప్రాయాలను, అభ్యాసాలను తారుమారుచేసింది. సంఘాన్ని బ్రాహ్మణులు-బ్రాహ్మణేతరులుగా చీల్చి దేశంకంటె కులానికీ, కులంకంటె వ్యక్తికీ ఆధిక్యతను కల్పించింది. ఈ మహోద్రేకంలో, ఈప్రవాహంలో బ్రాహ్మణులు నలిగిపోయారు. పోనీయండి. బ్రాహ్మణేతర సామాన్యజనులకయినా, లేదా రాజ్యానికంతకూ పునాదిగా వున్న రైతుకయినా ఏమైనా ప్రయో

జనం కలిగిందా అంటే అదిన్నీ కనుపించదు. బిదలందరూ ఉన్నచోటనే చతికిలబడ్డారు. ఇక, జాతీయవాదులుగా వుంటూవచ్చిన పానగల్లు, పాత్రో, కూర్మా ప్రభృతులు కులతత్వవాదులుగా మారిపోయారు. ప్రజల సంగతి యేవిధంగావున్నా దృష్టియావత్తూ వుద్యోగాల మీాద పడ్డది. ఈ వుద్యమం వచ్చి బ్రాహ్మణ్ణి అవతలకు నెట్టినా, అసంఖ్యాకములయిన బ్రాహ్మణేతరకులాల్లో చాలా వుపద్రవమైన వుద్యోగాపేక్షను ప్రజ్వరిల్లజేసి, వారిలో వారికే పోటీని హెచ్చుచేసింది. ఇంతకూ రాజ్యాధికారంలేని దేశంలో బ్రాహ్మణు డేమిటి, బ్రాహ్మణేతరు డేమిటి, వుద్యోగంవల్ల ప్రయోజనం అంటూవుంటే అది వ్యక్తిగతంగా తప్పితే రాజకీయంగా వుండదు.

కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు పేరుపడ్డన్యాయవాదులు. స్థానికసంస్థల పాలనలో అనుభవంగలవారు. ఆంధ్ర ఆంగ్లభాషలలో మంచి వక్తలు. ఆంధ్రాభిమానులు. ఈలాటి ప్రముఖునికి 1920–వ సం.వు పానగల్లువారి మంత్రివర్గంలో ప్రవేశం కలిగిందంటే ఆంధ్రులంతా సంతోషించారు. కాని 1920 లో పనికివచ్చిన వెంకటరెడ్డిగారు 1923 నాటికి పనికిరాకుండా పోయారు! అర్హత లేదా? సామర్థ్యం లేదా? అన్నీ వున్నాయి. అయితే,

మన జస్టిసుపార్టీ నాయకులు తమ మంత్రులను యేర్పాటు చేయడంలో ఒక కులపెద్దయొక్క సామర్థ్యాన్ని బట్టి గాక ఆయనస్వాధీనంలోవుండే ఓట్ల బలాన్ని బట్టి వ్యవహరించేటప్పుడు ఏవో లోటులు వుండనేవుంటాయి.

మనవాళ్లు కలిమిలేములను కాపాడికుండ లన్నారు. రాజకీయాలూ అంతే. ఇవ్వేళ పైమెట్టు; రేపు క్రింది మెట్టు. వెంకటరెడ్డిగారు మంత్రివర్గంచేత వుపేక్షింపబడ్డ నాటినుంచిన్నీ ప్రతిపక్షవర్గంలో చేరి వారిని ఒకవూపు వూపారు. చురుకయిన దెబ్బలను సాగదీసి బాదారు. ఇట్లాగానీ, ప్రతిపక్షంలో పూర్తిగా చేరిపోయినారా అంటే, అదీ కనపడదు. రామలింగారెడ్డిగారు మంత్రుల పైన తమ అవిశ్వాసతీర్మానాన్ని ప్రవేశపెట్టినపుడు వెంకటరెడ్డిగారు అటూ వోటియ్యలేదు; ఇటూ వోటియ్యలేదు: తటస్థంగా కూర్చున్నారు!

"నమ్మి చెడినవారూ లేరు, నమ్మక చెడిపోతే పోయేరు" అని మన తత్వపాఠకులు పాడుతూవుంటారు. ఇది ఒక విశ్వాసం. ఆ చల్లనిప్రభువులను నమ్ముకొని గీతాలను పాడుతూవుంటే యెన్నటికయినా వారికి అనుగ్రహం కలుగకపోదు. భక్తుని విశ్వాసంతో, మిలిటరీ బిడ్డయొక్క ధైర్యంతో, సమయానికై కనిపెట్టుకొని

వున్న వెంకటరెడ్డి నాయుడుగారికి చివరకు శుభలగ్నం సమకూడింది. కోయంబత్తూరు బ్రాహ్మణేతరమహాసభ వారు గోషెన్ ప్రభువుపైన నిరసనచూపితే నాయుడు గారు వారిని సమర్థించారు. సైమన్ కమీషనుకు చాలా మంది దూరంగా నిలబడితే నాయుడుగారు బ్రహ్మరథం పట్టి భళీ, భళీ అన్నారు. ఇంగ్లాండులో సర్ జాన్ సైమన్ గారికి యేదో విందు జరుగుతూవుంటే మన నాయుడుగారు సందుచేసుకొని బ్రిటిష్ ప్రభుత్వంయొక్క మేళ్లనుగురించి నగారావాయించి, అది యీశ్వర ప్రసాదమన్నారు. వెంకటరెడ్డినాయుడుగారిలో వీరరక్తం ప్రవహిస్తూవుండినప్పటికిన్నీ బ్రాహ్మణస్తోత్రాన్ని మించి చేసే ఆ వీరుని స్తోత్రాలను విని విని యెంతకాలమని ప్రభువులు వూరకుంటారు? 1929-వ సం. లో జినీవా యందుజరిగిన అంతర్జాతీయ సమావేశానికి వారిని భారత ప్రతినిధిగా పంపారు. రైట్ ఆనరబిలు శ్రీనివాసశాస్త్రి గారు దక్షిణాఫ్రికానుంచి వచ్చివేసినతర్వాత వారిస్థానే భారతప్రభుత్వంవారి ప్రతినిధిగా నియమించారు. 1933-34-వ సం. లో స్టేటుకవున్సిలుకు సభ్యులుగా ఏర్పరచారు. ఇట్లా ప్రభుత్వంవారు ఒకగౌరవంతర్వాత మరివొక గౌరవాన్ని యిస్తూ, చూపుతూ వుండగా, మదరాసుప్ర

భుత్వంవారి లా మెంబరు సర్ యమ్. కృష్ణనాయరు గారి మృతివల్ల యేర్పడిన ఖాళీలో మన నాయుడుగారిని నియమించి "నమ్మక చెడిపోతే పోమేరు" అనే గీతం యొక్క సత్యాన్ని విశదీకరించారు. సర్ వెంకటరెడ్డి నాయుడుగారు ఆంధ్రులని మన మెంత పొంగినా,కొల్లాయి గుడ్డస్వరాజ్యగాళ్లని గాంధేయులను గురించి "ఖయిదీలకు మజ్జిగ అడిగేరుసుమా. నేను లేదనవలసివస్తుంది" లాటి వారి ప్రయోగాలు కాస్త చివుక్కు మనకమానవు.

అదృష్టం కలిసివస్తే అన్ని కార్యాలూ నల్లేరు మీాది బండీలాగ సాగిపోతాయి. సర్ హోప్టన్ స్టోక్సు గారు తమ పదవినుండి విరమించుకొన్నారు. ఇందువల్ల నాయుడుగారు ప్రభుత్వంవారి కార్యనిర్వాహక సంఘానికి వుపాధ్యక్షులున్నూ, శాసనసభకు నాయకులున్నూ అయి నారు. ఇంతలో ఎర్స్కిన్ ప్రభువు సెలవుమీాద వెళ్లడం చేత నాయుడుగారే మహోన్నతమైన ఆ గవర్నరుపదవికి నియుక్తు లయినారు. ఘనతవహించిన రావుబహద్దూరు సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు ఆ వున్నతపదవిని యెంత ఠీవితోను, దర్పంతోను, సామర్థ్యంతోను నిర్వ హించాలో అంతగా నిర్వహించారు. ఆంధ్రులు ప్రధాన మంత్రులుగను, గవర్నరు జనరలుగారి కార్యనిర్వాహక

సంఘ సభ్యులుగను, గవర్నరుగను, ఇండియాకార్యదర్శి మంత్రులుగను తమ వుద్యోగాలను నిర్వహింపగలరనే కీర్తిని పానగల్లురాజా, సర్ బి. యన్. శర్మ, సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడు, ఈమపుగంటి రాఘవేంద్రరావు గార్లు మన దేశానికి కలిగించారు.

గడ్డకట్టుకొనిపోయిన జస్టిసుపార్టీమీదను, వారి ప్రభుత్వవిధానంమీదను ప్రజలలో పెద్దఘోష బయలు దేరింది. 1936–వ సం. పు యెన్నికలలో, 20 సంవత్స రాలు చెన్నరాజధానిని యావత్తూ క్షోభింపజేసిన యీ పార్టీ యింతలో లేచేదానికి వీలులేకుండా పడిపోయింది. నాయకుడని, మంత్రియని, జమీందారని పేరుపడ్డవా రంతా దెబ్బతిన్నారు. మంత్రిపదవులను స్వీకరించాలా, వద్దా అని కాంగ్రెసుపక్షంవారు వూగులాడుతూవుంటే సమయంలో, యీ భారాన్ని బొబ్బిలిరాజు, రైటానరబిలు శాస్త్రి, సర్ మహమ్మదు వుస్మాన్‌గార్లవంటియోధులు మీదవేసుకోనేదానికి వెనుకతగ్గినపుడు దక్షిణాఫ్రికాలో ఇండియాగవర్నమెంటువారి యేజంటుగాను, చెన్న పురిలో ప్రభుత్వంవారి లా మెంబరుగాను, చివరకు చెన్న రాజధానిగవర్నరుగాను అధికారం నిర్వహించిన రావు బహద్దూరు సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు



రావుబహద్దూరు, సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు



సర్ ముత్తా వెంకట సుబ్బారావుగారు

"నమ్మి చెడినవారూ లేరు-నమ్మక చెడిపోతేపోయేరు" అని ప్రహ్లాదుని భక్తితో, హనుమంతుని విశ్వాసంతో ప్రభుత్వాన్ని కీర్తిస్తూ నడిమంత్రపు సిరిని మీదవేసుకొన్నారు గాని ఆ కొల్లాయిగుడ్డమూకల శివతాండవంముంగల నిలువలేకపోయారు.

సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు పొందవలసిన రాజమర్యాదలు చాలాభాగం పొందారు. బ్రాహ్మణేతరుల పక్షాన జాయంటుపార్లమెంటరీ కమిటీవారివద్దకు వెళ్లిన రాయబారివర్గానికినాయకత్వం వహించారు. చెన్నపురిలాకాలేజీలో కాన్స్టిట్యూషనల్ లాలో వుపన్యాసకులుగా నియుక్తులయినారు. ఆంధ్రయూనివర్సిటీ పట్టప్రదానోత్సవసమయంలో వుపన్యసించారు. నాట్యకళను, కళాపరిషత్తులను ప్రోత్సహించారు. ఆంధ్రులకే కాదు, భారతీయులకు సాధ్యమైన వుద్యోగాలను వహించారు. కాని, వారి శక్తి సామర్థ్యాలను, వక్తృత్వాన్ని, విజ్ఞానాన్ని, మిలిటరీ ధైర్యాన్ని భారతజాత్యభివృద్ధికి వినియోగించేదానికి బదులుగా సంకుచితమైన, కులతత్వప్రధానమైన రాజకీయాలకు వినియోగిస్తూ, "ఓ జిన్నాగారూ, మామాట మరచిపోకండోయి" అనిదీనవిన్నపాలుచేస్తూ, ముందుకూ వెనక్కూ, వెనక్కూ ముందుకూ నడుస్తున్నారు.

## సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు

మాననీయులు, న్యాయమూర్తులు సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు తమ ఉద్యోగాన్ని విరమించి యిప్పటికి రెండుసంవత్సరాలకు పైగా కావస్తోంది. ఇదివరకు ఎందరో న్యాయమూర్తులు ఉద్యోగాలు చేశారు; మానుకొన్నారు. కాని, వెంకటసుబ్బారావుగారు తమ ఉద్యోగం మానుకొన్నారంటే ప్రధానన్యాయమూర్తి సర్ లయొనెల్ లీచ్, అడ్వొకేటుజనరల్ సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యరు, న్యాయమూర్తి పి. వెంకటరమణారావు, చెన్నపురిఅడ్వొకేట్లసంఘాధ్యక్షులు యస్. శ్రీనివాసఅయ్యంగారు, యీలాటి మహామహులంతా ఎందుకు వారిని కీర్తించాలి? అంత గొప్పగా ఎందుకు వారిని స్తోత్రంచేయాలి?

ముత్తా వెంకటసుబ్బారావుగారు ఎక్కడనో కటకంలో జన్మించారని చెప్పుతారు. అసలు వారు పెరిగింది బందరుపట్రమీాద. ఆ పట్రలో ఏమి మహత్తు వుందోగాని ఆ గాలినిపీల్చి, ఆ నీళ్లను త్రాగినవారెందరో నాయకులై ఒక్కొక్క వ్యవహారంలో ప్రసిద్ధికెక్కితే, వెంకటసుబ్బారావుగారు "ధర్మపరిపాలనలో యింతటివారు లే"రనే ప్రసిద్ధిని, కీర్తిని గడించుకొన్నారు.

అందరివలె వారున్నూ చెన్నపట్టణంలో న్యాయ వాదులకు సంబంధించిన తరిఫీతును పొంది, రాధాకృష్ణయ్యగారితో కలిసి తమవృత్తిని ప్రారంభించారు. ఒరిజినలుసైడునందలి న్యాయవాదులలో యింతటివారు లేరనిపించుకొనేదానికి వారికి యెంతో కాలం పట్టలేదు. వారు న్యాయవాదిగాకంటె న్యాయమూర్తిగా యెక్కువ ప్రసిద్ధి పొందారు. "ధర్మశాస్త్రపాలనమంటే కండ్లు మూసుకొని, నడచినదారినే నడవడం కాదు. నాగరకసంఘానికి ధర్మ ప్రతిష్ఠాపనమే ఆధారము" అనే ఉత్కృష్టభావంతో ప్రారంభించి తమ ప్రతిచర్యలోను, ప్రతిఅడుగులోను ఈ ఆదర్శాలను ఆచరణకు తెచ్చిన భాగ్యశాలి ఆయన.

అనేకవిధములయిన మానసికప్రవృత్తులతో నిండి వున్న సంఘంలో సాధ్యమైనంతవరకు నిజాన్నిగ్రహించి, న్యాయాన్ని స్థాపించడమే న్యాయమూర్తియొక్క ధర్మం. ఈ ధర్మాన్ని నిర్వహించడంలో వారు అధికారుల అనుగ్రహానికి ప్రాకులాడలేదు; ఆగ్రహానికి బెదరలేదు. అప్రతిహతమైన స్వాతంత్ర్యాభిలాష, సర్వజనాదరణీయమైన ధర్మానురాగం, నిరుపమానమైన మేధాసంపద వారిలో మూర్తీభవించి, గొప్ప అలంకారంగా శోభించినాయి.

న్యాయమూర్తియొక్క గొప్పతనం న్యాయసూత్రాలను పఠించడంలో లేదు; న్యాయాన్ని త్రవ్వడంలోను, ధర్మాన్ని ప్రతిష్ఠించడంలోను వుంది. ఈ గుణా లన్నీ సుబ్బారావుగారి ప్రతితీర్పులోను ప్రతిఫలిస్తూవున్నాయి. ఉభయపక్షవాదాలను పరిశీలించి, కచ్చితమైన నిర్ణయానికి రావడమే వారి లక్ష్యం, వారి ఆశయం. వారు హిందూధర్మశాస్త్రాన్ని వెనుకబడిపోయిన పుక్కిటి గాథగా త్రోసివేయలేదు. దాన్ని ఆధునికకాలానుకూలంగా త్రిప్పి, నూతనాలంకారాన్ని తొడిగి, నూతన జీవాన్నిపోసి హిమవత్పర్వతపు శిఖరంలాగ ధగద్ధగాయమానంగా ప్రకాశింపచేసిన ధర్మశాస్త్రజ్ఞు డాయన.

ఆయనచేయి అన్నిటిమీదా పడ్డది. వారు వ్యాపార పరిశ్రమలవల్ల కలిగే మార్పులను మనసులో పెట్టుకొని హిందూలాకు సంబంధించిన బంధువారసత్వమందు అనుకూలమయిన నియమాలను చేస్తూవచ్చారు. ఆధ్యాత్మికోద్దేశాలనుబట్టి దత్తత చేసుకొన్నప్పటికీ అది భౌతిక కార్యంగానే ఉండా లన్నారు. స్త్రీల హక్కులను ఎంత మట్టుకు కాపాడాలో అంతమట్టుకున్ను కాపాడేదానికి జంకలేదు. హిందూమతాన్ని వదలి అన్యమతంలో చేరిన వారిని మళ్లీ మతంలో చేర్చుకోవడం శాస్త్రవిరుద్ధం

కాదన్నారు. హిందూమతంలో పంచమవర్ణం లేదనీ, అస్పృశ్యతలేదనీ ప్రతిపాదించినారు. ఇంతేకాదు, సర్ సుబ్రహ్మణ్య అయ్యరు మొదలుగాగలవారు ప్రారంభించిన రైతుహక్కురక్షణాన్ని వారు పూర్తిగావించినారు.

"వెంకట సుబ్బారావుగారియొక్క ఆధిక్యతను గురించి యెంత చెప్పినా తరుగు లేదు, విసుగు లేదు. వారికంటె యెక్కువ చదివినవారు, యెక్కువ తెలివిగలవారు, యెక్కువ గొప్పతనం వున్నవారు ఉంటే ఉండవచ్చును గాని యీ మూడు గుణాలూ సుబ్బారావుగారిలోవలెలగ్నమయినవారు యింకొకరు లే"రన్నారు న్యాయమూర్తి వెంకటరమణారావుగారు. "ఈలాటి న్యాయమూర్తి మరి వొకరు లభించేదానికి చాలా కాలం పట్టుతుంది. పూర్వ కాలపు నాగరికులు ఆధునిక సాంఘిక పరిస్థితుల నెదురొక్కొని కొట్టుకులాడే యీ కాలంలో హిందూసంఘానికి వీరు చేసిన సేవ అమూల్యమైం"దని సర్ అల్లాడి కృష్ణస్వామయ్యరుగారు వ్రాశ్రుచ్చారు. నిశ్చయం.

సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు న్యాయమూర్తిగానే కాదు గొప్పసంస్కర్తగాను, సాంఘిక సేవకుడుగాను, దాతగాను ప్రసిద్ధిపొందివున్నారు. వారున్ను, లేడీసుబ్బారావుగారున్ను చెన్నపురిలో స్థాపించిన సేవా

సదనమే వారి సేవాభిలాషను, దాతృత్వాన్ని కలకాలం చాటుతూ వుంటుంది. మన చెన్నరాజధానిలో యిదివరకు యెవరూ ప్రారంభించని మహోత్కృష్ట కార్యాన్ని ప్రారంభించి, భర్తలువదలిన స్త్రీలకు, దిక్కులేని ఆడు వారికి, హరిజనబాలికలకు తినేదానికి అన్నం, కట్టుకొనే దానికి బట్ట, ఉండేదానికి యిల్లు, విరామానికై ఆట పాటలు యేర్పరచి, తమకూ తమ సంఘానికీ వినియోగించే విద్యను, వృత్తులను నేర్పి ప్రయోజనకారిణులనుగా చేసేదానికై చేస్తూవున్న కృషికి సాటి యింకొకటి లేదు. ఈ గొప్పప్రతిష్ఠాపనకు ఒక్క సుబ్బారావుగారే యిప్పటికి 70, 80 వేల రూపాయలను యిచ్చివుంటారు.

సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు సంస్కర్తలు. అయినప్పటికీ వారి హృదయ మెంత వుదారభావాల తోను, ప్రాచీనధర్మశాస్త్రాలపై అనురాగంతోను నిండి వున్నదో, ఆడ్వొకేటు జనరలుగారి వుపన్యాసానికి సమాధాన మిస్తూ వారు

ధర్మస్వరూపనిర్వచనం యెంతికష్టమైన కార్యమైనప్పటికిన్ని న్యాయమూర్తిగావున్న వ్యక్తికి ధర్మాన్ని సరిగ్గా పాలించడమే ఏకైకాదర్శంగా వుండాలి. అట్టి ధర్మ నిర్వహణంలో స్మృతిబద్ధంగా ప్రవర్తించాలిగాని వుల్లంఘించరాదు. న్యాయాధి

పతి సమర్థుడై, ధర్మజ్ఞుడై వున్నట్టయితే ధర్మపరిపాలనను ఆత డొనర్చు ప్రకాశాన్నలను స్మృతులు యేమాత్రమున్నూ అడ్డంరావు. విశాలభావపూరితమైన వ్యాఖ్యానానికి శాస్త్రాలలో అవకాశం వున్నపుడు కాలానుగుణమైన సాంఘికపుమార్పులను అనుకూల మైన వ్యాఖ్యానంచేసి, ఆనాటి సాంఘికపరిస్థితులను అనుకూ లంగా ధర్మాన్ని పాలిస్తూవుండాలి. హిందూ ధర్మశాస్త్రం అట్టి విశాలమైనదనిన్నీ, జీవవంతమయినదనిన్నీ, దేశకాలపాత్రాదుల ననుసరించిన మార్పులను అవకాశంగలదనిన్నీ, అదే హిందూధర్మ శాస్త్రం యొక్క వుత్కృష్టత అనిన్నీ నా అభిప్రాయం.

అని వారు కుచ్చిన అభిప్రాయాలే విశదీకరిస్తూ వున్నాయి.

మన చెన్నపురి ఉన్నతన్యాయస్థానంలో న్యాయ మూర్తిపదవిని వహించిన అలాంటి ఉదారహృదయులు, దయామయులు, సౌమ్యులు యింకొకరు కనుపించడం లేదు. ఆయన పదిహేను సంవత్సరాలు తదేకదీక్షతో ధర్మాన్ని పాలించిన న్యాయమూర్తి. రాబోవు తరాల వారికి ఆదర్శస్వరూపుడు. స్వాతంత్ర్యమూర్తి. సేవాభి లాషి. సౌక్టటు సంఘానికి స్వాతంత్ర్య, సాహస, స్వదే శాభిమానాలను నూరిపోసిన నాయకుడు. హంమండు కమిటీలో స్వాతంత్ర్యపథాన్ని త్రొక్కిన ధీరుడు. కనుకనే మహాఘనతవహించిన నిజాం ప్రభువు వారిని లాక్కొని బీహారులో తమ ప్రతినిధిగా యేర్పాటుచేసుకొన్నారు; ఆంధ్రదేశమంతా నేడు

సీ॥ న్యాయశాస్త్రాబ్ధియంతస్సారము గ్రహించు
తలఁపుతో లెస్సగా తడిసినావు
ఆంధ్రు లందఱును గా కఖిలదేశము గర్వ
పడ న్యాయమూర్తితఁ బడసినావు
తీర్పు చెప్పుటయందు, మార్పు చేయుటయందు
ధర్మదేవత కింత దడిసినావు
సచ్చరిత్రాదులౌ సద్గుణమ్ములచేత
విహితుల మదులలో విడిసినావు

తే॥ నీదు యోగ్యత గుర్తించి నిను నుతించి
సర్ బిరుద మిచ్చికొనలేదె చక్రవర్తి
ఆశ్రితాప్త విధేయ! నిరంతరాయ!
సూరిజనగేయ! వేంకటసుబ్బరాయ!

అని పురాణం సూర్యనారాయణ తీర్థులవారితోపాటు ఐక్యకంఠంతో కీర్తిస్తూవుంది.

---

## ఆంధ్రభీష్మ, న్యాపతి సుబ్బారావుపంతులుగారు

ఆంధ్ర దేశంలోని రాజకీయాలకు న్యాపతి సుబ్బారావుపంతులుగారు సునాయాసంగానే గురుస్థానం వహిస్తారు. వారి జీవితంలో ప్లీడరీప్రాక్టీసున్నూ, ప్రజాసేవయున్నూ ఒక్కటే ముహూర్తాన ప్రారంభమైనాయి. ఆ కాలంలో రాజమహేంద్రవరంలో ఉద్భవించిన ప్రతి సాహిత్య, రాజకీయ, సాంఘికోద్యమానికీ వారే నాయకులు. వారు చాలాకాలం శ్రీ వీరేశలింగం పంతులుగారి సంఘసంస్కరణోద్యమానికి కుడిభుజంగా వున్నారు. ఆంధ్రవాఙ్మయాభివృద్ధికై 'చింతామణి 'ని స్థాపించి సారస్వతం సేవించారు. మునిసిపాలిటీలోను, జిల్లాబోర్డులోను సభ్యత్వం వహించి స్థానికసంస్థాపాలనంలో మార్గదర్శకులైనారు. జిల్లాసభలను ప్రోత్సాహపరుస్తూ ప్రజల్లో రాజకీయజ్ఞానం వ్యాపింపజేయడానికితోడ్పడుతూవుండేవారు.

న్యాయశాస్త్రవాదంలోను, న్యాయాధికారులను మెప్పించడంలోను వారు స్థితప్రజ్ఞులు. పది సంవత్సరాలు గవర్నమెంటుప్లీడరుగాను, పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను పనిచేశారు. కేవలం ఉద్యోగవ్యామోహంలోనే వుంటే ఎప్పుడో న్యాయపీఠం ఎక్కివుండేవారు. కాని

వారిలో ఉద్యోగవ్యామోహంకంటె ప్రజాసేవాభిలాషే యెక్కువగా వుంది. 1892-వ సంవత్సరంలో మదరాసు కౌన్సిలు స్థాపింపబడ్డప్పుడు తమ ఉద్యోగానికిరాజీనామా యిచ్చి ఉత్తర తెలుగుజిల్లాలపక్షాన శాసనసభలో ప్రవేశించి, 1893 మొదలు 1899 వరకు ప్రజాసేవలోమగ్నులై వుండిరి. వారు సభ్యులుగా వున్నంత కాలం తరుచుగా దేశంలో సంచారంచేస్తూ, ప్రజలకష్టసుఖాలు తెలుసు కొంటూ, తమ సభ్యత్వాన్ని ప్రయోజనకరంగా చేసు కొంటూవుండేవారు. ఇట్లా వారు రాష్ట్రీయసభలో గడించిన అనుభవంతో 1910-వ సంవత్సరంలో యింపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలులో ప్రవేశించి, తమ శక్తి సామర్థ్యాలు చూపుతూ తమ సేవనూ, తమ ప్రాముఖ్యాన్నీ విస్తరింపజేసుకొన్నారు. ప్రతి దేశీయసమస్యనూ శాంతంగా యోచించి, ఎన్ని ఆటంకాలు కల్పింపబడి నప్పటికీ వాటికి లొంగక, ప్రజాక్షేమం ఏ వైపుకు వాలుతుందో ఆవైపుకే తిరిగి పోతాడుతూ, ప్రజాభిమాను లనే కీర్తి గడించుకొన్నారు.

సుబ్బారావుపంతులుగారు శాసనసభలో ఎంత శ్రద్ధగా పనిచేస్తూవుండేవారో ఆ కాలపు కాంగ్రెసు ఉద్యమానికికూడా అంత శ్రద్ధగా పనిచేస్తూ వచ్చినారు.

1885 లో కాంగ్రెసు స్థాపింపబడ్డప్పటినుంచీ కాంగ్రెసు సేవచేస్తూ కాంగ్రెసువ్యక్తులుగానే వున్నారు. 1898–వ సంవత్సరంలో చెన్నపురిలో కాంగ్రెసుమహాసభ జరిగినప్పుడు ఆహ్వానసంఘాధ్యక్షులుగావుండే గౌరవం వారికే దక్కింది. ఆ కాలంలో కాంగ్రెసులో ప్రసిద్ధివహించిన ఆంధ్రులు వారొక్కరే. ఈ విధంగా వారు రాజకీయాల్లో సంయుక్తరాష్ట్రాల్లో మదనమోహన మాలవ్యావలెను, చెన్నరాజధానిలో సేలం విజయరాఘవాచార్యులవారివలెను, బంగాళాదేశంలో సురేంద్రనాథ బెనర్జీవలెను, బొంబాయిలో వాచాగారివలెను భారతీయ వ్యక్తిగా పరిగణింపబడి ఆంధ్రదేశానికి ప్రతిష్ఠ నార్జించారు. 1913–వ సంవత్సరంమొదలు నాలుగు సంవత్సరాలవరకు కాంగ్రెసు జనరల్ సెక్రటరీగా వుండి, దేశమంతటా సంచారంచేసి, కాంగ్రెసును బలపరచి, తమ కార్యనిర్వహణశక్తిని ప్రకటించారు. కాంగ్రెసువార్త చాటుటకున్నూ, దైనిక ఆంగ్లపత్రిక లేని లోటును తీర్చడానికిన్నీ దేశమున జరిగిన కృషిలో సుబ్బారావుపంతులుగారు ప్రముఖస్థానం వహించి, హిందూపత్రికా స్థాపకుల్లో ఒక్కరుగా యిప్పటికీ కీర్తింపబడుతూనే వున్నారు.

సుబ్బారావుపంతులుగారు ఎంత శాంతిప్రియులైనా, ఎంత రాజభక్తిపరాయణులైనా దేశానికిన్నీ, న్యాయానికిన్నీ అపచారం జరిగేచోట్ల యెప్పుడూ వెనకడుగు వేయలేదు. జలియనువాలాబాగుదురంతాలను ఖండించ వలసివచ్చినప్పుడూ, ప్రభుత్వంవారు రాజకీయవాదులను అన్యాయంగా బాధించేటప్పుడూ, వాడపల్లికేసువిచారణ సందర్భంలోను, యింకా అవసరం కలిగినప్పుడున్నూ సుబ్బారావుపంతులుగారు యువకుల వుత్సాహమున్నూ, పెద్దలయోచనను న్నూ, న్యాయశాస్త్రపాండిత్యమున్నూ ప్రదర్శిస్తూ అపారమైన సేవ చేస్తూ ధన్యులైనారు.

పంతులుగారు ఇప్పుడు వయోవృద్ధులైనా, ఎచ్చట యే అవసరసభ జరిగినా, ఎంతదూరప్రయాణం చేయ వలసివచ్చినా, తామాసభకు పోయి, చిరకాల సంపాదితమైన తమ అనుభవాన్ని ప్రజలకు లభింపజేస్తున్నారు. రాజమహేంద్రవరంలోని హిందూసమాజానికి అధిపతులై, పోషకులై హిందూధర్మాన్ని ఉద్ధరిస్తున్నారు.

వదులుగావుండే ట్రవుజరు, లాంగుకోటు, తెల్ల జరీపాగా, భుజాలమీదనుంచి వ్రేల్లాడే ఉత్తరీయం ధరించి, వైస్రాయిగారి సభలో నిలబడి, తూచివేసిన పదాలతో, బెదురులేని ధాటీతో సైన్యవ్యయాన్ని గురించీ, దేశీయ

శ్రీ న్యాపతి సుబ్బారావు

లకు ఉన్నతోద్యోగా లివ్వడాన్ని గురించీ చేసి
వుపన్యాసకాలంనుంచీ యిప్పటివరకూ వారు
వున్న తెంపులేని సేవను తలుచుకుంటే యెవరు మన
ఆంధ్రభీష్మునికి ధన్యవాదా లర్పించరు ? ఎవరు ఆ గురు
దేవునికి భక్తివిశ్వాసా లర్పించకుండా వుండగలుగుతారు ?

---

# దివాన్ బహద్దూరు, సర్ మోచర్ల రామచంద్రరావు పంతులుగారు

ఆంధ్రదేశంలో నూతనప్రజాహితజీవితవిధానం సూచించి పునాది వేసినవారు న్యాపతి సుబ్బారావు పంతులుగారైతే, దాన్ని తన జీవితంలో పరిపక్వంచేసుకొని, దానికి సక్రమమైన అవతారం ఇచ్చి, దేదీప్యమానంగా మన కండ్లయెదుట నిలబెట్టినవారు మోచర్ల రామచంద్ర రావుపంతులుగారు. వారిపుట్టుక 1868లో. అనగా వారు సుబ్బారావుపంతులుగారికంటె దాదాపన్నెండేళ్లు చిన్న. ఆయన పెరిగి పెద్దవారయ్యేటప్పటికి సుబ్బారావుపంతులుగారి కృషి కొంత ఫలించి, దేశీయస్థానిక ప్రభుత్వసంస్థలకు మంచి పునాదులు యేర్పడినాయి. వాని సమస్యలున్నూ హెచ్చినాయి. పని చేయదలచుకొన్న శ్రమశీలురకు పఠించడానికీ, విచారణచేయడానికీ, యోచించడానికీ, పరిష్కరించడానికీ ఎన్నో అవకాశాలు కుదిరినాయి. అటువంటి సమయంలో రామచంద్రరావుపంతులుగారు ప్రజాహితకార్యరంగంలో అడుగుపెట్టవలసివచ్చింది.

ఆయన తిరువల్లిక్కేణి హిందూహైస్కూలులోను, ప్రెసిడెన్సీకాలేజీలోను, లాకాలేజీలోను చదువులు పూర్తి



దివాన్‌బహద్దూరు, సర్ మోచర్ల
రామచంద్రరావు పంతులుగారు



శ్రీ గంజాం వెంకటరత్నం పంతులుగారు

చేసి, ఆంధ్రమ్యా లాంగు అనే సాలిసిటరుకింద కొంతకాలం అప్రెంటిసుగావుండి ఏలూరులో ప్లీడరీప్రాక్టీసు మొదలు పెట్టి ధనముకు ధనమూ, ప్రజలతో పరిచయమూ, వారికి సంబంధించిన సమస్యల జ్ఞానమూ, వారికి ఉప కారం చేయవలసిన విధానాల నేర్పూ అన్నింటినీ యేక ముహూర్తాన సంపాదింప ప్రారంభించారు. వ్యవసాయం, నీటిపారుదల, అడవులు, శిస్తులు, విద్య, ప్రజారోగ్యం మొదలైన పరిపాలనాసమస్యలను ఆమూలాగ్రంగా, గుట్టుమట్టులతో పఠించి, ఎట్టి సమస్యలనైనా యెదు ర్కొనే సాధనాలు సేకరించారు.

ఆయన యే సమస్యను తీసుకొన్నా దానిని ఆమూ లాగ్రంగా, అనగా పుట్టుపూర్వోత్తరాలు, ఇతరసమ స్యలతో దాని సంబంధాలు, లోటుపాట్లు, సంస్కరణ మార్గాలు సర్వం పఠించి తయారుగా వుండేవారు. కమి టీలలోనూ, మీటింగులలోనూ చర్చలువచ్చినప్పుడు, తమ వాదాన్ని చక్కగా చేసి, యితరుల వాదాలలోని తప్పులు ఖండించేవారు. ఉద్రేకము, పిడివాదము మొద లైన ఉపాయాలు వేటినిగాని అవలంబింపక, తమ భావం తాము సూటిగా, న్యాయంగా చెప్పేసరికి యెంతటి వక్తలనోళ్లైనా కట్టుబడిపోయేవి. ఆయన చేసిన సూచన

లకు ప్రతిసూచనలు చేయడానికి ఏలాటి పండితుడికైనా కష్టమయ్యేది. ఈ విధంగా ఆయనకు అనేకవిషయాలలో పాండిత్యమూ, పరిచయమూ వున్నందువల్ల అనేక కమిటీలలో సంపర్కం కలిగేది. ఇట్టి పండితుని సహాయం చాలా అవసరం గనుకనే ప్రభుత్వంవారే వారిని యెన్నో కమిటీలలోకి కోరి పిలుచుకుపోయేవారు. లిట్టనుకమిటీలో, స్కీను కమిటీలో, సాండర్స్టు కమిటీలో, రౌండు టేబిలు కాన్ఫరెన్సుయొక్క అనేక సబ్ కమిటీలలో, అనేకవిధాలైన రిఫారంస్కీములలోనూ ఆయనసలహా సహాయాలు ప్రభుత్వానికి తప్పనిసరిగా కావలసివచ్చేవి. అధికార వర్గానికి సంబంధించనివారు గనుక ఆయన భారతీయ పక్షముగా స్వతంత్రమైన సూచనలు చేసి, వానిని చేర్పించ గలిగేవారు. ఇదిగాక ప్రజలతరఫున సాక్ష్యమివ్వడానికి జాయింటు పార్లమెంటరీ కమిటీలో 1919 మొదలైన కమిటీల యెదటికి వెళ్లినారు. ప్రజలతరఫున ఏ కార్యమైనా సమగ్రంగా పఠించి డెప్యుటేషనులు నడిపేవారు. 1927 లో స్వదేశసంస్థానప్రజల డెప్యుటేషనును యింగ్లాండుకు తీసుకుపోయినారు. 1932 లో 14-వ నేషనల్ లిబరల్ ఫెడరేషనుకు అధ్యక్షత వహించారు. ఆయన యెప్పుడు, ఏ ఉపన్యాసం ఇచ్చినా, వ్రాసినా ప్రభుత్వంవారు దాన్ని

గమనించి, తమ స్కీములను అందులోని సూచనల ప్రకారం సంస్కరించవలసిందే. లేకపోతే విమర్శలకు పాత్రమయ్యేవారు. ప్రభుత్వంవారు చేసిన భారతీయ చట్టాలు, రాష్ట్రీయశాసనాలు, ఇతర సంస్కరణాలూ నేడు ప్రజలకు ఏమాత్రమైనా మేలుచేస్తూవున్నాయంటే యిటువంటి ప్రజాహితజీవు లెందరో యెట్టి పటాటో పాలూ, కేకలూ, ఢాకలూ లేకుండా సవ్యంగా పూనిన శ్రద్ధవల్లనే అని మరువరాదు. మన రాష్ట్రంలోనే కాకుండా మన దేశం అంతటాకూడా ఈ రకం ప్రజాహిత జీవులలో ఆయన మణిపూస. ఆయనను దేశనాయకు లందరూ దక్షిణహిందూస్థానపు గోఖ్లే అని పిలిచేవారు. ఆ గోఖ్లే చేసిన పనితో పోల్చదగినపని యీరాష్ట్రంలో యీగోఖ్లేతప్ప వేరెవ్వరూ చేయలేదనవచ్చును.

మద్రాసురాష్ట్రపు ప్రాత లెజిస్లేటివు కౌన్సిలులో గోదావరీ కృష్ణాజిల్లాల తరఫున పన్నెండు సంవత్సరాలు ఆయన సభ్యులుగా పనిచేశారు. 1924లో ఇంపీరియలు లెజిస్లేటివు కౌన్సిలుకు సభ్యుడుగా ఎన్నుకోబడినారు. మిత వాదికి వుండవలసిన స్వాతంత్ర్యము, పదవీనిరోత్సాహత్వ మూ ఆయనలో పూర్తిగా వున్నాయి. గవర్నరును వొక్క సారి కలిస్తే లభించగల వొక పదవిని వారు సులభంగా

నుంచీ బాగాయెరుగును గనుక వారికి యీ వుపకారం సహకారసంఘాలద్వారా చేయించడానికి చాలా శ్రమ పడినారు. తమ అధ్యక్షుపదవిలో ఆశాఖనిధులు వర్ధిల్లుటకు ఆయన ప్రభుత్వమువారికి అనేకమైన సిఫార్సులుచేసి తన పట్టు నెగ్గించుకొన్నారు. ఇట్టి వీరుని మరణంతో జన బాహుళ్యానికేకాక ప్రభుత్వంవారికికూడా ఒక కీలు లేకుండాపోయినట్లయింది. ప్రభుత్వంవా రాయన కిచ్చిన దివాన్ బహద్దూరుబిరుదూ, కెయిజరీహింద్ బంగారుపతక మూ, సర్ బిరుదున్నూ వారి శాశ్వతకృతజ్ఞతకు చిహ్న లు. కాంగ్రెసుయుగంలో ఆయనవంటివారు ఉన్నతో న్నతకీర్తిమంతులు కాలేక, వెనకపడటం అబ్బురంకాదు కాని ఆయనకుండే గౌరవం ఒక సంస్థవల్లా, ఒక విధా నంవల్లా వచ్చిందికాక స్వయంప్రజ్ఞాకృషులవల్ల వచ్చిం దవడంచేత అది చరిత్రలో చిరస్థాయిగానే వుంటుంది.

——

## శ్రీ గంజాం వెంకటరత్నం పంతులుగారు

సంఘసంస్కరణంలో కందుకూరి వీరేశలింగం పంతులు, ధార్మిక నైతిక జీవనంలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగార్లు గురుస్థానం వహిస్తే రాజకీయాలలో న్యాపతి సుబ్బారావు పంతులు, మోచర్ల రామచంద్రరావు పంతులు, గంజాం వెంకటరత్నం పంతులుగార్లు గురుస్థానంలో వుంటున్నారు. వీరిలో వెంకటరత్నం పంతులుగారు కేవలం స్వయంకృషిచేత, స్వసామర్థ్యంచేత, స్వార్జితపు జ్ఞానంచేత పరిస్థితులకు యెదురీది, ప్రాముఖ్యానికి వచ్చిన మహాపురుషులు.

వెంకటరత్నం పంతులుగారు పెద్దచదువులు చదువలేదు. ఆయన పూర్వకాలపు మెట్రిక్యులేటు. మెకాలే, యెడిసన్, గోల్డుస్మిత్తుల వ్యాసాలను తూర్ణంగా పఠించి, జీవముగల శైలిని, లక్షణమైన భాషను అలవరుచుకొని, తమ కలాన్ని యెట్లా పట్టితే అట్లాగున త్రిప్పగల సామర్థ్యాన్ని సంపాదించుకొన్న తరగతిలోనివారు. ఈ కాలపువారికి ఆభాషా లేదు, ఆశైలీ లేదు, ఆఓపికా లేదు.

వెంకటరత్నం పంతులుగారు జన్మించింది సామాన్యుల కుటుంబంలో. సామాన్యుల కష్టాలన్నీ పడి, అత్యు

న్నత పదవికి వచ్చినవారు. నరసాపురంలో చదువుకొని, తరువాత ఆ జిల్లాకు ముఖ్యస్థానమగు కాకినాడకు వెళ్లి అక్కడ పోస్టాఫీసులో వుత్తరాలను గూళ్లలో వేసే చిన్న వుద్యోగాన్ని సంపాదించుకొన్నారు. కాని, వారి మనస్సు యావత్తూ ఆ రోజుల్లో చాలా దర్జాగావుండే తహసీలుదారు పనిమీదా, ప్లీడరీ పనిమీదా వుంటూవచ్చింది. ఇంతలో, మంచి పకడ్‌గా వ్రాసే వారి వ్రాతను, తెలివిని మెచ్చుకొని, విశాఖపట్నం జిల్లాకలెక్టరు "కోరాపుట్టిలో డిప్యూటీ తహసీలు పనియిస్తాను, వెళ్లుతావా" అన్నారు. సరేనని పంతులుగారు మూటాముల్లె కట్టుకొని బయలుదేరిపోతూవుంటే, దారిలో ప్రభుత్వంవారుతమకు మొదటి తరగతి ప్లీడరు సనదును మంజూరు చేసినట్టు శుభవార్త తెలిసింది. అంతట ఆయన మళ్లీ వెనకదారిపట్టి, కాకినాడ చేరుకొని, ఒక నల్లకోటును, తలగుడ్డను కొనుక్కొని, యింటికి ప్లీడరీబోర్డును తగిలించి, క్రమంగా న్యాయవాదులలో పేరుమ్రోగినారు.

వెంకటరత్నం పంతులుగారి దృష్టి మొదటినుంచి డబ్బుమీదనేగాక దేశంమీదా, ప్రజోపకారంమీదా కూడా వుండేది. ఆ రోజుల్లో ప్రజల దేశహితైకజీవనం యావత్తూ హిందూమత బాలసంఘాలు, లిటరరీ సొసైటీ

లకు సంబంధించి స్త్రీ పునర్వివాహాలమీదా, సముద్ర యానాలమీదా ఘోరమైన చర్చలు జరుగుతూవుండేవి. పంతులుగారు నెమ్మదిగా కాకినాడ లిటరరీసొసైటీ కార్యదర్శియై, వారన్ హేస్టింగ్సు గొప్పవాడా, లార్డుక్లయివు గొప్పవాడా అనే వాదాలతో తృప్తిచెందక, ప్రజల కష్టసుఖాలకు సంబంధించిన వ్యవహారాలనుగురించి అక్కడ చెన్నపట్టణంలోని ప్రభుత్వంవారికీ, యిక్కడ కాకినాడలోని కలెక్టరుగారికీ మంచి ఆంగ్లభాషలో వ్రాస్తూ, మంచి వ్రాతగాడనే ప్రసిద్ధిని సంపాదించుకొన్నారు. ఏదో సందర్భంలో, చెన్నపురి శాసనసభయందు ఆనరబిల్ వెబ్‌స్టరుగారు కాకినాడ లిటరరీ సొసైటీవద్దనుండి వచ్చే వ్రాతల శైలిని, హేతువాదాన్ని మెచ్చుకోవడంతో పంతులుగారి కీర్తి నగారాలాగ మ్రోగిపోయింది.

నిశ్చయానికి ఆ లిటరరీ సొసైటీపరిమితి పంతులుగారి శక్తిసామర్థ్యాలకున్నూ, సేవాభిలాషకున్నూ తగినదిగాదు. అయినా, ఒక్కొక్క మెట్టే పైకిపోతూ ఆయన 1887-వ సం.లో జూబిలీకమిటీకి కార్యదర్శియై ప్రభుత్వంయొక్క, ప్రజయొక్క మన్ననలను అందుకొన్నారు. పిఠాపురం రాజావారి కళాశాల మేనేజరుపదవిని స్వీకరించి, కాలేజీ కౌన్సిలును రిజష్టరుచేయించడం, పై తరగతులను పెట్టిం

చడం మూలంగా స్థిరమైన వుపకారంచేశారు. వెంకట రత్నంగారంటే వెంకటరత్నంగా రనేపేరు ప్రోగడం చేత కలెక్టరు బ్రాడీగారి కన్ను వారిమీద పడి, ఆయన వారిని జిల్లాబోర్డు వైసుప్రెసిడెంటుగా ఏర్పరచినారు. బ్రాడీదొర అంటే చాలాపేరుపడ్డ మండలాధికారి. తన పరిపాలనాన్ని చక్కగా చేసుకొనిపోయిన సర్దారు. గోదావరిజిల్లాయొక్క 1895-6, 1896-7 సంవత్సరాల రిపోర్టుల్లో తమ వైసు ప్రెసిడెంటునుగురించి వారు యీప్రకారంగా వ్రాశారు :

జిల్లాబోర్డు పనులను యెక్కువ సామర్థ్యంతోను, తృప్తికరంగాను నిర్వహించేదానికై చాలా శ్రమచేశారు. వారి సలహాయున్ను, సహాయమున్ను యెప్పుడు కావలిస్తే అప్పుడు యిస్తూవచ్చారు. ఇపుడు పరిశీలనయందున్న సంవత్సరంలో చాలా అధికారాలను నా వైసుప్రెసిడెంటుకు యిచ్చివేశాను. మరికొన్ని యితర శాఖలకున్ను, సంస్థలకున్నూ సంబంధించిన యావత్తు అధికారాలను కూడా వారిపరం చేశాను. ఈ బోర్డుకు సంబంధించినవారిలో యెవరున్ను వారియంతగా శ్రద్ధతీసుకోలేదు ; పనిచేయనూ లేదు.

జిల్లాబోర్డులు జిల్లాకు సంబంధించివుంటే శాసన సభలు రాష్ట్రానికీ, దేశానికీ సంబంధించి ప్రజల బాగోగులను నిర్ణయిస్తూ వుంటాయి. గవర్నరు, గవర్నమెంటు

మెంబర్లు—యీలాటివారితో కూడిన మహాసభలో సభ్యులై, ప్రజలకష్టసుఖాలను వారి యెదుట చర్చిస్తూ, తెలివితేటలను కనుపరుస్తూవచ్చినవారికి అధికారవర్గంతో పరిచయం యేర్పడి, ప్రభుత్వంవారి ఆదరణ లభిస్తూవుండేది. ఆనాటి శాసనసభలో ఇరువది నల్గురు సభ్యులు కాబోలును వుండేవారు. మునిసిపాలిటీలూ, జిల్లా బోర్డులూ కలిసి నలుగురు ప్రతినిధులనుమాత్రం యెన్నుకొనే అధికారం వుండేది. ఈసభకు గవర్నరుగారే అధ్యక్షులు. ఈలాటి స్థితిలో, శాసనసభ మెంబరంటే ప్రజలు చాలాగౌరవంతో చూడడంలో వింతయేమీా లేదు. పలుకుబడిన్నీ కావలసినంత వుండేది. గంజాం వెంకటరత్నం పంతులుగారు 1899-వ సం.పు యెన్నికలలో వుత్తరప్రాంతపు మునిసిపాలిటీలు, జిల్లాబోర్డుల పక్షాన నిలబడినపుడు ప్రజలు వారియెడగల భక్తివిశ్వాసాలను, పూజ్యభావాన్ని విశదీకరించేదానికి అవకాశం కలిగింది.

పంతులుగారు శాసనసభలో వుండినంత కాలమున్నూ వూరక కూర్చోలేదు. రైతుల కష్టసుఖాలను గురించి, గ్రామాల స్థితిగతులనుగురించి చాలా శ్రమచేశారు. వారిపేరును యిప్పటికిన్నీ భూమి ఆదాయం, తరాలు, సెటిల్‌మెంట్లు, ధరలు, వ్యవసాయదారుని

జీవనం—యీలాటి సమస్యల సందర్భంలో స్మరింపక తప్పదు. ఈ సమస్యల పరిశీలనకు ఓపిక, ఆర్థిక శాస్త్ర జ్ఞానం, రైతుతో పరిచయం కావాలి. రైతు జీవిత మర్మాలనన్నిటినీ గ్రహించాలి. మండలసభలలో, దేశీయ మహాజనసభలలో, శాసనసభలలో పంతులుగారు రైతు పక్ష మవలంబించి చేసిన వుపన్యాసాలూ, భూమిశిస్తు, లోకల్ బోర్డులఆక్టు, ఇమిగ్రేషన్ బిల్లు—యీలాటి రైతు గోడునుగురించి పత్రికలకు వ్రాస్తూవచ్చిన వ్యాసాలూ యిప్పటికిన్ని మనకు ప్రమాణంగా వుంటున్నాయి. ఈ మాత్రం పనితో వారు వూరుకోలేదు. జిల్లాసభలను, జిల్లాసంఘాలను ప్రోత్సాహపరచారు. రైతులకూ, విద్యావంతులకూ సంబంధం కల్పించారు. రమేశచంద్ర దత్తుగారిని అరట్లకట్టకు ఆహ్వానించి, తమ తోటలోని చెట్లనీడక్రింద విశ్రమించి, చక్కెరకేళీలను, బత్తాయి లను ఆరగిస్తూ, డెల్టా సమస్యలను చర్చిస్తూ, తమ అభిప్రాయాలకు సానబెడుతూ, రైతులోకానికి అపార మైన సేవను చేశారు. వారి యనంతరము రైతుగోడు చాలామట్టుకు అంతరించింది. వారి శిష్యకోటికి చెందిన పెన్మత్స సుబ్బరాజు, కాళ్లకూరి నరసింహంగార్ల తరు వాత తరాలమాట వినబడడమే పోయింది.

వెంకటరత్నంపంతులుగారు న్యాయవాదులుగాను, శాసనసభ్యులుగాను, రైతు అభిమానిగానుమాత్రమే కాదు, దేశహితైక కార్య నిరతులుగాకూడ ప్రసిద్ధి పొందినారు. ధనాన్ని ఆర్జించారు. శక్తికొలది ప్రజోపయోగ కార్యాలకు ఖర్చుపెట్టినారు. సంఘ సంస్కరణంమీద అభిమానం చూపుతూవచ్చినారు. వీరేశలింగంపంతులు, హావలక్కు ప్రభువులపేర్ల స్థాపించిన విద్యార్థి వేతనాలు, దాదాభాయి నౌరోజీగారిపేర నెలకొల్పిన సువర్ణపతకం, దేశీయమహాజనసభకూ, కాకినాడపురమందిరానికీ యిచ్చిన విరాళాలు, భూమిశిస్తు విషయమై ఇంగ్లాండులో ఆందోళనచేయడానికై యేర్పరచిన ద్రవ్యం—యీలాటి కార్యాలన్నీ వారి విశాలహృదయానికీ, విచక్షణతో కూడిన ధర్మాలకూ నిదర్శనంగా వుంటున్నాయి.

ఆరోజుల్లో గంజాంవారి ఖ్యాతి దేశమంతా వ్యాపించిందంటే వింత యేమీలేదు. ఏ ముఖ్యమైన సభకు పోయినా, కత్తిరించిన మీసకట్టు కలిగి, నల్లటి పూర్వకాలపు కోటు, వదులుగావుండే తలగుడ్డ, నల్లంచు వుత్తరీయం వేసుకొని, చిరునవ్వుతో వుపన్యసిస్తూవుండిన గంజాంవారి విగ్రహమే కనిపిస్తూ వుండేది. దేశహితైక జీవనాభిలాషులు తక్కువగావుండే యాభైయేండ్లనాడు

మన ఆంధ్రులకు దేశహితైకాభిలాషను నేర్పి, వుద్యోగపు పెనగులాటకు బదులు దేశసేవను, ప్రజాసేవను వరించి, మన రాజకీయ జీవితాన్ని పోషించి, దేశసేవకు దారిచూపిన యోధులు, దేశహితైకజీవన నిర్మాతలు శ్రీ గంజాం వెంకటరత్నంపంతులుగారు, ఆ మహా పురుషునికుమార్తెయే శ్రీ డాక్టరు పట్టాభిసీతారామయ్యగారి సతి శ్రీ భోగరాజు రాజేశ్వరమ్మగారు.

## డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు

కట్టమంచి రామలింగారెడ్డిగారిది అతివింతైన చరిత్ర. ఏరంగం తీసుకొన్నా అందులో అగ్రస్థానం వహించే ప్రజ్ఞ ఆయనకు వుంది. ఈ బహుప్రజ్ఞాత్వంవల్లనే ఆయన యెందులోను పాదుకోలేక ఒకదానిలోనుంచి యింకొక దానిలోకి కొట్టుకొనిపోతూ, ఎప్పటికప్పుడు మొదటి మెట్టులోనే వుంటూవస్తున్నారు.

ఆయన బాల్య, యౌవనాలు పరికించినవారికి ఆయన యెంతటివా డౌతాడో అనిపించేది. ఆయన ప్రతి తరగతిలోనూ ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణు డయ్యేవాడు. ప్రతి సభలోను ఉపన్యసించి వినేవాళ్లకు వేడుక కొల్పేవాడు. మద్రాసు క్రిష్టియను కాలేజిలో చదువు పూర్తిచేసి, కేంబ్రిడ్జికళాశాలలో ప్రఖ్యాతగౌరవాలు పొంది, ఆ దేశపు మహావిద్వాంసులకుకూడా ఆశ్చర్యం కలిగేటట్టు వారి భాషావాచాలతలోనే వారిని వోడిస్తూవచ్చి, గోపాలకృష్ణ గోఖ్లేవంటి దేశాభిమానుల ప్రశంసలకుకూడ పాత్రుడై, జాతీయభావోద్రేకపూరితుడైన ఆయనచరిత్రమీాద భరతఖండమంతా దృష్టినిలిపి యెదురుచూస్తూ వుండగా, బరోడాసంస్థానాధీశులైన గైక్వారుగారు ఆయన ప్రజ్ఞను గుర్తించి ఆయనను అమెరికాకుపంపించి, అక్కడ

ఆయనచేసిన మరికొన్ని విద్యాపరిశ్రమల తర్వాత ఆయనకు తన కాలేజీలో వైసు ప్రిన్సిపాలు పదవి యిచ్చారు. మైసూరు మహారాజుగారు ఆయనతో పోటీచేసి రెడ్డిగారిని తమ సంస్థానానికి రప్పించి విద్యాశాఖ ఇన్స్పెక్టరు జనరలుకు అసిస్టెంటుగా వుద్యోగమిప్పించారు. వెంటనే ఆయన మైసూరుయువరాజాగారితో ఐరోపాయాత్ర వెళ్లివచ్చారు. తర్వాత కనడా, జపాను, ఫిలిప్పైను, హాంకాంగు మొదలైన ప్రాక్పశ్చిమయాత్ర చేసి, అక్కడ విద్యావిధాన సమస్యలు పరిశీలించి వచ్చుటకుగాను పంపబడ్డారు. అటునుంచి రాగానే మైసూరుకాలేజీలో ప్రొఫెసరై, ప్రిన్సిపాలై, 1916 నాటికి ఇన్స్పెక్టరుజనరలు కూడ అయినారు. ప్రొఫెసరుగా వున్నప్పుడు విద్యార్థులు ఆయన వాగమృతధారలు గ్రోలుతూ వుండేవారు. ప్రిన్సిపాలుగా వున్నన్నాళ్లు ఆ కాలేజీఖ్యాతి దశదిశలా వ్యాపించింది. ఇన్స్పెక్టరుజనరలుగా వున్నప్పుడు విద్యావిధానమే క్రొత్త తెన్నులు త్రొక్కి నవీనత్వం కనుపఱచింది. ఇతర శాఖల్లోకంటె విద్యాశాఖలో ఆయనకు అభిరుచీ, అభిమానమూ యెక్కువనేమాట నిర్వివాదం. ఈ రంగంలోనుంచి అడుగుజారగానే ఆయన అత్యున్నత వ్యక్తిత్వంలోనుంచి సామాన్యుడై క్రొత్తపుంతలు దున్నవలసివచ్చింది.



డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు



శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు

పనిలేనివారికి తరుచుగా రాజకీయాలు శరణ్యమని అంటూవుంటారు. అప్పటికి మదరాసురాష్ట్రంలో జస్టిసు పక్షచర్యలే రాజకీయాలు. అందులో పానగల్లు, పాత్రో, త్యాగరాయసెట్టి ప్రభృతులు తలలునెరిసిన పండితులు. వారిని ఆశ్రయించి విద్యాశాఖమంత్రిపదవి అన్నా చూఱ గొందామని రెడ్డిగారు ఊహించారు కాని, స్వకీయాభిమానంముందఱ కులతత్వాభిమానం మాత్రం నిలుస్తుందా? ఊరించిఊరించి వారు వృత్తచేయి చూపెట్టగానే ఆయన, పౌరుషం రేకెత్తి, జస్టిసుపార్టీపైకే దండయాత్ర సాగించాడు. రెడ్డిగారి విమర్శలు, హేళనలు, ఖండనలు, వ్యాసాలు, ఛాంకారాలు ఆ పార్టీని మూలముట్టుగా గడగడలాడించినాయి. ఆయన మంత్రివర్గం మీాద తెచ్చిన విశ్వాసరాహిత్య తీర్మానం వోడిపోయినా పార్టీపరువుమాత్రం నేలబడింది. ఈ అవతారానికి సత్యమూర్తివంటి జాతీయవాదులు జోహారులుచేసి గొప్పగా ప్రశంసించారు. కాని ద్వంద్వప్రభుత్వ నిర్మూలనం అనే సిద్ధాంతాన్ని ఆయన అంగీకరింపడాయెను. పానగల్లు మంత్రిత్వంస్థానంలో తన మంత్రిత్వం స్థాపించడమే ఆయనసంకల్పం. ఇందుకోసం రెండుప్రక్కలా వాడిగల ఖడ్గం పుచ్చుకొని, ద్వంద్వయుద్ధంచేసి, రెండుపార్టీలను

ఎదుర్కోవలసి వచ్చింది. అయినా ఆయనలో జాతీయ తీవ్రతకు కొఱతలేదు. పదవీస్వీకరణంమాట యెట్లా వున్నా, ఆయన జస్టిసువిరోధి అయితేమాత్రం తరవాత వచ్చే యెన్నికలలో కాంగ్రెసుకు అఖండవిజయం తప్పదు. ఆయనను యెట్లాగైనా విడదీయడం నిజమైన యెత్తే. ఇందుకోసం పానగల్లురాజాగారు ఆంధ్ర విశ్వవిద్యాలయం సృష్టించి, రెడ్డిగారికి వైసుఛాన్సలరు పదవి ప్రసాదించి, ఆయనను అవతలకు నెట్టినారు.

రెడ్డిగారివంటివిద్యావిధానసంస్కారాభిలాషి విద్యాశాఖలోనుంచి రాజకీయాలలోకి దూకడమే తప్పు. ఏదో కారణంవల్ల దూకినా, తరవాత రాజకీయాలలోనైనా అఖండంగా వెలగగల మనిషి మళ్లీ మొదటి విద్యావ్యామోహంలో పడిపోయి వైసుఛాన్సలరుపదవి స్వీకరించడం తప్పేనని అనకూడదు కాని అది కర్మకర్తృకి అనకతప్పదు. అయినా, యీ కర్మకర్త్రికి—అంటే ఆంధ్రవిశ్వవిద్యాలయస్థాపనం అయి, దానికి రెడ్డిగారు మొదటి వైసుఛాన్సలరుగా రావడానికి ఆంధ్రదేశమంతా ఉత్సవాలు చేసింది.

రామలింగారెడ్డిగారియందు దప్పటినుండి యిప్పటి వరకూ గల భావము ఆయన అస్థిరు డని. చిత్తోప

దేశంప్రకారం మారడం యెప్పుడూ తప్పేకాదు. 1930 లో సత్యాగ్రహసమయంలో ఆయన తనకు అత్యంతాభిమానాస్పదమైన ఆంధ్రవిశ్వవిద్యాలయపాల నాభిలాషనుకూడా యెడంగాపెట్టి జాతీయభావోద్దీపితుడై సత్యాగ్రహంలోకి వురక్కపోతే మానె, వేరుగా వొదిగివుండడమైనా ప్రశంసాపాత్రం కాదని యే జాతీయవాది అనగలడు? కాంగ్రెసురాజకీయాలు అప్పటికి తనకు గిట్టకపోయినా, గిట్టిననాడైనా తాను వాటిలో పాల్గొని దేశానికి రాజకీయశ్రేయస్సు చేకూరుద్దామనే తలపు ఆయనకు లేదని యెవ్వరనుకుంటారు? ఆయన మహత్తును గుర్తించి ఆంధ్రనాయకులాయనను 1935 లో కేంద్రశాసనసభకు నిలవమని కోరినట్లే, 1936 లో మద్రాసునాయకులు మద్రాసు కౌన్సిలుకు అభ్యర్థిగా నిలబడమని కోరితే చరిత్ర వేరుగా వుండేది. అయితే ముక్కుకు సూటిగా మాట్లాడే నిర్లక్ష్యము, ప్రజల కిచ్చగింపుగా ఉపన్యసిద్దామనే కోరిక లేకపోవడము, యింకా యేవో యితర కారణాలూ కలిసి ఆయనను క్రొత్తగాచేరిన కాంగ్రెసురంగంనుండిమరోత్రోవకు గెంటినాయి. ఆయన పోయినందుకు వీరూ, వీరు పిలవనందుకు ఆయనా ధన్యులైనట్లు భావించుకొనే దురవస్థ ఆంధ్రరాష్ట్రానికి సంభవిం

చింది. ఆయన తిరిగి ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. తిరువాన్కూరు, హైదరాబాదు సంస్థానాలతో చెలిమి సంపాదించి, దాని కోశాగారాన్ని నింపడం సామాన్యకార్యంకాదు. హైదరాబాదుతో ఆంధ్రానికి చెలిమి నెరపిన ప్రజ్ఞ ఆయనకే చెల్లింది. తిరువాన్కూరుమహారాజుకున్నూ, ఆ రాజమాతకున్నూ సింహాచలక్షేత్రసందర్శనభాగ్యం అబ్బజేసిన పుణ్యం ఆయనదే.

విశ్వవిద్యాలయసంస్కరణాలలో యిది మహాక్లిష్టసమయం—పాతకొత్తల బేసందు. తాను నమ్మిన మాటలు గట్టిగా చెప్పడం, నమ్మిన కార్యాలు తప్పకుండా చేయడం, తన లోపాలు గుర్తించడం, అవసరమైనప్పుడు వాటిని పైకి తెలియజేసి సవరించుకోవడం, హితవర్తనతో ప్రజలనూ, పెద్దలనూ మెప్పించి వారిఅభిమానం చూరగొనడం మొదలైన సుగుణాలు రామలింగారెడ్డిగారిలో వున్నాయి. ఆయనను ఆక్షేపించడంకోసం ఆంధ్రవిశ్వవిద్యాలయం క్రొత్తసంస్కరణలు వేటినీ ఊడబొడవలేదని మొత్తిపొడవడం ఎవరికైనా సులభమేకాని హిమాలయానోహణంకంటె కష్టతరమైన ఆ కార్యక్రమ క్లిష్టతను గమనించడం మాత్రం అతికష్టం. అయినా, ఆయన యెప్పుడూ ఎవరి పొగడ్తలకూ, ఎవరి విమర్శలకూ చలిం

చకుండా ధీరత్వంతో విశ్వవిద్యాలయోద్ధరణకు పూను కొన్నాడు. ఆశుతోషముఖర్జీయంతటి కీర్తిమంతుడు కావచ్చు, కాకపోవచ్చు గాని అందుకై పోరాడగల శక్తి ఆయనలో పూర్తిగా నేవుంది. ఆంధ్ర దేశం పరస్ప రానుమానంవల్లనే పరరాష్ట్రీయుల నవ్వులాటకు పాలైం ది. రెడ్డిగారిలో ఆంధ్రవీరత్వం, ఆంధ్రవిజ్ఞానాభిరుచి, సంప్రదాయ గౌరవం, సమరసతత్వం అన్నీ వన్నెవాడ కుండా వున్నాయి.

రామలింగారెడ్డిగారు పండితుడు, గ్రంథకర్త, వక్త, రాజకీయవేత్త, వ్యవహర్త, విమర్శకుడు, సంస్కారి, సంభాషి, స్నేహపాత్రుడు.

---

## సర్ చిర్రావూరు యజ్ఞేశ్వర చింతామణిగారు

విజయనగరం మహారాజావారి కళాశాలలో ఆయన విద్యార్థి. ఇరవైయేండ్లు వుండినాయో లేదో, భారతీయ రాజ్యాంగసమస్య యేదైనా కాని, కొప్పరపు కవులలాగ, ఏకధారతో వుపన్యసించే శక్తిని సంపాదించారు. అయ్యకోనేరిగట్టుమీద, గంటస్తంభందగ్గర, పార్కు మీటింగులలో, యెక్కడపట్టినా విజయనగరం యావత్తూ వారి వుపన్యాసాలతో మ్రోగిపోతూవుండేది. క్రమేణ ఆయనకు చదువుమీద దృష్టితప్పి మనస్సంతా దేశంమీద పడ్డది.

ఇంతలో, 1900-వ సం. లో అఖిలభారతజాతీయ మహాసభను లాహోరులో జరిపే సన్నాహం ప్రారంభమయింది. చింతామణిగారు ఆ సభకు పోదామనుకొన్నారు. లాహోరు దగ్గరలోవున్న పట్టణంకాదు. అక్కడ డిసెంబరులో శరీరాన్ని కరచే చలి. చేతిలో రొక్కమూ లేదు. సరే, యెట్లాగో అప్పోసప్పో చేసుకొని లాహోరు చేరుకున్నారు. ఇక అక్కడిచలిలో వారు పడిన కష్టం, పులుసూ, పచ్చడీ లేక భోజనంలో పడ్డ తిప్పలు చూడాలి; చెప్పలేము.

చింతామణిగారి మనస్సు ఆ మహాసభలో వుప న్యాసం చేయడంమీాదా, అక్కడి నాయకులచేత భేష్ అనిపించుకోవడంమీాదా వుండిందిగాని ఆ చలి, పులుసు, పచ్చళ్లమీాద లేదు. యువకులైన చింతామణిగారు ఆ మహా సభలో అదురూ బెదురూ లేక, తడవ్రూ నత్తూ లేక విసరిన విసుళ్లకు, యెత్తిన పరుగుకు, శైలిలో చూపిన పటిమకు, విషయ పరిశీలనలో చేసిన పరిశ్రమకు సంతోషింపని వారు లేరు; మెచ్చుకోనివారు లేరు. సురేంద్రనాథ బెనర్జీ, భూపేంద్రనాథ బోసు, 'హిందూ'పత్రిక సుబ్రహ్మణ్య అయ్యరు లాటి మహారథులంతా భేష్ అన్నారు; ఆశీర్వదించారు; చేయిపట్టుకొని, వీపు తట్టినారు.

సామాన్యంగా మాటకారులకు కలంసాగదు; కలం పట్టుగలవారికి నోరు ఆడదు. చింతామణిగారు బాగా మాట్లాడే శక్తీ, వ్రాయగల శక్తీ రెండూ వున్నవారు కావ డంచేత, మనస్సంతా దేశహితైకజీవనంమీాద వుండడం వల్లచదువు సంధ్యలకుస్వస్తిచెప్పి, 1901-వ సం.లో చెన్న పట్టణంచేరుకొని, 'యునైటెడ్డుఇండియా' అనే ఆంగ్లవార పత్రికలో ఒక చిన్నవుద్యోగాన్ని సంపాదించుకొన్నారు. కాని, అది వారికి యేమూలల? అక్కడనుండి సుబ్రహ్మణ్య అయ్యరుగారు నడుపుతూవుండిన 'మదరాసు స్టాండర్డు'

అనే దైనికపత్రికలో కొన్నాళ్లు పని చేశారు. దీనితో వారికి వార్తాపత్రికాలోకంలో పేరు ప్రతిష్ఠ లేర్పడ్డాయి.

అప్పుడేకాదు, ఇప్పటికిన్నీ చెన్నపురి రాజధానిలో పత్రికాప్రపంచంలో ముందుకు త్రోసుకొని పోదామనే యువకులకు చోటూలేదు; అవకాశములూ తక్కువే. ఇందువల్ల మన ప్రాంతంలోనే వుండవలసినవా రెందరో యితరప్రాంతాలకు పోయి, పేరుప్రతిష్ఠలను గడించు కొంటున్నారు. చింతామణిగారున్నూ చెన్నపట్టణపు కూావ మునువదలి అలహాబాదుకు పోనిశ్చయించుకొన్నారు. ఇప్ప టికిన్నీ అక్కడనే వున్నారు. తమ 'లీడరు' పత్రిక ద్వారా సంయుక్తరాష్ట్రీయుల దేశహితైకజీవనాన్ని పోషించారు; ఫలవంతంచేశారు. ఇందుకనే ఒక సందర్భంలో "ఈయన మావాడని, మా దేశంలో పుట్టినాడని చెన్నపురిరాజ ధానివారు చెప్పుకుంటే, మాకు పెంపుడుపోయాడు. మేము దత్తతచేసుకున్నాం" అని సంయుక్తరాష్ట్రాలవారు చెప్పు కుంటారని సర్ తేజబహద్దరు సప్రూగా రన్నారు. నిశ్చ యం. చింతామణిగారి వంటి మహారథులు స్వజాతీయ తలో యిముడక ద్రాక్షారభీమేశ్వరస్వామిలాగ పెరిగి పోయినపుడు సార్వజనీన జాతీయతలో లయమైపోవడం ఆంధ్రధీపరిణామానికి నిదర్శనంగావుంది.

చింతామణిగారు మితవాది అని అంటారు కాని, యిది వారి చర్యలలో కనుపించదు. ఆత్మగౌరవానికీ, దేశగౌరవానికీ వుపద్రవం కలుగనున్న సమయాలలో మితవాదం యేమిటి, అతివాదం యేమిటి? అంతా వొక్కటే. మడ్డీమర్ కమిటీయెదుట సాక్ష్యమిస్తూ ద్వంద్వప్రభుత్వ విధానాన్ని చితుకగొట్టే సమయంలో మితవాదిత్వం అడ్డుపడలేదు. సంయుక్తరాష్ట్రప్రభుత్వ మంత్రియైనపుడు ఏర్పడిన భిన్నాభిప్రాయ సమయంలో అధికారానికీ, జీతానికీ పెనగులాడక, తమ మంత్రిపదవికి స్వస్తి చెప్పడానికిన్నీ మితవాదిత్వం అడ్డంరాలేదు. తర్వాత పెద్దజీతంమీద 'ఇండియన్ డెయిలీమెయిలు' సంపాదకులుగా బొంబాయికి వెళ్లినారు. అక్కడ తమకున్నూ, తమ పత్రికాధిపతులకున్నూ అభిప్రాయాలు భిన్నించి, ఆ వుద్యోగాన్ని తన్ని వేసేటప్పుడున్ను మితవాదిత్వం అడ్డువచ్చిందికాదు. చివరకు, యీలాటి స్వాతంత్ర్యలక్షణమే, సైమన్ కమిషన్ యెదుట తెలిపిన ప్రతికూలాభిప్రాయాలే వారికి రావలసిన గవర్నరు పదవికి అడ్డంవచ్చిన వంటారు ప్రజలు.

ఇప్పటికి 40 యేండ్లనుంచి త దేకదీక్షతో దేశసేవయందు మగ్నులై దేశహితైకాభిలాషులకు మార్గదర్శ

కులుగావున్న వక్తలుగను, లేఖకులుగను, సంస్కర్తలు గను, రాజకీయవేత్తలుగను ఖ్యాతికెక్కిన చింతామణి గారు ప్రజయొక్క అభిమాన విశ్వాసాలను విశేషంగా సంపాదించుకొన్నారు. 'భారతీయ సంస్కరణము', 'ఫిరోజిషా మెహతాగారి ఉపన్యాసాలు' అను రెండు ఉద్గ్రంథాలను దేశానికి ప్రసాదించారు. ఫిరోజిషా మెహతా, మహాదేవ గోవింద రనడే, సురేంద్రనాథ బెనర్జీ, సుబ్రహ్మణ్య అయ్యరు లాటి వారల అనుభవ భాగ్యాన్ని సంపాదించుకొన్నారు. ముందువరస పెద్దలలో చేరిపోయినారు.

ఇన్నివిధాలా ప్రసిద్ధిపొందిన చింతామణిగారిని సత్కరించడంలో ప్రభుత్వంవారున్ను వెనుకపడక, ఇటీవలనే వారికి 'సర్' బిరుదమునిచ్చి వారిపట్ల తమ గౌరవాన్ని విశదీకరించారు. ఇతర దేశాలలో అల్పస్థితినుండి ఉన్నత స్థితికి వచ్చారని ఫోర్డు, కీర్‌హార్డీగార్ల పేర్లు చెప్పితే మన దేశంలో విజయనగరం అయ్యకోనేరుగట్టుమీద వృపన్యాసా లిస్తూవచ్చిన చింతామణిగారు—సర్ చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణిగారు బీదరికంయొక్క కష్టాలన్నీ అనుభవించి, ఉన్నతస్థానానికి వచ్చినవారిలో ఒకరని చెపుదాం, పట్టండి.

## శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు

కృష్ణాజిల్లాసంఘం, కృష్ణాజిల్లాసభ, కృష్ణాపత్రికల తో సన్నిహితసంబంధం కలిగి, సామాన్య జనులయొక్క, రైతులయొక్క అభివృద్ధికై నిరంతర పరిశ్రమచేసి, కృష్ణా మండలం-ఆమూలంగా ఆంధ్రదేశం-యొక్క రాజకీయ జీవితానికి పునాదులువేసి పెంచిన ఆదిపురుషులలో రామ దాసుపంతులుగారొకరు. కాని, పంతులుగారివంటి కార్యోత్సాహులకు, దేశహితైకాభిలాషులకు మాండలికనివాసం సంకుచితమయిందిగా కనుపించి వారు తమ నివాసం చెన్నపట్టణానికి మార్చుకొన్నారు.

సహజ శక్తిసామర్థ్యాలున్ను, బుద్ధిబలమున్ను, సేవాభిలాషయు గల రామదాసుపంతులుగారు తమ నివాసాన్ని, కార్యరంగాన్ని చెన్నపట్టణానికి మార్చుకొన్న తరువాత ముందువరుసవారిలో కూర్చోవడానికి ఎంతో కాలం పట్టలేదు. విద్యావంతులలో చాలామందికి పరస్పరసహకారోద్యమం అంటే తలనొప్పి. దీన్నికై పాటుపడదలచిన వారికి ఓపిక కావాలి. వస్తూత్పత్తి విధానం, విక్రయపద్ధతులు, పరపతివసతులు వాగు క్షుణ్ణంగా గ్రహించాలి.

వారికి ఆర్థికశాస్త్ర పరిచయం కావాలి. ఇందుచేత చాలా మంది దీనికి దూరంగా వుంటూవచ్చారు.

భూస్వాములు, రైతుఅభిమానులు, గొప్ప న్యాయవాదులు అయిన రామదాసుపంతులుగారు తమ దృష్టిని యీ పరస్పరసహకారోద్యమంవైపుకు మరల్చి, అప్పటినుంచి యిప్పటివరకూ మన ఆంధ్రదేశానికేకాదు, మన రాజధానికంతకూ అమోఘమైన సేవచేస్తున్నారు. ఆంధ్ర ఆంగ్లభాషలలో బాగా వ్రాయను, మాట్లాడను సమర్థులగురామదాసుపంతులుగారు సహకారోద్యమవ్యాప్తికై తమ లేఖినిని, తమ వక్తృత్వాన్ని ధారాళంగా వినియోగించి, యీ వుద్యమాని కింత ప్రాణంపోసి, లేవనెత్తి, బలపరచి, జయప్రదంగా సాగిపోయేదానికై చేసినంత కృషిని యింకెవరూ చేయలేదు. ఏగ్రామంలో సహకార సమావేశం జరిగినప్పటికీ, ఏప్రాంతంలో సహకారనిధి స్థాపితమైనప్పటికీ పంతులుగారి వాక్కు వినబడవలసిందే. ఇంతగా పనిచేస్తూవున్న పంతులుగారు యీ సహకార శాస్త్రంలో అధికారిగా పరిగణింపబడడంలో ఆశ్చర్యం యేమీలేదు. చూపవలసిన గౌరవాలను ప్రజలు చూపుతున్నారు. హైదరాబాదువంటి స్వదేశ సంస్థానాలనుండి ఆహ్వానాలు వస్తూవుంటాయి.

మన దేశపు సహకారోద్యమానికి ప్రధానాచార్యులుగావున్న రామదాసుపంతులుగారికి సంబంధంలేని సంస్థయే కనుపడదు. ఎన్నో దేశీయ, రాష్ట్రీయ సహకారసంఘాలకు ఆయన అధ్యక్షులు. అంతర్జాతీయ సహకార సమ్మేళనసభ్యులు. లండనులో జరిగిన అంతర్జాతీయ సహకార మహాసభ ప్రతినిధులు. సహకారసంఘువిచారణ, బ్యాంకింగుసంస్థల కేంద్రవిచారణసంఘాల సభ్యులు. యీలాంటి గౌరవపదవులెన్నో నిర్వహించారు. చెన్నరాష్ట్రీయసహకార భీమాసంఘ స్థాపకులుగా ప్రాముఖ్యం వహించారు. రామదాసు పంతులుగారి దేశహితైక జీవనం యీ సహకారసంఘవ్యవహారాలతో అంతమొందలేదు. ఇది విశాలమైన వారి రాజకీయజీవితంయొక్క వికాసంగాని అంతం కాదు. ఆంధ్ర స్వరాజ్యపార్టీ అధ్యక్షులుగా, దేశీయమహాసభకమిటీ సభ్యులుగా, చెన్నపురి మహాజనసభ ఉపాధ్యక్షులుగా, స్టేటు కవున్సిలుసభ్యులుగా రాజకీయాలలో ప్రాముఖ్యం వహించి వున్నారు. స్టేటుకవున్సిలులో స్వరాజ్యపార్టీ నాయకత్వభారం వహించి, ప్రజాభిప్రాయాలను ఖండితంగా వెల్లడిస్తూ, తమ అనుభవాన్ని యీవత్తూ ప్రజకు వినియోగిస్తూ, బందరుపత్రవాళ్లకు సహజమైన ప్రజాసేవలో ముందడుగువేసుకొనిపోతున్నారు.

## శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు

కీర్తికాయుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య చీరాల మునిసిపాలిటీని రద్దుచేయించడానికి ప్రతిఘటన ఆరంభించాడు. ప్రధానమంత్రి రామారాయణింగారు మునిసిపాలిటీని రద్దుచేయడానికి ఏమాత్రమూ అంగీకరించలేను. పైగా దానిని చిరస్థాయిగా చేయడానికి దృఢముగా సంకల్పించుకొన్నారు. గుంటూరు జిల్లాలోవున్న బుద్ధిమంతుల సలహాలను తీసుకొన్నారు. అందుకోసం కొంతమంది పెద్దలతో మునిసిపాలిటీ విషయము సంప్రదించడానికి చీరాలకు వెళ్లినారు. రైలుస్టేషనుకు సమీపంలోవున్న జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారి సౌధంలో విడిది చేశారు. ఆయనచుట్టూ ముఖ్యులు కుప్పుస్వామిచౌదరిగారితోసహా నల్గురో అయిదుగురో చేరారు. రామాయణింగారు కర్తవ్యాన్ని గురించి ఆలోచించడం మొదలుపెట్టినారు. చివరకు కుప్పుస్వామిగారిని చీరాల మునిసిపాలిటీకి పెయిడ్ ఛేర్‌మన్‌గా సర్కారువారు నియమించేటట్లు చేస్తామన్నారు. ప్రధానమంత్రి అయినవాడు ప్రభుత్వకార్యసాధనకోసం ఎన్ని ఆశలు పెట్టవలెనో అన్ని ఆశలూ పెట్టినారు. ఏమాత్రం ఏమరుపాటుచెందినా వ్యామోహపడే అవకాశాలన్నీ చూపించారు. జిల్లాకలెక్టరు చౌ



మహబూబ్ అలీబేగ్ సాహెబ్ మహాశయుగారు

దరిగారిని ప్రాధేయపడ్డాడు. కాని చౌదరిగారు సహజ గంభీరమందహాసంతో "నే నాపనిచేయను" అన్నారు.

వారి కేమీ తోచలేదు. ఉపాయాంతరం చెప్పమని చౌదరిగారిని అడిగారు. "మునిసిపాలిటీని రద్దు చేయడమే ఉపాయాంతరం" అన్నారు చౌదరిగారు. రామారాయణింగారికి అది నచ్చలేదు. ఆయన చాలా పట్టుదలతో వున్నాడు. చౌదరిగారు మాట్లాడకుండా గంభీరంతో వూరుకొన్నారు. జిల్లాకలెక్టరు అని జ్ఞాపకం— రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేస్తూవున్న రుస్తుంసింగు అనేవారిని చీరాలకు పెయిడ్ ఛేర్మన్‌గా వేస్తే నిర్వహిస్తారని ప్రధానమంత్రికి సలహాయిచ్చినారు. రాయణింగారు చౌదరిగారిని సలహా అడిగారు. వారు అవునని గాని, కాదనిగాని జవాబుచెప్పకుండా "మునిసిపాలిటీని రద్దుచేస్తే చీరాలకుగాని, సర్కారువారికిగాని వచ్చేముప్పేమి"టని ప్రశ్నించారు. చివరకు రాయణింగారిని ఒక రాజీకి ఒప్పించారు. ఏకాంతంగా దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు వెళ్లి రాయణింగారిని చీరాల మునిసిపాలిటీని రద్దుచేయమని కోరేటట్లున్నూ—ప్రార్థించడం కాదుసుమా—, వారు మునిసిపాలిటీని రద్దుచేసేటట్లున్నూ చౌదరిగారు ఏర్పాటుచేశారు.

"బొందిలో ప్రాణంవుంటే ఒక్క ఆ శ్రీ రామ చంద్రప్రభువును తప్ప మరొక మానవమాత్రుణ్ణి 'నా కాంక్ష యిది' అని యాచించను" అన్నాడు గోపాల కృష్ణయ్య. రాజీకి రామనారాయణింగారిని చౌదరిగారు ఒప్పించారు కాని గోపాలకృష్ణయ్యను ఒప్పించలేక పోయినారు.

గోపాలకృష్ణయ్య ప్రాణావశిష్టస్థితిలోవున్నాడు. రేపో మాపో దేహలీలలను త్యజిస్తా డనిపిస్తూవుంది. మిత్రు లంతా గుంటూరు వచ్చివుండమని అతన్ని ప్రోత్స హిస్తున్నారు. ఈ చీరాల—ఈ రామనగరులోనే నేను దేహత్యాగం చేస్తా నని ఆ రామనగరు అని పేరు పెట్టిన ఆ దిక్కులేని చీరాల యిసుకపర్రలో ఆ ఒక్క పూరియింట్లో వున్నాడు. ఒక్క మిత్రుడుమాత్రం ఆయనకు ఉపచారం చేస్తూవున్నాడు. లేవ లేడు, కూర్చో లేడు. దేహము శుష్కించిపోయింది. ఎండాకాలము. ఈ చెవిలో గాలి ఆ చెవిలో కొడుతూవుంది. ఆ తీక్ష్ణాత పానికి పిట్టలు చచ్చి కింద రాలుతున్నవి. మిట్టమధ్యా హ్నము. గోపాలకృష్ణయ్య మహా యమయాతన అనుభ విస్తున్నాడు. బయట రోడ్డుమీద కారు వస్తూవున్న చప్పుడు అవుతూవుంది. ఆ చప్పుడు బాగా సమీపంలో

వినబడుతూవుండగా "ఆహా! యీ దుర్దశలో నాకోసం ఎవరయినా వస్తున్నారేమో. కొంప కేవలము అయ్యవార్లంగారి నట్టిల్లులాగా వుంది" అన్నాడు గోపాలకృష్ణయ్య. ఇంతలో కారుచప్పుడు ఆగిపోయింది. కారు పోయిం దనుకొన్నాడు ఆయన.

ఒక అరగంట అయింది. గోపాలకృష్ణయ్యయింట్లోకి ఏ. పి. పాత్రోగారున్నూ, కుప్పుస్వామిచౌదరిగారున్నూ ప్రవేశించారు. "అబ్బ! ఎంత యెండలో వచ్చారు! నామీద పాత్రోగారికి యింత అనురాగం వుందా? చాలా సుదినము. మీకు మంచంలోనుంచే స్వాగతము చెప్తున్నాను. మేము బ్రాహ్మణులము. మీలో ఒకరు మంత్రులు, ఒకరు సంపన్నరైతులు. మేము ఏమి ఆతిథ్యం యీయవలెనో తెలియడంలేదు. అయినా రామభక్తుడు యింటికి వచ్చినవారికి ఉడుతాభక్తితో ఏదో ఆతిథ్యం యీయకపోడు" అంటూ, లోపల ఏదో పనిచేసుకొంటూవున్న మిత్రుణ్ణి పిలిచి "రెండు నిమ్మకాయ లున్నా యన్నావు. ఆ రెండు నిమ్మకాయల రసమూ ఆ కుండ చన్నీళ్లలో పండి, యింత పంచదార—పంచదార లేకపోతే బెల్లమయినా వేసి గ్లాసులలో పోసి యీ పెద్దలకు దాహం యివ్వరా బాబూ" అన్నాడు.

చౌదరిగారూ, పాత్రోగారూ ఆ పానీయం పుచ్చు కొన్నారు. గోపాలకృష్ణయ్య అంత జబ్బులోనూ పాత్రో గారితో ఏవో రాజకీయవిషయాలనుగురించి మాట్లాడు తున్నాడు. చౌదరిగారు మౌనముద్ర ధరించి తదేకంగా గోపాలకృష్ణయ్యవంక చూస్తూకూర్చున్నారు. క్షణక్షణా నికీ ఆయనముఖం వివర్ణమయిపోసాగింది. సంభాషణ చా లించి పాత్రోగారు లేచారు. చౌదరిగారు చొక్కా జేబులు తడుముకొంటూ అక్కడే, గోపాలకృష్ణయ్య మంచం దగ్గరగానే నిలుచున్నారు. పాత్రోగారు బయటికి నడుస్తు న్నారు. కొంచెంసేపయినతర్వాత గోపాలకృష్ణయ్య "రామార్పణం" అన్నాడు. చౌదరిగారు మందహాసంతోనూ, కండ్ల వెంట నీళ్లతోనూ బయటికి నడిచారు.

వారు వెళ్లగానే గోపాలకృష్ణయ్య పక్కగదిలో వున్న నన్ను పిలిచి "ఒరే! ఆ రాముడు ఒక చిత్తుకాయి తం పంపించాడురా. ఆ తీసుకొనివచ్చినవాడికి తిన్నని ఆతిథ్యమయినా యివ్వలేకపోయినానురా" అన్నాడు. ఆ చిత్తుకాయితం నూరురూపాయల కరెన్సీనోటు! అప్పటికి చౌదరిగారు గోపాలకృష్ణయ్యకు ఎన్నినూర్లు యిచ్చినారో ఆ సంగతి ఆఉభయులకూ తెలియవలసిందే.

ఒకప్పుడు తాను ఏవో పత్రికలూ అవీ ప్రకటించ వలెననే సంకల్పంతో చౌదరిగారి దగ్గిర అయిదువేల రూపాయలు అప్పుపుచ్చుకొంటే ఆ అప్పుకు కాలదోషము పడుతూవున్నా చౌదరిగారు కబురయినా చేయలేదని గోపాలకృష్ణయ్య నాతో ఒకప్పుడు చెప్పినాడు.

ఒకప్పుడు, ఒకానొక గ్రామంలో, రాధారిబంగళాలో కుప్పుస్వామిచౌదరిగారు మకాంచేశారు. ఆ బంగళాలోనే కాకతాళీయంవల్ల నేనూ, నామిత్రులు మరొకరూ ఉన్నాము. అయితే అప్పటికింకా నాకు చౌదరిగారితో పరిచయం కలగలేదు. ఆయన ఉదయమే నిద్రలేచారు. ఒక వేపపుల్లతో పండ్లుతోముకొంటూ, అటూయిటూ ఆ వరండాలో పచారుచేస్తూవున్నారు. తెలతెలవారుతూవుంది. ఒకానొక పెద్దమనిషి ఆ ఆవరణలో చౌదరిగారి దర్శనంకోసం తారట్లాడుతున్నాడు. కొంతసేపయినతర్వాత చౌదరిగారు ఆ మనిషినిచూచి "ఎవరుబాబూ?" అని ప్రశ్నించారు. ఆ వ్యక్తి వినయ విధేయతలతో నమస్కరించి, తాను ఫలానా అని చెప్పకొన్నాడు. "నేను మిమ్ములను ఇదివరకు చూడలేదు. మీరా...సరేకూర్చోండి. ఏమిపనిమీద దయచేశారు?" అని మృదువుగా, హాయిగా అడిగారు.

ఆ వచ్చిన వ్యక్తి ఫలానావం తెన కంట్రాక్టు తనకు యిప్పించవలసిందని అడిగాడు. వెంటనే చౌదరిగారు "నేను...గారికి యిస్తానని వాగ్దానం చేశానే! మీరు మరొకదానికి ప్రయత్నించేదురుగానీ" అన్నారు. ఆయన మరొకటిఅక్కర లేదనీ, ఆవంతెనే తాను కంట్రాక్టుచేయ వలెననీ ఎన్నోవిధాల చెప్పడం మొదలుపెట్టినాడు. చౌదరిగారు అంతా సావధానంగా విన్నారు. కాని "నేను మాటయిచ్చానే, మీరు మరొకటి చూసుకోండి" అని రెండుమూడుసార్లన్నారు. ఆ వచ్చినఆయన చౌదరిగారి మాటలు వినిపించుకోకుండానే "మీరు అన్యాయంచేస్తున్నారు. అధర్మం చేస్తున్నారు. అది న్యాయంగా నాకు రావలసిన కంట్రాక్టు. మీరు మరొకరికి వాగ్దానం చేయడమేమిటి?" అని బుకాయించడం మొదలుపెట్టినాడు.

"సరే, మీరుచెప్పదగిన విషయాలన్నీ చెప్పినారు. విన్నాను. న్యాయమే చేస్తాను. వెళ్లండి"

"కాదు, నాకిస్తామంటే నేతప్ప నేనుపోను."

"జ్ఞాపకంవుంది. నేను న్యాయం చేస్తానని అన్న తర్వాత మీకింకా అనుమానమెందుకు? పాపము, వెళ్లండి" అనిచెప్పి చౌదరిగారు ఆ పెద్దమనిషిని పంపించేసరికి తలప్రాణం తోకకువచ్చింది. ఆ మనిషి వెళ్లగానే

పక్కనుఉన్న గుమాస్తాతో "చూడవయ్యా వీడు! నేను వాగ్దానంచేశాను, మరొకటి చూసుకోవయ్యాఅంటే ఎంత మూర్ఖమో? వదిలాడు, సంతోషము" అన్నారు.

చౌదరిగారు పిల్ల జమీందారులు. అయినా సామాన్యపు రైతుజీవనమే. జాగర్లమూడిలో యిల్లు చూస్తే ఒకమూల వడ్లబస్తాలు, యింకోమూల వులవల తట్టలు, అవతల జనపకట్టె—కనిపిస్తూ వుంటాయి. వచ్చే మనిషి, వెళ్లేమనిషి! సత్రంలో యెంతమంది వచ్చినా వడ్డన జరుగుతూనే వుంటుంది. తినే చేయి, కడిగే చేయి!!

ప్రాముఖ్యాన్ని బట్టిన్నీ, తమపార్టీకి చేసే సహాయాన్ని బట్టిన్నీ జాగర్లమూడివారు యెన్నడో మంత్రులయి వుండవలసింది. అయితే వుద్యోగాలకు ప్రాకులాడే స్వభావం వారికి లేదు. ఇతరులకు వుద్యోగా లిప్పిస్తారు. స్వాతంత్ర్యాన్ని చంపుకోలేకనూ, దృష్టియావత్తూ రైతుమీదా, పల్లెటూళ్లమీదా వుండడంచేతనూ వారు యెంతవరకూ తాలూకాబోర్డు, జిల్లాబోర్డు, శాసనసభ వీటిపనితోనే సరిపెట్టుకున్నారు. వరుసన మూడుసార్లు జిల్లాబోర్డు అధ్యక్షులయినారంటే సామాన్యవిషయంకాదు. ఈ ఆధిపత్యం గొప్పనిమిత్తం, కక్షలనిమిత్తం తెచ్చుకొన్నదికాదు. పల్లెటూళ్లకు రోడ్లు, పాఠశాలలు, వైద్య

శాలలు పడ్డాయి. బాపట్ల, తెనాలి, కొల్లూరు వున్నత పాఠశాలలకు దివ్యమైన భవనాలు లభించాయి. ఇట్లెన్ని విధాల ప్రజల కష్టాలను కనిపెట్టుతూ, రైతుజీవనాన్ని జీవించే కుప్పుస్వామిచౌదరిగారు ప్రజల ఆదరణకు, దేవుని వోటుకు పాత్రులు కావడంలో అధికం యేమీ లేదు. ఈ కారణంచేతనే జిల్లాబోర్డుభవనంమీద వారి పేరు శాశ్వతంగా ప్రతిఫలిస్తూవుంది. కమ్మవిద్యార్థుల వసతిగృహం, శిల్పాశ్రమం, శారదానికేతనం—యీలాంటి సంస్థలన్నీ వారి ఔదార్యాన్ని చాటుతున్నాయి.

ఆయనకు స్వాభావికంగా ప్రకటన అనేది యెంత మాత్రమూ పనికిరాదు. ఆయన ఏవ్యక్తికిగాని, ఏసంస్థకుగాని యెప్పుడు, ఏమి ధర్మంచేసినా, ఏమి దానంచేసినా ఆ విషయం అతిగోప్యంగా రెండోకంటివారికి తెలియకుండా చేస్తారు. అందువల్ల లోకానికి ఆయనదానధర్మాల సంగతి బాగా తెలియదు. ఆయనను సన్నిహితంగా ఎరిగినవారికే తెలియదు. ఫలానావారికిఫలానాసాయంచేశానని పొరపాటున అయినా ఆయన చెప్పగా విన్నవారు ఎవరూలేరు.

ఈ సందర్భంలో అనేక విషయాలు లోకానికి తెలియవు. కావూరుగ్రామంలో గొల్లపూడి సీతారామ

సబర్మతీఆశ్రమంవలె దేశహితైకాభిలాషులకు ఒక కేంద్ర స్థానమై జాతీయజీవనానికి దోహదం కల్పించే ప్రతిష్ఠాపనగా పనిచేయలేక పడివుంటూవుంది. ఇది డబ్బు లేకనా? కాదు. అన్నీవుండే!

పట్టాభిగారికి బందరుకువచ్చిన పదేండ్లలో ఒకవైపున తమ వైద్యంవల్లను, ఇంకోవైపున జాతీయకళాశాల, ఇండియన్ పేట్రియట్, న్యూ ఇండియా, ప్రత్యేక రాష్ట్రీయము, జన్మభూములతోటి సంబంధంవల్లను ఏర్పడిన ప్రసిద్ధి మండలసరిహద్దులన్నీ దాటి రాష్ట్రరాష్ట్రాంతరములకుకూడా వ్యాపించింది. పట్టాభిగారికి మాండలికత్వం పోయి దేశీయప్రతిష్ఠ యేర్పడింది. ఆంధ్రసభ, కర్ణాటకసభ, విద్యార్థిసభ, సంస్థానాలసభ యీలాటి సభ లెన్నిటికో అధ్యక్షులై చూపిన ప్రజ్ఞవల్ల వారు అసాధారణమేధావి అనీ, అప్రతిమాన వాక్చతురుడనీ కీర్తి తెచ్చుకొన్నారు. పట్టాభిగారిని యెరిగినవాళ్లు ఆయన బ్రాహ్మణశిరస్సు, వైశ్యహృదయం గల మనిషి అని చెప్పుతూ వుంటారు. నిశ్చయానికి వారిలో వైశ్యభాగంతోపాటు బ్రాహ్మణభాగంకూడా వుండడంచేతనే వారు వ్యవహారంలోవలె బుద్ధిలోనూ బూజుపట్టిన తెలుగుల తెలివిని దశదిశల ప్రయోగించారు.

మండలసభలు, రాష్ట్రసభలు తమ బుద్ధి పరిమితికి నిలవలేకపోవడంచేత ఆయన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీలోను, దేశీయమహాజనసభలోను ప్రవేశించి విజృంభించి రాజనీతిజ్ఞుడని, మహాత్ముని భాష్యకారుడని కీర్తిని సంపాదించి ఆంధ్రశబ్దాని కెంత గౌరవాన్ని సంపాదించినాడు. ఆయన యెంత మాటకారియో అంత వ్రాతగాడు. ఆయన నాలుకకూ, కలానికీ తడువుకోవడం అంటూ లేదు. అవి కళ్లెములులేని గుఱ్ఱాలలాగున పరుగెత్తుతాయి. ఆయన ఏకభాష, ఏకమతము, ఏకజన్మ వుంటేనే ఏకజాతీయత వస్తుం దనే పుక్కిటిసిద్ధాంతాన్ని భారతజాతీయత అనే పుస్తకంలో ముక్కలుముక్కలుగా తరిగిన జాతీయవాది. అక్కడ పశువు, ఇక్కడ శిశువు, అవతల మురికినీళ్లగుంటలతో పెనగులాడే మన గ్రామజీవులకు ఆరోగ్యశాస్త్రం రచించి ప్రబోధంచేసిన మహోపాధ్యాయుడు. బండెడుపుస్తకాలుగాని, సైపుయంత్రాలుగాని లేకనే, తమగదిలో ఒకమూల చాపమీదకూర్చుండి, ఇదివరకే వొకప్రక్క వ్రాయబడ్డ పాతకాగితాలే వాడుతూ ఆయన రచించిన దేశీయమహాజనసభాచరిత్ర చాలు ఆయన ఆంధ్రజాతికి సంపాదించిన గౌరవాన్ని తరతరాలవారూ జ్ఞప్తిలో

వుంచుకోవడానికి. పట్టాభిగారి మేధస్సు విజ్ఞానసర్వస్వం లాంటిది; ఏ విధమైన పరికరాలూ లేకుండానే, దేనిని గురించి వ్రాయవలసివచ్చినాసరే, మహాప్రవాహం లాగ రంయ్యి రంయ్యిన పోతూవుంటుంది. పట్టాభిసీతారామయ్యగారు బుద్ధిలో అగ్రగణ్యులు, కల్పనలో నిరుపమానులు, రాజనీతిలో మహా శక్తిమంతులు.

పట్టాభిగారిని మొవగో వ్యవహర్త అని అన్నారు. అవును, రాజకీయసేవకులను భరించే స్థితికి మన ఆంధ్ర దేశం ఇంకా రాలేదు. దేశాన్ని నమ్ముకొని రాజకీయాలలో దూకి దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, భమిడిపాటి సత్యనారాయణ, టంగుటూరి ప్రకాశం, బులుసు సాంబమూర్తి మొదలైనవారు పడ్డఅవస్థే చాలుననుకొంటాను—మన రాజకీయజీవనపు ఒడుదుడుకులు గ్రహింపజేయడానికి. సంపాదనమీదే ఆయన కంత దృష్టివుంటే వైద్యవృత్తిలోనే వుండేవాడు; లేదా బొంబాయి, అలహాబాదులనుంచి వచ్చిన వుద్యోగాహ్వానాలనైనా అంగీకరించివుండేవాడు. ఇందువల్ల పట్టాభిగారి వ్యవహర్తృకౌశల్యం ద్రవ్యాపేక్షగాకంటె తమ భారాన్ని లోకులమీద వేసి తమ దేశహితైకజీవనం ఒడుదుడుకుల పాలు కాకుండావుండేందుకు చేసే పరిశ్రమగా భావిస్తాను.

దేశ సేవ అనేది చతుర్ముఖ బ్రహ్మవలె అనేక ముఖాల నడుస్తూవుంటుంది. ఒకరు ద్రవ్యంతో సేవిస్తే ఇంకొకరు బుద్ధితో సేవిస్తారు; ఒకరు అన్నదానం చేస్తే యింకొకరు వస్త్రదానం చేస్తారు. పట్టాభిగారు తమ ఆరోగ్యాన్ని, తమబుద్ధిని దేశార్పణంచేసిన మహావ్యక్తి. వాద ప్రతివాదాలలో అతిరథుడు. అందుకనే ఆయనను ప్రతివాదిభయంకరు డంటారు తెలిసినవారంతాను. ఈమధ్యను వారిగౌరవార్థమై చెన్నపురిలో జరిగినసభలో వేమవరపు రామదాసుపంతులుగారు మాట్లాడుతూ "పట్టాభిగారు మూర్తీభవించిన ఆంధ్ర తేజ" మన్నారు. "పట్టాభిగారివంటివారు మనదేశంలో పుట్టినందుకు మన మంతా గర్వపడాలి" అని గంటి లక్ష్మన్న పంతులుగారన్నారు. మన ఆంధ్రజాతిలో పూర్వం సిద్ధనాగార్జునుడు బయలుదేరితే మనకాలంలో పట్టాభి బయలుదేరి, తమ గుమ్మాలైనా దాటలేని ఆంధ్రులకు విశాలజాతీయతను, విశుద్ధమైన ప్రతిష్ఠను కల్పించారు.

పట్టాభిగారు ఆరోగ్యంగల మనిషికారు. ఒకప్పుడాయన బ్రదకడమే కష్టమైపోయింది. అయినా గాంధీ మహాత్ముని పిలుపు వినడంతోనే సహాయనిరాకరణోద్యమంలో దూకిన విషయం వొక్కాణించాలి ఆయన ఆంత

ర్యాన్ని తెలపడానికి. ఆయన కారాగారంలో కూర్చోవడానికి జంకలేదు. ఆరోగ్యంసరిగాలేదని వెనక్కు అడుగు వేయలేదు. ఆనందమఠంలో వ్రాసినట్టుగా కావలసింది సేవకాని, ఆసేవను మ్రింగే ప్రాణత్యాగంకాదు. పట్టాభిగారు వుపన్యాసాలిచ్చారు, పుస్తకాలు వ్రాశారు, సభాధ్యక్షులైనారు, ద్రవ్యోత్పత్తికి సాధనమైన సంస్థలను సృష్టించారు, వాటిని పాలించారు. "ప్రజకు కాకపోతే నేనెవరికి పనిచేస్తూవున్నది? ప్రజలో పుట్టినాను, ప్రజలో పెరిగాను, ఆ ప్రజాసేవకే ప్రాణాన్ని అర్పిస్తాను" అని ఛార్లెసుబ్రాడ్లా చెప్పినమాటలు ఆదర్శంగాగల మహావ్యక్తి ఆయన. ఆధునికాంధ్రులకు ఆలోచనచెప్పి వారిని సరియైన దారిలో నడిపించగల శక్తిమంతుడు. వడబోసిన నాయకుడు. ఆశ్రితపక్షపాతి. గాంధీమహాత్ముడు చెప్పినట్టుగా ఆంధ్రనాయకమణులలో చింతామణి.

---

## "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

ఎరుపునకు చేరిన చామనచాయ; ఆ రడుగులకు దగ్గర ఎత్తు; పెద్ద మచ్చతోడి విశాల లలాట ఫలకము; బ్రహ్మాండమును పీల్చగల ముక్కు; పద్రుచుల నెఱిగిన నోరు. శ్రావ్యమును, గంభీరమును అయిన మధుర కంఠధ్వని. ఆజాను బాహువులు; విశాలవక్షము. పాదాలలో శంఖ చక్ర ముద్ర లుండేవని ప్రతీతి. ఆయుర్దాయమే వున్నచో కేతువు అంతరంలో ఢిల్లీ మంత్రిత్వం లభించవలసిన జాతక శాలి. భారతకాంగ్రెసు కార్యదర్శిత్వంతో అంత మొందిన జీవితచరిత్ర. దుర్గాప్రియుడు, సారస్వతమూర్తి, రామభక్తుడు. మన గోపాలకృష్ణుడు ఆంధ్రరత్నమే కాదు, శ్రీరంగంలో ఒకరు చెప్పినట్లు భారతరత్నమే.

శీలంలో 'పరోపకారార్థ మిదంశరీరం' అనే ఆర్యోక్తిచే ఆస్తిపాస్తులనే కాకుండా అస్థికలనుకూడా తన దేశాని కర్పించిన మహనీయుడు. ఇతరులు తింటే తన కడుపు నిండుతుందని చెప్పిన, చూపిన త్యాగమూర్తి. సప్తాహములతోనూ, అన్నసత్రాలతోనూ ప్రజాకోటి ఆకలిని తీర్చడానికి యత్నించిన అన్నదాత.

శ్రీ గోపాలకృష్ణుడు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లము లు మూడింటిలోనూ సమాన ప్రతిభాప్రజ్ఞలు కలిగి, గాన హాస్య పద్య గద్య నటనాదులచే లక్షలాది ప్రజలను రంజింపజేసిన వాక్చతురుడు; గాయకుడు, రసికుడు, పండితుడు, కవి, విమర్శకుడు, రాజనీతిజ్ఞుడు, బ్రహ్మవేత్త, నాట్యకళాపిపాసువు, మిత్రసత్తముడు, ఉత్తమగృహస్థు, ప్రజ్ఞావంతుడు, దేశసేవా ధురంధరుడు, రామభక్తాగ్రేస రుడు. కవిత్వంలో ఆయనరచనలు స్వల్పాలైనా, విలు వలో మాత్రం అమూల్యములు. తెనుగుజీవితమును తెనుగుకవిత్వంతో ముడిపెట్టడంలో అతనికి పెట్టి నది పేరు. విమర్శనంలో—ఆంధ్రకళా నాటక వాఙ్మయ రాజకీయములను విమర్శించడంలో ఆంధ్ర దేశంలో ఆంధ్ర రత్నానికి యీడు లేరనే చెప్పవచ్చు. అసలు గాంధీమహా త్ముని అవతారపురుషుణ్ణి చేసింది అతడే. "సత్యాగ్రహ మార్గం ప్రహ్లాదసాధనే" అని చెప్పితే "ప్రహ్లాదం నారసిం హంగా పరిణమించలేదా" అని మహాత్ముణ్ణి నిరుత్తరుని చేసింది ఈ ఆంధ్రరత్నమే.

రాజకీయాలలో అతని చీరాలరంగం ఎరగని వాళ్లుండరు. చీరాల, పేరాలలు నూతనస్వరాజ్యస్థాపనకు ప్రాతిపదిక. ఇంతేకాదు, భారతరాజకీయాలలో వంగీయ

వం దేవమాతరానికిమాఱుగా భూపతిత్వఆదర్శాన్ని పున రుద్ధరించడంలోనూ, రాజ్యాధిపత్యంలో భారతవర్షాధి పతి అయిన బదరికాశ్రమనారాయణుడనే భాగవత సంప్రదాయాన్ని అనుసరించి భగవంతుడికే పట్టాభి షేకం చేయడంలోనూ, రామరాజ్యమే స్వరాజ్యమనడం లోనూ అతనిదే ముందుమాట. అతని స్వరాజ్యధ్వజం రంగు మెరుపు - ప్రణవం బీజం - శక్తి చక్రము. భారత దేశానికేకాదు, ప్రపంచానికే అది మార్గదర్శకం.

సంస్కర్తగా మన గోపాలకృష్ణుడెన్నో ప్రాచీన సంప్రదాయాలను వుద్ధరించాడు. స్మృతులే మన రాజ్య తంత్రాలు, ధర్మమే మనకు న్యాయశాసనం, పరిషత్స భలే మన పార్లమెంట్లు, 'పదిసీతులు, పదిబూతులు, పది శృంగారములతో' ప్రసంగించడమే మన సభాసంప్ర దాయం, శ్రీముఖాలే మన ఆజ్ఞాపత్రాలు, దీక్షా సంఘాలే మనకార్యవర్గాలు, ప్రభలే మన ప్రబోధమార్గా లు అని బోధించినాడు. నూటపదహార్లలెక్కలు, సప్తా హాలు మొదలైన ప్రాచీన సంప్రదాయాలను మారు మూలలనుంచి బహిరంగస్థలాలకు లాగుకొనివచ్చినాడు.

మతధర్మాలపట్ల అతడొక నూతనయుగ పురు షుడని చెప్పాలి. కాదు, ప్రవక్తగానే భావించాలి.

భారతదేశాన్నే కాకుండా ప్రపంచాన్నంతటినీ వేధిస్తూవున్న మతకలహాలపట్ల—దశావతారాలను ద్వాదశావతారాలుగా చెయ్యమనీ, బైబిలు ఖురానులు రెండూ మరిరెండు పురాణాలుగా భావించవలసిందనీ సమన్వయించిన అతని వాక్కు అమూల్యము. హిందూసంఘోద్ధరణంపట్ల అతని నూతన బ్రాహ్మణధర్మము సర్వజన శరణ్యము.

నాట్య ప్రపంచంలో అతడు అనేకపాత్రలు నటించడంలో అద్వితీయుడు. ఇంతేకాక తన గురువర్యుడైన డాక్టరు ఆనందకుమారస్వామితోకలిసి 'అభినయదర్పణము'ను ఆంగ్లమొనర్చి తనపేరు చిరస్థాయి చేసుకొన్నాడు. "వక్తృత్వంలో యింతటి ఉత్తమోత్తముణ్ణి నేను చూడలేదు" దన్నారట శ్రీకట్టమంచిరెడ్డిగారొకసారి. అతడు సంభాషణలో సరసుడు; బుద్ధిలో బృహస్పతి.

ఆంధ్రరత్నసందేశాలు మూడని చెప్పవచ్చు: రామదండు, స్వరాజ్యపథము, బ్రాహ్మణగోష్ఠి. వరుసగా యీ మూడూ భక్తికర్మజ్ఞానమార్గాలను సూచిస్తాయి. ఇందు రామదండులో అతడు డాక్టరు మూంజీ, స్వామిశ్రద్ధానందులకు మార్గదర్శకుడైనాడు; మహాత్మదల్లీ షౌకతల్లీలకు మిత్రుడైనాడు. ఔత్తరాహుల మహావీరదండు,

హనుమాన్ దళాలలో వుండే శివ కేశవ భేదం మన రామ దండులో లేకపోవడానికి మన సంధ్యాఋషులకు పిమ్మట ఆంధ్రరత్న ప్రభావమే కారణం. మహమ్మదీయులు రుద్రాభిమానులున్నూ, మాలానా శంకరల్లీకి శిష్యులున్నూ, అల్లోపనిషదారాధకులున్నూ అవడంచేత వారికికూడా రామదండులో స్థానమివ్వడం ఆంధ్రరత్న ప్రజ్ఞావిశేషం.

స్వరాజ్యపక్షంలో గోపాలకృష్ణుడు గాంధీభృత్యుడూ, చిత్తరంజనదాస మిత్రుడూ అయినాడు. ఆంధ్రరత్నం అస్తమించిన తరువాత "ఇక మన స్వరాజ్యానికి బ్రిటిషువారిపై దావా వేసేవారు ఎవ"రని ఒక ముసలాయన ప్రశ్నించడం నే నెరుగుదును. స్వరాజ్యమంటే అందరికీ తినడానికి తిండి, కట్టుకోడానికి గుడ్డ, ఉండడానికి నీడ, ముక్తికి ఏక ఇష్టదైవమూ నని అతని వ్యాఖ్య.

బ్రాహ్మణగోష్ఠివిషయంలో మన మతం బ్రాహ్మణ మతమే కాని హిందూమతం కాదనీ, బ్రాహ్మలంటే బ్రహ్మన్వేషకులనీ, అట్టి పదిమంది బ్రహ్మన్వేషకులు వుండేదే బ్రాహ్మణగోష్ఠి అనీ, అట్టిగోష్ఠి తన జీవితాశయమనీ, యీ బ్రాహ్మణగోష్ఠులు వేనవేలుగా దేశమంతటా, ప్రపంచమంతటా వెలయవలెననీ ఆంధ్రరత్నమువాంఛ; దృఢసంకల్పము.

శ్లో. మార్గే మార్గే శాఖినాం రత్నవేదీ,
వేద్యాం వేద్యాం కిన్నరీబృందగీతమ్,
గీతే గీతే మంజులాలాపగోష్ఠీ,
గోష్ఠ్యాం గోష్ఠ్యాం త్వత్కథా రామచంద్ర!

యీ రామకర్ణామృతశ్లోకమే అతనికి ధ్యానశ్లోకమైంది. గోపాలకృష్ణుడు రామభక్తుడు, అభినవ రామదాసు. రామచంద్రుడతనికి యిష్టదైవం. 'రా' అంటే 'రాజ్యం', 'మ' అంటే 'మనది' అని అతడు రామశబ్ద నిర్వచనంచేసి స్వరాజ్యరసం గ్రోలినాడు. రామాలయమే మన నిజకళా భవనమన్నాడు. మన స్వచ్ఛందదళములు రామదండు, గ్రామంపేరు రామనగరం, రసీదులు రామరసీదులు, పాటతాళములు రామభజనలు, జెండా హనుమద్ధ్వజం, రాటం తిప్పేవాడల్లా రామదాసు, సర్వప్రయత్నాలూ రామకార్యాలు—'అంతా రామమయం యీ జగమంతా రామమయం' అని తన జీవితంలో అనుభవించిన తత్త్వవేత్త.

ఆంధ్రరత్నము జైలులోనుంచి వచ్చి తన నూతన బ్రాహ్మణధర్మాన్ని మద్రాసులో వుపదేశించినప్పుడు అగ్రాసనాధిపత్యం వహించిన మాజీ అమాత్యులు గౌ. ప్రకాశంపంతులుగారు అతన్నిగురించి యిట్లా అన్నారు: "పన్నెండు మాసాలు కారాగారవాసంచేత గోపాలకృష్ణు

డు ఆధ్యాత్మికరూపం వహించి వచ్చినాడు. ఈతడు జెయిలులోంచి ఏ విధానాలతోనూ, ఏ కార్యక్రమాల తోనూ రాలేదు. ఆత్మ సందేశంతోమాత్రం వచ్చి నాడు. మన దేశీయుల తోడ్పాటుతో యీ సందేశం నెరవేరితే అది స్వరాజ్యాన్ని మించిందే అవుతుంది. ఈ సందేశాన్ని మంత్రులుగాని, గవర్నర్లుగాని, నైస్రా యిలుగాని, సెక్రిటరీలుగాని యెరుగ్గో జాలరు. మనకు నిజంగా దైవభక్తివుంటే యీ కార్యనిర్వహణంలో మన మందరమూ పూనుకోవాలి. సిక్కులు తమ గాఢ విశ్వాసంచేతనే జయంపొందారు. పాశ్చాత్యవిద్యావ్యా మోహంచేత వారి ఆత్మ లింకా భ్రమగ్గిపోలేదు. తాను చీరాలలో చేసినరీతిగానే ఆంధ్రరత్నం ఒక ప్రాంతంలో ప్రారంభించి, సిక్కుమతం లాగానే దైవభక్తిగల్గిన ఒక నూతనబ్రాహ్మణజాతిని సృష్టించుగాక."

అట్లాంటి గోపాలకృష్ణు డిప్పుడు కీర్తిశేషుడా? అతని గోష్ఠి, రామదండు, స్వరాజ్యేప్సితం మనం మరవకుండా వున్నంతవరకూ అతడు విగతజీవుడు కాజాలడు. వీటిని మనం యెప్పుడు సాధించగల్గుతామో అప్పుడే అతని సాధన సిద్ధిస్తుంది.

# శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు

అరుణోదయ కాంతులు ప్రసరించేవేళనో, గోధూళి ధూసరితమై చీకట్లు అలముకొనేవేళనో బృందావన (బందరు) పురవీథుల్లో పరికించి చూస్తే యీ మంగళ మూర్తి గోచరిస్తాడు. జ్ఞానభారంచేత కాబోలు, వారిగిన తలను నిటారుగా పెట్టకుండానే, క్రిందికి దించిన చూపును ఎత్తకుండానే ఇంటిదగ్గరనుంచి బయలుదేరి ఆఫీసుకు చేరు కునే ఆ వింతవైఖరి వ్యక్తే ముట్నూరి కృష్ణారావుగారు.

ఇంట్లో నైతేనేమి, ఆఫీసులో నైతేనేమి, మరెక్క డనైనా అయితేనేమి ఆయన మితభాషి. క్రొత్తవాళ్ల యెదుట, ఆడవాళ్లయెదుట అసలే జమ్మైకు పోతారు. ముప్పయి వాల్యూములలో నిశ్శబ్దతారహస్యాన్ని బోధించిన కార్లయిలు ఋషి లక్ష్యమో, లేక ముప్పయి యేళ్లుగా లోకకౌతుకాన్ని గిలిగింత పెడుతూ పుచ్చేరిలో మౌనవ్రతం వహించిన అరవిందయోగి గురువో?

కావలసిన చుట్టాలూ, అక్కర్లేని బాదరాయణ సంబంధీకులూ చాలామంది వున్నారు కృష్ణారావుగారికి. అయినా, ఆయనకు ఎవ్వరితోనూ జోక్యంలేదు. "దూరాత్ సంకుచితేవ గచ్ఛతి..." ఆయన యజ్ఞోప

వీతాన్ని విసర్జించి 'నాయుడుగారి బ్రహ్మసమాజం' లో చేరాడనీ, కుమార్తెలకు రజస్వలానంతరవివాహం చేశాడనీ, మడిమైలలు అట్టే పాటించడనీ కోపంతో, కినుకతో వాళ్లందరూ ఆయనను వెలివేసినప్పుడు ఆయన లోలో పలే నవ్వుకొన్నారు.

"కృష్ణారావుగారితో మాకు బాగా పరిచయం వున్నది...ఆయనఅంతర్యం తెలిసికోగలిగాం. ఇదిగో ఆయనతత్వం యిదీ" అని నిక్కచ్చిగా చెప్పగల్గినవాళ్ల సంఖ్య లెక్కపెడితే అయిదువేళ్లలోనూ కొన్ని మిగిలి పోతాయి! కాని ఆయనపరిచయభాగ్యం కలిగి, ఆయన వాగమృతధారలను గ్రోలి ఆనందించినవారు పలువురు. నలుగురైదుగురుకన్న ఎక్కువ లేకుండా చుట్టూజేరి ఆయనను పురికొల్పితే చాలు ప్రారంభమౌతుంది జలసా! కళాశాల ఆవరణలోని వృక్షచ్ఛాయల విశ్రమించి అయితేనేమి, బొంబాయికాలువవొడ్డున సైకతస్థలాల కూర్చుని అయితేనేమి, ఆఫీసులో కుర్చీని వెనక్కు తన్నిపెట్టి ఠీవిగా హస్తవిన్యాసం చేస్తూనైతేనేమి, ఇంట్లో పడక కుర్చీలో నడుమువాల్చి మాలతీమలయమారుతాన్ని ఆఘ్రాణిస్తూనైతేనేమి 'మూడ్' వచ్చినప్పుడు ఆయన ఆవేశంతో విశదీకరించే విషయాలకు అంతులేదు.

ఆధునికాంధ్రసారస్వతం, పూర్వపు సంస్కృత కావ్యాలు, చిత్రకళ, గీతారహస్యం, ఉపనిషత్సారం, గాంధీగారి రాజకీయాలు, ఘోషుగారి వ్రాతలు, టాగూరుగారి రచనలు, నాటకాలధోరణి, సినిమా సంగతులు, నాట్యవిన్యాసాలు, అలంకారశాస్త్రమథనం, ఒకటేమిటి, మీ కేది కావలిస్తే అది, ప్రపంచంలో ఎన్నివిషయాలున్నాయో అన్నీ, కూలంకషంగా కలయు పెట్టబడతాయి. అప్పుడు కేవలం భృంగరాజీ లలితధ్వనే!

కృష్ణారావుగారు 'చలాకీమనిషే;' అగుపడేటంత బిగువు కాదు. ఏ విషయాన్ని గూర్చి ఐనా ధారాళంగా ధోరణి సాగించగల మేధావి. ప్రాత విషయాలనైనా క్రొత్తకోణంనుంచి చూపింప శక్తిగల ధీశాలి.

ఎందులోనూ జోక్యం కల్గించుకోని మనిషి చల్లగా సత్యాగ్రహసమరంలో రెండుదఫాలు రాజుగారి ఆతిథ్యాన్ని అందుకొన్నారు. యువకు లందరూ కృష్ణారావుగారి చుట్టూ చేరి ఆయనకు 'కీ' యిచ్చి వింటూవుండేవారట. వాళ్లందరికీ అదొక క్రొత్త అపూర్వానుభవం. ఎవళ్లకుకావలసింది వాళ్లు అడిగి తెలిసికొనేవారట.

విడుదలైవచ్చినతర్వాత కొంత కాలంవరకూ ఆయన అమితోత్సాహంతో ఎప్పుడూ జైలుకబుర్లే చెప్పే

వారు—అక్కడచేసిన నలభీమపాకాలు, సలిపిన గోష్ఠి సభలు, తత్వానందస్వామిగారిమీద ప్రయోగించిన ట్రిక్కులు, ఆంధ్రులకూ అరవలకూ జరిగిన సంవాదాలు, వింతలూ, విడ్డూరాలూను. వినడానికి మాకు విసుగు వచ్చేదికాదు.

కృష్ణారావుగారు సరసులు. 'రసానందో బ్రహ్మ' మంత్రరహస్యార్థ విబోధితులు. రుచి, పస తెలిసిన రసికులు. సంస్కృతంలో, తెనుగులో, ఇంగ్లీషులో ఉత్తమ కావ్యాలను సవిమర్శంగా సమీక్షచేసి చక్కగా వంటపట్టించుకున్న సాధుశీలురు. వీటికితోడు స్వతస్సిద్ధంగా వున్న తేజోవికాసం, బుద్ధితీక్ష్ణత. ఆయన లేరిచిచూసి తేల్చని నిగ్గులు లేవు. అవి ఆయనవ్రాతలలో, సంభాషణలలో అనవరతమూ ప్రత్యక్షమౌతూనే వుంటాయి.

సిత్రాళ్జిత్తమైన ఆ పాటియింటికే నాజూకులు, నగిషీలు. ముంగువాచుట్టూ రంగవల్లులను చెక్కించడమో, హాలులో అక్కడక్కడ అగ్రాచలువరాళ్లను తాపించడమో, స్తంభాలకు చెక్కడపు ఆర్చీలను పెట్టించడమో, సింహద్వారంపైన పద్మపీఠమైన లక్ష్మిని కుడ్యాలంకారంగా బిగింపించడమో, ఏదో ఒకటి తోస్తూనేవుంటుంది ఆయనకు. ఆ సందుగొందుల ఆఫీసులోనూ అంతే. ఆ వున్న

జానెడుబెత్తెడు ఆవరణలోనూ శిలావిగ్రహాలు, పర్ణ శాలలు, కాసారాలు, లతాకుంజాలు, జాతిచపటాలు, తోటపసందులు. నందనవనాన్ని సృష్టించాలని సంకల్పం.

కృష్ణాపత్రిక తయారులోగూడ రసప్రవాహం గోచరిస్తూ వుంటుంది. ఆ బొమ్మలు, ఆ మకుటాలు—గ్రహించే వాళ్లకు తెలుస్తుంది వాటివిలువ! చివరకు, ఆయన జైలులో వున్నప్పుడుగూడా ఆర్టు టేబలాటాన్ని వదలిపెట్టలేదు.

ఈ రసకాంక్షే కృష్ణారావుగారి దుస్తులలోగూడా అగుపిస్తుంది. ఆయన అతిమోహన వేషధారి. మొదట్లో కాలర్ కోట్లతోనూ, నెక్ టైలతోనూ, క్లిప్పులతోనూ ఆయన మురిసిపోయినా, పంజాబుహత్యలకాలంనాటినుంచీ ఒకేమోస్తరు ఖద్దరువేషాన్ని ధరిస్తూ పరిచారు. మెడదగ్గర నుంచీ మోకాళ్ల క్రిందవరకూ సాష్టాంగపడే తెల్లనిలాల్చీ, సంస్థానాధీశ్వరుల ఠీవిని ధిక్కరిస్తూ కోణాలు తేలిన ధవళ శిరోవేష్టం—అంతే మల్లీ. కాని అదే ప్రత్యేకత!

కృష్ణారావుగారు మద్రాసులో ఎఫ్.ఏ. చదువుతున్న రోజులవి. వంగనాయకుడు బిపిన చంద్రపాల్ గారు పట్నం విచ్చేశారు బ్రహ్మసమాజంతరపున ఉపన్యాసాలివ్వడానికి. కృష్ణారావుగారికి ఆయనమీద గురి కుదిరి, శిష్యులై పోయినారు.

వారు—అక్కడచేసిన నలభీమపాకాలు, సలిపిన గోష్ఠి సభలు, తత్వానందస్వామిగారిమీద ప్రయోగించిన ట్రిక్కులు, ఆంధ్రులకూ అరవలకూ జరిగిన సంవాదాలు, వింతలూ, విడ్డూరాల్యాలూను. వినడానికి మాకు విసుగు వచ్చేదికాదు.

కృష్ణారావుగారు సరసులు. 'రసానందో బ్రహ్మ' మంత్రరహస్యార్థ విబోధితులు. రుచి, పస తెలిసిన రసికులు. సంస్కృతంలో, తెనుగులో, ఇంగ్లీషులో ఉత్తమ కావ్యాలను సవిమర్శంగా సమీక్షచేసి చక్కగా వంటపట్టించుకున్న సాధుశీలురు. వీటికితోడు స్వతస్సిద్ధంగా వున్న తేజోవికాసం, బుద్ధితీక్ష్ణత. ఆయన తెరిచిచూసి తేల్చని నిగ్గులులేవు. అవి ఆయనవ్రాతలలో, సంభాషణలలో అనవరతమూ ప్రత్యక్షమౌతూనే వుంటాయి.

పిత్రార్జితమైన ఆ పాతయింటికే నాజూకులు, నగిషీలు. మండువాచుట్టూ రంగవల్లులను చెక్కించడమో, హాలులో అక్కడక్కడ ఆగ్రాచలువరాళ్లను తాపించడమో, స్తంభాలకు చెక్కడపు ఆర్చీలను పెట్టించడమో, సింహద్వారంపైన పద్మపీఠియైన లక్ష్మిని కుడ్యాలంకారంగా బిగింపించడమో, ఏదో ఒకటి తోస్తూనేవుంటుంది ఆయనకు. ఆ సందుగొందుల ఆఫీసులోనూ అంతే. ఆ వున్న

జానెడుబెత్తెడు ఆవరణలోనూ శిలావిగ్రహాలు, పర్ణ శాలలు, కాసారాలు, లతాకుంజాలు, జాతిచపటాలు, తోటపసందులు. నందనవనాన్ని సృష్టించాలని సంకల్పం.

కృష్ణాపత్రిక తయారులోగూడ రసప్రవాహం గోచరిస్తూ వుంటుంది. ఆ బొమ్మలు, ఆ మకుటాలు—గ్రహించేవాళ్లకు తెలుస్తుంది వాటివిలువ! చివరకు, ఆయన జైలులో వున్నప్పుడుగూడా ఆర్టు ఉబలాటాన్ని వదలిపెట్టలేదు.

ఈ రసకాంక్షే కృష్ణారావుగారి దుస్తులలోగూడా అగుపిస్తుంది. ఆయన అతిమోహనవేషధారి. మొదట్లో కాలర్ కోట్లతోనూ, నెక్ టైలతోనూ, క్లిప్పులతోనూ ఆయన మురిసిపోయినా, పంజాబుహత్యలకాలంనాటినుంచీ ఒకేమోస్తరు ఖద్దరువేసాన్ని ఖాయపరిచారు. మెడదగ్గర నుంచీ మోకాళ్ల క్రిందవరకూ సాష్టాంగపడే తెల్లనిలాల్చీ, సంస్థానాధీశ్వరుల ఠీవిని ధిక్కరిస్తూ కోణాలు తేలిన ధవళ శిరోవేష్టం—అంతే మళ్లీ. కాని అదే ప్రత్యేకత!

కృష్ణారావుగారు మద్రాసులో ఎఫ్.ఏ. చదువుతున్న రోజులవి. వంగనాయకుడు బిపిన చంద్రపాల్ గారు పట్నం విచ్చేశారు బ్రహ్మసమాజంతరఫున ఉపన్యాసాలివ్వడానికి. కృష్ణారావుగారికి ఆయనమీద గురి కుదిరి, శిష్యులై పోయినారు.

అటుపై ఆ వంగవీరునితో బెంగాలు వెళ్ళినారు. దాదాపు ఒక సంవత్సరం అజ్ఞాతవాసమైనతర్వాత గృహోన్ముఖు లైనారు. కలకత్తాలో బిపినపాలుగారితో ఆ యనపడ్డ తికమకల కేమిగానీండి, ఆ యాత్రతో, ఆ అనుభవంతో కృష్ణారావుగారి జీవిత దృక్పథంలో తీవ్రమైన మార్పు కలిగింది. మల్లిక్ గారి విశాలభవనంలో అరవిందఘోషు, రవీంద్ర కవి, బిపినపాలు మొదలైన ఉద్దండులు గుమికూడి జాతీయజీవన సౌధానికి పునాదులు వేసేవారు. మూగనోముvవయై కృష్ణారావుగారు ఆ మీటింగు లన్నింటికీ హాజరై, సంగతులను గ్రహించి, నూతనావేశభరితు లయ్యేవారు.

బెంగాలుపర్యటనం పూర్తియై బందరు చేరుకున్నారు కృష్ణారావుగారు. చదువుకు స్వస్తి. ప్రత్యేకించి చేసే పని లేదు. క్లబ్బుకుమాత్రం హాజరుతప్పేది కాదు.

ఆ రోజులలో శ్రీయుతులు కొండా వెంకటప్పయ్య పంతులుగారు, శెడింబి హనుమంతరావుపంతులుగారు, వేమవరపు రామదాసుపంతులుగారు యిత్యాదులు కృష్ణాజిల్లాసంఘం తరఫున కృష్ణాపత్రికను ప్రకటిస్తూవుండేవారు.

మెల్లగా అది కృష్ణారావుగారి హస్తగతమైంది. కాని ఆయనగారికి సాఫీ తెనుగు వ్రాయడం వస్తేగా ? కాని జంక లేదు. దాదాపుముప్పై ఏళ్లుతరలిపోయినాయి. 'కేలల్లాడ' కుండా ఎత్తిపట్టిన 'విపులచ్ఛత్రం' కృష్ణాపత్రిక. కృష్ణా పత్రికే కృష్ణరావుగారు, కృష్ణారావుగారే కృష్ణాపత్రిక !

స్వతస్సిద్ధంగా ఆయన మౌన ముద్రాలంకారుడైనా కృష్ణారావుగారు కృష్ణాపత్రికద్వారా మాట్లాడక తప్పేదికాదు. అంచేత అది చాలావరకూ ఆయనప్రతిబింబమే. కాబట్టి కృష్ణాపత్రిక చేసిన సేవ ఆయన చేసింది గానే భావించడంలో దోషంలేదు.

కృష్ణాపత్రిక చేయని మంచిపని లేదు. జోక్యంకల్గించుకొని చేయూతనియ్యని ఉద్యమం లేదు. దేశంలోని అన్ని సమస్యలలోనూ కొద్దో గొప్పో పాల్గొన్నది. జీవితానికి సంబంధించిన సమస్తవిషయాలనూ తర్కించింది. ముఖ్యంగా ఆంధ్ర సాహిత్యానికి, కళలకు, కాంగ్రెసుసంస్థకు అది చేసిన సేవ నిరుపమానం. "కృష్ణాపత్రిక న్యూస్ పేపరు కాదు, వ్యూస్ పేపరు" అన్నారు కృష్ణారావుగారు ఒకమారు. అది ముమ్మాటికీ నిజం.

ఆ ఎడిటోరియల్సు జర్నలిస్టుకు ధోరణిగా వుండవు. వాటిది వ్యాసరూపం. నవ్యాంధ్రసారస్వతంలో

'వ్యాసం' అనేదానికి వరవడిపెట్టింది కృష్ణారావుగారి ఎడిటోరియలు. ఒకప్పుడు ఆయనభావాలకు కలంశక్తి చాలడంలేదేమో ననిపిస్తుంది. ఆయన కలంశక్తి చదువరిని ఉద్రేకంతో శివాలాడిస్తుంది, చిందులు త్రొక్కిస్తుంది.

ఆ శైలి, ఆ సౌష్ఠవం, ఆ మూకుమ, ఆ దర్జా కృష్ణారావుగారికే సరిపోయింది. ఆయనరీతిగా వ్రాసేవారు తెనుగునాడులో ఎవ్వరూ లేరు. కృష్ణాపత్రికలో కృష్ణారావుగారు టాగూరుగారి కవితాతత్వాన్ని పరామర్శిస్తూ వ్రాసిన వ్యాసాలను చూచి పులకించి, వాటిని పురస్కరించుకొని కాదూ సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు తమ 'ఫిలాసఫీ ఆఫ్ టాగూరు' అనే గ్రంథానికి పునాదులు వేసింది ? కృష్ణాపత్రిక ద్వారా గాదూ, ఆంధ్రులలో ఎక్కువగా నవ్యభావోదయం ఉద్బోధితమైంది ?

కృష్ణారావుగారియొక్క కమనీయతామహిమ దానికదే ; సాటిలేనిది. సానలుతీరిన జాతిరత్నం.

## శ్రీ పూసపాటి లక్ష్మీనరసింహరాజుగారు

స్థానిక సంస్థల ప్రయోజనాన్ని ప్రజలకు పూర్తిగా కలిగించిన ప్రముఖులలో శ్రీ పూసపాటి లక్ష్మీనరసింహ రాజుగారికి మొదటిస్థానం యివ్వవలసి వుంటుంది. ఆయన జిల్లాబోర్డు, జిల్లా యెడ్యుకేషన్ కౌన్సిలు, మునిసి పాలిటీలలో సభ్యులు. విజయనగరం తాలూకాబోర్డు, జిల్లా కాంగ్రెసుసభలకు అధ్యక్షులు. ఇలాటి స్థానిక సంస్థల లోని తమ పదవులను, పలుకుబడిని ప్రజాక్షేమానికే వినియోగించి వారి ఆదరణానికి పాత్రులైన లక్ష్మీనర సింహరాజుగారి పేరు విశాఖపట్టణంజిల్లాఅంతటా వ్యా పించివుంది.

విజయనగరం తాలూకాబోర్డు పేరుకు తాలూకా బోర్డుగా వున్నప్పటికీ విస్తీర్ణవిషయంలో చాలాపెద్దది. ఆ తాలూకాప్రజలలో విద్య తక్కువ. ఆర్థికసంపద లోనూ వారు చాలా వెనుకబడివున్నారు. దేశహితైక జీవనాభిలాషగలవారుకూడా తక్కువే. ఇట్లు యిన్ని ప్రతిబంధకాలు వున్నప్పటికీ లక్ష్మీనరసింహరాజుగారు ఆ తాలూకాబోర్డుప్రెసిడెంటుగా వుండి ప్రజోపయోగ కార్యాలను చాలా సాధించివున్నారు. రాజా గజపతి

నగరం ప్రాథమిక పాఠశాలను మాధ్యమిక పాఠ
నుగా మార్చినారు. పాలకొండ మాధ్యమిక పాఠశా
ఉన్నత పాఠశాలనుగా చేయించారు. పాఠశాలలు
అనేక కుగ్రామాలలో ప్రాథమిక పాఠశాలలు బయలు
దేరారు. వైద్యశాలలును, బాటలును వృద్ధి అయినా

జిల్లాబోర్డు సభ్యులుగావుండి చేసిన ప్రచారాల
కూడా వారు స్థిరమైన యశస్సును గడించారు. చె
పురి రాజధానియందు గ్రామబాటలకు ప్రత్యేకించ
యిరవై రెండు లక్షల రూపాయలలోను పన్నెండు ల
రూపాయలు వారి కృషివల్లనే విశాఖపట్టణంబో
లభించినాయి. వారి కృషివల్లనే విజయనగరం
ఖద్దరు సహకారసంఘం రాజధానిలో జిల్లా ప్రసిద్ధి చె
వాటిలో ఒకటిగా పేరు పడ్డది. సామాన్యంగా ఖాదీ
సంఘాలు ఒక తరగతిపనికే చెందినవిగా వున్నప్పు
ఈ విజయనగర ఖద్దరుసంఘం వడకుట, నేత, అద్ద
—వీటికి సంబంధించిన పనులు కలిగి గాంధీమహాత్ము
ప్రశంసలకుకూడా పాత్రమైంది. సహకార పరపతి సం
న్ని కూడా వారు మంచిస్థితిలోకి తెచ్చినారు. బాకీలు
గితే అప్పటికి నిలవలోవున్న వాటిని చాలామట్టుకు రాబ
నారు. ఆర్థికస్థితికూడా బాగుపడింది.



శ్రీ పూసపాటి లక్ష్మీనరసింహరాజుగారు



శ్రీ మల్లప్రాసి తిమ్మరాజుగారు

నరసింహరాజుగారు పెద్ద భూస్వామి. జొన్నవలస చుట్టుపట్ల మామిడితోటలలో చాలాభాగము వారివే. మహారాజుగారికి చూపే మర్యాదలను వంశప్రతిష్ఠనుబట్టి ప్రజలు వారికీ చూపుతారు. గౌరవస్థానంలో వారు మహారాజావారి తరువాతివారుగా పరిగణింపబడుతున్నారు. చాలా ధనవంతులూ, భూస్వాములూ అయినప్పటికీ తమ తోటలలో విరగకాచిన మామిడిచెట్లవలెనే తాము కూడా వినయంగా తలవంచుకొని, అనేక అధికారపదవులలో వున్నా అందరికీ అందుబాటులోవుండి, భాగ్యవంతులు బీదలు అనే వ్యత్యాసం లేకుండా సమరసమైన ప్రవర్తన, నిష్కల్మషమైన మనస్సు, గూఢమైన దాతృత్వం, సర్వసమ్మతమైన పరిపాలన—యీలాంటి గుణాలు గల వ్యక్తిగా ప్రసిద్ధిచెందివున్నారు.

బొబ్బిలిరాజాగారి జిల్లాబోర్డువిభజనాన్ని రద్దుపరచి మళ్లా ఒక్కటే బోర్డును చేసి మొన్న జరిపిన యెన్నికలలో శ్రీ లక్ష్మీనరసింహరాజుగారు విశాఖపట్టణంజిల్లాబోర్డుకు అధ్యక్షులు కావడం ప్రజల అదృష్టంగా తలుస్తున్నారు అంతాను.

# శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు

ఊరికంతా వ్యవసాయపు భూమి. మన్నెవారు దున్ను తున్నారు. పసువుల కాపరులు పాటలు పాడుతూ గొడ్ల మీద సవారిచేస్తున్నారు. గుబురుగా పెరిగిన మామిళ్లు దోరమాగిన బంగినపల్లి కాయల భారానికి కొమ్మలు వంగిపోయి వున్నాయి. విరగకాచిన ఒక చెట్టు నీడపట్టున ముగ్గురు యువకులు విశ్రమించివున్నారు. వారిలో ఒకరు ఏదో పుస్తకాన్ని చదువుతూవుంటే మిక్కినవారిద్దరూ వ్యాఖ్యానం చేస్తున్నారు. ఆ ముగ్గురిలో ఒకరు ముళ్లపూడి తిమ్మరాజుగారు; మిక్కినవారు పండితులు.

తిమ్మరాజుగారు గొప్ప భాగ్యవంతులయినా, వృద్ధులయిన తమ తండ్రిగారు అవలంబించే సామాన్య రైతుజీవనాన్నే అనుసరిస్తూ, సన్నకావిపంచను, మోచేతులుదాటని ముతకచొక్కాను ధరించి, పైన ఏదో ఒక ఖద్దరుగుడ్డ వేసుకొని కూర్చున్నారు. ఆ ముగ్గురూ 'మృచ్ఛకటిక' నాటకం చదువుతూ, అందులోని పాత్రలనూ, ఆ కాలపు సాంఘికజీవనాన్నీ విమర్శిస్తున్నారు.

స్థలంచూస్తే ఊరికెక్కడో వెలుపలగా వుంది. పరిసరాలు కర్షకజీవన ద్యోతకాలు. గ్రంథపఠనంలో నిమ

గ్నమైవున్న వారిని నా రాకమూలకంగా ఆటంకం కలిగించినందుకు క్షమాపణకోరి, నేనూ అక్కడే చతికిలబడి, “ఏమండీ, మీరంతా యీ పుస్తకం ఇంత శ్రద్ధగా చదువుతున్నారు? ప్రయోజనం ఏమిటి” అన్నాను. “మన ప్రాచీనులు చిత్రించిన ఆ పాత్రల మానసిక ప్రవృత్తులకూ యీ కాలపువారి మానసిక ప్రవృత్తికీ—ఆ కాలపు సాంఘిక పరిస్థితులకూ యీనాటి సాంఘిక పరిస్థితికీ ఉన్న భేదాలూ, సామ్యాలూ జిజ్ఞాసచేస్తున్నాం. ఇంతకుమించి మరేమీ లేదు” అని తిమ్మరాజు, నారాయణ శాస్త్రి, సూర్యనారాయణరాజుగార్లు ఒక్కసారిగా అన్నారు.

తర్వాత తిమ్మరాజుగారు “శాస్త్రులుగారూ, నారాయణరాజుగారు వచ్చారు. ఈ వేళకు మనచదువు కట్టిపెట్టుదాం” అంటూ చటుక్కున లేచి, తను నెత్తిమీద వ్రేలాడుతున్న లేతమామిడి బంగినపల్లికాయ ఒకటి కోసి, చర్మం చెక్కి, మా అందరికీ తలా ఒకముక్క యివ్వడం మొదలుపెట్టినారు. ఆముగ్గురూ ఒక కమ్మ, ఒక క్షత్రియ, ఒక బ్రాహ్మణయువకులు. ఆ చెట్టుక్రింద కూర్చుండి చల్లగాలి పీలుస్తూ, గొడ్లుకాచేవాళ్ల పాటలు వింటూ, కాస్త పుల్లగా, కాస్త తియ్యగా వున్న పచ్చిమామిడి ముక్కలు తింటూ, భారతీయ జీవనవాహినిని, మానవ

స్వభావాన్ని పరిశీలిస్తూ నిశ్చింతగా కాలక్షేపం చేస్తున్న ఆ యువకులనుచూస్తే నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

ఈ దృశ్యమే చెపుతుంది తిమ్మరాజుగారి జీవిత మర్మాన్ని యావత్తూ. తణుకులోనే కాదు, మన ఆంధ్ర దేశంలోనే కొంతకాలం నుండి—ఆర్భాటం లేని ప్రజాహిత [illegible] వారెవరంటే ఆయన తిమ్మరాజుగారని చెప్పవలసివస్తుంది. బస్తీలో వున్నా గ్రామజీవనమార్గాన్ని అవలంబిస్తూ, అనుభవిస్తూ వున్న తిమ్మరాజుగారి [illegible] గ్రామపునరుద్ధరణాభిలాషతో నిండివుంది. తిమ్మరాజుగారి వేషం, వారి జీవనశక్తి, వారి [illegible], వారి స్నేహకూటమి— చూస్తూ వారిలో [illegible] గ్రామోద్ధరణాభిలాషనే తెలుపుతూవున్నాయి. వారి తోటలోవున్న గున్నమామిడి ఫలభారంతో ఎట్లా వంగి వున్నదో, అట్లాగే తిమ్మరాజుగారుకూడా వయసున చిన్నవారయినప్పటికీ దేశహితైక కార్యభారంతో వంగిపోతున్నారు. ఇరిగేషన్ అడ్వయిజరీ బోర్డు, జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలు, ప్రాథమిక విద్యాసంఘం—ఇలాంటి సంస్థ లెన్నిటితోనో సంబంధంకలిగి, వారు తమ అధికారాన్ని, పలుకుబడిని ప్రజాక్షేమానికే వినియోగిస్తూ వున్నారు. వరసగా తొమ్మిదేండ్లు తణుకు తాలూకాబోర్డు

అధ్యక్షులుగావుండి వారు చేసిన అపారమగు సేవ మరవ డానికి వీలు లేనిది. ఆ తాలూకాలో జరిగిన గ్రామాభివృద్ధి యీవత్తూ వారి పేరునే ఆశ్రయించుకొనివుంది. కాలుతీసి కాలు పెట్టడానికి వీలులేనిచోట్ల రోడ్లు, పిల్లలు చదువు సంధ్యలు లేక తిరుగుతూవుండే గ్రామాలలో పాఠశాలలు, రోగంవస్తే దిక్కూ మొక్కూ లేక మృత్యువువాత పడవల సివచ్చే ప్రదేశాలలో వైద్యశాలలు స్థాపింపజేశారు. తణుకు లో పంచాయితీ బోర్డు అధ్యక్షులై మురుగుకాలువలు ఏ ర్పాటుచేసి, మురుగు బాధ తగ్గించారు. ప్రసవసమయంలో సరియైన వైద్యసహాయంలేక చిక్కులుపడే స్త్రీలకు ప్రసూతిచికిత్సాలయాన్ని కట్టించి స్త్రీలకృతజ్ఞతకు పాత్రు లయినారు. ఇదీ అదీ యేమిటి ? ఆధునిక గ్రామపునరుద్ధర ణకు సంబంధించిన కార్యక్రమాన్ని — వీలుచిక్కినంత వరకూ, ద్రవ్యసమపాయం లభించినంతవరకూ—సాధిం చడానికి తమఅధికారాన్నీ, సామర్థ్యాన్నీ వినియోగించి చాలావరకు జయంపొందిన గ్రామజీవనాభిలాషి ఆయన.

తిమ్మరాజుగారి సేవ యింతటితో తీరిపోలేదు. గ్రామ వాసులలో ఆధునిక పరిజ్ఞానాన్ని వ్యాపింపజేసే ఉద్దేశం తో తమ సొంత పుస్తక భాండాగారాన్ని తాలూకాబోర్డు వారి వశంచేసి, చిన్నచిన్న సంచార గ్రంథాలయాలు

## శ్రీ టి.ఎన్. రామకృష్ణారెడ్డి గారు

చిత్తూరు మండల న్యాయవాదులు. సేవానురక్తులు. సుప్రసిద్ధనాయకులు. చిత్తూరు నగర సహకార పరపతి నిధికి, మండల సహకార పరపతినిధికి, సహకార నిధుల పెడ కేపనుకు చాలాకాలం డైరెక్టరులు. పరపతి సంస్థల పనితోనే సరిపుచ్చుకోకుండా మునిసిపాలిటీ, జిల్లాబోర్డు లలోకూడా ప్రవేశించి స్థానికసంస్థల పరిపాలనలోకూడా అనుభవం సంపాదించుకొన్న ప్రముఖులు.

రామకృష్ణారెడ్డిగారు తమనివాసాన్ని మదనపల్లికి మార్చుకొన్నతర్వాత ఆతాలూకాబోర్డు ప్రెసిడెంటు, జిల్లాబోర్డు ప్రెసిడెంటు పదవులను ఎన్నుకోబడి ప్రజలకు ఎక్కువ సహాయం చేయగల్గుతున్నారు. తమ ప్రజా సేవను ఇంకా విస్తరింపజేసే వుద్దేశంకలిగి రాయలసీమ చిత్తూరు జిల్లాల పక్షాన ఇప్పటికి రెండుసార్లు కేంద్ర శాసనసభ్యత్వాం వహించి, ప్రజాపక్షం అవలంబించి తమ ప్రజాసేవకు కీర్తి ఆపాదించుకొన్నారు.

రామకృష్ణారెడ్డిగారివంటి ప్రజాభిమానులను, నాయకులను కాంగ్రెసు తనగర్భంలో యిముడ్చుకొని గత చెన్నపురిశాసనసభల ఎన్నికలలో సాటిలేని విజయం సమకూర్చుకొన్నది.

పరపతి సంఘాలే కానీయండి, మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులే కానీయండి, శాసన సభలే కానీయండి—ఏకార్యం తలపెట్టినా రామకృష్ణా రెడ్డిగారు ప్రజాసేవే ఆదర్శంగా పెట్టుకొను ప్రజాప్రముఖులుగా విలసిస్తున్నారు.

———

# శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు

ఇప్పటికి సుమారు ముప్ఫయియేండ్లక్రిందట కృష్ణా మండలరాజకీయ జీవనాభివృద్ధికై జరిగిన కృషియందు పాల్గొన్న కుటుంబాలలో అడుసుమిల్లివారి కుటుంబం ఒకటి. ఆ రోజులలో ఆంగ్లవిద్యావంతులకూ, గ్రామ వాసులకూ సంబంధాన్ని కల్పించడానికై కృష్ణాజిల్లాసంఘంవారు మండలసభలను జరుపుతూవచ్చినారు. కృష్ణా పత్రికను స్థాపించారు. సంచారకార్యదర్శులను నియమించారు. ఈసందర్భంలో సుబ్రహ్మణ్యంగారున్ను, ఆ తరువాత సూర్యనారాయణగారున్ను చూపుతూవచ్చిన అభిమానం మరువతగిందికాదు. వీరి యనంతరం తమ తండ్రి, అన్నగార్లయొక్క గ్రామజీవనాభిలాష, నిరాడంబరజీవనాలు గోపాలకృష్ణయ్యగారికికూడా పట్టుపడ్డాయి.

గోపాలకృష్ణయ్యగారికి ఆంగ్లభాషలో పరిచయం లేదు. ఆంధ్రంలోనూ వారు పండితులుకారు. వక్తృత్వం గురించి చెప్పతగింది యేమీలేదు. వృత్తిచూస్తే వ్యవసాయం. నివాసం కుగ్రామంలో. ఇట్లు రాజకీయరంగంలో ప్రవేశించడానికిగాని, ప్రవేశించి దానిని జయప్రదంగా నిర్వహించడానికిగాని ఆధునిక శిక్షణమని చెప్పతగిన

శిక్షణ యేమీలేకున్నా వారు స్వార్జితమూ, స్వయంశిక్షితమూ అయిన జ్ఞానంచేత కృష్ణామండల రైతాంగానికి నాయకులుగాను, ప్రజాహితజీవనంలో గణింపతగిన వ్యక్తిగాను యేర్పడ్డారు. ఈ నాయకత్వం బుద్ధిబలంవల్ల యేర్పడిందేగాని అందుకై పెనగులాడి, ప్రయాసపడి సంపాదించుకొన్నది కాదు.

గోపాలకృష్ణయ్యగారు నాయకులు. ఆయన నిగర్వం ఆదర్శకరంగాను, ఆయన గ్రామజీవనాభిలాష అనుసరణయోగ్యంగాను వుంటున్నాయి. ఆ ఆజానుబాహుమూర్తి, ఆ విశాలమైన మొగము, ప్రకాశమైన ఆ నేత్రాలు, దృఢమైన ఆ చెక్కిళ్లు అన్నీ నాయకలక్షణాలనే తెలుపుతున్నాయి. కక్షలు బయలుదేరనియ్యండి, వ్యతిరేకప్రచారం జరుగనియ్యండి...అవి-ఇప్పుడుకాదు, యికముందున్నూ-కమ్మవారిలో చాలామందికి గోపాలకృష్ణయ్యగారిపైగల భక్తివిశ్వాసాలను కదిలింపలేవు.

మానవస్వభావాన్ని పరిశీలిస్తే మనుష్యులలో వున్నది వున్నట్టుగా మాట్లాడేవారు కొందరూ, వున్నదానిని కప్పిపుచ్చి తియ్యగామాట్లాడేవారు మరికొందరూ కనిపిస్తారు. గోపాలకృష్ణయ్యగారు తమ ఆవేశాన్ని మాటల ద్వారా తప్పితే క్రియారూపంగా చూపడం తక్కువ.

మాటలు యెంతపరుషంగా కనుపించినా వారిమనస్సులో స్నేహభావం, ఉపకారబుద్ధి, ఆశ్రితపక్షపాతం లేక పోలేదు. వారిని యెంతకఠినంగా విమర్శించినా కపటంలేని మనిషిఅని ఒప్పుకోకతప్పదు. ఆయన నిష్కల్మషపు ధోర ణిని చూచి చాలామంది దురభిప్రాయపడుతారుగాని "యింత ఆశ్రితపక్షపాతి, ఇంత స్నేహపాత్రుడు లే" డంటారు యెరిగినవారు.

గోపాలకృష్ణయ్యగారి వాగ్ధోరణి కాస్త కఠినపాకం. ఇది జస్టిసుపార్టీ అనే బ్రాహ్మణేతరోద్యమ సమయంలో అందరినీ వూగించినట్టే వారిని వూగించింది. ఈ మహా ప్రవాహంలో అంతా యెట్లా కొట్టుకొనిపోయారో అట్లా గే గోపాలకృష్ణయ్యగారుకూడా కొట్టుకొని పోయారు. ఈ వుద్యమంవల్ల అనేకులు బాగుపడ్డారు; ప్రాముఖ్యం సంపాదించారు. గోపాలకృష్ణయ్యగారు మాత్రం దీనిని స్వలాభానికి, స్వప్రయోజనానికి వినియోగపరుచుకొన్న వారు కారు. వారివల్ల వుద్యమానికి బలం కలిగింది గాని వుద్యమంవల్ల వారికి కలిగిన ప్రయోజనం లేదు. ఏ వుద్య మంలో ప్రవేశించినా వారు వెనుకనిలుచుండి కథను నడుపుతూవుంటారే గాని ముందుకురారు. వారి ఆలో చనకు, బుద్ధికి, శక్తికి తగిన పనేలేదు. జిల్లాబోర్డుయెన్ని

కలు వచ్చినా, శాసనసభయెన్నికలు వచ్చినా అవన్నీ నాలుగురోజుల ముచ్చటలు.

ఈమధ్య కొంతకాలంనుంచి గోపాలకృష్ణయ్యగారు తమదృష్టిని రాజకీయాల వైపునుంచి పారిశ్రామికాభివృద్ధి వైపుకు త్రిప్పడం మొదలుపెట్టినారు. వారు అపారమగు తమ శక్తిని, పలుకుబడిని దేనికి వినియోగించినప్పటికీ అది ఫలప్రదమవడంలో వింత యేమీలేదు. వుయ్యూరులోని పంచదార యంత్రాలయం వారి మూలముననే బయలు దేరింది. మనదేశమునందలి పెద్ద పంచదార యంత్ర శాలలలో యిదివొకటి. కాని యంత్రాలయ నిర్వాహకత్వం మనకు క్రొత్తగావుండడంచేత ధక్కాలు తినవలసి వస్తూవుంది.

రాజకీయంగా చూచినా, వ్యావసాయికంగా చూచినా, పారిశ్రామికంగా చూచినా గోపాలకృష్ణయ్య గారి చరిత్ర చాలా ఆకర్షణీయమయింది. ఆయన జమీందారు : అయినా రైతువేషం; ధనికుడు : అయినా మూడవక్లాసులో ప్రయాణం ; నాయకుడు : అయినా గ్రామజీవి. పైకి యెంతకఠినంగా కనుపించినా ఆంతరంగికంగా అంత వుపకారి. నిష్కల్మషుడు. ఆశ్రితపక్షపాతి.



శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు

## ఆనరబుల్ బులుసు సాంబమూర్తిగారు

సిల్కు సూట్లు వేసి, యే పెద్ద క్రిమినల్ కేసు వచ్చినా ఏదో ఒక వైపున వుండి జిల్లా అంతటా మోటారు సైకిలు మీద తిరుగుతూవుండే రోజులలో సాంబమూర్తిగారికి సంపాదనకూ, భోగానికీ లోటులేదు. గాంధీమహాత్ముని సహాయ నిరాకరణోద్యమం వచ్చి ఆ సూట్లను గీట్లను అవతల పార వేయించి కొల్లాయిగుడ్డ కట్టించి, చొక్కాయి అయినా లేకుండా బట్టకప్పించి, ఆంధ్ర దేశం యావత్తూ ఆమూలనుంచి యీ మూలదాకా త్రిప్పిత్రిప్పి ప్రజా ప్రబోధం చేయించింది. ఈ వుద్యమం వచ్చి వారి సంపాదనలో, భోగంలో, వస్త్రాలంకారంలో మార్పు కలిగించినట్టుగానే రైలుప్రయాణంలో జబర్దస్తీచేసే యూరపియనులకు ప్రతిజబర్దస్తీ చూపే పద్ధతినికూడా మార్చి శాంతం, నిగ్రహం, సహనం అలవరించింది.

దేశమంతటా తిరిగి ప్రచారంచేస్తూవున్న సమయంలో కాకినాడలో దేశీయమహాజనసభ వచ్చి వారికి చేతినిండా పనికల్పించింది. ఈ పనిచేస్తూవున్న సమయంలోనే చేతికందిన ఒక్కకొడుకూ చనిపోయినాడు. మనుష్యమాత్రుడికి కలిగే పెద్దదుఃఖాలలో యిది వొకటి.

అయినా వారు దానిని దిగమ్రింగివేశారు. ఈ రకపు మను
ష్యులలో మల్లాది రామకృష్ణచయనులుగారు ఒకరు;
రెండవవారు సాంబమూర్తిగారు. చయనులుగారి అల్లుడు
పోయినప్పుడు తక్కిన అందరూ కంటతడిపెట్టినారేకాని
చయనులుగారు మాత్రం చలింపనేలేదు. సాంబమూర్తి
గారికి కలిగిన ఆపదను తలచుకొని రాజోలుసభలో దేశ
భక్త కొండవెంకటప్పయ్యపంతులుగారు కంటతడిపెట్టి
నారు. "అంగవస్త్రధారి సాంబమూర్తిగారు దేశీయమహా
సభసేవలో మగ్నులై పుత్రవియోగదుఃఖాన్ని యావత్తూ
మరచిపోయినా"రని కన్నీరు నించింది శ్రీ సరోజినీదేవి.
శ్మశానఘట్టంలో హరిశ్చంద్రుడిలాగు సాంబమూర్తిగారు
ఆవిపత్సమయంలోకూడా దేశావసరకార్యాలు యెప్పటి
లాగానే చేసుకొనిపోతూవచ్చినారుగాని పుత్రవియోగ
దుఃఖాన్ని అణ్చుకొనియ్యలేదు. ఆయసధైర్యానికి నిద
ర్శనం యీ వొక్క కథే చాలును. కాని దీనినిమించింది
యింకొకటి వుంది. 1932-వ సంవత్సరంలో గాంధీమహా
త్ముడు అరెస్టయినవార్తవచ్చిన రోజున కాకినాడపురమంది
రంలో ఒక సభ యేర్పాటయింది. దానికి సాంబమూర్తి
గారు అధ్యక్షులు. సభ ప్రారంభమయిందో లేదో
పోలీసువారువచ్చి సాంబమూర్తిగారిని బాదడం మొదలు

పెట్టినారు. స్పృహతప్పి పడిపోయేవరకూ, తమచేతులు నొచ్చేవరకూ లాఠీయెత్తుతూనేవున్నారు. చివరకు చచ్చిపోయినా డనుకొని కొట్టడం మానివేశారు. ఇటువంటి దుర్భరకష్టసమయంలోకూడా సాంబమూర్తిగారు తమ శరీరం అప్పగించి వూరుకొన్నారుగాని పల్లెత్తుమాట అనలేదు. ఆ బాధంతా చూసేవాళ్లు అనుభవించారుగాని సాంబమూర్తిగారు చలించలేదు.

కాకినాడలో జాతీయపతాకాన్ని లాగివేయనీ, నాగపురంలో దానిని త్రొక్కివేయనీ, చెన్నపట్టణంలో నీలువిగ్రహంఅలజడి ప్రారంభంకానీ—యిటువంటివి యేవివచ్చినా ప్రతిఘటించడానికి ముందుకు దుమికేది, కష్టనష్టాల కన్నిటికీ సంతోషపూర్వకంగా స్వాగతమిచ్చేది సాంబమూర్తిగారొక్కరే. "వారికి దేశమే యిల్లు, కాంగ్రెసే గుడి, స్వరాజ్యమే మతం" అన్నారు ఒకరు. అది నిశ్చయం!

లాఠీదెబ్బలు తిని జెయిలులో కూర్చుండి, దారిద్ర్యాన్నివరించిన సాంబమూర్తిగారిని కాకినాడవారు తమ ప్రతినిధిగా యెన్నుకోవడంలో ఆధిక్యమేమీ లేదు. కాని శాసనాలుచేసే శాసనసభలో రాష్ట్రమంతటినుంచీవచ్చిన ప్రతినిధులచేత అధ్యక్షులుగా నియుక్తులై, కొల్లాయి,

పైబట్ట, మడిసంచీలతో సహా అధ్యక్షపీఠం అలంకరిం చిన సాంబమూర్తిగారి దృశ్యం నిజంగా చూడతగింది. ఒకప్పుడు లాఠీలతో సత్కరించిన పోలీసువారే యీగోచి పాతరాయనికి ఇప్పుడు అంగరక్షకులైనారు. "సాంబమూర్తి గారు సర్వస్వమూ దేశాని కర్పించిన త్యాగమూర్తి. యీ సభయొక్క గౌరవము, అధికారము వారి హస్తగత మైంది." అని ప్రభుత్వప్రధానమంత్రిగా రన్నారు. "నిర్భ యుడు, స్వతంత్రుడు, ఉత్తముడు" అని ప్రతిపక్షనాయ కుడు అభినందించాడు.

ఆధునిక రాజకీయకల్లోలంలో సంపాదన మాను కొని దారిద్ర్యంవల్ల కలిగే కష్టాలన్నీ పడ్డారు సాంబ మూర్తిగారు. గాంధీమహాత్ముడు కాకినాడకు వచ్చినప్పుడు స్త్రీలంతా తమ ఆభరణాలన్నీ తీసి కానుకలుగా సమర్పి స్తున్నారు. సాంబమూర్తిగారి భార్యకు గాజులుతప్ప మరే మీలేవు. ఆమె సిగ్గుపడి నిలుచుకొనివుంటే " ఓసి పిచ్చి దానా! ఆ వున్న రెండుగాజులూ యిచ్చి వేయకూడదూ" అని ధైర్యంచెప్పిన మహోదారుడు సాంబమూర్తి; ఆధు నిక రాజకీయ జీవితాన్ని పుష్టిపరచిన రాజకీయభిక్షువు; అన్నికష్టాలనూ ఓర్పుతో భరించే మహామేరువు.



శ్రీ ఈడుపుగంటి రాఘవేంద్రరావుగారు

## శ్రీ టంగుటూరు ప్రకాశంపంతులుగారు

మనదేశంలో 1920-వ సంవత్సరంలో బయలు దేరిన సహాయనిరాకరణోద్యమం మన రాజకీయసాంఘికజీవనంలో గొప్ప పరివర్తనాన్ని కలిగించింది. విద్యావంతులు స్వాభిమానాన్ని వదలి సామాన్యులతో కలిసి పనిచేయడానికి ప్రారంభించారు. నగరవాసులు గ్రామ సమస్యలమీదనూ, గ్రామపునర్నిర్మాణంమీదనూ శ్రద్ధ వహించి ఆ సంబంధమైన కృషిలో మగ్నులైనారు. ఈ సమయంలో బయలుదేరిన నిరంకుశపద్ధతులకూ, కష్ట పరంపరలకూ తలవొగ్గి, ఒక అపూర్వస్వాతంత్ర్య పిపాసను పుట్టించి ఆత్మసమర్పణ గావించిన ప్రముఖులలో టంగుటూరు ప్రకాశంపంతులుగారొకరు.

ప్రకాశంపంతులుగారు నూతనోద్యమానికి ఆహుతులైనారుగాని దీనివల్ల వారికి కలిగిన ప్రాముఖ్యం అంతగా ఏమీలేదు. రాజమహేంద్రవరంలో న్యాయవాదులుగావున్న రోజులలోనే కొమ్ములుతిరిగిన నిడమర్తివారు, న్యాపతివారు, మోచర్లవారు, నేతివారు మొదలైనే హేమాహేమీలను డీకొని నగరపాలనసభకు అధ్యక్షులై ప్రసిద్ధిపొందినారు. న్యాయవాదివృత్తిలో

వుండి సమృద్ధిగా యశోధన సముపార్జన చేసుకుంటూ వున్నప్పటికీ బారిష్టరై తమ హోదానూ, ప్రయోజనాన్నీ విస్తరింపజేసుకోనే వుద్దేశ్యంతో ఇంగ్లాండుకు ప్రయాణం కట్టినారు.

బారిష్టరుపట్టము పొందివచ్చినతరువాత తమ నివాసాన్ని రాజమండ్రినుండి చెన్నపట్టణానికి మార్చుకొన్నారు. అప్పటికి చెన్నపురిలో యెన్నదగిన ఆంధ్ర బారిష్టరే లేడు. ఆంధ్రుల పలుకుబడి, సాంఘికరాజకీయజీవనం బాల్యావస్థలోనే వుంటూవచ్చినాయి. ప్రకాశంగారు న్యాయశాస్త్రపాండిత్యంలో అఖండులు. ప్రతిపక్షుల బలహీనపు పట్టులన్నీ యేరి నిర్దాక్షిణ్యంగా ఖండించే గడుసరి. ఈ గుణాలవల్ల వారు అనతికాలంలోనే సుప్రసిద్ధ న్యాయవాదులుగా ప్రసిద్ధిపొందగలిగారు; లక్షలు ఆర్జించారు; భోగభాగ్యా లనుభవించారు.

ఇంతలో గాంధీమహాత్ముని సహాయనిరాకరణోద్యమం వచ్చింది. ప్రకాశం పంతులుగారు యీా వుద్యమంలో దుమికి రాజకీయ పరివ్రాజకులుగా మారిపోయిన యితిహాసంకంటె సంతాపకరమైన కథనం యింకొకటి వుండబోదు. ప్రకాశంగారిలో వ్యావహారిక నిదానం, నిర్మాణకౌశల్యం లేవంటారు కొందరు. నిశ్చయానికి

వ్యావహారికనిదానం కలిగి ఆలోచిస్తూ కూచొనివుంటే, వేలకువేలు గడిస్తూవుండే రోజులలో ఆ బారిష్టరుగాను పారవేయకుండా, ఉదకమండల శీతలవాయువులు పీలుస్తూ, స్పెన్సరువిందులు ఆరగిస్తూ, ఒకటో తరగతి బండ్లలో ప్రయాణంచేస్తూ వుండేవారేనేమో! కాస్త వుద్రేకమూ, ఆవేశమూ లేక మంచుగడ్డలాగ బిగుసుకొని కూర్చునివుండే స్వభావమే అయితే "న్యాయవాదులారా! లెండి! కోర్టులనుండి రండి!" అనే శంఖారావం నాగపురంలోనుండి బయలుదేరినప్పుడు వినిపించుకొనేవారే కారేమో! గుంటూరుమండల పన్నుల నిరాకరణం, గురుబాదా అకాలీసత్యాగ్రహం, సైమను కమీషను బహిష్కారం, ఉప్పుసత్యాగ్రహం, కృష్ణాగోదావరి రీసెటిల్మెంటు ఆందోళనం—ఈ విషమ విషయాలలో చిక్కుకొనివుండేవారే కారేమో!

ప్రకాశంగారి తత్వంలో ముందుచూపేగాని వెనుకచూపులేదు. పందెపుగుఱ్ఱంలాగా అడ్డాలన్నీ దూకవలసిందేగాని వాటిని లెక్కించడంలేదు. ఈ సత్యాగ్రహ అగ్నిగుండంలో ఆయన బుద్ధిపూర్వకంగానే బలిదానమైనారు. కల్మషంలేని జీవి. ఆపత్కాలంలో ప్రాణం యిచ్చే మిత్రుడు. లుబ్ధత్వం, నీచత్వం, తంత్రం మొర

గని వ్యక్తి. ఐరావతంలాగ స్వరాజ్యపత్రిక తమ ద్రవ్యాన్నీ, ఇతరుల ద్రవ్యాన్నీ మ్రింగనీ, శాసన తిర స్కారసమయంలో తమ పుత్రులు మరణావస్థలో వుం డనీ, తాము గడించిన లక్షలన్నీ హరించుకొనిపోయి సంసారం గడవడమే దుర్లభంకానీ, చివరకు అర్ధాంగి మరణావస్థలో వుండగా ఆమెకు వుపచారంచేసేందుకు కూడా వ్యవధి లేకపోనీ—ఆ మనస్సుకు చలనం అంటూ లేదు ; ధైర్యం వదలడమంటూ లేదు.

ఆంధ్రదేశంలో కాంగ్రెసుకు బలం చేకూర్చడానికి, ఎన్నికలలో ప్రబోధంచేయడానికిప్రకాశంగారివలెఎవరూ కృషిచేయలేదు ; కష్టపడలేదు ; నష్టపడలేదు. మోటా రులో భోజనం, మోటారులో పడక. రాత్రింబగళ్లు ఆంధ్రదేశంలో సంచారంచేసి, కాంగ్రెసుసందేశాన్ని మారుమూలల పల్లెలలోకికూడా అందజేసిన దేశభక్తుడు ప్రకాశంగారు. స్వరాజ్యపత్రిక ఎంత ద్రవ్యాన్ని హరిం చినా, ఆ మూలంగా ఆయన దారిద్ర్యాన్ని వరించవలసి వచ్చినా, దేశంలో జరిపిన ప్రచారం, ఆ ప్రచారంమూలం గా లభించిన దిగ్విజయం చాలు—ఆవ్యయానికీ, నష్టానికీ పరిహారంమాట యెత్తితే. చిన్నలు మొదలు పెద్దలవరకూ వ్యాపించిపోయిన జస్టిసు పార్టీ కులతత్వాన్నీ, దేశభక్తు

లను క్షోభింపజేసిన ఆ పార్టీ నిర్బంధవిధానాన్ని పెక లించివేయడానికై స్వరాజ్యపత్రిక చేసినంత కృషి ఆంధ్ర దేశంలో మరేపత్రికా చేయలేదు. ఆ పత్రికవల్లా, దాని ప్రచారంవల్లా దేశంలో ఒక అపూర్వమైన మానసికవిప్ల వం వుత్పన్నమై, ప్రజలు తమ బలాన్ని గ్రహించి జస్టిసు ప్రభుత్వాన్ని వ్రేళ్లతో పెకల్చి కూలద్రోసినారు.

ఛేర్మన్ ప్రకాశంగా, బారిష్టరు ప్రకాశంగా— ద్వివిధావస్థలలోనూ భోగం అనుభవిస్తూవుండిన ఆ నాటి వ్యక్తిని చూసి దేశభక్తుడై, విరాగియై, సర్వస్వమూ దేశార్పణచేసి, చిరిగిన చొక్కాయవేసుకొని, మాసిన ఖద్దరుశాలువను కప్పుకొని, వుంగటాలు తెగిన చెప్పులు తొడుగుకొని, శివునివలె దారిద్ర్యహాలాహలం దిగమ్రింగి, పాదచారియైన ఈ నాటి నూతన పరిణామవ్యక్తిని చూస్తే విచారం, సంతోషం, ఉత్సాహం, సానుతాపం పొర్లి వస్తూవుంటాయి. నిలుచున్నచోట నిలవక, కూర్చున్న చోట కూర్చోక, పడుకున్నచోట పడుకోక, వుపన్యసిం చినచోట వుపన్యసింపక, చేసినచోట సభచేయక పది హేనేళ్లు శ్రమపడ్డ మూర్తి కండ్లయెదుట కనిపిస్తుంది. పోలీసుకమీషనరు కన్నింగుహాము వ్యూహానికి నదురూ

బెదురూ లేక గుండెలొడ్డిన మహాసాహసికవ్యక్తి ప్రత్యక్ష
మౌతుంది.

ఎన్నో ఆటంకాలను త్రోసుకొని, మితిలేనికష్టాలను అనుభవించిన ప్రకాశంపంతులుగారు మంత్రిత్వం వహించినా వారికి సహజమైన స్వాతంత్ర్యేచ్ఛ, వారి ప్రతి రక్తకణంలోనూ జీర్ణించిపోయిన ప్రజానురాగం నేటికీ వారి ప్రతికార్యంలోనూ, ప్రతి వుపన్యాసంలోనూ ప్రతి ఫలిస్తూనే వున్నాయి. రైతుహక్కులను కాపాడేందుకు వారు ప్రవేశపెట్టిన బిల్లే చాలు—వారి సేవను, వారి దేశభక్తిని, వారి ప్రజాభిమానాన్ని తరతరాలవారికీ దివ్య జ్యోతిలాగ చూపుతూవుండడానికి.

## శ్రీ వి. వి. గిరిగారు

దేశాన్నియావత్తూ వూగించిన సత్యాగ్రహసమయంలో గిరిగారు బరంపురంజెయిలులో తమశిక్షను పూర్తిచేసుకొని బయటకువచ్చే రోజది. గిరిగారు చిరునవ్వునవ్వుతూ, జెయిలుగుమ్మం దాటి యివతల అడుగు పెట్టుతూపెట్టుతూ ఉన్నారు. ఇంతలో కాంగ్రెసుజండాలను,సంగీతవాద్యాలను తీసుకొని,ఖరగపురంనుంచి వచ్చిన కార్మికబృందం బయటనిలబడి, దేశీయగీతాలను పాడుతూ "కాంగ్రెసుకు జై! గిరిమహారాజుకు జై!" అను సంతోషధ్వానాలు చేస్తూ "ఇంతటినుండి మీరు మా నాయకులు. మా సంఘానికి వుపాధ్యక్షులు" అనిచెప్పి, వారికంఠాన్ని పూలదండలతో కప్పివేశారు. గిరిగారు తమ జీవితాన్ని భారతీయకార్మికునికి అంకితంచేయడానికదే ప్రారంభం.

గిరిగారు బారిష్టరు. బరంపురంలో సుప్రసిద్ధ న్యాయవాదులగు వెంకటజోగయ్యపంతులుగారి పుత్రులు. పంతులుగారు పెద్దలవుతూవుండడంచేత తమ స్థానంలో గిరిగారిని కూర్చోపెట్టి, తమ భారాన్ని ఆయనమీద వేద్దామనుకొని అయిర్లాండుకు పంపి బారిష్టరును చేశా

రు. అయితే, గిరిగారి ధ్యాస బారిష్టరుగానుమీద లేదు; సంపాదనమీదనూ లేదు. కార్మిక సేవ మీద మనసు పెట్టుకొని, కోర్టుకు పోవడం రావడం మొదలుపెట్టినారు. గిరిగారి తత్వం కఠినమైందికాదు. జాలిగుండె. బీదలంటే దయ. ఇందువల్ల వారి కోర్టుఫయిలులో ఫీజును తెచ్చిన కేసులకంటె ప్లీడరును పెట్టుకోలేనట్టివారి, ప్రజాసేవ పేరున కేసులలో యిరుక్కొన్నట్టివారి కేసులే అధికంగా ఉంటూవచ్చాయి. ఎక్కడ రంగూను, ఎక్కడ బరంపురం? బర్మాశాసనసభలో కార్మికప్రతినిధిగావుండిన నేను రంగూనుపోర్టుట్రస్టు ట్రాఫిక్కు మేనేజరు, అసిస్టెంటు మేనేజర్లు (యిద్దరూ యూరోపియనులే) పోర్టు లేబరు కంట్రాక్టరుదగ్గర లంచాలు పుచ్చుకొంటూ వుండిరని ఆరోపణచేసినందుకై, నాపైన పెద్ద అభియోగంతేబడి నేను హైకోర్టుసెషన్సుకు పంపబడినప్పుడు ఈ సంగతిని గిరిగారు యెక్కడనోవిని, తమ సొంతఖర్చుమీద అమాంతంగా రంగూనులో వాలినారు. నన్ను ఆ సుడిగుండంనుండి బయటకు లాగేవరకూ రంగూనునుండి కదలలేదు. వారి ఔదార్యాన్ని తెలపడానికి, వారు తమ బారిష్టరుపదవి యితరులకు వుపయోగపడేటట్టుచేసిన

దానికి రంగూనునగరాన్ని కలవరపరచిన ఈ కేసు ఒక్కటే చాలు నిదర్శనం.

ఖరగపురం కార్మికుల ఆహ్వానం బారిష్టరు గిరిగారిని కార్మికయోధునిగా మార్చి, వారి జీవితంలో ఒక క్రొత్త అధ్యాయాన్ని ప్రారంభంచేసింది. కార్మికనాయకత్వం యెంత ప్రాముఖ్యాన్ని కలిగిస్తుందో అంత అపాయంకూడా దానిని వెన్నంటే నడుస్తూవుంటుంది. గిరిగారి నిర్మలమైన మనస్సు, దూరదృష్టి, అయిర్లాండులో సంపాదించిన అనుభవం యివి అప్పటప్పటి అపాయాలను తప్పిస్తూవుండినా, బహుప్రమాదపు ఘట్టాలను యెదుర్కోక తప్పిందికాదు. ఒకసారి ఖరగపురం వర్కుషాపులో పెద్దసమ్మె ప్రారంభమయింది. ఇంకోసారి బెంగాలునాగపురం రైల్వేఅంతటా సమ్మె లేచింది. మొదటిదానిలో 12,000 మంది, రెండవదానిలో 40,000 మందిన్ని యిరుక్కొని, ఆ సమ్మెలు కొన్ని నెలలపాటు సాగి, బహువిషమపరిస్థితు లేర్పడినప్పటికీ గిరిగారు ఆ సమ్మెలను మిక్కిలి జాగ్రతగాను, నిరపాయంగాను నిర్వహించి, కొన్ని ప్రయోజనాలనుసహా సంపాదింపగలిగారు. వారు నాగపురంరైల్వేయందున్ను, మద్రాసు

దక్షిణమహారాష్ట్రరైల్వేయందున్న సమ్మెలను నడపిం
చిన అధ్యాయం చరిత్రాత్మకమయింది.

ఈ రీతిగా రైల్వే వుద్యోగస్థుల, రైల్వే పనివాండ్ర కష్టసుఖాలను జాగ్రతగా కనిపెట్టుతూవచ్చిన గిరిగారు అఖిలభారతరైల్వేవుద్యోగీయుల సంఘానికి 10,12 సంవత్సరాలు కార్యదర్శిగానో, ప్రెసిడెంటుగానోవుండి, అమోఘమగు సేవను గావించి, అఖిలభారతకార్మిక నాయకులుగా ప్రసిద్ధిపొందారు. దేశంలోని రైల్వేలన్నిటి యందున్నూ వుద్యోగస్థుల సంఖ్యను తగ్గించడానికి రైల్వేబోర్డువారు సంకల్పించుకొన్నప్పుడు దేశమంతటా వ్యాపించివున్న రైల్వేవుద్యోగస్థులందరున్నూ సమ్మె కట్ట డానికి సంకల్పించుకొన్నప్పుడు గిరిగారి ప్రయత్నం వల్లను, పట్టువల్లను ఆ గండం రైల్వేబోర్డుకు తప్పడం, వుద్యోగస్థుల యిబ్బందులను విచారించుటకు ఒక కమిటీ యేర్పాటుకావడం, చివరకు వుద్యోగస్థుల సంఖ్యను తగ్గించే ప్రయత్నంయొక్క తీవ్రత తగ్గడం జరిగింది.

గిరిగారు కార్మికనాయకులుగా వహింపవలసిన గౌరవపదవులను చాలాభాగం వహించారు. చెన్నపురిలో జరిగిన అఖిలభారతకార్మికసభకు అధ్యక్షులు, జెనీవా లోని అంతర్జాతీయకార్మికసభకు ప్రతినిధులు, రెండవ

రౌండుటేబిలుసభలో కార్మికప్రతినిధులు, భారతీయ కేంద్రశాసనసభ్యులు. వారు ఏ పదవి వహించినప్పటికీ కార్మికుని క్షేమాన్నే మనసులో పెట్టుకొని వ్యవహరించే నాయకుడు. కేంద్రశాసనసభ్యులుగా వుండినంత కాలమున్నూ జోషీగారూ వీరూ ఏకమై కార్మిక సమస్యకు చాలా ప్రాముఖ్యాన్నీ, బలాన్నీ కలిగించారు. కార్మికుల ఆశయాలను, కష్టాలను నిర్భయంగా చర్చిస్తూవచ్చినారు. ఆ రోజులలో ఢిల్లీలోని ఫిరోజిషారోడ్డును ఆనుకొనియుండిన గిరిగారి బసకు పోయిచూస్తే పైపు యంత్రానికీ, వారి కార్యదర్శికీ, వారికీ తీరికే కనుపించేది కాదు. వారి కార్యాలయంలో ఇండియాలోని రైల్వే వుద్యోగస్థుల కష్టాలన్నీ ప్రత్యక్షంగా కనుపిస్తూవుండేవి. గ్రామపునరుద్ధరణ, నిరుద్యోగసమస్య, కార్మికుల జరిమానాలు, గనులలో పనిచేసేవారి గంటల పరిమితిని తగ్గించడం, ఓడలలో, తోటలలో, గనులలో పనిచేసే వారి కూలిని సకాలంలో యివ్వడం యీలాటి వ్యవహారాలనుగురించి చాలా చక్కని సలహాలను వారు ప్రభుత్వంవారికి యిచ్చివున్నారు. వీటి అన్నిటికంటెను ముఖ్యమయింది పోస్టాఫీసువారి గాథ. ఈ విషయంలో కమిటీ వారుచేసిన సిఫారసులను అమలులోపెట్టడానికి పూర్వం

ఆయాసంఘాలను సంప్రదించిగాని ఏమీచేయమని సర్ ప్రాంకునాయిసుగారిని ఒప్పించారు. వారి కార్మికవ్యవహార పరిజ్ఞానం అసెంబ్లీ చర్చలకు మెరుగుపెట్టి, ప్రాజ్ఞులనే కీర్తిని కలిగించింది.

మొన్నటి చెన్నపురి శాసనసభ యెన్నికలలో వారు బొబ్బిలిరాజాగారికి ప్రత్యర్థిగా నిలబడి అఖండవిజయాన్ని సంపాదించి, పరిశ్రమలకు కార్మిక వ్యవహారాలకు మంత్రులుగా నియుక్తులైనారు. గిరిగారివంటి సుప్రసిద్ధులు మంత్రిగా ఏర్పడడం కార్మికుల అదృష్టం. ఇంతటి అభిమానం, సానుభూతి, పరోపకారిత్వం, అనుభవం గలవారు ఈ రాష్ట్రంలో మరియొకరు లేరు. మంత్రిపదవిలో వున్నరోజులలోకూడా యెప్పటిలాగునసే కార్మికులకు దర్శనమిస్తూ, వారికష్టసుఖాలను స్వయంగా కనుక్కొంటూ, వీలయినంతవరకు సహాయంచేస్తూ కార్మికవర్గంలో ధైర్యాన్నీ, నిర్భీతినీ, ఆత్మగౌరవాన్నీ వృద్ధిపరిచారు.

కాంగ్రెసుపక్షంవారు రాజ్యాధికారాన్ని వహించిన రెండుసంవత్సరాలలోను కార్మికులు తమ కష్టాలను ప్రభుత్వంవారికి తెలుపుకోవడానికీ, వాటిని సవరించుకోవడానికీ బయలుదేరిన వుత్సాహం యిదివర కెప్పుడూ బయలుదేరలేదు. ప్రతికార్మికుడూ "యీ ప్రభు

త్వంనాది, యీ మంత్రి నావాడు'' అనే ధైర్యంతో పొంగి పోయినాడు. ఈ అపూర్వస్వాతంత్ర్యేచ్ఛ సమ్మెలమీద సమ్మెలను, వుత్సవాలమీద వుత్సవాలను పుట్టిస్తూ నూతనోద్వేగాన్ని రగులజేసింది. కార్మికహృదయం తెలియని యింకొకరు యీ మంత్రిస్థానంలో వుండివుంటే ఏమి జరిగేదోగాని, గిరిగారు కార్మికులను సరాసరి తమ కార్యస్థానానికే రప్పించి, తమకు సహజమైన చిరునవ్వుతో "చేతనైన సహాయంచేస్తాను. వెళ్లండి'' అనిచెప్పి పంపివేసేవారు. క్లిష్టపరిస్థితులలో ప్రత్యేకవిచారణాధికారిని నియమించి, వారి శిఫారసులను అమలులోపెట్టడానికై ప్రయత్నిస్తుండేవారు.

గిరిగారు మంత్రిగా ఏర్పడినతర్వాత కూలిరేటు పెరిగింది. అక్రమంగా తీసివేయబడ్డవారికి మళ్లీ పనులియ్యబడినాయి. గంటలపరిమితి తగ్గింపబడింది. సెలవులు హెచ్చినాయి. ఈలాటి క్రొత్త సదుపాయాలను కార్మికులకు లభింపజేయడమే కాకుండా నిరుద్యోగులగు కార్మికులకు పనిపాటులను కల్పించే వుద్దేశంతో కాంగ్రెసువారు చేస్తూవచ్చిన ప్రయత్నంలో చాలా కృషిచేశారు.

"కార్మికులారా, లెండి! మీరంతా ఒకటికండి! మీ జీవిత నియమాన్ని వృద్ధిపరచుకోండి! ఈప్రభుత్వం

మీది. మేము మీ మనుష్యులం " అనే శంఖారావాన్ని ఆనరబుల్ బారిష్టరుగిరిగారు నలుదిశలా పూరిస్తూవుండినంతగా యిదివరకు ఏ నాయకుడూ పూరించివుండలేదు. కార్మికమంత్రిత్వం కార్మికులదే అనే విశ్వాసాన్ని యింతకు పూర్వం యే మంత్రియూ కలిగించివుండలేదు.

---



శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు

## శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు

బక్క పలచటి శరీరం, ఆరడుగుల పొడుగు, ఆలోచనా ముద్రిత నేత్రాలు, చిరునవ్వు తొలుకాడే ముఖం, తెల్లని ఖద్దరుబట్టలు—వీటి స్ఫురణతో బెజవాడ గోపాల రెడ్డిగారిని యెంత పెద్దగుంపులోనైనా సరే, యే వుత్సవ సమూహంలోనైనా సరే తేలికగా పోల్చుకోవచ్చు.

పుట్టింది ధనాఢ్యుల గృహంలో, విద్యాభ్యాసం చేసింది జాతీయభావాలు రేకెత్తించి ప్రజాభిమానులనుగా చేసే కోపల్లె హనుమంతరావుగారి ఆంధ్రజాతీయ కళాశాలలోనూ, పిమ్మట రవీంద్రనాథ ఠాకూరు మహాశయుని శాంతి నికేతనంలోనూ. గోపాలరెడ్డిగారు తమ విద్యను ముగించుకొన్నతర్వాత తమ కుటుంబలాభానికి గాని, స్వప్రయోజనానికిగాని వినియోగపడక, అనేక కష్ట నష్టాలు తెచ్చిపెట్టే గాంధీమహాత్ముని దేశీయ మహాసభాకార్యక్రమంలోకి వురికినారు. అప్పటి కింకా యిరవైయేళ్లు నిండినయ్యో లేదో. సహాయనిరాకరణోద్యమం ఆంధ్రదేశంలో తలయెత్తడంతోనే ఒకపూట తినీతినకుండాను, వెళ్లిన వూరికి మళ్లీ వెళ్లకుండాను గోపాలరెడ్డిగారు తమ మండలంలో కాంగ్రెసు పరివ్రాజ

కులుగా తిరిగారు. కాంగ్రెసుకమిటీలలో, రైతుసంఘా లలో, రాజకీయసమావేశాలలో అక్కడా యిక్కడా యెక్కడ చూచినా యువకులైన రెడ్డిగారే కనుపిస్తూ వుండేవారు ; ఉపన్యాసాలు చేస్తూవుండేవారు.

నెల్లూరుమండలం దేశానికి సమర్పించిన ధీరు లలో గోపాలరెడ్డిగారికి ప్రథమస్థానం ఇవ్వవలసివుం టుంది. ఏదో ప్రతిష్ఠనుకోరి నాయకత్వాన్ని అభిలషించి ప్రయోజనాన్ని మనస్సులో పెట్టుకొని యీ వుద్య మంలో ప్రవేశించినవారు కారు వారు. కారాగృహ నివాసాన్ని, కష్టభాజనమైన అందలి నిర్బంధజీవితాన్ని ఏధనికుడూ కోరడు, ఏ సుఖజీవీ అర్థింపడు. కాని దేశ సేవాభిలాషియైన గోపాలరెడ్డిగారు ఒక్కసారికాదు, రెండుసార్లు తమ జీవితాన్ని కారాగారంలో సంతోష పూర్వకంగా గడిపి, దేశాభిమానానికి కావలసిన అగ్ని పరీక్ష యిచ్చినారు.

గోపాలరెడ్డిగారిని యెరిగివున్నవాళ్లంతా వారికి ఉద్యోగాపేక్ష యే కోశంలోనూ లేదని యెరిగివున్నారు. రాజగోపాలాచార్యులవారి మంత్రివర్గంలో గోపాలరెడ్డి గారివంటి యువకులు—ధనికులు మంత్రిపదవికి నియుక్తులు కావడమే వారిప్రతిభకు ప్రబలతార్కాణం. రాజగోపా

లాచార్యులవారి అగ్నిపరీక్షకునిల్వగల్గడంలో యువకులైన గోపాలరెడ్డిగారి యోగ్యతకూ, శీలానికీ మెరుగువచ్చింది. ద్రవ్యాపేక్షలేని యువకమంత్రికాలంలో మన స్థానిక సంస్థలు ప్రజోపయోగకరంగా మారి, మన పట్టణాలూ, పల్లెలూ సుఖజీవనానికి ఆటపట్టులయ్యే దారియేర్పడింది.

---

## శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు

భూస్వాములు. ప్రజాహిత జీవులు. నెల్లూరు మండలంలోని అనేక సంస్థలతోనూ, వుద్యమాలతోనూ సంబంధం కలిగి, ప్రజాహితజీవితాన్ని పెంచి, బలపరచి, నెల్లూరును ముందుకు లాగుకొనివచ్చినవారిలో వొకరు. మండలవిద్యాభివృద్ధిసంఘానికీ, జిల్లాబోర్డుకూ అధ్యక్షస్థానం వహించి, విద్యాభివృద్ధికిన్ని, గ్రామవాసుల సౌకర్యాలకొరకున్ను చాలా పాటుపడిన ప్రజాభిమాని. మెట్టూరుప్రాజెక్టు, నేతపరిశ్రమలకు సంబంధించిన కమిటీలలోనూ, గోదావరి, కృష్ణాజిల్లాలలోని ప్రజల ఆర్థిక విచారణసంఘంలోనూ సభ్యులుగా వుండి తమ అనుభవాన్ని, జ్ఞానాన్ని ప్రజలకొరకై ధారాళంగా వినియోగించిన సేవాభిలాషి.

నెల్లూరుమండల ప్రజలపక్షాన వారు నాలుగు పర్యాయాలు శాసనసభకు యెన్నుకోబడినారు. శాసనసభవారు ఒకసారి వారిని తమ అధ్యక్షునిగా యెన్నుకొని తమ విశ్వాసాన్ని, గౌరవభావాన్ని విశదపరచినారు. ఆనరబుల్ రామచంద్రారెడ్డిగారు తాము శాసనసభాధ్యక్షులుగా వుండినంతకాలమున్ను నిష్పాక్షికమగు వుత్తరువుల నిస్తూ, ఆంధ్రుల ప్రతిష్ఠను విస్తరింపజేస్తూ స్వతంత్రవర్తను లనే కీర్తిని సమృద్ధిగా గడించుకొన్నారు.

## శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారు

కాళేశ్వరరావుపంతులుగారు పేరుమోసిన న్యాయవాదులు. బెజవాడన్యాయవాదులకు నాయకులు. చిన్నలూ పెద్దలూ విశేషంగాగల సంసారం. అతిథి అభ్యాగతులకు విరామం లేదు. ఇల్లు ధర్మసత్రం. ఊరిలో ఏ చందా వచ్చినా వారిదే పెద్దపద్దు. "పంతులుగారిని చూస్తే వూరికే పంపరులే" అనే ధైర్యం అందరికీ కలిగింది. ఈ లాంటి స్థితిలో గాంధీమహాత్ముని సహాయనిరాకరణోద్యమం వచ్చింది. ఏమి తోచిందో, పంతులుగారు బంగారపుగనిలాగునవున్న ప్లీడరుప్రాక్టీసు మానుకొన్నారు. గాంధీమహాత్ముడు కట్టిన మోళీ సంపాదన మానుకోవడంతోనూ, ప్రచారంతోనూ తీరిపోతే కొంత నయమే. కాని ప్రభుత్వంవారి కారాగారంలో విశ్రమించేవరకూ దీనికి శాంతే లేదు. అందరికివలెనే కాళేశ్వరరావుగారికి కూడా కారాగారం విశ్రాంతిమందిరమైంది. ఒకసారి గాదు, నాలుగుసార్లు వెళ్లడం తిరిగిరావడం జరిగింది. కాళేశ్వరరావుగారు అసలు ఆరోగ్యమైన మనిషి కాదు. ఎంత ఆర్జించినా నిలవచేసే మనిషికూడా కాదు. అందువల్ల జెయిలునుంచి విడుదలై యింటికి చేరుకొన్నతర్వాత ఎంత

నలిగిపోవాలో అంతా నలిగిపోయారు. ఆర్థికసంబంధమైన కష్టాలు ఎన్ని రావాలో అన్నీవచ్చినాయి. ఎంత కష్టపడాలో అంతా కష్టపడ్డారు. కాని కాశేశ్వరరావుగారు మాత్రం చలించలేదు, మారలేదు.

కాశేశ్వరరావుగారు మంచి వుపన్యాసకులు. వారు దేనినిగురించి మాట్లాడినా తెలియకపోవడమంటూ వుండదు. వారి వుపన్యాసధోరణి అంత మార్దవంగానూ, అంత సులభంగానూ వుంటుంది. వ్రాతలో ఆరితేరిన చెయ్యి. టర్కీనిగురించి ఒక పుస్తకం, చీనానుగురించి ఒక పుస్తకం, రెండు ప్రాచ్యరాజ్యాంగ సంబంధమైన పుస్తకాలు రచించారు. ఉపాయాలలో పెట్టింది పేరు. రాజనీతిలో చాణక్యుడు. ఇక ఆలోచనలో కూసంవిడిచిన పాము. ఇదిగాక హోమ్‌రూలు వుద్యమంకోటకూ, ఆంధ్రోద్యమంకోటకూ మొదటినుంచిన్నీ కృషిచేసిన స్వదేశాభిమాని. విశాఖపట్టణంలో జరిగిన ఆంధ్రరాష్ట్రీయసభకు అధ్యక్షులు. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘానికి కొన్నాళ్లుప్రధాన కార్యదర్శి. ఆంధ్రవిశ్వవిద్యాలయసభ్యులు. హరిజన బాంధవులు.

కాశేశ్వరరావుగారు బెజవాడ మునిసిపల్ ఛేర్‌మనుగా వుండి బస్తీఅభివృద్ధికోసం చాలా పాటుపడ్డారు.

విద్యుద్దీపాలు, ఉద్యానవనాలు, మురుగునీటి వసతులు, ప్రాథమిక విద్యాభివృద్ధి—యీలాంటి సదుపాయాలూ, మార్పులూ యెన్నో వారికాలంలోనే జరిగాయి. శాసనోల్లంఘనసమయంలో శాసనసభ్యత్వాన్ని వదలి కారాగారాన్ని వరించిన ధైర్యశాలి. మొన్నటి ఎన్నికలలో మళ్లీ దిగ్విజయంపొంది పంతులుగారు ప్రధాన మంత్రిగారి పార్లమెంటరీ ప్రధానకార్యదర్శిగా నియుక్తులయిరి. అందరికీ అందుబాటు మనిషి. భాషాభిమాని. ఉపకారి. సాంఘికజీవి.

———

## ఆయుర్వేదమార్తాండ, వైద్యరత్న, పండిత
## డి. గోపాలాచార్యులుగారు

ఆచారప్పేట వీధి: ఆయుర్వేదాశ్రమం. కొంచెం పొట్టి, కాస్తస్థూలమైన ఆకారం. మోకాళ్లుదిగిన పెద్ద పట్టు కోటు, జరీపోగులు వేసిన మస్లిన్ తలగుడ్డ, బ్రహ్మతేజస్సును ప్రతిఫలింప జేస్తూవున్న ముఖం. శాంతమైన చూపులు, ఋషి సంప్రదాయాన్ని సూచించే పెద్దగెడ్డం— యీలాటి లక్షణాలున్న మహాపురుషులొకరు బల్లముందు కూరుచుండి ఏవో మందులకు సంబంధించిన చీట్లను ఆడువారికి, మగవారికి, పిల్లలకూ వ్రాసియిస్తూ, అందరి క్షేమాన్నీ విచారిస్తూ, ధైర్యపుమాటలు చెప్పతూ, చిరునవ్వుతో పంపివేస్తూ వున్నారు. వచ్చేవారువస్తున్నారు, వెళ్లేవారు వెళ్లుతున్నారు. తెంపులేదు. ఆ బల్లకు కొంచెంఅవతల ఏవో ఓషధులు రాసులురాసులుగా పడివున్నాయి. రవంత వెనక్కుపోతే పెద్దపెద్ద యిత్తడికాగులలో ఏవో ద్రావకాలు కాగుతున్నాయి. స్త్రీలు పంక్తులుపంక్తులుగా కూరుచుండి కల్వాలమీద మందులను నూరుతున్నారు. ఏ ప్రక్క చూచినా వ్యాధి నిర్మూలనానికీ, ఆరోగ్యాభివృద్ధికీ జరుగుతున్న కోలాహలమే! సుమారు పాతిక



కీ. శే ఆయుర్వేద మార్తాండ వైద్యరత్న
పండిత డి. గోపాలాచార్యులుగారు

సంవత్సరాలు ఆంధ్రదేశానికే కాదు, భారతవర్షం అంత టికున్నూ ఒకనూతన సందేశాన్ని యిచ్చి, ఒక నూతన ఉత్సాహాన్ని కల్పించి, జీర్ణమైన ఆయుర్వేదాన్ని వుద్ధరించడానికై అవతరించి, మహాయజ్ఞాన్ని ప్రారంభించిన యీ ఆశ్రమవాసులే ఆయుర్వేద మార్తాండ, వైద్యరత్న, పండిత గోపాలాచార్యులవారు.

ఈ ఆయుర్వేద మార్తాండ, భిషఙ్మణి జన్మించింది బందరు పట్రమీాద. బందరుపట్ర యెందరో సంస్కర్తలను వుత్పత్తి చేసింది. గోపాలాచార్యులవారు చిన్నతనంలోనే మైసూరులో లభించే జ్ఞానాన్ని యావత్తూ ఆర్జించారు. కాని, వారి జ్ఞానతృష్ణ అంతటితో తీరలేదు. వారణాసి, జయపురం, కాశ్మీరం, హరిద్వారం, మలయాళం—యీలాంటి స్థలాలలోని సుప్రసిద్ధ ఆయుర్వేదపీఠాలను దర్శించి, అక్కడి రహస్యాలనుగ్రహించి, తమ విజ్ఞానాన్ని విస్తరింపజేసుకొన్నారు. చెన్నపట్టణానికివచ్చి ఆయుర్వేదాశ్రమాన్ని స్థాపించి, తమ ఆయుర్వేద యజ్ఞాన్ని సంకల్పించారు.

గోపాలాచార్యులవారు బయలుదేరిన కాలంలో ఆయుర్వేదచికిత్సకులమీాద ప్రజకు విశ్వాసం లేదు. ప్రభుత్వంవారు ఆయుర్వేదాన్ని సవతితల్లిప్రేమతో చూస్తూ వచ్చినారు. ఉత్సాహానికి బదులు నిరుత్సాహం, ఆశకు

బదులు నిరాశ క్రమ్ముకొనిపోయినాయి. అయితే, భండరుపత్రమీద పెరిగినవాళ్ల తత్వంలో అధైర్యమంటూ లేదు. ఎన్ని ఆటంకాలు వచ్చినాసరే, వెనుకఅడుగు అంటూ లేదు. గమ్యస్థానం చేరేవరకూ సాగిపోవలిసిందే. ఈలాటి సంకల్పంతో బయలుదేరిన గోపాలాచార్యుల వారికి మాత్రం జయంకాకుంటే అపజయం యెట్లా కలుగుతుంది ?

గోపాలాచార్యులవారు శాస్త్రసిద్ధమైన, శ్రేష్ఠమైన ఔషధాలను ప్రత్యేకంగా తమ ఆయుర్వేదాశ్రమంలో తయారుచేయించి, దేశీయమహాజనసభకు అనుబంధంగా జరుపబడుతూవచ్చిన దేశీయవస్తు ప్రదర్శనలకు పంపిస్తూ, దేశీయనాయకుల దృష్టిని ఆకర్షించి, ఆనరబుల్ డాక్టరు సర్ బాలచంద్రకృష్ణ, మహామహోపాధ్యాయ కవిరాజ ద్వారకానాథ సేన్, మహామహోపాధ్యాయ గంగాధర శాస్త్రి, ఆనరబుల్ రావుబహద్దూరు విద్యావినోది ఆనందాచార్యులవారు—యీలాటి మహామహుల అభినందనాలను పొందుతూ, తమ ఔషధాలకు ప్రతిష్ఠను సంపాదించుకొన్నారు. కాని, వీటి నన్నిటిని వొక యెత్తుగాను, వారి ప్లేగుఔషధాలను యింకొక యెత్తుగాను గణింపవలసివుంది. దేశం నాలుగుప్రక్కలా ప్లేగు బయలుదేరి

ప్రజను తినివేస్తున్న సమయంలో వారి హైమాది పాన కం, శతధౌత ఘృతం యెందరి ప్రాణాలనో కాపాడి, చాలా ఉపకారం చేసినాయి. ఇందుకై వారిని శ్రీశ్రీ గద్వాల మహారాణీవారు సువర్ణపతకంతో సన్మానించారు కూడాను.

పండితులవారు వుత్తమ ఔషధాలను చేయించ డంతో తృప్తిచెంది వూరుకోలేదు. సుశ్రుత, మాధవ నిదానాది గ్రంథాలకు ఆధునికదృష్టితో వ్యాఖ్యానాలు వ్రాసి జీర్ణగ్రంథాలను వుద్ధరించారు. ఆయుర్వేద విద్యా వ్యాప్తికై సుప్రసిద్ధమైన తమ ఆయుర్వేద కళాశాలను స్థాపించి, ఆయుర్వేదాన్ని పోషించారు. తెలివితేటలు, సేవాభిలాష గల విద్యార్థులను ఆకర్షించడమే దుస్తరంగా కనుపించిన ఆ రోజులలో ఆచార్యులవారు విద్యార్థు లకు భోజనాదివసతులను కల్పించి ఆ కళాశాలను కాపా డుతూ వచ్చినారు. తమ ఆశ్రమంలో ఔషధాలను తయారుచేయడానికిన్ని, తమ ధర్మవైద్యశాలలో రోగు లను పరీక్షించి ఔషధాలను నిర్ణయించడానికిన్ని, తమ పుస్తకభాండాగారంలో ప్రాచీన గ్రంథాలను పరిశీ లించి వాటిలోని రహస్యాలను కనిపెట్టడానికిన్ని వస తులు కల్పించారు. తమ ప్రయత్నాల నన్నిటిని కేంద్రీ

కరించేనిమిత్తమై శ్రీ బొబ్బిలి మహారాజు, డాక్టరు సర్ సుబ్రహ్మణ్య అయ్యరు, సర్ పి. త్యాగరాయ శెట్టి, దివాన్ బహద్దూరు రాజరత్నం మొదలియారు మొదలయిన ప్రముఖుల యాజమాన్యంక్రింద ఆయుర్వేదప్రచారిణీ సభను స్థాపించారు. తమ వుద్యమ వ్యాప్తికై ఒక ముద్రాలయాన్ని, ఒక వార్తా పత్రికను నెలకొల్పినారు. ధన్వంతరి వుత్సవాలలో చెన్నపురియందుసభలుచేయించి ఆయుర్వేద ప్రచారం చేయిస్తూ వచ్చినారు. ఈలాటిబ్రహ్మాండమైనకృషికిగాను కలుగుతూవచ్చిన సుమారు పది పదిహేను వేల రూప్యముల వ్యయంలోనూమూడుపాళ్లకు పైగా గోపాలాచార్యులవారే భరిస్తూవచ్చిన సంగతి వొక్కటే చాలు వారి పేరును యెప్పటికీ జ్ఞప్తిలోవుంచుకోవడానికి.

ఇట్లు ఇన్నివిధాలుగా ఆయుర్వేదాన్ని సేవించిన గోపాలాచార్యులవారికి గౌరవాలమీాద గౌరవాలుదొర్లినాయి. విశాలమైన వారి వక్షస్థలం యావత్తూ సువర్ణపతకాలతో క్రమ్ముకుపోయింది. అఖిలభారతవర్షీయ శ్రీ శాయాజీ ఆయుర్వేద విద్యాపీఠంవారు వారిని ఆయుర్వేద మార్తాండబిరుదంతో పూజించారు. మైసూరు దొరతనంయొక్క, దయానంద వైదిక కళాశాలయొక్క, అల

హాబాదు ఆయుర్వేదమహామండలియొక్క, ఆయుర్వేద విద్వత్పరీక్షకులుగా నియుక్తులయినారు. కేరళ ఆయుర్వేద సమాజసప్తమసమ్మేళనం, బొంబాయి అఖిలభారతవర్షీయ ద్వితీయాయుర్వేద సమ్మేళనం-యీలాటి సభల అధ్యక్షులుగా నిర్ణయింపబడ్డారు. ఇంతేకాదు, శ్రీ పంచమజార్జి సార్వభౌముని చేత వైద్యరత్నబిరుదంతో బహూకరింపబడ్డారు.

గోపాలాచార్యులవారు ఆశ్రమవాసులయినా బీదలను మరువలేదు; విద్యార్థులను ఉపేక్షించలేదు; తమసహాయాన్ని అపేక్షించివచ్చినవారిని వూరకపంపివేయలేదు. ఆయుర్వేదాశ్రమం యెప్పుడూ అతిథులతో, స్నేహితులతో నిండివుండేది. అనంతాచార్యులు, కృష్ణస్వామయ్యరు, సుందరయ్యరు, సుబ్రహ్మణ్యఅయ్యరు-యీలాటి ప్రముఖులంతా యెప్పుడో వొకప్పుడు వారిచికిత్స క్రిందకు వచ్చినవారే. గోపాలాచార్యులవారు యుగపురుషులు. ఆయుర్వేదోద్ధరణకై వారు చేసిన సేవకు సాటిలేదు. పాతికేండ్ల క్రిందట వారు ప్రారంభించిన కృషే యిప్పుడు దేశమంతటా ప్రాకింది. ప్రభుత్వంవారు దేశీయవైద్యపాఠశాలను స్థాపించి, ఆయుర్వేదానికి ప్రాముఖ్యం కల్పిస్తూవున్నారంటే అది గోపాలాచార్యులవారి కృషిఫలితమనే

యెంచవలసివుంటుంది. దేశం యావత్తూ నిద్రిస్తూవున్న కాలంలో, దేశీయవిద్యలు ఘనీభవించిపోయినసమయం లో యీ ఆటంకాలనూ, అడ్డాలనూ సాధించడానికై వారు చేసిన కృషి, వారు పడిన కష్టం, వారు చేసిన త్యాగం, చివరకు తమ మరణసమయంలో తమ సర్వ స్వాన్నీ తమ అభిమానవిద్యకు సమర్పించిన వృత్తాంతం తరతరాలవారి స్మరణకూ పాత్రం కాగలవు.

గోపాలాచార్యులవారు స్థాపించిన ఆయుర్వేదా శ్రమం యిప్పటికీ అవిచ్ఛిన్నంగా సాగిపోతూనే వుంది. వారి సోదరులేయగు దేశికాచార్యులవారు దీనిని నిర్వ హించుకొనివస్తున్నారు. వీరు వయసున చిన్నలే అయినా యీ ఆశ్రమాన్ని నేర్పరితనంతో, శ్రద్ధతో, సామర్థ్యం తో నడుపుతూ, జీవామృతంలాటి ఔషధాలను చాలా ప్రాముఖ్యానికి తెచ్చి, పండితులవారి ఆశయాలను సాగించుకొనివస్తున్నారు. దాతృత్వంలో, దేశోపయోగ కార్యాలలో, అతిథులను ఆదరించడంలో పండితులవారి మార్గాన్నే అనుసరిస్తూ, ఆయుర్వేదాశ్రమం ప్రశస్త మైనసంస్థ అనే ఖ్యాతిని దేశమంతటా వ్యాపింపజేశారు, చేస్తున్నారు.

# డాక్టరు అహోబలరావుగారు

ప్రొద్దుటిపూట. ఏడుగంటలుకొట్టి వుంటారు. పరాను పేటలోని విశాలమైన ఆవరణంగల ఒక బంగళా వద్దకు కొందఱు కాలినడకను, మఱికొందఱు బండ్లమీదను స్త్రీలు పురుషులు, బీదలు భాగ్యవంతులు, చిన్నలు పెద్దలు తిరుణాలకు వచ్చునట్లుగా వస్తున్నారు. ఎవరిని చూచినా బాధయే, దుఃఖమే వారి మొగములపైన వ్రాసి వుంది. ఇంతలో ఒకింత చిరునగవుచేవికసించి నిష్కాపట్యమును, గాంభీర్యమును, ఔదార్యమును ప్రకటించే మొగము, దాక్షిణ్యమును, కనికరమును సూచించే నేత్రములు, నిగ్రహమును, నిబ్బరమును స్ఫురింపజేసే నిడివి ముక్కు, కెయిజరువలె పైకి త్రిప్పిన పెద్ద మీసకట్టు, కొంచెము పొడువుగా కత్తిరింపబడి మధ్యను పాయదీయబడి మెలికలు తిరిగిన నల్లటి బిరుసు వెండ్రుకలును కలిగి దేశాభిమాన సూచకమైన దేశీయవస్త్రాలను ధరించి, చామన చాయరంగుగల ఒక పొడవుపాటి వ్యక్తి అక్కడ ఒక గదిలోకి వచ్చినాడు. విచారమగ్నులై కూర్చుండిన ఆ జనసమూహంలో ఒకవిధమైన కలకలం బయలు దేరింది. "ఆ చల్లని నాయన వచ్చాడు, వచ్చాడు,

అదుగో'' అని కొందఱును, ''ఓబలరావుగారు వచ్చారు, ఓబలరావుగారు వచ్చారు'' అని పిల్లలును గంద్రగోళంగా చెప్పకో సాగినారు. ఒకరితరువాత ఒకరు లోపలికి వెళ్లి రావడంలో గల ఆలస్యంతప్ప వారి దర్శనానికి ఆలస్యం లేదు, అడ్డం లేదు, భయం లేదు, అనుమానం లేదు. భాగ్యవంతులయినా సరే, బీదలయినా సరే ఒక్కటే ఆదరణ, ఒక్కటే లక్ష్యము!

ఇరవైయేండ్లక్రిందట అందరు వైద్యులవలెనేవారును నిరుత్సాహపు పరిస్థితులలో వైద్యం ప్రారంభించారు. కాని ప్రత్యేకపు ప్రోత్సాహమూ, ఆదరణా ఏమాత్రమూ లేవు. జీవులలో కలిగే బహుతీవ్ర స్పర్ధయొక్క ఘట్టంలో ప్రతివ్యక్తీ ఎదుర్కోవలసిన ఆటంకాలను, అపజయాలను, కష్టాలను వారుకూడ అనుభవించే వున్నారు. ఇప్పు డెందుకా ప్రజ తిరుణాలకు పోయినట్లుగా వారివద్దకు బయలు దేరవలయును? భౌతిక సౌకర్యా లన్నిటికీ ధనమే పరిమాణంగాగల యీ లోకంలో బీదలకు కొంతసదుపాయాన్ని ప్రభుత్వమూ, సంఘమూ చేయ బ్రయత్నిస్తున్నా, అటు ప్రభుత్వముయొక్క, ఇటు దాతలయొక్క వైద్యాలయములయం దేమి, ఇతర ధర్మ సంస్థలయం దేమి, బీదలకు తగు ఆదరణ, శ్రద్ధ, సదుపాయము చూప

బడుతూవున్నాయని చెప్పడం కష్టము. ఇక ద్రవ్యము నకై స్థాపింపబడు ప్రయివేటు వైద్యుల చికిత్సాలయా లలో వీరి కసలు చోటేలేదు. ఇట్టి ప్రయివేటు వైద్యశా ఖకే సంబంధించిన డాక్టరు అహోబలరావుగారు అందరి వల్లా ఉపేక్షింపబడుతున్న సామాన్య జనులకు కల్పించిన వైద్యసహాయంవల్లను, యోగ్యతవల్లను ప్రజాహృద యాన్ని నేడు పూర్తిగా వశంచేసికొనివున్నారు.

ఒకరోజున నేను అహోబలరావుగారి యింట్లో నిద్రి స్తున్నాను. తెల్లవారుజామునాలుగుగంట లయివుంటుంది. అంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడెవరో ఒక మనిషి వచ్చి "యెవరయ్యా! యెవరయ్యా!" అంటూ కేకలు వేయ సాగాడు.

నేను—ఎవరండీ?

ఆ మనిషి—నేనే. ఉండారంటయ్యా?

నేను—ఎవరు కావాలి?

ఆ మనిషి—ఆళ్లేనయ్యా.

నేను—ఆళ్లేనంటే?

ఆ మనిషి—ఆళ్లయ్యా. ముక్కోల్లు ఆళ్లులే!

నేను—ముక్కోల్లు ఆళ్లంటే, పేరులే?

ఆ మనిషి—ముక్కోల్లు ఆళ్లంటే తెలియదంటయ్యా?

ఈ విధంగా మాటలాడ సాగిన ఆ మనిషికి సమాధానం చెప్పడం కష్టమని నే నూరకున్నా ఆ మనిషి మాత్రం ఊరుకోక "మాట్లాడ వేంటయ్యా?" అని సణుగుకొంటూ నిలువబడే వున్నాడు. అప్పుడు అహోబలరావుగారే యీ గొడవ విని, లేచి బయటకువెళ్లి ఆ మనిషి కేమో సమాధానంచెప్పి పంపివేశారు. ఈవింత సంభాషణ జరిగి యిప్పటికి 15 యేండ్లు దాటివుంటాయి. కాని, అహోబలరావుగారి ఉదారవర్తనకు, నిదానానికి, లక్ష్యానికి ఇంతకన్నా మఱియొక నిదర్శనం నాకు కనపడ లేదు. ఉన్నారు, ప్రఖ్యాతినీ, ధనమునూ గడించిన వైద్యు లెందరో, ఆంధ్ర దేశంలో. కాని, సామాన్య జనుల విశ్వాసాన్ని, అనురాగాన్ని, కృతజ్ఞతను అహోబలరావుగారి యంతగా గడించినవా రున్నారో లేదో, అనుమానమే.

అహోబలరావుగారు వైద్యంలో ప్రవేశించిన పిదప చికిత్సాపద్ధతినే మార్చివేశారని చెప్పవచ్చు. మందుల కన్నా ఆహారనియమానికే యెక్కువ ప్రాముఖ్యం ఇవ్వ నారంభించారు. నారింజపండ్లను, ఆవుపాలను పథ్యంగా నిర్ణయించని వ్యాధియే లేదు వారికి. పూర్వం నారింజను చూచినవారే లేరు. బత్తాయిముంగల నారింజకు స్థానమే లేకుండేది. 15 యేండ్లలో అహోబలరావుగారి పుణ్యాం

వల్ల నారింజ కెక్కడలేని ప్రాముఖ్యమూ, ప్రయోజనమూ యేర్పడినాయి. వారి వైద్యంలో వ్యావహారికం కన్నా పారమార్థికమే స్ఫుటంగా కనపడుతుంది. రోగికీ, వైద్యునకూ గల సంబంధం తాత్కాలికమైందనీ, వ్యావహారికమైందనీ కొందఱు చెప్పుతారుగానిఒక్కొక్కప్పుడు రోగియొక్క వ్యాధి విషాదంగా అంతమొందునప్పుడు ఆప్తబంధువువలెనే అహోబలరావుగారుకూడ వ్యాకుల చిత్తులై ఒకటి రెండు రోజులవఱకు బహుకలవరంపాలై భోజనముసహా సరిగా చేయని సందర్భాలెన్నో వున్నాయి. వారియందు దయ, దాక్షిణ్యము, సానుభూతి, అభిమానముల పాళ్లు అధికంగా వుండడంవల్లనే వారి దృష్టి యెప్పుడూ ప్రజోపకారంవైపుకే పోతూవుండేది. అహోబలరావుగారిది అమృతహస్తము. ఆ హస్తముతో నారింజకాయ రసమునే నిర్ణయింపనిండు, లేదా మరియొక నీటినే నిర్ణయింపనిండు-వారియందుగల అపారమగు భక్తి విశ్వాసములవల్ల స్త్రీలే కాదు పురుషులేకాదు, పల్లెలవారే కాదు బస్తీలవారే కాదు, చివరకు చిన్నపిల్లలుసహా చికిత్సకై వారివద్దకు పరుగులెత్తేవారు. నేటికాలపు వైద్యులలో ప్రజ లింతగా వశము చేసుకొన్నవారును, ప్రజ కింతగా వశమునందున్నవారును మరివొకరు లేరు.

తమ చికిత్సయందున్నవారిలో చూడవలసిన వారిని చూచి అహోబలరావుగారు యింటికి వచ్చేసరికి మధ్యాహ్నం 12 గంట లవుతుంది. భోజనమైన పిమ్మట 2 గంటలనుండి 4 గంటలవరకు జరుగు చర్చను ఒక దర్బారుగా వర్ణింపవలసివుంటుంది. ఈ దర్బారులకు పండితులు పామరులు, కవులు గాయకులు, ఉద్యోగులు ప్రజా ప్రముఖులు, జాతీయవాదులు రాజభక్తులు, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు, సనామకులు అనామకులు–రకరకములవారూ సమావేశమవుతుండేవారు. ఆంధ్రులలో ఇరువురు ఒక చర్చను ప్రారంభిస్తే మధ్య నెక్కడనో అది తీవ్రరూపం ధరించి ఆభాసమవడం సామాన్యము. ఆంధ్రుని ప్రకృతి ఒక క్షణమున భగ్గుమనడం, ఆ మఱుసటి క్షణముననే చప్పున చల్లారడం! అహోబలరావు గారియింట చర్చలు లేకపోలేదు. జన్మాంతర మున్నదా లేదా, దయ్యము లున్నవా లేవా అను అంతులేని సందేహాలు మొదలుకొని గుండ్రబల్ల వ్యవహారాలవరకూ చర్చలు వస్తూనే వుంటాయి. కాని, యివి సామాన్యంగా హద్దుమీరి కాని, యితరులకు కష్టమును తోచించు విధంగాగాని జరగవు. ఇతరుల దృష్టికి ఈ భిన్నభిన్నపక్షములవారి సమావేశాల ప్రయోజనం కాఫీసేవించడం

కన్నను మత్తేమైనగలదా యని తోచవచ్చుగాని బందరు పౌరులు సామరస్యం కలిగి, నిరుపయోగమైన స్పర్ధలకూ, కక్షులకూ అంతగా చోటియ్యకున్న యెడల ఈసమావేశాలూ, యీసమావేశాలవలనఏర్పడేమిత్రభావమూ, సహనగుణమూ చాలా సహాయపడుతున్నాయని గట్టిగా చెప్పవచ్చు. ఇతర చోట్లలోవలె బందరునం దంతగా కులస్పర్ధలు లేనియెడల బందరుపౌరుల ఉదారసంకల్పాలు, ధారాళమైన ప్రజాహితజీవనము అటుండ, అహోబలరావుగారు సర్వపక్షములవారికిని కొలికిపూసవలె ఉండి భారతమునాటి విదురునివలె అటు జాతీయపక్షము వారిలోను, ఇటు తీవ్రకులాభిమానులలోను మిత్రభావాన్ని, విశాలమైన సేవాభిలాషను కల్పించడానికై, పోషించడానికై యెంతగా సహాయపడుతున్నారో లోకులు గ్రహింపవచ్చు.

పగటి సమావేశాలలో దర్బారీయులు ఫలాహారాదులతో సంతృప్తులు గావింపబడితే, రాత్రులందు కొందఱు మిత్రులు విధిగా భోజనమున కాహ్వానింపబడుతూనే వుంటారు. ఈ రాత్రుల భోజనానంతరం విక్రమార్కుని సభలోవలె సంగీతమే కాదు, సాహిత్యమే కాదు, సుద్దులే కాదు, దేశీయవిషయాలే కాదు యెన్నో

దృశ్యమవుతూవుంటాయి. అహోబలరావుగా రెంత మిత భాషియైనా, బహిరంగసభలయం దెంత పాల్గొనక పోయినా దేశీయ వ్యవహారాలను తెలివిగాను, యుక్తి గాను, నైపుణ్యంగాను చర్చింపగల సామర్థ్యాన్నీ, నేర్పరి తనమునూ ధారాళంగా కలిగి నిష్కళంకమైన అభిమా నమును వ్యక్తపఱుస్తూవుంటారు. రాత్రి భోజనానంతరం జరుగు చర్చలలో వారి యభిప్రాయాలను, ఆశయాలను ఆలకించడంకన్నా ప్రబోధకరమైన కార్యం లేదు.

అహోబలరావుగారు తమ యోగ్యతచేతను, పూర్వకర్మసంచితమగు ఉపకారబుద్ధిచేతను దేశహితైక జీవనంలో చాలా ప్రాముఖ్యమునూ, పలుకుబడినీ వహించి వున్నా వీని నన్నిటిని ప్రజోపయోగానికే వినియోగి స్తున్నారు. బందరులో వారి సహాయము పొందని సంస్థ లేదు. వారి నాశ్రయించి వ్యర్థంగా పోయినవారుకూడ తక్కువే. అహోబలరావుగారు ఖద్దరుఉత్పత్తిని పోషించి వుంటారు. యువజన సంఘమువారి క్రీడలను ప్రోత్సాహ పఱచివుంటారు. ధర్మకర్తృత్వము వహించి శివాలయ పాలనను చక్కబఱచివుంటారు. చంటిపిల్లలను భుజ ములపై ఎక్కించుకొని పిల్లలపై ప్రేమను విశదీకరించి వుంటారు. దేశోపయోగకరమగు ధర్మాలను గావించి

వుంటారు. వీని నన్నిటిని ప్రజ లెన్నటికైనా మఱచిన మఱువవచ్చునేమోగాని దీనజనబాంధవుడుగానూ, స్పర్ధలకూ, కక్షలకూ బదులు శాంతినీ, సుహృద్భావమునూ నెలకొల్పు అభినవ విదురుడుగానూ మాత్రం ప్రజలు వారి నెన్నటికీ మఱువజాలరు.

అహోబలరావుగారి భూతదయ, దాతృత్వం, మిత్ర వాత్సల్యం, దీనజనానురాగం—యిటువంటి గుణాలను గురించే లోకులు యెరిగివుంటారుగాని ఆయనవుత్సాహానికిన్నీ, శరీరపాటవానికిన్నీ పెద్దవూతగావుండే హాస్యరసాన్ని గురించిన్నీ, వినోదక్రీడలను గురించిన్నీ అంతగా యెరిగివుండరు. మన దేశంలో నలుగురు వొకచోట చేరితే చిన్నలు మొదలు పెద్దలవరకూ ఒక విధమైన గంభీరతను, మూకీభావాన్ని తెచ్చిపెట్టుకొని కూర్చుంటారుగాని ఒకపాట పాడో, ఒకఆట ఆడో, ఒక తమాషా కథను చెప్పో సభ్యులను సంతోషపరచగల శక్తి సంపాదించరు. ఒకవేళ వుంటే అత్యల్పంగా వుంటుందేమో. అహోబలరావుగారు అట్లా కాదు. ఆయన దగ్గర కూర్చుంటే గంటలేకాదు, రోజులు, వారాలు పరుగెత్తుకొనిపోతాయి. మూతులు ముడుచుకొని ముంగులలాగున కూర్చునే సజ్జుతో ఆయన కసలు పొత్తు

కుదురనే కుదరదు. ఆయనదగ్గర సిగ్గు, భయం, అను మానం పనికిరావు. ఆయనకు తనతో భోజనంచేసి, తిరిగి, ఆడి, పాడి, గంతులువేసేవాళ్లనుచూస్తే సరదా. వీధి భాగవతాలంటే, పగటివేషాలంటే, బొమ్మలాటలంటే, గమ్మత్తుపాటలంటే ఆయన కెక్కడలేని సంతోషం. ఆయనకు మనస్సుకలిసిన స్నేహితులంతా రాత్రిభోజ నానంతరం ఆలాటి వింతపనులను చేయగల విద్యాధి కులే. "అమరావతికి పోదాం. కృష్ణలో యీదుదాం. అంతా ఆడుకుందాం. భోజనాలు చేద్దాం" అంటే ఆ భాగవతపుజట్టు యావత్తూ-విద్వాంసులబృందంయావత్తూ మాట్లాడకుండా బయలుదేరవలసిందే. అంతా అమరా వతికి వెళ్లినారు. అక్కడ బడికిపోయి చిన్నచిన్న పిల్లల నందరిని కట్టుకొనే నిమిత్తమై వాళ్లకు బటానీలు, శెనగ పప్పు, కొబ్బరి, బెల్లం పంచిపెట్టినారు. అక్కడనుంచి పిల్లలు వెంటబడ్డారు. అహోబలరావుగారు ముసిముసి నవ్వులు నవ్వుతూ, పెద్దఅంగలువేస్తూ పెద్దబజారు చేరారు. పిల్లలంతా చిరుతిళ్లు తింటూ ముందు నిల బడ్డారు. "ఇదిగో యీ పాట నేర్చుకొంటే మీకు ఇంకా కొబ్బరి, బెల్లం పెడతాము" అంటూ,

పొట్టిపొట్టిగ దట్టమైన మట్టలచేత
నెదుగుచున్న చెట్టది

అనే పిల్లలపాటను అహోబలరావుగారే పాడుతూ, అభినయిస్తూవుండేసరికి వూరంతా విరుచుకొనిపడ్డారు. ఈ నిరాడంబరమూర్తి వర్తనానికిన్నీ, చిన్నపిల్లలమీది ప్రేమానురాగాలకునూ వారంతా సంతోషించి దానిని పట్టజాలక "అహోబలరావుకు జై!" అనే ధ్వానాల తోను, కరతాళధ్వనులతోను ఆకాశం చిల్లులుపడే టట్టు చేశారు!

ఆనాడు ఆదివారం. మోటారుకారులువచ్చి ఘీంకారాలు కొట్టుతున్నాయి. "ఒరే! లెండి! పిరమిడ్డు యాత్రకు లెండి!" అనిఅందరినీ మోటార్లలోవేసి బందరు సముద్రానికి వెళ్లేదారిలో దేవునిగుడిదగ్గరవున్న ఇసుక దిబ్బదగ్గరకు కొట్టుకొనివెళ్లినారు. అహోబలరావుగారు మీసాలు వొడివేస్తూ ఆ దిబ్బమీద నిలబడ్డారు. మిత్రులైన లాయర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, శాసనసభ్యులు, లక్షాధికార్లు చుట్టూ కూర్చున్నారు. అహోబల రావుగారేమైనా పాడుతారో, లేకుంటే యేమైనాహాస్యం మొదలు పెడతారో అని అనుకొంటూవుంటే గభాలున "మీరంతా యిద్దరిద్దరు చొప్పున కట్టకట్టుకొని పైనుండి

క్రిందకు దొర్లాలి. గో ఆన్ !'' అని అన్నారు.అనడంతోనే ఆ పెద్దపెద్ద చదువులు చదివినవాళ్లున్ను, పెద్దపెద్ద వుద్యోగాలుచేసేవాళ్లున్ను పిల్లలలాగున యిద్దరిద్దరు కట్టలుకట్టుకొని దొర్లుతూ, కొందరు క్రిందిబురదలోను, మరికొందరు రక్కసముండ్లమీదను పడుతూవుంటే ఆయన వొక్కటే నవ్వు! ఇట్లా అందరివంతూ అయినతరువాత "అంతా పాడాలి'' అంటూ తామే ముందుగా తమ అభిమానపాత్రమైన 'తాడిచెట్టు', 'తట్టా పెంటాచారి' పాటలు పాడి, ఆ పిమ్మట సోమనాధరావుగారి హరికథను అనుకరించడం మొదలుపెట్టి వొకటే నవ్వించారు.

ఒకొక్కరాత్రి "యివ్వేళ డిన్నరు'' అంటే భోజనానికి దర్బారంతా పోవలసిందే. సాధారణంగా యీ దర్బారుభోజనాలకు ఆయనతో కలిసి వ్యవహరించే స్నేహితులనుతప్ప ఇతరులను పిలవడం రివాజులేదు. భోజన్నా లయినతర్వాత రాత్రి పండ్రెండు గంటలవరకూ 'నవరోజు' రాగాలు, . నటేశన్ కంపెనీ అనుకరణాలు, వీధిభాగవతపు పాటలు, గొల్లసుద్దులు, దయ్యాల కథలు —ఇల్లాంటి అపూర్వసాంఘిక వినోదాలతో విశ్రాంతి పుచ్చుకొనే స్వభావం అహోబలరావుగారిది. విదేశ విద్యాలయాలలో పఠించివచ్చినవారికీ, ఆర్యులకాలపు

సాంఘికతత్వాన్ని పరిశీలించినవారికీ యీ క్రీడావినోదా లన్నీ బహుసహజంగా కనపడతాయి.

ఇక వేళాకోళపు పనులను యేర్పాటుచేయడంలో అహోబలరావుగారు బహునేర్పరి. రవంతైనా తొణకడు, కనపడడు. ఆయనకు ముఖ్య స్నేహితులూ, గొప్ప వుద్యోగస్థులూ అయినవారి బదిలీ సందర్భంలో పెద్దవిందుచేసి చివరకు తాటాకుల హారంవేసి, ప్రత్యేకంగా తెప్పించిన గంగిరెద్దబాజాతో పంపడం, వల్లూరురాజాగారి మేడలో అల్పాహారాల సమావేశం జరుగనున్నట్టు బారిష్టరుగారిపేర లేఖలు పంపి అంతా చేరుకున్నతరువాత 'ఏప్రిల్ ఫూల్' అట్టను చూపడం మరపురావు. ఇంకొకసారి తాలూకాలో పనిచేసే వొక సహపాఠి వచ్చి శిఫారసు అడిగితే ఆయనను వెంట బెట్టుకొనివెళ్లి ఏదో చెప్పినప్పుడు ఆ అధికారి "ఇతడు బండ. కూర్చున్నచోటినుంచి కదలలేడు. ఈ పనికి తెగ తిరగాలి. ఇతని సంగతి నాకు తెలుసు" అని అనడం జరిగింది. అంతట అహోబలరావుగారు యుక్తిచేసి "ఒరే! నీవు బండవట, కదలలేవట, నడవలేవట. నీ తెలివి చూద్దాం, రామశాస్త్రిగారియింటిదాకా ఆ యిసకలో పరుగెత్తు" అని అతనిచేత పరుగెత్తించి చివరకా

పని యిప్పించారు. ఈలాటి విచిత్రపు పను లెన్నో చేస్తూ ఏదో తమాషాచేసి నవ్వించడం, ఏదో మిష మీద నలుగురినీ పోగుచేయడం, గేలిచేయడం, వృడికించడం, తమ చాతుర్యం చూపించడం—యివన్నీ అహోబలరావుగారి సహజలక్షణాలు. ఎందులో ప్రవేశించినాసరే వారి ప్రత్యేకవ్యక్తిత్వం, ఔదార్యం, గంభీర స్వభావం, వశీకరణశక్తి, నాయకలక్షణం—అన్నీ స్పష్టంగా కనుపడుతూవుండేవి.

ఆయనముందర కూర్చోడానికైనా అర్హత లేని వారు ఆయనదగ్గర చేరి కాస్తపరువు సంపాదించుకొన్నారు. మీకు యేంకావాలి? భోజనమా? ఇష్టం వచ్చినన్నాళ్లు తినండి. డబ్బు కావాలా? పుచ్చుకొని, యిస్తేయివ్వండి, లేకుంటే లేదు. రోగం వచ్చిందా? వారి యింట్లోనేవుండి పాలూ పళ్లూ పుచ్చుకుంటూ నయంచేసుకోండి. ఆట పాటలలో యేమైనా తెలివి వుందా? ఆడండి, పాడండి. ఈ దీనజనబాంధవుడు పోయినాడంటే బందరుయావత్తూ దుఃఖంలో మునిగింది.

పుణ్యమూర్తియగు అహోబలరావుగారు నిష్కామ సేవానిరతియందు ప్రభుస్థానం వహించారు. ఆయన కీర్తిని వరించలేదు. ధనాన్ని మోహించలేదు. అధికారాన్ని



క్రీ. శే. డాక్టరు కోకా అహోబలరావునాయుడుగారు



డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు

ఆశించలేదు. దీనజన సేవనుమాత్రం వాంఛించారు, ప్రేమించారు. ఆత్మసమర్పణం గావించారు. ఇట్టిదీనబంధు, రసజ్ఞుడు, భోగి, త్యాగి, దేశాభిమాని నిర్యాణం చెంది నప్పుడు కొందరు "గొప్పసంస్థ కూలిం" దన్నారు; కొందరు "బందరుశిఖరం పడిపోయిం" దన్నారు. కాని అహోబల రావుగారి సుందరతరమగు ఆత్మ మచిలీపట్టణంవీథులలో సర్వాంతర్వ్యాప్తమై విహరిస్తూ నేవుంది. మర చెదమన్నా మరపుకురాదు.

---

## డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు

చాలాకాలంనుంచి "విద్యావంతులారా లెండి! గ్రామాలకు పోయి పనిచేయండి" అనేకేక సభావేదికలనుంచి వినబడుతూఉండడమే కాని ఆపనికి పూనుకొని, ఆతంటాలుపడేవారుమాత్రం కనబడేవారు కారు. కాని, ఈ పిలుపు విని తన సంపాదన, యింటిపట్టునసుఖజీవనం వదలుకొని గ్రామజీవనోద్ధరణకు బలిదానమైన ఆంధ్రులలో డాక్టరు సుబ్రహ్మణ్యంగారు మొదటివారు.

ఈ గ్రామోద్ధరణావేశంలో, రాజకీయోద్రేకంలో చాలాచోట్ల ఆశ్రమాలు బయలుదేరినాయి గాని, ప్రజలను ఆకర్షించి కొంతమట్టుకైనా గ్రామసేవను తరిచి, మార్గదర్శకమయింది సీతానగరంలోవున్న గౌతమీ ఆశ్రమం ఒక్కటే. పది యెకరాల విశాలమయిన తోటలో కుటీరాలు, పత్రికాప్రచురణ, పుస్తకభాండాగారము, నేతమగ్గాలు, హరిజనసేవ, ఉచితపాఠశాల, గిలకభావి, కూరపెరళ్లు, పూలతోటలు—యీలాటి ఆకర్షణలతో బయలుదేరిన ఆ ఆశ్రమంమూలంగా దేశంలో ఒక క్రొత్త సేవాభిలాష ప్రబలి అన్నపూర్ణయ్య, లింగరాజు, శేషగిరిరావు, లక్ష్మీపతి, వెంకటప్పగార్లవంటి సేవాభిలాషియువకబృందము సుబ్రహ్మణ్యంగారి చుట్టూ

చేరుకొన్నారు. అచిరకాలంలో ఫిర్కా ప్రజలకేకాక, ఆంధ్రదేశస్థు లందరికీ ఆ ఆశ్రమం పుణ్యక్షేత్రమయిం ది. కాంగ్రెసుమహాసభయొక్క నిర్మాణకార్యక్రమాన్ని వ్యాపింపజేసే గొప్పసంస్థగా పరిణమించి అయిదారేండ్లు అమోఘంగా పనిచేసింది.

గాంధీమహాత్ముడు 1929 లో ఆంధ్రదేశం చూడ డానికి వచ్చినప్పుడు, దారిలో యీ గౌతమీ ఆశ్రమాన్ని చూచి సంతోషించి, రెండురోజులు అక్కడనే బస చేసి, ఆంధ్రదేశప్రచారకుల సభను జరిపించిన పుణ్య స్థలం ఇది. తన యాత్ర ముగించుకొని సబర్మతీ చేరిన తర్వాత సుప్రసిద్ధమైన తన 'యంగ్ ఇండియా' పత్రికలో 'ఒక గొప్ప సంస్థ' అనే తలకట్టుక్రింద "నా విస్తీర్ణమైన సంచారంలో యీ ఫిర్కా గ్రామాలలో చూచినంత వుత్సాహాన్ని, జీవకళను మరి యెక్కడా చూడలేదు. ఈ ఆశ్రమవాసులు సాధారణజీవయాత్ర చేస్తూ, గ్రామస్థుల జీవనంతో ఐక్యమయి, చాలా పలుకుబడిని సంపాదించు కొన్నారు. ఈ బీదగ్రామాలలో అయిదువేల రూపా యలు నాకు సమర్పించారు. ఇంత మొత్తం యింకే గ్రామాలలోనూ నాకు రాలేదు." అని మహాత్ముడు ప్ర శంసించి వున్నాడు. ఈ ఆశీర్వచనంతో ప్రజలందరి దృష్టి

దీనిమీదికి మరలింది. తరువాత 1930 లోను, 1932 లోను బయల్వెడలిన సత్యాగ్రహోద్యమంలో వహించిన ప్రాముఖ్యంవల్ల; ప్రజలలో పుట్టిస్తూవచ్చిన నిరోధ భావంవల్ల -యీ ఆశ్రమం పోలీసువారికి కంటకంగా తోచి, దీనిని అణచివేసే వుద్దేశంతో వారు ఆస్తిని స్వాధీన పరచుకొని, లాఠీప్రయోగంచేసి ప్రచారకులను అరెస్టు చేశారు. ఈ దెబ్బకు ఆశ్రమం తట్టుకోలేకపోయింది.

ఇంతలో స్వాతంత్ర్య దినోత్సవం వచ్చింది. ఆ రోజున డాక్టరుగారు ఇన్నీసుపేటలో నాళం భీమరాజుగారియింట్లో భవితవ్యాన్ని ఆలోచిస్తూ కూర్చున్నారు. ఆశ్రమం దెబ్బ తిన్నా సుబ్రహ్మణ్యంగారింకా స్వేచ్ఛగాతిరగడంఅధికారులకుకంటకంగానే వుంది. అంతట, లాఠీ వ్యాయామంలో మహోపాధ్యాయుడు, డెప్యూటీసూపరింటెండెంటు ముస్తఫాలీగారుతమ అనుచరులతోభీమరాజుగారియిల్లుప్రవేశించి లాఠీదెబ్బలవర్షం కురిపించమొదలుపెట్టినారు.సుబ్రహ్మణ్యంగారు స్పృహతప్పిపడిపోయారు . నెత్తురుచిమ్మింది.ఎముకవిరిగి,తీపుతో మూలుగుతుండిన సుబ్రహ్మణ్యంగారు లేచితిరగడానికిమూడు నెలలుఆస్పత్రిలోచికిత్సపొందవలసి వచ్చింది. లాఠీదెబ్బలు చాలామంది తిన్నారుగాని బులుసు సాంబమూర్తి, ఖాసా సుబ్బారావు, డాక్టరు సుబ్రహ్మ

ణ్యంగార్లంత చేటుగా యెవరూ తినలేదు. ముస్తఫాలీగారు అంతటితో తృప్తిపడ్డారా? లేదు. సుబ్రహ్మణ్యంగారిమీద తెచ్చిన అభియోగంలో [illegible], శుద్ధ అబద్ధపు కేసని అనిపించు[illegible] యింకొక కే[illegible] సుబ్రహ్మణ్యంగారిని జెయిలు[illegible]

ఆరోగ్యంచెడి సుబ్రహ్మణ్యంగారు జెయిలునుండి బయటపడ్డారు. ఆశ్రమాన్ని పునరుద్ధరించడానికి చేసిన శ్రమ కలిసిరాలేదు. ప్రజలు నిర్బంధపద్ధతులకు తట్టుకో లేకపోయారు. ఆఖరుకు జెయిలునివాసంవల్ల, లాఠీదెబ్బలవల్ల, ఆశ్రమభారంవల్ల, దారిద్ర్యంవల్ల సుబ్రహ్మణ్యంగారు క్షయవ్యాధిగ్రస్తులై మృత్యువుపాలు కావలసివచ్చింది.

డాక్టరు సుబ్రహ్మణ్యంగారు మంచి సంపాదన చేస్తూ వుండిన వైద్యుడు. మహాత్ముని వుద్యమంలో దుమికి సర్వ పరిత్యాగ మొనర్చిన ధీరుడు. ప్రతిఫలము లేని జిల్లా కాంగ్రెసుకు అధ్యక్షుడు. ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీసభ్యుడు. భారతచర్ఖా సంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యుడు. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాన్ని జయప్రదంగా నడిపించిన గాంధీమహాత్ముని భక్తుడు. చివరకు అసహాయోద్యమానికి బలి అయి, దారిద్ర్యానికి ఆహుతి అయి, అకాలమృత్యువు పాలయి, అమరత్వంపొందిన ఆంధ్రనాయకుడు.

## డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు

ఇన్నీసుపేటలో గోదావరికి దగ్గరగా ఒక పాత మేడ వుంది. దానిలోపల వెలుపల ఏవో సంఘాల పేర్లున్న బల్లలు తెగ వ్రేలాడుతూ వుంటాయి. కాస్త లోపలికిపోయిచూస్తే రోగులు, పరపతిసంఘ సభ్యులు, కాంగ్రెసు ముఠాదారులు, హరిజనులు—యీలాటివారితో కూడిన ఒక కలగూరసభను జరుపుతూ, వూరికథ, దేశంకథ చుట్టబెట్టుతూ, గంటలాగ మ్రోగే కంఠధ్వనితో "కనపడడమే మానేశావే" అని వొకరినీ, "యెప్పుడు వచ్చావు" అని యింకొకరినీ హెచ్చరిస్తూ ఒక కుర్చీలో కూర్చుంటారు డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు.

మనవాళ్లకు ఒకరితర్వాత ఒకరు మాట్లాడే అభ్యాసం తక్కువ. అంతా వొక్కసారిగా మాట్లాడుతూ వుంటారు. డాక్టరుగారుదర్బారుచేసే సమయంలో 'బాబయ్యా' అంటూ వొక బీద స్త్రీ వచ్చి తన సంసారకష్టం చెప్పుకుంటూవుంటే, ఇంకొక బ్రాహ్మణ స్త్రీ వచ్చి నిలబడి 'నాయనా' అని తన రోగంకథ ప్రారంభిస్తుంది. ఇంకొకరు పరపతి సంఘపు గొడవ మొదలుపెట్టుతారు. ఈలాగున వారూ వీరూ చెప్పడం సాగించినా గురుమూర్తిగారు మాత్రం

కసురుకోరు, విసుక్కోరు; అందరితోనూ అవధానం చేస్తూనే వుంటారు.

గురుమూర్తిగారు సుప్రసిద్ధ వైద్యులు. తీరిక అంతగా లేనివారు. అయినప్పటికీ రాజమహేంద్రవరంలో వారికి సంబంధంలేని వుద్యమం అంటూ లేదు. కాంగ్రెసు, హరిజనులు, పరపతిసంఘాలు, చిలకమర్తివారి గ్రంథాలు, మునిసిపల్ వ్యవహారాలు, సీతానగరపు తొందరలు, కేసులు, చందాలు—ఒకటా, వూరిలోని, వూరివెలుపలి వ్యవహారాలన్నీ వారిమీదుగానే నడుస్తూవుంటాయి. అసహాయోద్యమ సమయంలోను, ఆ తరువాతను జెయిలుకు పోయినప్పుడు అక్కడ కాస్తవిశ్రాంతి దొరకినా, అవసరపు పట్టులలో వారు బయటవుండడంచేతనే వారి చేతిమీదుగా యెన్నోపనులు జరుగుతూ, దేశీయవ్యవహారాలకు కావలసిన వూత, తోడ్పాటు లభిస్తూ వూపిరాడకుండా వుంటూ వచ్చేది. గురుమూర్తిగారి విషయంలో దేనిని గురించి చెప్పినా చెప్పకపోయినా వారు మునిసిపల్ ఛేర్మనుగావుండి, నగరాభివృద్ధికై చేసిన శ్రమ, సెంట్రల్ కోఆపరేటివు బ్యాంకు నిర్వాహకత్వం వహించి పరపతిని పోషించడంలో చూపిన శ్రద్ధ, వైద్యులుగా వుండి బీదలకు చేసే సేవ, గృహస్థుగావుండి అతిథులకు

చూపే ఆదరణ—వీటినిగురించి మాత్రం స్మరింపక తీరదు.

ఇక యే స్నేహితుడువచ్చినా, యే వాలంటీరు వచ్చినా "ఒరే ఆలస్యమయింది. యెక్కడికి పోతావు? భోజనంచేసి పోరా" అని ఖంగునమ్రోగే కంఠస్వరంతో, ప్రీతిపూర్వకంగా చేసే ఆహ్వానం వింటే ప్రాణాలు లేచి వస్తాయి. వారియింట యెప్పుడూ యెవళ్లోవొకళ్లు భోజనం చేస్తూనే వుంటారు. మందులు వూరికే తీసుకొనిపోయేవాళ్లకూ, ఏదో సహాయం అడుగుతూవుండేవాళ్లకూ అంతేలేదు. లాఠీచార్జీలూ, అరెస్టులూ జరిగే రోజులలో కూడా వారి మంచితనాన్నిచూచే పోలీసువారుసహా వారిజోలికి అట్టే పోతూవుండేవారుకారు.

---

## రావుసాహేబు డాక్టరు గోవిందరాజులుగారు

ఆ రోజులలో ఏలూరు కాలవక్రింద తూర్పువారి గుడి సెలు వేసవికాలంలో పరశురామప్రీతి అవుతూవుండడం, మిషను హైస్కూలు ప్రిన్సిపాలు మార్టిన్ బ్రౌనుగారు మండుతూవుండే గుడిసెల ఆకులూ వాసాలూ లాగివేస్తూ వుండడం, గోవిందరాజులుగారివంటి శిష్యులు కాలవలో నుంచి నీళ్లు తెచ్చి మంటలార్పుతూవుండడం జరుగుతూ వుండేది. బ్రాహ్మమత ప్రచారకులు పిల్లారిసెట్టి సీతా రామయ్యనాయుడు, ఆర్య ధర్మోపదేశకులు ఆదిపూడి సోమనాథరావుగార్లవంటివారు ఊళ్లోకివస్తే వారి కథ లకూ, సభలకూ కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తూవచ్చింది కూడా గోవిందరాజులుగారే. ఇట్లా చిన్నప్పటినుంచీ సేవానురాగంగల గోవిందరాజులుగారు తమ మేన మామ డాక్టరు సుబ్బరాయలుగారు చూపిన మార్గాన్నే అనుసరించి తాముకూడా వైద్యులుగా తయారుకావడం వారి ప్రకృతికీ, ఆశయాలకూ తగివుంది.

గోవిందరాజులుగారు కలకత్తా జాతీయవైద్య విద్యా లయంలో తమ శిక్షణ పూర్తిచేసుకొన్నతర్వాత కొ న్నాళ్లు రంగూనులోను, మరికొన్నాళ్లు పెనుగొండలోను

వైద్యంచేసి ఆతర్వాత బెజవాడవచ్చినారు. వారి గౌతమ మెడికల్ హాలుకు పోతే బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు, కాంగ్రెసువారు జస్టిసువారు, సంస్కరణాభిలాషులు సనాతనులు, స్త్రీలు, శిశువులు—అన్ని తరగతులవారూ గుంపులుగా కనిపిస్తారు. కేవలం బాహుళ్యమయిన ప్రాక్టీసును పాటించినా, ద్రవ్యార్జనమే ప్రధానంగా పెట్టుకొన్నా యీపాటికి గోవిందరాజులుగారు కొన్నిలక్షలు నిలవచేసివుండేవారు. కాని ప్రజా సేవాభిలాష వొకమూల, దేశహితైక కార్యానురాగం మరియొక మూల వారి ద్రవ్యార్జనకు ఆటంకాలుగా ఏర్పడ్డాయి. బెజవాడవంటి కూడలిస్థానం వారి దేశహితైక జీవనానికి అనుకూలంగా వున్నప్పటికీ, లోపలనుండి పొంగివచ్చే ఉత్సాహం ఎక్కడ యేపనివస్తే అక్కడకు వారిని లాగుకొనిపోతూవుంటుంది. జబ్బల్‌పూరు రాష్ట్రీయ యాదవ సభ కానీయండి, పెన్‌కోట యాదవ యువజన సభ కానీయండి, ఆహ్వానం వచ్చిందంటే సొంత ఖర్చుతో పోయి అక్కడ దూకవలసిందే.

గోవిందరాజులుగారి జీవితం చాలావిశాలమయింది. వారు ఆంధ్రయూనివర్సిటీసెనేటులో వుండి ఉన్నతవిద్యకు దోహదమిచ్చినారు. బెజవాడ మునిసిపలు సభ్యులుగా

వుండి ఉన్నతపాఠశాలకు ప్రత్యేకభవన వసతి కల్పించడానికి, బందరు కాలవవంతెన ఏర్పాటు చేయించడానికీ, ఊళ్లో విద్యుద్దీపాలు పెట్టించడానికీ వారు పడిన శ్రమ, వారు చేసిన కృషి మరవడానికి వీలులేదు. కృష్ణా మండల విద్యాసంఘంలో వుండి విద్యాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు. బెజవాడ తాలూకాబోర్డు సభ్యులుగావుండి గ్రామారోగ్యాభివృద్ధికీ, నీటివసతికీ, ప్రాథమికపాఠశాలల విద్యాప్రణాళికను మార్గంలో పెట్టడానికీ, ఉపాధ్యాయుల జీతాలు సకాలంలో ముట్టడానికీ నడుముకట్టి పనిచేశారు. కాని యీలాటి పనులు వొక యెత్తుగాను, వైద్యులుగావుండి బీదలకు చేసే సహాయం మరొక యెత్తుగాను చూడవలసివుంటుంది. వారివద్దకు మందులకని వచ్చేవారిలో డబ్బిచ్చితీసుకుపోయేవారికంటె ఉచితంగా తీసుకొనిపోయేవారున్నూ, పాలకనీ, రొట్టెకనీ రొక్కం తీసుకుపోయే బీదవారున్నూ—యిలాంటివారే అధికం. వారి వైద్యవృత్తివిధానంలో ద్రవ్యార్జనాభిలాషకంటె బీదలకు సహాయంచేసే తలంపే మెండు.

ఉబ్బసం క్షయలవంటి మొండి రోగాలను, లివరు స్ప్లీనులకు సంబంధించిన క్లిష్టవ్యాధులను, చంటిపిల్లల యితర నున్నితపు వ్యాధులను చికిత్సచేయడంలో వారు చాలా

ప్రఖ్యాతిగాంచినారు. ఆప్రఖ్యాతినిబట్టే వారుఎంతో ధనికు లు కావలసింది. కాని డబ్బుఆశ లేక యెప్పటిచోట నే పడి వుంటున్నారు. ఇప్పటికీ వారు భాగ్యలక్ష్మిని దూరంగానే ఉంచుతున్నారు. ప్రజాసేవాభిలాష, మంచితనం, మొగ మాటం—వీటివల్లనూ, డబ్బుమీాది ఆశకంటె రోగం నయం చేసి పంపుదామనే అభిలాషే బలవత్తరంగా ఉండడం వల్లనూ ధనంవచ్చే చోటులలోకూడా వారి కది రాకుండా పోతూవుంటుంది. అభ్యసించింది అల్లోపతీ వైద్యవిధానమే. అయినా, ఆయుర్వేద యూనానీ విధానాలమీాద తగని అభిమానం వుంది. గౌతమవైద్యశాల బీరువాలలో అల్లో పతీ మందులు వుంటే యింటిముందు వసారాలో ఆయు ర్వేద మూలికలు గుట్టలుగా పడివుంటాయి.

గోవిందరాజులుగారి ఆకారం, వేషభాషలూ వారి నిష్కపటత్వాన్నీ, అమాయికత్వాన్నీ, అడాంబికత్వా న్నీ ప్రకటిస్తాయి. వారు చాలాకాలంజస్టిసుపార్టీప్రముఖు లలో వ్యవహరిస్తూ వచ్చినారుగాని, వారు తమ పార్టీకీ, పార్టీప్రముఖులకూ ఉపయోగపడ్డంతగా తమపార్టీనీ, తమ పార్టీనాయకులనూ స్వార్థంనిమిత్తం వుపయోగించుకున్న ట్లయితే యీా సరికి ఎంతో లాభం పొందివుండేవారు. అటువంటిది ఆయనధోరణిలోనే లేదు. అందుకనే జస్టిసు



రావుసాహేబు డాక్టరు గోవిందరాజులునాయుడుగారు



డాక్టరు జంధ్యాల దక్షిణామూర్తి శాస్త్రిగారు

పార్టీ అధికారంలోవున్న రోజులలోకూడా తంత్రాలూ మర్మాలూ అనేవి ఎరగకుండా, జస్టిసుపక్ష ఆదర్శాలలో ఒకటైన కులతత్వాలకు లొంగకుండా స్వయంవ్యక్తిత్వంతో ప్రవర్తించడం వారిపార్టీ వారికే వుపయోగించక పోవడానికి కారణం. బీదలకు వైద్యసహాయంచేయడం, భోజనం పెట్టడం, డబ్బుయివ్వడం—యీలాంటివాటి మీదికే మనసు పోనిస్తూ, బలిచక్రవర్తి మోస్తరుగా తమ మంచితనంక్రింద తామే నలిగిపోతూ, పోవలసినంత ముందుకు సాగిపోలేకుండా ఉన్నారు. చివరకు జస్టిసు ప్రభుత్వంలోనేగాక కాంగ్రెసుకాలంలోనే వారు రావుసాహేబు బిరుదంతోసన్మానింపబడినందుకు ఆశ్చర్యపడనివారు లేరు.

---

## డాక్టరు జంధ్యాల దక్షిణామూర్తిగారు

సుప్రసిద్ధులైన జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారి పుత్రులు. యువకులు. ప్రసిద్ధవైద్యులు. విశాఖపట్టణ వైద్య విద్యాలయంలో విద్య నభ్యసించి, తరువాత కొన్నాళ్లు రాయపురం వైద్యాలయంలోనూ, బెంగుళూరు మింటో నేత్ర వైద్యాలయంలోనూ, కలకత్తాలోని వృష్ణదేశీయ వ్యాధి చికిత్సాలయంలోనూ తగిన అనుభవాన్ని సంపాదించుకొని బెజవాడలో వైద్యమునందు ప్రవేశించి ఎనిమిదేండ్లుమాత్రమే కావచ్చినా ఈ స్వల్పకాలంలోనే ఎంతోఖ్యాతిని గడించుకొన్నారు. నేత్రవైద్యాన్ని ప్రత్యేకంగా అభివృద్ధిపరచి చికిత్సకులకు తమ చికిత్సాలయంలోనే పడకలను ఏర్పాటుచేసి చాలాశ్రద్ధ పుచ్చుకొంటూ వున్నారు. డాక్టరు దక్షిణామూర్తిగారి చికిత్సాలయాన్ని రోగుల సంఖ్యనుబట్టి ఆసుపత్రిగా భావించవలసి వుంటుంది.

దక్షిణామూర్తిగారు ఎంత ప్రసిద్ధిజెందిన వైద్యులైనప్పటికీ ద్రవ్యాన్ని ప్రధానంగా చేసుకున్నవారు కారు. బీద సాదలను కనిపెట్టి నడచుకొనే ఔదార్యవంతులు. కృష్ణా గోదావరి పుష్కరాలలో యాత్రికులకువారుచేసిన వైద్య

సేవను ప్రజలు ఎప్పటికీ మరువజాలరు. శాసనోల్లంఘన సమయంలో లాఠీదెబ్బలు తిని పడిపోయిన వాలంటీరులకు వైద్యోపచారం చేసేందుకు ముందుకు దుమికిన ధైర్యశాలి. వైద్యవృత్తి పెరిగి, అంతగా తీరికలేని వైద్యులైనప్పటికీ ప్రజోపయోగకరమైన ఏ కార్యము వచ్చినాసరే చేతనైన సహాయం చేస్తూవుంటారు.

ఈ మధ్యన కొంతకాలంనుంచీ మిత్రుల ప్రోద్బలం చేత మునిసిపల్ వ్యవహారాలలో ప్రవేశం కల్పించుకొంటున్నారు. ప్రజాభిమానాన్ని విశేషంగా సంపాదించుకొంటూవున్న దక్షిణామూర్తిగారు మునిసిపల్ ఎన్నికలలో గెలవడం అంత కష్టమైన పనికాదు. ఊః అంటే నడుము కట్టి పనిచేసేవా రెందరో కలరు. ఒకసారి ఎన్నికలలో వారికి పోటీయే లేదు. తరువాత రెండుసార్లు మిక్కిలి సునాయాసంగా గెలుచుకొని వచ్చినారు. మునిసిపల్ ప్రభుత్వంలో పాదుకొనివున్న బలహీనపు పట్టులను సవరించుటకున్నూ, మునిసిపాలిటీ ద్రవ్యాన్ని ఎక్కువ ప్రయోజనకరమైన మార్గాలకు త్రిప్పుటకున్నూ దక్షిణామూర్తిగారు పట్టుదలతో పనిచేస్తూవున్నారు.

దక్షిణామూర్తిగారు చూపులకు చిన్న వస్తాదులాగా కనిపిస్తారు. దేహసౌష్ఠవం,జబ్బ పుష్టిగల యువకులు.చిన్న

ఈ పనులతో తృప్తిపడి వూరుకోలేదు. స్వ కుల స్థులలో బయలు దేరే వివాదాలను పంచాయతీల మూలంగా పరిష్కరిస్తూ వచ్చినారు. కుంభకోణంలో జరిగిన ఆర్యవైశ్య మహాసభకు ఆధిపత్యం వహించి, వైశ్యుల అభ్యున్నతికై గొప్ప ప్రబోధం గావించారు. మునిసిపల్ సభ్యులుగా వుండి నగరాభివృద్ధికీ, వాణిజ్యసంఘ సభ్యులుగావుండి వర్తకులకూ తోడ్పడుతూ వచ్చినారు. ఆర్యవైశ్యసంఘాన్నీ, ఆమూలంగా ఆంధ్ర సంఘాన్నీ సేవిస్తూ, దేశహితైక జీవనంలో మగ్నులైన పద్మనాభం గారికి తీరిక అనేది బహుస్వల్పంగా వుంటూవచ్చినప్పటికీ 1918-19 సం. లలో బయలుదేరిన కరవు సమయంలో వారు చేసిన సేవ మరపుకు రాదు. ప్రభుత్వం వారుసహా వారి కృషిని మెచ్చుకొని రావుబహద్దూరు బిరుదుతో సన్మానించారుగాని దానిని విని సంతోషించడానికిపూర్వమే మృత్యువుపాలైరి. అటు ప్రజలయొక్క, యిటు ప్రభుత్వంయొక్క మన్ననలకు పాత్రులై తమ కాలాన్నీ, తమ శక్తినీ స్వకులాభివృద్ధికై, దేశాభ్యున్నతికై వినియోగించిన నాయకులుగా రావుబహద్దూరు నాళం పద్మనాభంగారు స్మరింపబడుతూ వుంటారు.

———



కీ. శే. రావుబహద్దూరు నాళం పద్మనాభంగారు



రావుసాహేబు ప్రెసింగు వెంకటరంగయ్యగారు

## రావుసాహేబు ప్రెశింగు వెంకటరంగయ్యగారు

ఆంధ్ర దేశంలో విద్యలేక, ద్రవ్యంలేక, కులవృత్తుల ను బాగుపరచుకోవడానికి వసతులులేక కష్టపడుతూ వున్న కులాలవారు ఎందరో వున్నారు. అథవా, వారిలో విద్యావంతులు వున్నప్పటికీ వారు తమ కులంపేర ఉద్యోగం సంపాదించుకొనే విషయంలోతప్ప కులాభివృద్ధినిమిత్తమై ప్రయత్నంచేయడం తక్కువ. ద్రవ్యవంతు లున్నప్పటికీ వారు తమ ద్రవ్యాన్ని వృద్ధిచేసుకోవడంతప్ప కులాభివృద్ధి విషయం ఆలోచించడం తక్కువ. ఈ కారణంచేత మన దేశంలో ప్రత్యేక కులసభలు జరుగుతూ, ఆందోళన చేస్తూవున్నప్పటికీ సామాన్య జనక్షేమానికీ, సౌఖ్యానికీ అవి అంతగా ప్రయోజనపడడం లేదు.

బందరునివాసులూ, అగ్నికులక్షత్రియులూ అయిన ప్రెశింగు వెంకటరంగయ్యగారు ఆంగ్లవిద్యాధికులుకారు. నవనాగరికసంప్రదాయానికి చెందిన వారూ కారు. అయినప్పటికీ స్వకులాభివృద్ధికై వారుచేసిన పరిశ్రమ మన ఆంధ్ర దేశంలో ఎవరూచేయలేదు. కులాభివృద్ధికార్యాలు సాధించడం అంత సుకరమైన విషయంకాదు. గౌరవార్హమైన కులవృత్తులను బాగుపరచుకోవడానికి అనుకూల

మైన వసతులు కల్పించడమూ, లేక హూణవిద్యావంతు లనుగాచేసి, అధికారం హెచ్చినకొద్దీ కులానికి దూరంగా వుంచే ఉద్యోగాలు చేయించడమూ అనే ప్రశ్నలకు వచ్చే సమాధానంమీద యీ కులాభివృద్ధి విధానం ఆధా రపడివుంది.

వెంకటరంగయ్యగారు స్వకులాభివృద్ధికిగాను చాలా ప్రయాసపడ్డారు. బందరులో విద్యార్థులకు వసతి గృహాన్ని యేర్పాటుచేశారు. భోజనం, జీతం, పుస్తకాలు మొదలైన సదుపాయాలు చాలామందికి చేయించారు. ప్రథమ అగ్నికులక్షత్రియ (పల్లీలు) మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగావుండి సంఘాభివృద్ధికి పునాదులు వే యించారు. యుద్ధసమయంలో రెండుమూడు లక్షలు వెచ్చించి, చాప ఓడలను కట్టించి, కోస్తావ్యాపారం జరి పిన సాహసులు. కంట్రోలు సమయంలో బియ్యాన్ని బీద లకు చవుకగా అమ్మించిన ప్రజాభిమాని.

బందరు జిల్లాకు ముఖ్యపట్టణం. విద్యావంతులూ, ధని కులూ, వర్తకులూ యెందరోవున్నారు. పూర్వం పెద్ద రేవు పట్టణంగానూ, వ్యాపారస్థలంగానూ పేరుపొంది యిప్పుడు పడిపోయింది. తిరిగీ దానికి పూర్వపుకీర్తిని కొంతవర కైనా నిలబెట్టే గౌరవం వెంకటరంగయ్యగారికి దక్కింది.

వారి కృషివల్ల ప్రస్తుతం యెన్నో కంపెనీల ఓడలు బం దరు రేవుకు వచ్చి ప్రత్తి, చమురుగింజలు, పొగాకు, తోళ్లు మొదలైనవాటిని వేసుకొనిపోతూవున్నాయి ; సరకులు దింపుతూవున్నాయి. ఈ స్టీమర్లను రప్పించడానికిన్నీ, వచ్చినతర్వాత సరకులను చేర్చడానికిన్నీ వెంకటరంగ య్యగారు యెంతో శ్రమపడ్డారు. ఈ మూలంగా ప్రస్తుతం నాలుగైదువందలమంది కార్మికులకు పనిపాటులు యేర్ప డ్డాయి. సరకులు వేసుకొనివెళ్లడానికి పడవలులేకపోతే, వెంకటరంగయ్యగారు తమ చాపఓడలను పగులకొట్టించి, చిన్నపడవలుగా మార్చిన సాహసులు. ఓడలకు సరకులు లేకగాని, యితర కారణాలవల్లగాని పనిలేనప్పుడు నష్ట పరిహారంక్రింద రోజుకు 500 రూపాయలకు హామీయిస్తే గాని రామంటే హామీయిచ్చిన ధైర్యశాలి. ప్రస్తుతం బం దరుకోటలో తిరిగీ స్టీమర్ల యీలలు వినిపిస్తూవున్నాయి. కార్మికులకు పనిపాటులు యేర్పడ్డాయి. కోటకు కళాకాం తులు వచ్చినాయి. ఇదంతా వెంకటరంగయ్యగారి చలవే.

వెంకటరంగయ్యగారు కేవలం కులాభివృద్ధినే ప్రధా నంచేసుకొన్న సంకుచితాభిమానులు కారు. బెంచి మేజ స్ట్రేటుగా, మునిసిపల్ కౌన్సిలరుగా, శాసనసభ్యులుగా వుండి తమ కులం, తమ పట్టణం, తమ దేశం—ఇన్నిటి

యొక్క క్షేమానికీ, గౌరవానికీ ప్రయత్నంచేసిన విశాల హృదయులు. తమ శక్తికొలదీ అందరికీ సహాయంచేసే ప్రజాభిమాని. ప్రభుత్వాదరణకు పాత్రులై, రావుసాహేబు బిరుదాంకితులయినప్పటికీ గర్వం ఎరుగని, కపటంలేని అగ్నికులక్షత్రియనాయకులు.

---



రావుసాహేబు కఱ్ఱి అప్పలస్వామి రెడ్డిగారు



రావుసాహేబు కల్లి చిట్టి అబ్బాయి నాయుడుగారు

## రావుసాహేబు కళ్లి చిట్టి అబ్బాయినాయుడుగారు

కాపులు. పిల్లజమీందారులు. అయినా, యెక్కడా జమీందారీఠీవులు కనపడవు. అక్కడ పూళ్లకు వెళ్లినా, ఇక్కడ పవరుపేటలో చూచినా ఆవులు, బండ్లు, ఎడ్లు ఇలాటి రైతుపరిసరాలలోనే వారి నివాసం. ఇప్పటికి 25 లేక 30 ఏండ్లనుంచి తమ పలుకుబడిని తమ కత్యంత ప్రియమైన గ్రామసీమల అభివృద్ధి కే వినియోగిస్తూవచ్చిన సంపన్నరైతను పేరు ప్రయోగినారుగాని స్వప్రయోజనపరు లనుమాట పడలేదు. పూళ్ల యూనియన్ బోర్డు, పంచాయితీ బోర్డు—యీలాటి సంస్థల ఆధిపత్యం చాలాకాలం వహించి, వాటి ప్రయోజనాలను గ్రామాదులకు లభింపజేసి, పూళ్లను చుట్టుపట్లగ్రామాదులకు తలకట్టుగా మార్చిన సేనాధిపతి. తాలూకా బోర్డు, జిల్లా బోర్డులలో ప్రవేశించి, విద్యాభివృద్ధి, ఆరోగ్యం, నీటి వసతి, క్రీడావినోదాలు మొదలైనవాటి ప్రయోజనాన్ని గ్రామాలకు లభింపజేసిన నాయకుడు.

చిట్టి అబ్బాయిగారు పెద్దపెద్ద చదువులకు పోలేదు. విశ్వవిద్యాలయ తరిఫీదు పొందలేదు. పాఠశాలల విద్య తాకలేదు. ఆధునిక విద్యాలయాలకు వా రింతదూరంగా

పెరిగినప్పటికీ స్వయంకృషివల్ల వ్యవసాయ సమస్యలను క్షుణ్ణంగా తెలుసుకొన్నారు. గ్రామపునరుద్ధరణకు కావలసిన జ్ఞానాన్ని సంపాదించుకొన్నారు. గ్రామవాసుల కష్టసుఖాలను జీర్ణించుకొన్నారు. అది కంట్రోలు సమయం. రైతు లందరూ గోలపెడుతున్నారు. చిట్టి అబ్బాయిగారు పూళ్ళలో జరిగిన నాల్గవకృష్ణామండల సన్మానసభాధ్యక్షులుగా వుండి కంట్రోలును బాదిన దెబ్బలు ప్రభుత్వానికి తగిలి, వారు దాని లోటులను సవరింపవలసినవారైనారు. కుందేరుసభలో సీటితీరువను హెచ్చు చేయగూడదని చేసిన నిరూపణ యిప్పటికీ మొక్కపోని ఉక్కుముక్కగా వుంటూవుంది. అనేక రైతుసభలఅధ్యక్షపీఠాన్ని వహించి వారు చేసిన ఉపన్యాసాలూ, విమర్శనలూ రైతుల గోడును తెలుసుకోగోరువారికి యిప్పటికీ ప్రమాణాలుగానూ, పురాణాలుగానూ వుంటున్నాయి.

ఇన్నివిధాలుగా రైతుజీవనాన్ని శోధించి, రైతుపక్షాన్ని అవలంబించి, రైతుకష్టాలను బహిర్గతం చేస్తూ వచ్చిన చిట్టి అబ్బాయిగారిని రైతులపెద్దగా మెంచి, గోదావరి వెస్టరన్ డెల్టా ఇర్రిగేషను అడ్వయిజరీ బోర్డు మెంబరుగానూ, వ్యవసాయకళాశాలదర్శకులుగానూ ప్రభుత్వంవారు నియమించడంలో గొప్ప ఏమీలేదు.

ఇక రైతుజనావళికి వారు కల్పించిన కొన్ని ప్రయోజనాలు మన రైతులను తీరని ఋణంలో పడవేస్తూవున్నాయి. చిట్టి అబ్బాయిగారు విస్తీర్ణమైన తమ భూములలో సిస లైన ఒక పొలాన్ని ఆదర్శ క్షేత్రంగా మార్చి, పచ్చి యెరు వుల విషయమై తేల్చిన సారాంశాన్ని ప్రభుత్వంవారు సహా మెచ్చుకొన్నారు. "నిరుపయోగంగా చూడబడే జీలుగ సారంలేని భూములకు పెద్దసారం సుమా" అని అబ్బాయిగారు తేల్చినారు. వారు యింతటితో తృప్తి జెంది వూరుకోలేదు. చెరకుంలో రెండు మూడు క్రొత్త రకాలనుకూడా వుత్పత్తిచేసి క్రొత్తదారిని చూపారు.

ఈ ప్రకారంగా వ్యవసాయవిషయాలలో క్రొత్త దారులు త్రొక్కి, క్రొత్త ప్రయోజనాలను కల్పించిన చిట్టి అబ్బాయిగారు సాంఘిక విషయాలలో మాత్రం వెనుకబడివుంటారా? ఉండరు. స్వగ్రామమైన పూళ్ల లో చాలాకాలం ఒక పాఠశాలను నిర్వహించి విద్యాభి వృద్ధికి తోడ్పడ్డారు. తమ పెద్ద కుమార్తెకు యమ్. ఏ. వరకూ విద్య చెప్పించి ఆమెను ఒక విదుషిగాచేసి, అగ్ర కులయువకుని కిచ్చి జాత్యభివృద్ధికి దారిచూపినారు. చిట్టి అబ్బాయిగారు రైతని చెప్పితిని. కాని వారు రైతు లలో ఆదర్శపురైతు; సంస్కర్తలలో తిరుగుబాటుతో

ప్రసక్తిలేని సంస్కర్త. ఇన్ని విధాలుగా గ్రామజీవనాన్ని పోషిస్తూ, గ్రామోద్ధరణకు తోడ్పడుతూ వున్న కళ్లి చిట్టి అబ్బాయినాయుడుగారిని ప్రభుత్వంవారు ఎప్పుడో చాలాకాలంక్రిందటనే రావుసాహేబు బిరుదుతో సత్కరించివున్నారు.

---

## రావుసాహేబు ఆలపాటి కుటుంబరావుగారు

ఏ సత్కార్యమయినా సరే, బెజవాడవర్తకులలో యెవరు సహాయంచేసినా యెవరు చేయకపోయినా, ఆలపాటి కుటుంబరావుగారు చేస్తారనే అభిప్రాయం బెజవాడలో అల్లుకుపోయింది. ఇది వారి మంచితనంచేతనూ, ఉపకారబుద్ధిచేతనూ, దాతృత్వ స్వభావంచేతనూ వచ్చినవాడుకగాని వట్టి మాటలచేత వచ్చిందికాదు. ఇండ్లుకాలి బీదలు కష్టపడుతూ వుంటారు: ముందు యింత గంజిపోసి ప్రాణం నిలపడానికి నాలుగు బస్తాలబియ్యం యిచ్చేది కుటుంబరావుగారే. కుష్ఠరోగులకు శరణాలయ నిర్మాణ ప్రయత్నం వస్తుంది: "వీళ్లకు శరణాలయం ఏమి" టని తక్కిన అందరూ ప్రశ్నిస్తూవుంటే, దీనికి ముందుగా చందా వేసేదీ, ఇతరులచేత వేయించేదీ ఆలపాటివారే. ఎవరో పండితుడు వస్తాడు: అంతా తలకొకమాట అంటూ వున్నా, ఎదుటివాళ్ల మనస్సుకు కష్టం తోచకుండా గోప్యంగా రెండువరహాలిచ్చి పంపేదికూడా వారే.

"కుటుంబరావుగారి చిత్రపటం వ్రాయించివేయడానికి యీాయన యేమిచేశాడయ్యా?" అన్నారు ఒకరు. "బెజవాడవర్తకులలో ధర్మగుణం అంటూ వుంటేకుటుంబరావుగారిలోనే వున్నదయ్యా" అన్నాడు యింకొకాయన.

ఇందులో అతిశయోక్తి యేమీలేదు. కన్యకా పరమేశ్వరీ అన్నసత్రానికీ, ఆలయానికీ, హిందూపాఠశాలకూ కార్యదర్శిగావుండి వారుచేసిన కృషే వారి విద్యాభిమానానికీ, సేవాభిలాషకూ తార్కాణం.

బెజవాడకొండలు వేడిగాలిని తోలుతూ వుంటాయి. నీటికొళాయిదగ్గరకు పోతే ఆవిరితేలే వేడినీళ్లు. పొరుగూళ్లనుంచి వచ్చేబీదలు యెండలోమాడి నాలుక పీక్కొనిపోతూ, ప్రాణాలు నిలుపుకోవడానికి మంచినీళ్లు దొరక్క బాధపడుతూవుంటే ఆలపాటివారు ప్రతిసంవత్సరం వేసంగిలో చలివేంద్రలు పెట్టించి చల్లటినీళ్లూ, ఆకలిగొన్న వారికి యింత జావా పోయించి పంపుతూవుంటారు. సంవత్సరానికి వొకసారి బీదలకు బట్టలిచ్చి ఆదరిస్తారు.

మృత్యువుకు ధనిక దరిద్ర భేదాలు లేవు. యముడు సమవర్తి. రుద్రభూమికి పోయేవారు అక్కడ యెండకు యెండి, వర్షానికి తడిసి చిక్కులు పడుతూవుంటారు. తల దాచుకోవడానికి ఒక పాకకూడా లేదు. త్రాగడానికి మంచినీళ్లు వుండవు. ఎవరో యీ సంగతిని కుటుంబరావు గారి చెవిలో వూదారు. మంచినీటి సదుపాయంతోకూడా ఒక పాక వేయించి నీడపట్టును అమర్పించింది ఆ దయాసంకలిత హృదయుడే.



రావుసాహేబు ఆలపాటి కుటుంబరావుగారు



రావుసాహేబు గొల్లపూడి
నరసింహారావు పంతులుగారు

కుటుంబరావుగారు యిప్పటికి పదేళ్లనుంచీ ఆనరరీ మేజస్ట్రీటు; జెయిలునుంచి విడుదలై వచ్చేవారికి సహాయంచేసే సంఘంలోనూ, రెడ్ క్రాసు సొసైటీలోనూ, యింకా ప్రయోజనకరమైన యితర సంఘాలలోనూ సభ్యులు, పోషకులు; బెజవాడ, దోసపాడు, అంగలూరు, పెంగొలను మొదలైనచోట్లవున్న రైసుమిల్లులకు మేనేజరు; కమీషను యేజంటు; దేవాలయాలకు ట్రస్టీ; హిందూ హైస్కూలుకు కార్యదర్శి. ఆలపాటి కుటుంబరావుగారు ఇట్లా వ్యాపారంలోనూ, ప్రజోపయోగమైన కార్యాలలోనూ ముందడుగు వేస్తూ వరదలనీ, యిండ్లు తగలబడ్డవనీ వచ్చేవారికి చందాలూ, బడిపిల్లలకు జీతాలూ, పండితులకు వార్షికాలూ యిస్తూ ఏ సత్కార్యం వచ్చినాసరే సహాయంచేస్తూ బెజవాడ వైశ్యులలో ధర్మాత్ముడనే ఖ్యాతిని పొందినారు. ప్రభుత్వంవారు వారికి రావుసాహేబు బిరుదు ఇచ్చి తమ ఆదరభావాన్ని విశదీకరించారు.

---

## రావుసాహేబు గొల్లపూడి నరసింహారావు పంతులుగారు

బెజవాడలో వర్తకులును, పురప్రముఖులలో ఒక్కరును, ప్రజోపయోగకార్యాభిలాషులును అయిన గొల్లపూడి నరసింహారావుపంతులుగారి ప్రజాసేవాభిలాష మొట్టమొదట కృష్ణాపుష్కర సమయంలో బీదలకుచేసిన భోజనపుయేర్పాటుల సందర్భంలో ప్రకటితమయింది. ఆపుష్కరసమయంలో సర్కారువారి అంచనాప్రకారం అధమం 50,000 మందికైనా అన్నదానం చేయబడింది. ఏ విధమైన యిబ్బందీ లేకుండా, యిట్లా యిన్నివేలమందికి సంతృప్తికరంగా అన్నదానం చేయబడిందంటే అది నరసింహారావుగారి కృషిఫలితమే అనిఅందరూ అంటారు. అప్పుడు సబ్ కలెక్టరుగావుండిన శివశంకరంగారు పుష్కరకమిటీకార్యదర్శి నరసింహారావుగారి అమూల్యసహాయాన్ని ప్రశంసించివున్నారు. ఆ తెరువాత, యిప్పటికి పంద్రెండేండ్లనుండి ఆరోగ్య, శిశురక్షణ వారాలు జయప్రదంగా గడచిపోతూవున్నాయంటేనూ, వానికి కావలసిన ద్రవ్యసహాయం ప్రజలవద్దనుండి లభిస్తూవున్నదంటేనూ యీ గౌరవంకూడా నరసింహారావుగారిదే.

బీదలయిండ్లు తగులబడి, వుండడానికి యిల్లు, త్రాగ డానికి గంజి అయినా దొరకక అల్లాడుతూవుండే సమ యంలో బీదలను నిలబెట్టడానికి శ్రమచేసిందిన్నీ నరసింహా రావుగారే. ఇంకా, రెడ్ క్రాసుసొసైటీవారి నిధికిన్నీ, కృష్ణాజిల్లా కలెక్టరు ఫ్రేజరుగారిసతి శ్రద్ధపుచ్చుకొంటూ వచ్చిన కుష్ఠచికిత్సాలయనిధికిన్నీ వారి పరిశ్రమ మూ లంగానే ద్రవ్యసహాయం లభించి కార్యం సఫలమైంది. క్వెట్టా భూకంపనిధి, వుప్పెనబాధితుల సహాయనిధి-యీ లాటి ఏ కార్యంవచ్చినా నరసింహారావుగారు సంతోష పూర్వకంగా ముందుకువచ్చి తోడ్పడే స్వభావంకల వారు. సాంఘికసేవాభిలాషతో ప్రజోపయోగకార్యా లకు తోడ్పడుతూవున్న నరసింహారావుగారిని ప్రభుత్వం వారు బెజవాడలో ఫస్టుక్లాసు బెంచికోర్టు ప్రెసిడెంటు గానూ, ఆనరరీ అసిస్టెంటు రిక్రూటింగు ఆఫీసరుగానూ నియమించి గౌరవించారు. రావుసాహేబు బిరుదం యిచ్చి సన్మానించారు.

## రావుసాహేబు కర్రి అప్పలస్వామిరెడ్డిగారు

అప్పలస్వామిరెడ్డిగారు చాలాకాలం రాజమండ్రి మునిసిపల్ కౌన్సిలరు, తరువాత వైసు ఛేర్మను, ఛేర్మను. కాని రెడ్డిగారు ఆ మునిసిపాలిటీగొడవలో పడి స్వకులాభివృద్ధినీ, ప్రజాక్షేమాన్నీ మరచినవారు కారు. వారు ఉత్తర సర్కారుల రెడ్డి మహాజన సంఘానికి అధ్యక్షులై రెడ్డియువకుల విద్యాభివృద్ధికి ప్రోత్సాహమిచ్చినారు. క్వెట్టాలోను, బీహారులోను భూకంపంవచ్చి ప్రజలు కష్టపడే సమయంలో నడుముకట్టి వారి సహాయార్థం చందాలు వసూలుచేసి ఆపదలోవున్నవారికి తోడ్పడ్డారు. ఐదవ జార్జిచక్రవర్తిగారి రజతోత్సవంలో శ్లాఘ్యమైన యేర్పాట్లుచేసి ప్రభుత్వంవారి సన్మానానికి పాత్రులైనారు.

రెడ్డిగారు దేవాలయ పరిపాలకసంఘంలోనూ, సెకండరీ విద్యాసంఘంలోనూ మెంబర్లు. జిల్లా విద్యాభివృద్ధి సంఘానికి అధ్యక్షులు. ఇప్పటికి 15 యేళ్లక్రితం దేశహితైకజీవనంలో ప్రవేశించి తమ శక్తికొద్దీ ప్రజాక్షేమానికి కృషిచేస్తూవున్న సేవానురాగులు. వారు మునిసిపల్ ఛేర్మనుగానూ, యితరవిధాలగానూచేసిన ప్రజోపయోగకరమైన కార్యాలకు మెచ్చి ప్రభుత్వంవారు వారిని రావుసాహేబుబిరుదుతో సత్కరించారు.

# రావుబహద్దూరు దహగం లక్ష్మీనారాయణగారు

ఇప్పటికి సుమారు 125 సంవత్సరాలక్రిందట హైదరాబాదు రాజ్యంలోని మంతెన గ్రామంనుండి దహగం పుల్లయ్యగారనే బ్రాహ్మణులు మధ్యరాష్ట్రాలలోని కాంప్టీలో నివాసం ఏర్పరచుకొని క్రమంగా ధనవంతులైనారు. వీరి పుత్రులైన లక్ష్మీనారాయణగారు కాంప్టీలోనే పుట్టి పెరిగారు. చదువు మానుకొన్నతరువాత మైకాగనులకు అధిపతులై నెలకు సుమారు 10,000 గడిస్తూ లక్షాధికారులైనారు.

జిల్లాబోర్డు మెంబరు, ఆనరరీ మేజస్ట్రేటు, బీరారు-మధ్యరాష్ట్రాల ఇండస్ట్రియల్ బోర్డు మెంబరు, మధ్యరాష్ట్ర శాసనసభాసభ్యులు, నాగపురం పయొనీరు ఇన్‌ష్యూరెన్సు కంపెనీ ప్రెసిడెంటు—యీలాంటి గౌరవ పదవులు అనేకం వహించి ప్రసిద్ధిపొందినారు. తమ జీవిత కాలంలో వైద్యశాలలకు, విద్యాలయాలకు భూరివిరాళాలున్నూ, ఆంధ్రవిశ్వవిద్యాలయానికి అమూల్యమైన పుస్తకభాండాగారమున్నూ యివ్వడంతో తృప్తిచెందక, సుమారు 50 లక్షల రూపాయల ఆస్తియావత్తూ ప్రజోపయోగకరకార్యాలకు వినియోగించేటట్లుగా విల్లువ్రాసి

యీమధ్యనే మృతిచెందినారు. ఇందులో సుమారు 25 లక్షల రూపాయలు నాగపురం విశ్వవిద్యాలయానికే దఖలుచేశారు.

మన ఆంధ్రులలో యింత పెద్ద మొత్తాన్ని ధర్మ కార్యాలకు వినియోగపరిచినవాళ్లెవరూ లేరు. బెంగుళూరు రిసర్చి ఇన్‌స్టిట్యూటు స్థాపకులు టాటా, అణ్ణామలై విశ్వవిద్యాలయ స్థాపకులు అణ్ణామలై చెట్టియారు లాటి మహాదాతలతో పోల్చదగినవారు లక్ష్మీనారాయణ గారు. కాని, లక్ష్మీనారాయణగారివలె తమ ఆస్తిఅంతా దేశార్పణంచేసినవా రెవ్వరూ లేరు. ఈ నిరుపమాన దాతృత్వం వారికి అమరత్వాన్ని చేకూర్చింది.





రావుబహద్దూరు దహగం లక్ష్మీనారాయణగారు

## వల్లూరు సూర్యనారాయణరావుపంతులుగారు

మాసిపోయిన సూటు, అతుకులు వేసిన బూట్సు, ప్రాతబడ్డ నల్లటి టోపీ ధరించి, బందరు జిల్లా కోర్టుకు పోతూవుంటే "చూడు చూడు, సూర్యనారాయణరావు గారు కోర్టుకు పోతున్నా"రని స్కూలుపిల్లలూ, ఆడు వాళ్లూ మెల్లగా చెప్పుకుంటూవుండేవాళ్లు. వంట మనిషి పోరు పడలేకనో, లేక ఖర్చులు తగ్గించే వుద్దేశంతోనో పూటకూళ్ల యింటినుంచి ఇద్దరికి భోజనం తెప్పించి నలుగురు సర్దుకుంటూ వుండేవాళ్లు యింట్లో. ఇట్లా వ్యవహరిస్తూవచ్చిన సూర్యనారాయణరావుగారికి సంపాదన లోటా? తెలివి తేటలు లోటా? దేశాభిమానం లోటా? ఏదీ లేదు. అన్నీ వుండిన్నీ వారు బందరులో వుండినంత కాలమున్నూ పీనాసి అనే పేరే మ్రోగారు.

ఇట్లా పాతికేండ్లు బందరులో గడపి, సుప్రసిద్ధన్యాయవాదు లనిపించుకొన్న పంతులుగారు ప్రాణమున్నంత వరకూ కోర్టులను పట్టుకొని దేవులాడక, తమ ప్రాక్టీసును మూటగట్టి అవతల పారవేసి, చివరకు గోదావరీతీరం చేరి, అక్కడ పూర్తిగా మారిపోయారు. ఆంధ్రగీర్వాణ విద్యాపీఠస్థాపకులగు తల్లాప్రెగ్గడ సూర్యనారాయణరావు

గారు చనిపోయి, ఆ విద్యాపీఠం వుంటుందా చస్తుందా అనే సందేహంతో అంతా కొట్టుకొనే సమయంలో మన వల్లూరు సూర్యనారాయణరావు పంతులుగారే దానికడ్డుపడి, దానిని జాగ్రత్తగా నిర్వహించుకొనివచ్చినారు. ఆదాయవ్యయాలను సరిపుచ్చి మంచిస్థితిలోకి తేగలిగారు.

సూర్యనారాయణరావుపంతులుగారు ఆ విద్యాలయ నిర్వాహకత్వాన్ని తమమీద వేసుకొన్నతర్వాత, యెప్పుడైనా యివ్వనీ, అప్పుడప్పుడు యిస్తూవచ్చిన 12,000 రూపాయలుగాక, యింకా 50 వేలను తమ మరణశాసనంలో వ్రాసియిచ్చిపోయిన గొప్ప విద్యాభిమాని; దాత. ఆ విద్యాపీఠానికేగాక బందరు ఆంధ్రజాతీయకళాశాలకున్నూ, తిలకుస్వరాజ్యనిధికిన్ని, బెజవాడలోని రామమోహన ఆయుర్వేదకళాశాలకున్నూ వేలకొద్దీ యిచ్చిన మహోదారులు. కష్టపడి ఆర్జించిన ద్రవ్యాన్ని ఇట్లా దేశీయకార్యాలకు యిచ్చివేయడమే కాదు, తమ న్యాయశాస్త్రజ్ఞానాన్నికూడా వినియోగపరచిన కార్యశూరులు. దేవాదాయాల, ధర్మాదాయాల ప్రయోజనం పోయి అవి మూలబడ్డ యీ కాలంలో తామే ఫిర్యాది, తామే న్యాయవాదివై, ఖర్చులన్నీ భరించి, ధర్మకర్తల ఆక్షేపణలకూ, పూజారుల నిందలకూ

తల వొగ్గుతూ, యీ సంస్థల నిర్వాహకత్వాన్ని నవరించడానికై వారు చేసిన కృషి మన దేశీయుల కృతజ్ఞతకు పాత్రమవుతూవుంది. వారి కృషివల్ల యెన్నో దేవాలయాలూ, ధర్మాదాయాలూ మంచి స్థితిలోకి వచ్చి, ప్రజకు వినియోగపడుతూవున్నాయి.

పంతులుగారికి సంగీతమం టేనూ, గ్రామోద్ధరణమం టేనూ చాలాయిష్టం. కొవ్వూరులో జరిగిన కృష్ణామండల సభలో కాబోలు గ్రామోన్నతికి సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ వా రానాడుపాడిన తరంగాలు, చదివిన పద్యాలు, చెప్పిన సుద్దులు, చేసిన నృత్యం—యిప్పటికీ కండ్లకు కట్టినట్టుగా కనిపిస్తూవున్నాయి. ఆనాటి వుపన్యాసం వుపన్యాసం కాదు; ఒక చిన్న కాలక్షేపం. పంతులుగారు వుపన్యాసాలిచ్చి, ఆంధ్రపత్రికలకు వ్యాసాలువ్రాసి, పుస్తకాలు రచించి, సామాన్యజనుల జ్ఞానాభివృద్ధికై చాలా శ్రమించారు. వర్ణాశ్రమధర్మపరిణామం అంతర్జాతీయధర్మశాస్త్రం, నానాదేశరాజ్యాంగ విధానం, మన స్వాతంత్ర్యం, స్వీయచరిత్ర—యీలాటి గ్రంథాలను తాము రచించడమేకాదు, ప్రజల జ్ఞానాభివృద్ధికి తోడ్పడే గ్రంథాలను వ్రాయించి, ముద్రింపించడానికై కొంత మూలధనాన్నికూడా ఏర్పాటుచేసిన జ్ఞానదాత.

శిక్షణ వేరు, అభిప్రాయాలు వేరు, మార్గాలు వేరు, ఆదర్శాలు వేరు. వారు ఇన్నిటిలోనూ ప్రత్యేకతను కలిగి, స్వేచ్ఛాజిజ్ఞాసువులైనప్పటికీ తమ సొంత అభిప్రాయాలను గీర్వాణవిద్యాలయపీఠనిర్వాహకత్వానికి అడ్డుపడనీయక తమ ద్రవ్యము, జ్ఞానము, సేవ సర్వస్వమూ దాని అభివృద్ధికై అర్పించి, చివరకు భౌతికయాత్ర చాలించిన సూర్యనారాయణరావుపంతులుగారి పేరు తరతరాల వారి జ్ఞప్తికీ పాత్రం కాగలదు.

---

## శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు

బ్రాహ్మణులు వ్యాపారానికి పనికిరారనీ, పాశ్చాత్యవిద్య మన ప్రాచీనసభ్యతపై ద్వేషంపుట్టిస్తుందనీ కొందరు చెప్పుతూవుంటారు. ఈ ఆక్షేపణలు నిలిచేవి కావని సూర్యనారాయణరావుగారి వృత్తాంతమే తెలుపుతూవుంది. సూర్యనారాయణరావుగారు సనాతనులు. ప్రతిసంవత్సరమూ దేవీనవరాత్రులలో పండితులకు శాస్త్రపరీక్షలు జరిపించి వారివారి అర్హతలకు తగినట్లు వార్షికాలేర్పరచి, ప్రాచీనశాస్త్రాలను పోషిస్తూవున్నారు. బెజవాడ గవర్నరుపేటలోని వారి గృహం ఆ తొమ్మిది రోజులూ ఎక్కడెక్కడి పండితులకూ నిలయమై, శాస్త్రవాదాలతోనూ, వేదఘోషతోనూ ప్రమోగుతూవుంటుంది. ప్రతిదినమూ పూజలూ, పండితసమారాధనలూ జరుగుతూవుంటాయి.

సూర్యనారాయణరావుగారు స్వధర్మ స్వరాజ్య సంఘాధ్యక్షులు. శాసనసభలద్వారా హిందూధర్మానికి వుపద్రవం కలగకుండా చూస్తూవుండడమే యీ సంఘంయొక్క ముఖ్యోద్దేశం. ఈ ఉద్దేశాన్ని సూర్యనారాయణరావుగారు తమ శక్తికొలదీ నెరవేరుస్తున్నారు.

1932–వ సంవత్సరంలో హరిజనోద్ధరణవిషయంలోగాంధీ మహాత్ముని యెరవాడ జెయిలులో దర్శించి, ఆసమస్యకు ధార్మికరూపం యివ్వడంకంటె రాజకీయరూపం యిచ్చి కృషిచేస్తే బాగుంటుందనీ, అప్పుడు సంఘంలో భిన్నాభిప్రాయాలు వుండవనీ, బలం చేకూరుతుందనీ విన్నవించి వున్నారు. హరిజనోద్ధరణకు అవలంబింపబడే పద్ధతుల సంబంధమైన భేదం తప్పితే, వారి అభివృద్ధికి పంతులుగా రెప్పుడూ సుముఖులే.

సూర్యనారాయణరావుగారు సనాతన వాదులైనా యథార్థానికి రాజకీయ, సాంఘిక, ఆర్థికాభివృద్ధికి విముఖులు కారు. బెజవాడ మునిసిపల్ సభ్యులుగావుండి నగరాభివృద్ధికి కృషిచేశారు. హోమ్‌రూలు లీగుకు అధ్యక్షస్థానం వహించి, రాజకీయ సంబంధమైన సేవచేశారు. టంగుటూరి ప్రకాశంపంతులుగారిచే మద్రాసులో నిర్వహింపబడుతూవుండిన 'స్వరాజ్య' పత్రికకు తమ బంగళాలోనే నివాసమిచ్చి, అవసరమైనప్పుడు ద్రవ్యసహాయం కూడా చేస్తూ ఆ పత్రికాభివృద్ధికి తోడ్పడ్డారు. బెజవాడలోని రామమోహన గ్రంథాలయానికి అనుబంధంగా విశాలమైన మందిరాన్ని నిర్మించి, గవర్నరుపేట ప్రాంతాలలో పురమందిరం లేదనే లోటును తీర్చినారు.



శ్రీ కౌతా సూర్యనారాయణరావుగారు



శ్రీ పోడవరపు దేవరాజుపంతులుగారు

పంతులుగారు చెన్నపట్టణంలో పెద్ద కర్మాగారానికి అధిపతులు. మన దేశస్థులకు కావలసిన యంత్ర సంబంధమైన సామగ్రిని సమకూర్చడంరూపంగా పరిశ్రమల పోషణకార్యం నిర్వహిస్తున్నారు. మద్రాసు బ్రాడ్వేలోని తమ కర్మాగారంలో మెషీన్లు, వుక్కు సామానులు మొదలైన రకరకాల వస్తువులనూ తయారుచేయించి ఆ లోటును తీరుస్తున్నారు.

సూర్యనారాయణరావుగారు సనాతనధర్మపక్షంవారైనప్పటికీ దేశోపయోగకరకార్యాలకు శత్రువులుకారు. ప్రాచీనవిద్యలను ఆదరిస్తూ, పారిశ్రామిక జీవనాన్ని ఫలవంతంచేస్తూ, పౌరజీవనానికి ఆవశ్యకమైన వార్తాపత్రికలకూ, పురమందిరాలకూ ద్రవ్యాన్ని వినియోగిస్తూ, హిందూశాస్త్రాలంటే అంతగా ఆదరణలేని యీ కాలంలో వాటిని నిలవబెట్టడానికి సూర్యనారాయణరావుగారు చేస్తూవున్న కృషికి మన దేశస్థులు వారి ఋణంలో పడివుంటున్నారు.

## శ్రీ చోడవరపు దేవరాజు పంతులుగారు

వృత్తులూ, పరిసరాలూ వ్యక్తులనూ, సంఘాలనూ యేవిధంగా మార్చివేస్తాయో తెలియడానికి లౌకిక జీవనంచేసే బ్రాహ్మణుల చరిత్రే తార్కాణం. దేవరాజు పంతులుగారు నియోగిశాఖలో పుట్టి, లౌకికవ్యవహారాలలో మునిగి తేలుతున్నప్పటికీ బ్రాహ్మణులకు విధివిహితాలైన వైదికకర్మలను నిర్వహించడం మూలాన్నే కాకుండా పౌర, గృహస్థధర్మాలను నిర్వహించడం మూలానకూడా, బెజవాడలో ప్రాముఖ్యం వహించివున్నారు.

పంతులుగారు భూస్వాములు. కంట్రాక్టర్లు. వైదికాభిమానులు. పాకయాజి. ఛాందసములేని వైదికమూ, ప్రజోపయోగకరమైననియోగమూ వారిలో ప్రబలంగా వుంటున్నాయి. బెజవాడ గవర్నరుపేటలో దివ్యమైన సత్రం నిర్మించి, విద్యార్థులకూ, వేళకువచ్చు అభ్యాగతులకూ భోజనాదివసతులు యేర్పరచి, అన్నదానంలో పేరుపడ్డారు. చోడవరంలోనూ, గవర్నరుపేటలోనూ ఆలయాలు కట్టించి, నిత్య ధూప దీప నైవేద్యాలూ, వుత్సవాది వేడుకలూ నిర్విఘ్నంగా జరుగుటకు కావలసిన యేర్పాట్లు చేసి, దైవభక్తు లనిపించుకొన్నారు.

శ్రీ చోడవరపు దేవరాజాపంతులుగారు

ప్రాచీన శాస్త్రాధ్యయనం చేసినవారికీ, పండితులకూ ఆదరణలేక వైదికవిద్యలు నశించిపోతూవున్న యీ కాలంలో, నవరాత్రాది పర్వదినాలలో పండితులను యథావిధిగా సత్కరిస్తూ, ప్రాచీనవిజ్ఞానపోషకు లనే ఖ్యాతిని సంపాదించుకొన్నారు. విద్యాభిమానులు. దాతలు. పండిత పోషకులు.

---

# శ్రీ అద్దేపల్లి హరిశ్చంద్రుడుగారు

హరిశ్చంద్రుడుగారు తమ జీవన సంగ్రామాన్ని కాకినాడలో వర్తకులుగా ప్రారంభించారు. అయితే, వారి మనసు వర్తకంమీదగాక దేశహితైక కార్యాలమీద పడింది. క్రమక్రమంగా ఆనరరీమేజస్ట్రేటు, మునిసిపల్ కౌన్సిలరు, వైసుఛేర్మను, జిల్లాబోర్డు మెంబరు—యీలాటి గౌరవపదవులను వహించి, పరిపాలనానుభవాన్ని సంపాదించుకొన్నారు.

హరిశ్చంద్రుడుగారి దృష్టి మెల్లగా స్థానిక సంస్థలపై నుండి శాసనసభలమీద పడింది. శరీరాన్ని వంచి పనిచేసే శక్తి, కార్యసాధనకు కావలసిన నేర్పరితనం, ప్రజను కట్టుకొనివచ్చే వుపాయం వారిలో అధికంగా వున్నాయి. ఈ సామగ్రి హరిశ్చంద్రుడుగారి శాసనసభాప్రవేశానికి చాలా తోడ్పడి, వారు గోదావరిజిల్లా సాధారణ ప్రాతినిధ్య వర్గంపక్షాన ఒకసారి కాదు, రెండుసార్లు యెన్నుకోబడు గౌరవం పొందారు.

హరిశ్చంద్రుడుగారు ఏపని మొదలుపెట్టినా జాగ్రత్తగాను, శ్రద్ధగాను చేస్తారు. శాసనసభలో వుండినంత కాలమున్నూ చేతులు ముడుచుకొని కూర్చోలేదు. రైతుకు సంబంధించిన వ్యవహారాలు చర్చకు వచ్చినప్పుడల్లా



శ్రీ అద్దేపల్లి హరిశ్చంద్రుడుగారు



శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుపంతులుగారు

ప్రజాభిప్రాయాన్ని వెల్లడించడానికి జంకలేదు. ప్రత్యే కాంధ్రరాష్ట్ర నిర్మాణాన్నిగురించి ఒకతీర్మానాన్ని ప్రవేశ పెట్టి దానిని నెగ్గించుకొన్నారు. చెన్నపురి రైల్వే అడ్వ యిజరీ కౌన్సిలు మెంబరుగా, అనంతపురపు ఆదిమాంధ్ర సభ, తూర్పుగోదావరిజిల్లా తెలగాలసభలకు అధ్యక్షు లుగా, రాజమండ్రిలోని సరస్వతీగ్రంథమాల స్థాపకు లుగా ప్రజలకష్టసుఖాలలో పాల్గొంటూ ప్రజను సేవిస్తూ వచ్చినారు. శాసనసభలోపలను, వెలుపలను వారిపేరు మ్రోగిపోయింది.

ఇంతలో కాకినాడ-రంగూనులమధ్య పోటీఓడలు బయలుదేరడంచేత బి. ఐ. వారికి ముల్లు గ్రుచ్చుకొన్నట్లు యింది. పలుకుబడిగల తెలుగువారి సహాయం కావలసి వచ్చి బి.ఐ.వారి కన్ను హరిశ్చంద్రుడుగారిమీాద పడింది. దీనితో హరిశ్చంద్రుడుగారి ప్రజాహితజీవితం బి. ఐ.వారి పాలై, వారు ఓడల రాకపోకలు,సరకులు,ప్రయాణస్థులు-యీాలాటిగాథలో పడ్డారు. హరిశ్చంద్రుడుగారు మెం దులోవున్నా ప్రజల కష్టసుఖాలను మరచేవారు కారు. మూడవతరగతి ప్రయాణికులు పడే యిబ్బందులను తొల గించి, యెక్కువ సౌకర్యాలను కల్పించే విషయంలో శ్రమతీసుకొని కార్యాలను సాధించుకొనివస్తున్నారు.

## శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు

గోదావరి జిల్లాకలెక్టరు కచేరీలో హెడ్డుఅకౌంటెంటువుద్యోగంలో ప్రారంభించి చివరకు ఆ వుద్యోగంలోనే పింఛనుపుచ్చుకొన్న సూర్యప్రకాశరావుగారు సర్కారు వుద్యోగాన్నే పరమావధిగా యెంచక తమ జీవితాన్ని ప్రజోపయోగానికై యెంతవరకు వినియోగించవచ్చునో అంతవరకూ వినియోగించిన ధైర్యశాలి.

కలెక్టరుకచేరీపని చేస్తూవున్నప్పుడే పిఠాపురంరాజావారి కళాశాలకౌన్సిలు సభ్యులుగానూ, కాకినాడమునిసిపాలిటీసభ్యులుగానూ యెన్నుకోబడ్డ సంగతేచాలు కాకినాడ పెద్దలకూ, పిన్నలకూ వారిపైగల గౌరవభావాన్ని విశదీకరించడానికి. వారు పింఛనుపుచ్చుకొన్న తరువాతకూడా 20 యేండ్లు వరుసన మునిసిపల్ సభ్యులుగా వుంటూవచ్చినారు. కొంతకాలం తాలూకాబోర్డులోనూ, జిల్లాబోర్డులోనూ సభ్యులుగా పనిచేశారు. ఇర్రిగేషన్ అడ్వయిజరీ బోర్డుప్రెసిడెంటుగావుండి గ్రామవాసులకు తోడ్పడుతూ వచ్చినారు. కాని, యీపనులన్నీ వొకయెత్తుగానూ, జిల్లా సంఘపు కార్యదర్శిగాచేసిన పనిని యింకొక యెత్తుగానూ చూడవలసివస్తుంది. యుద్ధసమయంలో యేర్పాటుపబడ్డ ప్రైజు కంట్రోలుపని కానియ్యండి, దక్షిణాఫ్రికాభారతీ

యుల సహాయనిధి కానియ్యండి, పరపతిసంఘాలకు సంబంధించిన పని కానియ్యండి—వారికి యేపని యిచ్చినా సరే దానిని తీక్ష్ణంగా, జయప్రదంగా నిర్వహించవలసిందే. బీదసాదలకు చేతనైనసహాయం చేయవలసిందే.

సూర్యప్రకాశరావుగారు సంఘసంస్కరణం అంటే చెవి తెగ్గోసుకొంటారు. వక్తృత్వానికి పేరు పడ్డారు. హాస్య ప్రసంగాలలో ఆరితేరిన చేయి. వ్రాతకోతలలో అనుభవశాలి. కీర్తిశేషులైన గంజాం వెంకటరత్నంపంతులు, కృత్తివెంటి పేర్రాజుపంతులుగార్ల అనంతరం గోదావరిమండల ప్రజాహితజీవనభారం వారి మీాదనే పడ్డది. వారి జాగరూకతవల్లనే పోలవరం జమీాందారుగారి పుస్తకభాండాగారం టవునుహాలుకు దక్కింది. రావుబహద్దూరు పైడా వెంకటాచలపతిగారి పురమందిరం ప్రజలవశంక్రిందనే వుండడం జరిగింది. ప్రకాశరావుపంతులుగారు ధనవంతులు కాకపోయినప్పటికీ తమ సేవయొక్క బరువును యితరులకు కలుగనీయకుండా వ్యవహరించడమే కాదు, తమ భీమామొత్తాన్ని హితకారిణీ సమాజానికీ, మరికొంత సొమ్మును రామచంద్రపురం హైస్కూలుకూ అర్పించిన పరోపకారులు.

# శ్రీ కంచర్ల రామబ్రహ్మంగారు

బందరు నివాసులు కంచర్ల శ్రీరామమూర్తిగారి పుత్రులు. తమ ఆలోచనలకూ, కల్పనాశక్తికీ, స్వతస్సిద్ధమైన సామర్థ్యానికీ బందరుఆవరణ సరిపోక వారు విశాఖపట్టణానికి వెళ్లిపోయారు. అక్కడ వర్తకము, కాంట్రాక్టుపనులు చేస్తూ అత్యల్పకాలంలో సిరిసంపదలనూ, పేరుప్రఖ్యాతులనూ గడించి, విశాఖపట్టణం వారిలో ముందుకు త్రోసుకొనిపోయారు. వా రెంత నిరాడంబరంగా కనుపించినప్పటికీ, సంభాషణ యెంత మృదువుగా వున్నప్పటికీ, విశాఖపట్టణంలో నేకాదు, చుట్టుపట్ల ప్రదేశంలోకూడా వారికి సంబంధంలేని పారిశ్రామికసంస్థయే లేదని చెప్పవచ్చు. విశాఖపట్టణం ట్రేడింగుకంపెనీ, విశాఖపట్టణం యెలెక్ట్రిక్కు సప్లయి కార్పొరేషన్, అనకాపల్లి యెలెక్ట్రిక్కు సప్లయి కార్పొరేషన్, ఆంధ్ర సీమెంటు కంపెనీ, ఆంధ్ర సినిటోన్ కంపెనీ, ఆంధ్ర ఫార్మసూటికల్ కర్మాగారము, చెన్నపురి యెనామిల్ కర్మాగారము, ప్రీమియర్ ఇన్‌షూర్యారెన్సు అండు బిల్డింగు సొసైటీ—యీలాటి సంస్థ లెన్నిటితోనో సంబంధంకలిగి, గొప్ప పారిశ్రామిక నాయకులుగా కీర్తి

వహించివున్నారు. శ్రీరామ వ్యవసాయ సంఘానికి అధిపతులై, వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుతూ వున్నారు. చెరకుతోటలను, కాఫీతోటలను ఆధునికపద్ధతులమీద వేయించి, పనిపాటులులేని కార్మికులకు పనులు కల్పించి కార్మికాభిమానాన్ని ప్రకటిస్తున్నారు. చెన్నపట్టణంలో ఎనామిల్ కర్మాగారాన్ని నెలకొల్పి నూతనపరిశ్రమలకు మార్గదర్శిత్వాన్ని వహిస్తున్నారు.

రామబ్రహ్మంగారింకనూ యువకులు. వారి విగ్రహం యెంత నిండయినదో వారి హృదయం అంత విశాలమయింది. వారి వ్యాపార మెంత బాహుళ్యమయిందో వారి దాతృత్వం అంత గాఢమయింది. ఏ సత్కార్యానికి, ఏ ప్రయోజనకరమైన వుద్యమానికి యిచ్చినా రహస్యంగా, గుప్పెటనిండా, చిరునవ్వుతో, సంతోషకరమైన మనస్సుతో యిస్తూవుండే కోమలహృదయులు.

హరిజనసంస్కరణం, దేవాలయ ప్రతిష్ఠ, నిరుద్యోగ పరిహారం, విద్యార్థులకు సహాయం-యీలాటి పనులంటే రామబ్రహ్మంగారు ముందుకు దుముకుతారు. హరిజనులకై తాము కట్టించిన దేవాలయపుప్రతిష్ఠను గాంధీమహాత్మునిచేతనే జరిపించుభాగ్యం రామబ్రహ్మంగారికి కలిగింది. బందరువారికి సహజమైన సాహసంతో, అనేక

పారిశ్రామిక సంస్థలతో సంబంధం కల్పించుకొంటూ, ఏ కార్యాన్ని ప్రారంభించినా దానిని జయప్రదంగా నిర్వహిస్తూ, ఏ ప్రజోపయోగకర కార్యం వచ్చినా దానికి ధారాళంగా తోడ్పడుతూ, పెద్ద వ్యాపారస్థులుగానూ, కర్మాగారాధిపతులుగానూ, పారిశ్రామిక నాయకులుగానూ, దేశహితైకాభిలాషులుగానూ, నిగర్వులుగానూ, దాతలుగానూ ప్రసిద్ధిచెందిన కంచర్ల రామబ్రహ్మంగారు ఆధునికాంధ్రు లందరకూ మార్గదర్శకులుగా వున్నారు.

---



శ్రీ కంచర్ల రామబ్రహ్మంగారు



శ్రీ అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు

## శ్రీ అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు

వైశ్యులు, గంగరాజుగారి దత్తపుత్రులు, వర్తకులు, ధనవంతులు, కాంగ్రెసుఅభిమానులు. బీదలకు అన్న దానం చేయడమంటేనూ, విద్యార్థులకు సహాయం చేయడమంటేనూ చాలా అభిమానం. తమ తండ్రి గారి పేరిట పాలకొల్లులో వొక ధర్మసత్రం స్థాపించి, బీదలకూ విద్యార్థులకూ దాని ప్రయోజనాన్ని విశేషంగా కలిగిస్తూ వున్నారు. ఇదిగాక పశ్చిమగోదావరిజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిలుసభ్యులై విద్యాభివృద్ధిని ప్రోత్సాహిస్తున్నారు.

పాలకొల్లు భాగ్యానికి ప్రసిద్ధిచెందినట్టే అనారోగ్యానికీ ప్రసిద్ధి పొందింది. అయితే సత్యనారాయణ మూర్తిగారు మునిసిపల్ సభాధ్యక్షులైనప్పటినుంచిన్నీ యీ అపఖ్యాతి చాలామట్టుకు తొలగిపోతూవుంది. విద్య, ఆరోగ్యం, నీటివసతి, రోడ్లు— యీలాటి పనులన్నీ సత్యనారాయణమూర్తిగారి శ్రద్ధకు పాత్రమైనాయి. 1931-వ సంవత్సరంనుండి వారు పోటీ లేకుండానే పురపాలక సంఘాధ్యక్షులుగా ఎన్నుకోబడుతూ వున్నారు. వారి పలుకుబడినీ, కార్యోత్సాహాన్నీ ప్రజాక్షేమాభిలాషనూ

తెలుపుటకు యీ వొక్క సంగతే చాలు. సత్యనారాయణమూర్తిగారు ప్రజోపయోగకరమగు కార్యాలన్నిటికీ తోడ్పడుతూ, పాలుకొల్లుకే కాకుండా చుట్టుపట్ల ప్రాంతాలకుకూడా ఆభరణంగా ప్రకాశిస్తూవున్నారు.

---

## శ్రీ చుండూరు సీతారామయ్యగారు

ఇప్పటికి 20 యేండ్లనుంచి దేశహితైక జీవనంతో సంబంధం కలిగిన ప్రసిద్ధవర్తకులు. బహుళమైన అనుభవం కలవారు. దేశహితైక కార్యాభిలాషి. బెజవాడ తాలూకా బోర్డుకు వైసుప్రెసిడెంటు. పదిహేనేండ్లు మునిసిపల్ సభ్యులు, వైసుఛేర్మను. శ్రీ భ్రమరాంబా మల్లికేశ్వర పుస్తక భాండాగారానికి అధ్యక్షులు. శ్రీకన్యకాపరమేశ్వరీ అన్నసత్రానికి, శ్రీ కన్యకాపరమేశ్వరీ విస్సంశెట్టి వెంకటరత్నంగారి ఉన్నత పాఠశాలకు కార్యనిర్వాహక సభ్యులు. వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాల పాలక సభ్యులు. బెజవాడ స్పిన్నింగు మిల్లు డైరెక్టరులు. వర్తక సంఘానికి కార్యదర్శులు. పెరికీడు దగ్గర బియ్యపుమర, బెజవాడలోని వేరుసెనగనూనె మరలకు యజమానులు. ఖాయిదావర్తకులు. వైశ్య ప్రముఖులు.

## శ్రీ తూముగుంట్ల నాగరత్నంగారు

గుంటూరులో పెద్ద వర్తకులు. ఎన్నో బియ్యపుమరలకు, దూదిమరలకు, పొగాకు ఫ్యాక్టరీలకు యజమానులు. సాధారణంగా ఆ వూరిలో వారికి సంబంధంలేని ప్రజోపయోగకర కార్యంగాని, సంస్థగాని లేదని చెప్పవచ్చు. కన్యకాపరమేశ్వరి దేవస్థానం, వైశ్య గురుకులాశ్రమం, వైశ్య వ్యాయామశాల, హిందూకళాశాల మొదలైన స్థానికసంస్థల పాలకవర్గ సభ్యులుగానూ, వరుసన ఇరవై యేండ్లు మునిసిపల్ సభ్యులుగానూ వుండడమే వారి పలుకుబడికీ, ప్రజాభిమానానికీ నిదర్శనం.

సుప్రసిద్ధమైన కుగ్గురు వైద్యాలయం, భద్రాచలంలోని కన్యకాపరమేశ్వరీ అన్నసత్రం, వైశ్యవిద్యార్థుల సహాయనిధి, దివ్యజ్ఞాన సమాజం, రెడ్ క్రాస్ సొసైటీ —యీలాటివాటికి తోడ్పడే విషయంలో వారు ముందడుగు వేస్తూ, ప్రజల ఆదరణకు పాత్రులై, వైశ్యప్రముఖులలో ఒక్కరుగా ఖ్యాతికెక్కి వున్నారు.

---



శ్రీ తూముగుంట్ల నాగరత్నంగారు



శ్రీ మంమారు సీతారామయ్యగారు

## శ్రీ కాకరపర్తి భావనారాయణగారు

బెజవాడలో మిల్లుస్టోర్సుకూ, సికిందరాబాదులో యంత్రసంబంధమైన విక్రయశాలకూ అధిపతులైన భావనారాయణగారు బెజవాడవాసులకును, చుట్టుపట్టుల వారికిని చిరపరిచితులు. వారు వర్తకులైనప్పటికీ తమ కాలాన్ని ద్రవ్యసంపాదనకృషియందు మాత్రమే గడుపక దేశీయవ్యవహారాలలోనూ, స్థానికవ్యవహారాలలోనూ కూడా శ్రద్ధాభక్తులు చూపుతున్నారు.

శ్రీ రాజేంద్రప్రసాదుగారు దేశీయ మహాసభాధ్యక్షులుగా బెజవాడకు వచ్చినప్పుడు పౌరులపక్షాన స్వాగత పత్రికను సమర్పించే గౌరవం వారికే దక్కింది. తరువాత బెజవాడలో ప్రత్యేకాంధ్రసభ జరపవలసివస్తే దాని సన్మానసభాధిపత్యభారం వారిమీదనే పడింది. బెజవాడమునిసిపాలిటీలో కాంగ్రెసుపక్షపు ప్రతినిధుల సంఖ్య హెచ్చి, ఛేర్మనును ఎన్నుకోవలసివచ్చినప్పుడు సభ్యుల దృష్టి వారిమీదనే ప్రసరించింది. వారు ఛేర్మను స్థానమందుండిన మూడేండ్లకాలంలోనూ స్థానికసమస్యల ప్రాముఖ్యం హెచ్చి, ప్రజల కష్టసుఖాలు జాగ్రత్తగా పరిశీలింపబడుతూవచ్చినాయి.

భావనారాయణగారింకనూ పిన్నవయస్కులే. అయినా, తమ విద్యనూ, ద్రవ్యాన్నీ, శక్తినీ దేశహితైక కార్యాలకై, బెజవాడయొక్క అభివృద్ధికై వినియోగిస్తూ కీర్తిప్రతిష్ఠలు గడిస్తున్నారు.

——



శ్రీ ఈదర వెంకటరావుపంతులుగారు

## శ్రీ ఈదర వెంకటరావు పంతులుగారు

పిత్రుపైతామహమైన భాగ్య మేమీలేదు. భాగ్యవంతులైన బంధువుల సహాయంకూడా లేదు. ఏలూరు పవరుపేటలో ఆచంట గోపాలకృష్ణయ్యపంతులుగారి యింట్లో ఉండి, మిషను హైస్కూలులో చదువుకొంటూ, పేదరికపు కష్టాలన్నీ అనుభవిస్తూ, కేవలం స్వయంకృషితో ప్రాముఖ్యానికివచ్చిన వ్యక్తి వెంకటరావుగారు. 'ప్రారంభవిద్య' అనే మాసపత్రికను స్థాపించి, చిన్నచిన్న పాఠ్యపుస్తకాలు వ్రాయించి, వాటిని విద్యాధికారులచేత అనుమతింపజేయడానికి చెన్నపట్టణం చుట్టూ తిరుగుతూ, నానాకష్టాలూ పడుతూ, ఎన్ని ఆటంకాలువచ్చినా ఉత్సాహంమాత్రం విడువకుండా పాతికేండ్లు అనవరతపరిశ్రమ చేసి తెలుగులో పెద్ద ప్రచురణకర్త అనే గౌరవం ప్రతిష్ఠించుకొన్నారు.

వెంకటరావుగారు పుస్తకప్రచురణ ప్రారంభం చేసిన రోజులలో తెలుగుపాఠ్యపుస్తకాలు రికగ్నయిజు కావాలంటే భగీరథప్రయత్నం చేయవలసివచ్చేది. ఏ హరిహరఅయ్యరుగారి పేరుతోనో, ఏ మహమ్మదు హుస్సేనుగారి పేరుతోనో వ్రాసి, ఏ మాక్మిలన్ వంటి

యూరోపియన్ కంపెనీ అయినా ప్రచురిస్తేనేగాని రిక గ్నయిజు కావడమనేది అసాధ్యంగా ఉండేది. విద్యాధి కారుల అభిమానం పెద్ద కంపెనీలవైపు ఉండడంచేత ప్రతిమెట్టుదగ్గరా ఆటంకాలే వుండేవి. అయినా వెంకట రావుగారుమాత్రం ఏ మాత్రమూ నిరుత్సాహం పొంద కుండా పట్టుదలతో యీ అడ్డాలన్నీ దాటి, ఆంధ్రపాఠ్య పుస్తకప్రచురణలో ఆంధ్రులకు ఒక స్థానాన్ని సంపాదించి, దానిని గట్టిచేశారు.

పంతులుగారు కేవలము ప్రచురణకర్తలుగావుండి ద్రవ్యార్జనపరులుగామాత్రమే ఉండకుండా దేశక్షేమం కర కార్యాలలో ప్రవేశిస్తూ, పేదలకూ, అతిథి అభ్యాగ తులకూ శక్తివంచన లేకుండా సహాయంచేస్తూవుంటారు. ఏలూరుమునిసిపల్ సభలో చాలాకాలం సభ్యులుగా వుండి నగరాభివృద్ధికి పాటుపడ్డారు. ఆంజనేయదేవా లయం, గోరక్షణసమితి, అన్నదాన సమాజం, హిందూ యువజనసంఘం, గాంధీ విద్యాలయం—యీలాటి స్థానికసంస్థల నిర్వహణంలో ప్రాముఖ్యం వహించి, వాటి పోషణకు ద్రవ్యసహాయంచేసి, తాము చిన్నప్పటి నుంచీ ఉన్న ఏలూరు నగరాభివృద్ధికి తోడ్పడ్డారు. వారి ప్రజాసేవకు కృతజ్ఞతాచిహ్నంగా పౌరులు వారిపేరుతో

'వెంకటరావుపేట' అనే నగరభాగం నిర్మించారు. ఆ పేటలో వారు తమ సతీమణిపేరుతో ఒక ప్రాథమిక పాఠశాలను స్థాపించి, విద్యాభివృద్ధికి పునాదివేశారు.

ఆంధ్రదేశమంతటా ఉన్న తమ పుస్తకవిక్రయశాలలలో విద్యావంతులైన యువకులకు పనిపాటులు కల్పించి, నిరుద్యోగసమస్యను కొంతవరకూ తగ్గింపజేస్తున్నారు. బాల్యంలో పేదరికానికి ఆశ్రయంగా ఉండిన వెంకటరావుగారు నేడు 'వెంకట్రామా ప్రెస్' అనే పెద్ద ముద్రాక్షరశాలకు అధిపతి, పెద్ద ప్రచురణకర్త, ఆస్తిపరుడు. కేవలం స్వసామర్థ్యంతో పైకివచ్చి యశోధన పరిపూర్ణులుగా ఉన్న వెంకటరావుపంతులుగారి జీవిత కథ ఆదర్శప్రాయమైందనీ, అనుకరణీయమైందనీ అనడంలో అతిశయోక్తి ఏ మాత్రమూ లేదు.



## శ్రీ భాగవతుల శ్రీరాములుపంతులుగారు

ఆంగ్లేయులకుగాని యివ్వని ఒక వుద్యోగాన్ని భారతీయులకు—అందులో మన ఆంధ్రులకు యిచ్చినారంటే అది సామాన్యవిషయం కాదు. శ్రీరాములు పంతులు గారు బందరులో ఇంపీరియల్ బ్యాంకులో గుమాస్తాగా ప్రవేశించి, క్రమంగా సూపరింటెండెంటు ఆఫ్ అకౌంట్సు అనే బాధ్యతగల వుద్యోగాన్ని పొంది, అక్కడనుంచి యింపీరియల్ బ్యాంకు యేజంటు అయినారు. ఈ యభివృద్ధికి కారణం శ్రీరాములుపంతులుగా రిచ్చిన 'లండన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ బాంకర్సు' అనే ముఖ్యమైన పరీక్షయున్నూ, పంతులుగారి స్వతస్సిద్ధమైన సామర్థ్యమున్నూ తప్పితే మరేమీ కాదు.

శ్రీరాములు పంతులుగారికిపూర్వం ఈ పరీక్షలో కృతార్థులైన ఆంధ్రులే లేరు. వారిదే దీనిలో మొదటి చేయి. బరంపురం, నంద్యాల, కుంభకోణం, బెజవాడలలో పదమూడు సంవత్సరాలు ఏజంటుపదవిని చక్కగా నిర్వహించి, వేయిరూపాయలకుపైగా జీతం పుచ్చుకొని ప్రజల ఆదరణకూ, పై అధికారుల విశ్వాస గౌరవాలకూ పాత్రులైనారు. పంతులుగారు ప్రస్తుతం పింఛనుపుచ్చుకొని మచిలీపట్టణంలో విశ్రాంతి తీసుకొంటున్నారు.



శ్రీ భాగవతుల శ్రీరాములుపంతులుగారు

## శ్రీ భాగవతుల శ్రీరాములుపంతులుగారు

ఆంగ్లేయులకుగాని యివ్వని ఒక వుద్యోగాన్ని భారతీయులకు—అందులో మన ఆంధ్రులకు యిచ్చినారంటే అది సామాన్యవిషయం కాదు. శ్రీరాములు పంతులు గారు బందరులో ఇంపీరియల్ బ్యాంకులో గుమాస్తాగా ప్రవేశించి, క్రమంగా సూపరింటెండెంటు ఆఫ్ అకౌంట్సు అనే బాధ్యతగల వుద్యోగాన్ని పొంది, అక్కడనుంచి యింపీరియల్ బ్యాంకు యేజంటు అయినారు. ఈ యభివృద్ధికి కారణం శ్రీరాములుపంతులుగా రిచ్చిన 'లండన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ బాంకర్సు' అనే ముఖ్యమైన పరీక్షయున్నూ, పంతులుగారి స్వతస్సిద్ధమైన సామర్థ్యమున్నూ తప్పితే మరేమీ కాదు.

శ్రీరాములు పంతులుగారికిపూర్వం ఈ పరీక్షలో కృతార్థులైన ఆంధ్రులే లేరు. వారిదే దీనిలో మొదటి చేయి. బరంపురం, నంద్యాల, కుంభకోణం, బెజవాడలలో పదమూడు సంవత్సరాలు ఏజంటుపదవిని చక్కగా నిర్వహించి, వేయిరూపాయలకుపైగా జీతం పుచ్చుకొని ప్రజల ఆదరణకూ, పై అధికారుల విశ్వాస గౌరవాలకూ పాత్రులైనారు. పంతులుగారు ప్రస్తుతం ఫించనుపుచ్చుకొని మచిలీపట్టణంలో విశ్రాంతి తీసుకొంటున్నారు.



శ్రీ భాగవతుల శ్రీరాములుపంతులుగారు



శ్రీ అరవ నారాయణమూర్తిగారు

## శ్రీ అరవ తిరుపతిరాయ సోదరులు

కాంగ్రెసు అభిమానులు, వర్తకులు అయిన అరవ తిరుపతిరాయలుగారు రాజమహేంద్రవర వాసులకు చిర పరిచితులు. బాబూరాజేంద్రప్రసాదుగారి రాకసందర్భంలో చేసిన వాగ్దానానుసారంగా సుమారు పదివేల రూపాయలు వెచ్చించి పౌరసభలకున్నూ, వార్తాపఠనమునకున్నూ వినియోగించే వొక చక్కని భవనం కట్టించియిచ్చిన కాంగ్రెసు భక్తులు.

వారిసోదరులు నారాయణమూర్తిగారు నిరాడంబరులు. ప్రచారకులు. సుప్రసిద్ధ కాంగ్రెసు భక్తులు. బాలగంగాధరతిలకు మహాశయుని ఉపదేశామృతం పొందిననాటి నుండీ కాంగ్రెసుసేవకులై, పిమ్మట మహాత్ముని శిష్యవర్గంలో చేరి తమ యావత్కాలమున్నూ దేశహితైక కార్యాల కొఱకే వినియోగిస్తూవున్న పూజనీయులు. ఉప్పుసత్యాగ్రహంలోనూ, ఆతరువాతి సత్యాగ్రహంలోనూ అరవవారికుటుంబంలోని స్త్రీపురుషులందరూయథాశక్తినివాలంటీరులుగానో, ప్రచారకులుగానో సేవచేసి ప్రభుత్వంవారి ఆతిథ్యం పుచ్చుకొన్నవారే. ఈకుటుంబంలో స్త్రీ పురుషులందరూ ఖద్దరే ధరిస్తూ సమస్తసత్కార్యాలకూ, కాంగ్రెసుకూ పట్టుగొమ్మలుగా వుంటున్నారు.

## శ్రీ బుద్ధ మహాలక్ష్మిగారు

అనకాపల్లి తాలూకా గవరలకు పునికిపట్టు. వీరిలో చాలామంది వ్యవసాయకులుగానూ, కార్మికులుగానూ వున్నప్పటికిన్నీ తమ తెలివితేటలచేతనూ, అనుకూల వాతావరణంచేతనూ అక్కడక్కడ పైకి వచ్చినవారు కూడా లేకపోలేదు. ఈలాటివారిలో ఒకరు మహాలక్ష్మి గారు. అనకాపల్లిశివారు గవరపాలెమునకు గ్రామ మునసబుగా తమ జీవితాన్ని ప్రారంభించి మెల్ల మెల్లగా అనేక గౌరవస్థానాలు ఆక్రమించివున్నారు. వరుసగా యిరవై రెండు సంవత్సరాలు అనకాపల్లి మునిసిపల్ సభ్యులు, రెండు తడవలు ఛేర్మను. మూడుసార్లు పంచాయితీకోర్టు అధ్యక్షులు. పన్నెండు సంవత్సరాలు విశాఖపట్నం తాలూకాబోర్డు సభ్యులు. ఒకసారి జిల్లాబోర్డు సభ్యులు. గవరసంఘానికి అధ్యక్షులు. వారి ప్రోద్బలంవల్లనే గవర పాలెంలో ఒక ప్రాథమికపాఠశాల, ఒక వైద్యశాల స్థాపింపబడ్డాయి. అయిదవ జార్జిచక్రవర్తి రజతోత్సవ సందర్భంలో వారు బహుమానం పొందివున్నారు.



శ్రీ బుద్ధ మహాలక్ష్మిగారు



శ్రీ తటవర్తి నాగపోతరావుగారు

## శ్రీ ఈదర వెంకయ్యపంతులుగారు

రామా అండ్ కంపెనీ యజమానులు. సుప్రసిద్ధ ప్రచురణకర్తలు. చాలాకాలం పశ్చిమగోదావరీ మండల విద్యాసంఘు, ఏలూరు పురపాలక సంఘాలలో సభ్యులుగానూ, హిందూ యువజనసంఘమునకు కార్యదర్శులుగానూ వుండి అమోఘసేవ చేసినవారు, చేస్తున్నవారు. చెన్నరాజధానిపాఠశాలోపాధ్యాయుల మేనేజరుల సంఘానికిన్నీ, పశ్చిమగోదావరి ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల యజమానుల సంఘానికిన్నీ అధ్యక్షులై వారి వారి హక్కులను జాగ్రత్తగా కాపాడుతూవున్న విద్యాభిమానులు. సారస్వత పోషకులు. సంస్కరణాభిలాషులు. ప్రజోపయోగకరమగు సంస్థలన్నిటితోనూ సంబంధం కలిగి ముందడుగువేసే కార్యోత్సాహులు. విద్యాభిమానులు. ఆంధ్రాభిమానులు.

## శ్రీ కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు

గుడ్ విల్ అండ్ కంపెనీ, స్మాయిల్ అండ్ కంపెనీ, కాళీ అండ్ కో, శివాజీ అండ్ కో,—యీలాటి కంపెనీల నెన్నిటినో రేపల్లె, తెనాలి, గుంటూరు మొదలైనచోట్ల స్థాపించి వ్యాపారస్థులుగానూ, దేశహితైక కార్యాభిలాషులుగానూ పేరుపడ్డయువకనాయకులు విశ్వనాథంగారు. తెనాలిలో వారికి సంబంధంలేని వుద్యమమూ లేదు ; వారి సహాయంపొందని సత్కార్యమూ లేదు. వారు గోరక్షణ సంఘానికి కార్యదర్శులు. స్త్రీ పునర్వివాహసభకు కోశాధిపతి. ఆంధ్రదేశ రైల్వేప్రయాణీకుల సభకు పోషకులు. కాంగ్రెసుఅభిమానులు.



కీ. శే. టి. శివశంకరంగారు



శ్రీ. శే. దివాన్ బహద్దూరు పి. కేశవపిళ్లెగారు

## దివాన్ బహద్దూరు పి. కేశవపిళ్లెగారు, సి.ఐ.ఇ.

కేశవపిళ్లెగారు పందొమ్మిదవ శతాబ్దాంతయుగానికి చెందిన ప్రజాహితజీవి. ఆయన గుత్తి డిప్యూటీ కలెక్టరుకచేరిలో అటెండరుగా తమ జీవితాన్ని ప్రారంభించి ప్లీడరు కావడం, ప్లీడరీచేస్తూ ప్రజాసేవకు దిగడం, అక్కడ నుంచి శాసనసభ్యులు కావడం—యిదంతా అరేబియా రాత్రుల కథలాగున కనిపిస్తుంది.

ప్లీడరుగావుండినప్పుడున్ను, శాసనసభ్యులైనతర్వాతను తమ వాడియైన కలాన్నీ, వాక్కునూ బీదల క్షేమానికై ధారాళంగా వినియోగించి అధికారుల గుర్రునకు పిళ్లెగారియంతగా యింకెవరూ పాత్రులు కాలేదనుకుంటాను. రాయలసీమప్రజాహితజీవితానికి పిళ్లెగారు ప్రధానాచార్యులని చెప్పడంలో అతిశయోక్తి యేమీ లేదు. ఇందుకనే, కాలంమారినప్పటికీ, కథ లెన్నో జరిగినప్పటికీ కేశవపిళ్లెగా రంటే ప్రజ లెంతో భక్తి విశ్వాసాలను చూపుతూవుండేవారు. దురభిమానులగు అధికారులకు వారివలెనే అంకుశంలాగున వున్న టి. శివశంకరంగారు పిళ్లెగారి దయార్ద్రహృదయాన్ని తెలుపుటకొక చిత్రకథను చెప్పుతూవుండేవారు. పిళ్లెగారు మర

ణించడానికి కొంతపూర్వం యింటియం దొక పడక కుర్చీలో విశ్రమించియుండగా, ఏదో కాటుపడి రక్తం కారుతూవున్న ఒక కోతి వచ్చి వారి యొడిలో కూర్చుండి నట్టున్ను, వారు దానిని బుజ్జగించి చికిత్సచేయించి పంపి వేసినట్టున్ను చెప్పేవారు! ఈ కరుణరసమే ఖైదీలకు వరి అన్నం పెట్టించుటకున్ను, అడవుల యిబ్బందులను తొలగించుటకున్ను వారిని పురికొల్పింది. పిళ్లెగారు యీ విషయాలకు సంబంధించి శాసనసభలో వాదించే రోజులలో ప్రభుత్వప్రతినిధులు వారి నెట్లు పరిహాసంచేసి విసరి కొట్టుతూ వచ్చినారో, చివరకు వారే పిళ్లెగారియం దెట్టి పూజ్యభావాన్ని ప్రకటిస్తూవచ్చినారోతలచుకొంటేఆశ్చర్యం కలుగుతుంది. బీదల కష్టసుఖాలను గ్రహించినవారనియే ఫిజీ, బ్రిటిష్‌గయానా దీవులలోని భారతీయపరిస్థితులను పరిశీలించడానికై నియమించిన సంఘంలో ప్రభుత్వంవారు పిళ్లెగారినికూడా చేర్చవలసివచ్చింది.

కేశవపిళ్లెగారు ధన్యజీవి. ప్రజాహితజీవనంలో పొందదగిన మర్యాదలన్నీ పొందినారు. హిందూపత్రికకు లేఖకులుగా వుండి ప్రజల కష్టసుఖాలను నిర్భయంగా చర్చిస్తూవచ్చినారు. సర్ ఫ్రెడరిక్కు నికల్సన్‌గారి మైత్రిని సంపాదించి, ప్రజలలో సహకారోద్యమాన్ని వ్యా

పింపజేయడానికై కృషిచేశారు. కలనల్ ఆల్కాటుతో పరిచయంచేసుకొని అంటరానికులములవారి యభ్యున్నతికై శ్రమించారు.

దేశమంతా జస్టిసుపార్టీ ప్రాబల్యానికి వశమైవుంటే, పిళ్లైగారు ప్రెసిడెన్సీ అసోసియేషన్ అధ్యక్షులై కుల తత్వ రాజకీయాలకు దూరంగావుంటూవచ్చినారు. అనంతపురం జిల్లాబోర్డుకు పదేండ్లు అధ్యక్షస్థానమందుండి గ్రామాల అభివృద్ధి కెంతో తోడుపడ్డారు. గుడివాడలో జరిగిన కృష్ణామండలసభకు ఆధిపత్యం వహించి రైతు సమస్యలకు ప్రాముఖ్యమిచ్చినారు. తొమ్మిదేండ్లు శాసన సభయందుండి దరిద్రుల ప్రతినిధి అని అనిపించుకొన్నారు. పోటీ లేకుండానే రెండుసార్లు శాసనసభకు డిప్యూటీ ప్రెసిడెంటుగా నియుక్తులయినారు.

ఈ విధంగా యాభైయేండ్లు ప్రజాహితజీవితాన్ని గడపి, అందరి ఆమోదాన్ని పొందిన యీ ప్రజాసేవకునిగురించి యెంత వ్రాసినా తృప్తితీరదు. కాని వారు సాధించిన ఫారెస్టు కమిటీ, ఫారెస్టుకమిటీల నిర్మాణం— యీ వ్యవహారాలను బీదలెన్నటికీ మరువలేరు. ఆ నల్లటి డబుల్ బ్రెస్టు కోటు, తెల్లని ధోవతి, దక్షిణాది తలగుడ్డ, జరీవుత్తరీయం ధరించి, శాసనసభయందు నిలబడి ఖైదీ

లకు వరిఅన్నం పెట్టుమనీ, అడవియిబ్బందులను తొల గించుమనీ, పల్లెటూళ్ల ప్రజయొక్క జీవితాన్ని సుఖ ప్రదమైనదిగా చేయుమనీ వాదిస్తూవుండిన కేశవపిళ్లై గారికి—తమ యావజ్జీవితమునూ బీదవారి సేవకై విని యోగించిన దివాన్‌బహద్దూరు కేశవపిళ్లై సి. ఐ. ఇ. గారికి మన దేశం చాలా ఋణపడివుంది. పిళ్లైగారు మృతజీవి. రాయలసీమ కేకాదు, ఆంధ్రభూమి కంతకూ చిరస్మరణీయుడు.

---

## శ్రీ ఆర్కాటు రంగనాథం మొదలియారుగారు

ఆర్కాటు రంగనాథం మొదలియారు ఆనీబిసెంటమ్మ యనుంగు బిడ్డడు. దివ్యజ్ఞానసమాజానికి చెందిన తేజస్సంపన్నరత్నం. 1879 లో జన్మించి క్రైస్తవ కళాశాలలోనూ, న్యాయకళాశాలలోనూ పట్టము లంది, నౌకరీలలో పైకెక్కివచ్చి, మనస్సులో ఉప్పొంగిన ప్రజా సేవాపరాయణత్వమున సర్కారుఉద్యోగంలో ఉండుట శృంఖల మనుకొని ముప్ఫయియారవయేట డిప్టీకలెక్టరు హోదాకు రాజీనామాయిచ్చివేసిన త్యాగపరాయణుడు. మానవసేవకై సర్వస్వాన్నీ అర్పించడానికి సిద్ధపడిన యీ పురుషుడు ఆనీబిసెంటమ్మతోగూడ 1917-వ సంవత్సరంలో రాజకీయరంగంలోకి ప్రవేశించి హోమ్ రూలులీగుకార్యదర్శి, ఆంధ్రమహాసభాధ్యక్షుడు, భారత స్వరాజ్యసమావేశానికి అధిపతి యైనాడు. తరువాత ఎన్ని పదవులనైనను అలంకరించాడు. అఖిలభారతకాంగ్రెసు కమిటీసభ్యుడైనాడు. మద్రాసుశాసనసభలో బళ్లారిజిల్లా ప్రతినిధిగా ఏర్పడి 1926-28ల మధ్యను మంత్రియై పని చేశాడు. ప్రజలలో కలిసిమెలసి తిరిగి వారిగోడు విచారించి తన చేతనైనంతవరకూ పోరాడి మేలుచేయునట్టి

సేవాస్వరూపి యితడని బళ్లారిజిల్లావా రాయనను పూజి స్తారు. రాయలసీమలో కలిగే క్షామములనుగురించి రంగనాథం మొదలియారు ఉపన్యసించాడా కంట నీరు జలజల రాలవలసిందే. అంతటి హృదయమార్దవం కల వాడు కావునను, రివిన్యూలో డిప్టీకలెక్టరు పనికూడ చేసిన వాడుకావునను ఆయన ప్రజలకు చేయదగిన ఉపకార మార్గాలను తెలిసి క్షామనివారణ, తకావీవడ్డీల కొట్టివేత, తకావీఅప్పులకొట్టివేత, నీటివసతుల కల్పన, శిస్తుముజరా, కోఆపరేటివు సొసైటీల నిర్మాణనిర్వాహణం — ఇత్యాది విషయాలలో పరులకంటికి బడని పరమనిష్కామసేవ చేస్తూవుండినాడు; చేయగలిగినాడు.

కోఆపరేటివు ఉద్యమమంటే ఆయనకు పరిపూర్ణ విశ్వాసం. పంచాయతీ ఉద్యమంలోనూ అంతే. అనంత పురంజిల్లాకోఆపరేటివుకాన్ఫరెన్సు (1922), ద్రోణాచలం కోఆపరేటివుకాన్ఫరెన్సు (1925), ఆంధ్రా ప్రావిన్షియల్ కోఆపరేటివుకాన్ఫరెన్సు (1928), ఈరోడుఅర్బన్ కోఆప రేటివుసొసైటీలకాన్ఫరెన్సు (1928), ఉత్తరార్కాడు జిల్లా కోఆపరేటివుకాన్ఫరెన్సు (1933)—ఇన్నిటికీ అత డధ్యక్షుడై వుండినాడు. ప్రావిన్షియల్ కోఆపరేటివుయూని యనుకు ఉపాధ్యక్షుడు. తాను మంత్రిగావున్నప్పుడు



శ్రీ ఎ. రంగనాథ ముదలియారుగారు



శ్రీ కె. కోటిరెడ్డిగారు

కోఆపరేటివుసొసైటీల స్థితిగతుల విచారణకు ప్రత్యేకము టవున్నందుసంఘాన్ని నియమించి ఎక్కువ పరిశ్రమ చేసినవాడు. 1924 లో పంచాయితీల మహాసమావేశా నికి ప్రెసిడెంటు. బళ్లారిజిల్లాలో పంచాయితీలస్థాపనకు మూలపురుషుడు. మంత్రిగా వున్నప్పుడు తన జీతంలో విశేషభాగం ఖర్చుపెట్టి గ్రామపునర్నిర్మాణకార్యక్రమం చేయించినవాడు. గ్రామపరిశ్రమలమీద సహజంగానే అభిమానంకలవాడు. స్వదేశీఉద్యమపక్షపాతి. తన మంత్రి త్వంలో ప్రత్యేకంగా ఒక ఉద్యోగిని నియమించి, ఆ రాజధానిలో జిల్లాజిల్లాలోనూగల చేతిపనులను సర్వే చేయించినాడు. అదే నేటికిని చాలాఉపయుక్తమైన రిపో ర్టుగా పరిగణింపబడుతున్నది.

సైమనుకమీషను మద్రాసుకు విజయంచేసినప్పుడు గవర్నరుతో గట్టిగా విభేదపడి ఆనాడు డిప్యూటీకలెక్టరు పనికి రాజీనామా యిచ్చినట్లే తర్వాత మంత్రిత్వానికి కూడా రాజీనామా యిచ్చినారు. నిరాడంబర జీవి. ప్రజా భిమాని. హొసపేటలో యిటీవల చక్కెర పరిశ్రమను నెలకొల్పినారు. తిరుపతిదేవస్థానపు కమీషనరు పనిచేసి మొన్నమొన్ననే చాలించుకొన్నారు. రాయలసీమనిర్మాత లలో ఒకరుగా తరతరాలవారిచేతనూ జ్ఞప్తియందుంచు కోబడుతారు.

## దివాన్ బహద్దూరు,
## సర్ రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు

అప్పట్లో బందరుమునిసిపాలిటీ సభ్యులు. ఇండ్ల పన్నులను నిర్ణయించడానికై నియుక్తులయినారు. ఈ కార్యాన్ని నిర్వహించే సందర్భంలో ఒకనాడు ఒక యింట్లో ప్రవేశించి "యెవరండీ" అని హెచ్చరించారు. ఈ మాటలను విని లోపలనుండి ఒక స్త్రీ వచ్చి వారిని చూడడంతోనే సిగ్గుపడి, తలుపువెనక నిలబడింది.

"ఈ యింటి యజమానులు యెవరమ్మా?"

"నేనే అయ్యగారూ."

"మీ వృత్తి యేమిటి?"

జవాబు లేదు.

"మీది యేకులం? యెట్లాగున జీవిస్తున్నారు?"

"ఏమని చెప్పేది తండ్రీ? దిక్కుమాలిన వేశ్యాకులంలో పుట్టి శరీరాన్ని అమ్ముకొని ఒక రోజున తిని, ఒక రోజున తినక కాలం గడుపుకొంటున్నాం. ఈ పాడుపనిని మానుకొందామా అంటే యింకో ఆధారం లేదు." అని కన్నీరు కార్చింది.

వేశ్య అనే శబ్దం వినబడి, ఆకన్నీటి బొట్లను చూడడంతోనే వెంకటరత్నంనాయుడుగారు కొయ్య అయి

నారు. ఇంటిపన్ను సంగతి పోయింది; ఈ కుల స్త్రీలకు సంఘం చేస్తూవున్న అపచారం ప్రత్యక్షమై హృదయం నీరయిపోయింది. తల యెత్తకుండా యింటికి వెళ్లి ఒక కుర్చీలో చతికిలబడి, యీ పతిత సోదరీమణులను వుద్ధరించడం యెట్లా అనే జిజ్ఞాసలో పడ్డారు.

నాయుడుగారికి ప్రియమైన, విశ్వసనీయమైన, ఆంతరంగికమైన శిష్యులంటూ వుంటే విశేషంగా బందరులోనే వున్నారు. గురు శిష్యులంతా ఆ నాటి సాయంకాలం సమావేశమై యీ సమస్యను చర్చించి అంతట నుంచి భోగంమేళాలను చూడగూడదనీ, వాటిని ప్రోత్సాహపరచరాదనీ నిశ్చయించుకొన్నారు. ఈ ప్రమాణాలను చేసుకొన్నది వేశ్యలను అవమానపరచడానికి కాదు; వారిని అసహ్యించుకొని బహిష్కరించడానికిన్నీ కాదు. అట్లా సంఘంలోనూ, యిట్లా వీరిలోనూ యీ వృత్తియొక్క నీచత్వాన్ని గ్రహింప చేయడానికే ఆ నిరోధమార్గాన్ని నిర్ణయించుకొన్నారు. నాయుడుగారియొక్క, వారి శిష్యవర్గంయొక్క వాగమృతధార యీ సమస్యయొక్క ఆందోళనకు వినియోగింపబడినంతగా యింకేదానికిన్నీ వినియోగం కాలేదు. ప్రజలో, యీ కుల స్త్రీలలో ఆత్మ విచారణను రేకెత్తించారు. చివరకు

నాయుడుగారికి (శ్రీ) పిఠాపురంమహారాజావారి పరిచయ భాగ్యం కలిగినతర్వాతగాని యీ సమస్య సరియైన పరిష్కారానికిరాలేదు. పడుపుజీవనానికి బలికావలసిన యెందరో బాలికలను (శ్రీ) మహారాజావారు వివాహధర్మంలో ప్రవేశపెట్టి కులోద్ధరణకు దారిచూపినారు.

నాయుడుగారి యిష్టదైవం పతితపావనమూర్తి. అనాథబాలబాలికలలోనూ, హరిజనబాలబాలికలలోనూ యీ దైవాన్నే చూస్తూవుంటారు. వారి హృదయాన్ని యావత్తూ యీ పతితపావనమూర్తి ఆక్రమించుకొన్నాడు. ఒక రోజున నాయుడుగారు చెన్నపట్టణంనుంచి రైలులో ప్రయాణంచేస్తున్నారు. రైలు పొన్నేరిస్టేషను చేరింది. "నాయనా, దిక్కులేనిపిల్లలం. అన్నం లేదు, బాబయ్యా. ఒక దమ్మిడీ యివ్వండి అమ్మగారూ" అని అడుక్కు పోయిన కడుపులను చూపుతూ, యెవరో నలుగురు ఆడు పిల్లలు స్టేషనుకటకటాల మధ్యనుంచి యెండిపోయిన తమ చేతులను చాచి దీనాలాపం చేస్తున్నారు. ఈమాటలు నాయుడుగారి చెవిలో పడ్డాయి. దగ్గరకు వెళ్లినారు.

"ఎవరమ్మా, మీరు ?"

"దిక్కులేనివాళ్లం బాబయ్యా."

"ఏ కులం మీది ?"

" తెలియ దయ్యగారూ. "

ఈ ఆడుపిల్లలలో పెద్దదానికి 8 యేండ్లు. ముష్టియెత్తి పిల్లలను పోషిస్తూవుంది. ఏ చెట్టుక్రిందనో పడక. ఒక గుడ్డ పీలిక మానాన్ని కప్పివుంది. అన్నంలేక యెముకలగూడు బయటపడింది. ఆనాడు తిరిగి ఈ పిల్లలలో పతితపావన మూర్తి ప్రత్యక్షమయినాడు. ఈ పిల్లలను వుద్ధరించడం యెట్లా అనే ఆందోళన ప్రారంభమయింది. ఆ వేదనతో చెన్నపట్నంచేరి, తమశిష్యులు, లాకాలేజిలో విద్యార్థులు, కొమాండూరి వెంకటరామాచార్యులుగారిని రప్పించి, యీ వృత్తాంతం తెలిపి "తాతయ్యా, నీవు వెంటనే పొన్నేరివెళ్లి, ఆ చెట్టుక్రింది పిల్లలను మేజస్ట్రేటు గారిదగ్గరకు తీసుకొనిపోయి, వాళ్లచేత స్టేటుమెంట్లు యిప్పించి, యిక్కడకు తీసుకొనిరా" అని పంపినారు. గురువు ఆజ్ఞాప్రకారం రామాచార్యులుగారు ఆ పిల్లలను తీసుకొనివచ్చినారు. సరే. నాయుడుగారు శికింద్రాబాదులో మహబూబుకాలేజిలో వున్నారు. ఇంట్లో చూస్తే, ముసలితల్లితప్ప యింకొకదిక్కు లేదు. ఈపిల్లలను యేమిచెయ్యాలి అనే ఆందోళన బయలుదేరింది. చివరకు మతంమార్చని పద్ధతిని, వొక క్రైస్తవరక్షణశాలలో తమఖర్చుమీద మూడేండ్లు వుంచవలసిందని

ఆ పిల్లలను అప్ప చెప్పారు. కాని యింతటితో యీ అనాధ బాలికారక్షణసమస్య యెట్లా పరిష్కారమయి నట్టు? దేశంలో యీలాటిపిల్లలు యెందరోవున్నారు. క్రైస్తవులపరం చేస్తే వారు మతం మారుస్తారు. ఉంటే, ఆంధ్ర దేశంలో ప్రత్యేకంగా వొక శరణాలయం వుండాలి. అనే ఆందోళనతో చాలాకాలం బాధపడుతూవచ్చినారు. చివర కీ ఆశయమున్నూ శ్రీ పిఠాపురంమహారాజావారి అనుగ్రహంవల్లనే నెరవేరింది. కాకినాడలో దివ్యమైన శరణాలయాన్ని స్థాపించి, యెందరో పిల్లలను పెంచి పెద్ద లను చేస్తున్నారు శ్రీ మహారాజావారు.

నాయుడుగారుచిరకాలం ఆచార్యస్థానమందున్నారు. విద్యార్థులను వారువశంచేసుకొన్నంతగా యింకెవ్వరూ చేసుకోలేరు. వారి వుపదేశాలను విన్నవారున్నూ, వారి దగ్గర చేరి వారి పరిచయభాగ్యంగలవారున్నూ తమకు తెలియకుండానే మార్చి వేయబడుతూవచ్చినారు. షేక్స్ పియరు పాఠంచెప్పడంలో పెట్టిందిపేరు. ఆయన క్లాసులో వుండినంతకాలమున్నూ వుపదేశకదృష్టితప్పితే వుపా ధ్యాయదృష్టి లేనేలేదు. ఆస్తికబుద్ధి, మానవునిపై ప్రేమ, లోకకల్యాణమందు విశ్వాసం — యీలాటి వుత్కృష్టా దర్శాలను బోధిస్తూ వుండేటప్పుడూ, స్త్రీలకు జరిగేఅన్యా

యాన్ని గురించి, మానవుని హక్కులనుగురించి వుపన్యసిం చేటప్పుడూ గంటలు నిమిషాలులాగున సాగిపోతూ వుం డేవి. ఆయనకు వచ్చినన్ని లోకోక్తులూ, పిట్టకథలూ యింకెవరికీ రావు. వీటిద్వారా నవరసాలు వెలిగిస్తూ వుండేవారు. ఆయన సంభాషిస్తూవుంటే యీ లోకాన్నే మరచిపోతాం. జీవితం వొకవిధమైన వినోదంలాగ తోచే టట్టు చేసేవారు. ఆయన వాత్సల్యం, సుహృద్భావాలవల్ల ఆకర్షింపబడనివాడు లేడు. ప్రిన్సిపాల్ అనే అధికారభావం తోకాదు, స్నేహితుడులాగ, బంధువులాగ సరిసమానంగా మాట్లాడేవారు. ఆ మహాపురుషునియందు హాస్య రస మున్నూ వెల్లివిరుస్తూవుండేది. ఒకనాడు విద్యార్థుల పరీక్షకు సంబంధించిన సమాధాన పత్రికలకట్టను మోసుకొని పోతు న్నారు. దారిలో ఒకవిద్యార్థి కనుపించి "ఏమండీ మేస్టరు గారూ! ఇంత గాడిదబరువును మోసుకొని పోతున్నా రేమీ" అని అన్నాడు. "ఇది గాడిదబరువుకాదు అబ్బా యీ. ఏభైగాడిదలబరువు" అని నవ్వుతూనే సమాధానం చెప్పినారు.

అక్కడ రాజమహేంద్రవరంలో కందుకూరి వీరేశ లింగం పంతులుగారున్నూ, యిక్కడ బందరు కాకినాడ లలో రఘుపతి వెంకటరత్నం నాయడుగారున్నూ నలభై

సంవత్సరాలు చేసిన నిరంతరపరిశ్రమవల్ల, వుపదేశాల వల్ల, వ్రాతలవల్ల ఆంధ్రులలోసంస్కరణోద్యమం పాతుకు పోయింది. ఆంధ్రయువకులలో స్వాతంత్ర్యవర్తనం, సేవా భిలాష, ధర్మానురాగం వృద్ధిపించాయి. వేదకాలంలో బ్రాహ్మణేతరుడగు సత్యకాముడు మహర్షి, ఆచార్యుడు, వుపదేశకుడు అయితే మనకాలంలో రఘుపతి వెంకట రత్నంనాయడుగారు మహర్షి, ఆచార్యుడు, వుపదేశ కుడు అయి దేశీయులకొక నూతనసందేశాన్ని, ఆద ర్శాన్ని ప్రసాదించారు. శ్రీపిఠాపురం మహారాజావారి అనుగ్రహంవల్ల, సేవాభిలాషవల్ల బ్రహ్మ ధర్మోపదేశకు లనీ, ఆదిమాంధ్రుల అభ్యున్నతిఅనీ, కళావంతుల వివాహ ములనీ, అనాధశరణాలయములనీ కలవరిస్తూవచ్చిన కార్యక్రమానికి కార్యరూపాన్ని ధరింపజేసి, కడచిన సం వత్సరం తమ యిష్టదైవమయిన పతితపావనమూర్తిలో లయమైనారు.





కీ. శే. దివాన్‌బహద్దూరు
సర్ ఆర్. వెంకటరత్నంనాయుడుగారు



దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు

## దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారు

ఇప్పటికి నలభైయేండ్లక్రిందట ఆంధ్రులలో మన దేశోన్నతికై పనిచేద్దామనుకొనే విద్యావంతులు తక్కువ. రాకపోకలకు వసతులు తక్కువ. ఒకరి సంగతు లొకరు తెలుసుకొనేందుకు వార్తాపత్రికలు తక్కువ. అన్నీ తక్కువగా వుండేకాలంలో శెడింబి హనుమంత రావుపంతులు (ఇప్పుడు రావుబహద్దూరు), కొండ వెంకటప్పయ్యపంతులు (ఇప్పుడు దేశభక్త) గార్లు కృష్ణా జిల్లాసంఘం, కృష్ణాజిల్లాసభ, కృష్ణాపత్రిక, సంచార కార్యదర్శి—యీ ద్వారా గావించిన కృషియొక్క ఫలితంగానే, వికాసంగానే యిప్పటి మన రాజకీయ జీవితాన్ని యెంచవలసివుంటుంది. కృష్ణాజిల్లాలో జరిగి నంత ప్రబోధం మరి యెక్కడా జరుగలేదు.

ఆ రోజులలో యెక్కడనో దూరంగా మారు మూలవున్న వెల్లటూరువంటి గ్రామంలో జిల్లాసభను జరుపాలంటే జిల్లాసంఘాధికారులు చాపలు, కూరలు, వంటబ్రాహ్మణులు, దస్తావేజులతో కొంతదూరం బండి మీద, మరి కొంతదూరం పడవమీద, మిగిలినది కాలి మీద నడివేసవిలో ప్రయాణం చేయవలసివస్తూవుండేది. ప్రజలు అజ్ఞానులుగాను, ప్రభుత్వం నిరంకుశంగాను,

[illegible]

[illegible] తక్కువగాను వున్న కాలంలో [illegible] తన కాలాన్ని, తన ద్రవ్యాన్ని విని [illegible]ంది. తన రాజకీయాలను ఫలవంతంచేయడానికై, గ్రామ[illegible]లలో మా[illegible]వజ్ఞానాన్ని వ్యాపింపజేయడానికై, చేసిన కృషికిన్నీ, పడిన శ్రమకున్నూ కృష్ణామండలమేకాదు, ఆంధ్రదేశం యావత్తూ ఋణపడివుంది.

వెంకటప్పయ్యగారు మొదటనుంచిన్నీ వుద్రేకులు. ప్రజానురాగులు. మితవాదులుగా వుంటూవచ్చినా గాంధీమహాత్ముని వుద్యమానికి యితరులంతా ఆహుతులైనట్లే వారున్నూ ఆహుతులైనారు. ఆదాయంవచ్చే ప్లీడరీపనిని మానుకొని ఒక అడుగును కోర్టులోను, యింకొక అడుగును బయటను పెట్టలేదు. సేలం ధోవతీని, నిగనిగలాడే ఆ నల్లటికోటును పారవేసి, లోపల మల్లుగుడ్డనూ బయట ఖద్దరునూ ధరింపలేదు. గృహబాధలు తీవ్రరూపాన్ని ధరించి అడ్డంవచ్చేటట్టుగా వున్నా, దేశంవైపు చూచినారుగాని యింటివైపు చూడలేదు. ఈ సంకల్పంతో, యీ నిశ్చయంతో రాజకీయ పరివ్రాజకులుగా మారినారు. ఆంధ్రదేశం ధన్యమయింది.

ఆంధ్రులలో రాజకీయప్రముఖులు లేకపోలేదు. కాని, యీ అందరిలోకంటె వెంకటప్పయ్యగారిలో

ఒక విలక్షణమైన వర్తనం కనిపిస్తుంది. ఆంగ్లవిద్యావంతులు ఆంధ్రభాషలో వ్రాయడం, వుపన్యసించడం పరువుతక్కువగా యెంచే రోజులలో ప్రసిద్ధ తేజాలని కృష్ణాపత్రికను నిర్వహించారు. మండలసభలలో రాజభాషకు బదులు ఆంధ్రంలోనే వుపన్యసిస్తూవచ్చినారు. గ్రామవాసులకున్నూ ఆంగ్లవిద్యావంతులకున్నూ సహచర్య తక్కువగా వుండే కాలంలో గ్రామాలను దర్శించి, అక్కడివారల సమస్యలను గ్రహించి, గ్రామ పునరుద్ధరణకు దారిచూపారు. అంతేకాదు, కృష్ణామండల రాజకీయాలను నడపేటప్పుడుగానీ, గుంటూరుచేరి కాంగ్రెసుకు ఆహుతులై కదురు తీసుకొని గ్రామాల వెంట బయలుదేరినప్పుడుగానీ వారి మనస్సును యెంత శోధించినా వారు నాయకత్వానికీ, ఆధిక్యతకూ, ప్రాముఖ్యానికీ పెనగులాడినట్టు కనపడదు. ఇతరులను నాయకులనుచేసి తాము అనుచరులైనారు. రాజకీయాలను మానవసేవకూ, మానవకల్యాణానికీ సాధనంగా యెంచి శ్రమించారుగాని స్వప్రయోజనానికీ, స్వలాభానికీ వినియోగించలేదు.

వెంకటప్పయ్యగారు రాజకీయాలలో ప్రజవల్ల పొందవలసిన గౌరవాలన్నీ పొందినారు. ప్రజాసంస్థలయందు

వహింపవలసిన పదవులను సమృద్ధిగా వహించారు. ఆంధ్రమహాసభ అధ్యక్షులు, ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెసు కమిటీ అధ్యక్షులు, అఖిలభారతకాంగ్రెసుకమిటీ అధ్యక్షులు, ఆంధ్రరాష్ట్రంలో అఖిలభారతవడకునూలు సంఘ ప్రతినిధులు, అఖిలభారతకాంగ్రెసుమహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులు, చెన్నపురిశాసనసభాసభ్యులు-యీలాటి పదవు లెన్నో వహించారు. గాంధీమహాత్ముడు ఆంధ్రదేశంలోసంచారంచేయవలసివచ్చినప్పుడు ఆకార్యభారాన్ని నిర్వహించే గౌరవం వారికే కలిగింది. ఎక్కడి గుంటూరు, ఎక్కడి గురువాయూరు? అక్కడ యేదో దేవాలయప్రవేశ సంబంధమైన సత్యాగ్రహం ప్రారంభమైనదంటే యిల్లువదలి అక్కడ దూకినారు. మాంటేగూ - చెమ్సుఫర్డుసంస్కరణల సంబంధమైన యెన్నికలను ఆమోదించగూడదంటే నడుముకట్టి వూరూరా తిరిగినారు. ఇక పెదనందిపాడు వుదంతాన్ని తడవవలసినపనేలేదు. అది చరిత్రాత్మకమయింది.

వెంకటప్పయ్యగారు ఆంధ్రంలో మంచివక్త. వ్రాతలో అనుభవజ్ఞుడు. మాలిన్యం యెరుగని రాజనీతిజ్ఞుడు. దేశానికై సర్వమూ అర్పించిన భక్తుడు. వెంకటప్పయ్యగారికి సాటి వెంకటప్పయ్యగారే.

## శ్రీ వరహాగిరి వెంకటజోగయ్యపంతులుగారు

గంభీరమైన విగ్రహం, ఆరోగ్యమైన శరీరం, తడవు కోని విషయసామగ్రి, కంచువంటి కంఠం, అనర్గళమైన వాగ్ధార, అప్రతిహతమైన స్వాతంత్ర్యం గల జోగయ్య పంతులుగారిని చూస్తే మనస్సు పొంగిపోయేది. వయో భారంవల్ల నడుమువంగిపోతూవున్నా, ప్రాతకాలపు రాజకీయాలకున్నూ ఆధునికాభిప్రాయాలకున్నూ స్పర్ధ ఏర్ప డినా వెనకపడక దేశోపయోగకార్యా లన్నిటిలోనూ ముందడుగు వేస్తూ నడచిన రాజనీతిజ్ఞులు.

జోగయ్యపంతులుగారికే కాదు, వారి కుటుంబం లోనివారందరికీకూడా భారతదేశమంటేనూ, దేశసేవ అంటేనూ అధికభక్తి, అఖండానురాగం. వారియింట స్త్రీలుకూడా స్థానికసంస్థలలోనూ, శాసనసభలలోనూ ప్రవేశించి, దేశశ్రేయానికి పనిచేసేవారుగా వున్నారు. స్వజనంతోనూ, అతిథిఅభ్యాగతులతోనూ కిటకిటలాడు తూవుంటుంది వారిగృహం యెప్పుడున్నూ.

జోగయ్యపంతులుగారు వృత్తిలో న్యాయవాదులు; బరంపురంజిల్లాకోర్టులో ప్రాక్టీసుప్రారంభించి క్రమంగా బార్ అసోసియేషన్ ప్రెసిడెంటు, పబ్లిక్ ప్రాసిక్యూటరు,

అడ్వొకేటు అయినారు. తరువాత లండను వెళ్లి ప్రీవీ కౌన్సిలుఎదుట చిన్నకిమిడి కేసులో వాదించి, తమ అద్వితీయప్రతిభను వెల్లడించి, గొప్పన్యాయవాది అనే కీర్తిని ప్రతిష్ఠించుకొన్నారు. ఆ రోజులలో ఏ పెద్ద కేసు వచ్చినా వారిదగ్గరకు రావలసిందే. జమీందారులంతా వారి కాతాదారులే. కాని ఉదారహృదయులూ, ధైర్యశాలీ కావడంచేత తమ దేశహితైకజీవనానికిన్నీ, పబ్లిక్ ప్రాసిక్యూటరుపదవికిన్నీ ఏర్పడిన స్పర్ధలో ద్రవ్యంకంటె ప్రజాసేవనే ప్రధానంగా గ్రహించి, ద్రవ్యార్జనకు ఉపకరిస్తూవచ్చిన ఆ పబ్లిక్ ప్రాసిక్యూటరుపదవిని అమాంతంగా త్రోసివేసిన ధైర్యశాలి.

జోగయ్యపంతులుగారి దేశహితైకజీవనం నిష్కళంకమై, బాహుళ్యమై అనేకముఖాల నడిచింది. కళ్లికోట కాలేజీకమిటీకి ఉపాధ్యక్షులు, మునిసిపాలిటీలో తాలూకాబోర్డులో సభ్యులు, మండల సహకార పరపతి నిధికి, ఆంధ్రసభకు అధ్యక్షులు. కేంద్రశాసనసభలో ప్రజాప్రతినిధులు. మొదటినుంచీ దేశీయమహాజనసభతోనూ, అనేకసాంఘికరాజకీయసభలతోనూ సంబంధంకల్గిన గొప్ప అనుభవశాలి. బూజుపట్టిన రాజకీయవాదులవలె స్వలాభమే ప్రధానంచేసుకోక బహుజనాభి

ప్రాయాన్ని ఆదరిస్తూ, కాలపరిణామాలూ, లోకప్రవృత్తులూ గమనిస్తూ, మన ఆంధ్రుల రాజకీయజీవితంలో గురుస్థానంవహించిన సంపన్నగృహస్థు. త్యాగి. దాదాభాయి నౌరోజీ, ఫిరోజిషామెహతా, గోపాలకృష్ణగోక్లే, బాలగంగాధరతిలకు, మదనమోహన మాలవ్యా, సుబ్రహ్మణ్య అయ్యరులకు సమకాలికులై ఆకాలపు అభిప్రాయాలలో పెరిగినా, గాంధీమహాత్ముని వరదకు నిలబడగల్గిన రాజనీతిజ్ఞుడు.

బరంపురంప్రాంతాలు ఒరిస్సాలో చేర్చబడ్డతరువాత యీ సందర్భంలో ఏర్పడ్డ ఆంధ్రుల కష్టసుఖాలను ప్రభుత్వంవారికి తెలియజేయడానికై చేయవలసిన రాయభారం వారిమీదనే పడింది. ఒరిస్సారాష్ట్రానికి సరిహద్దులు నిర్ణయించే విషయంలో మూడుసార్లు ఇంగ్లాండుకు వెళ్లి స్టేటుసెక్రటరీగారిని దర్శించి, ఆ విషయమైన సంగతి సందర్భాలన్నీ తెలియజేయడమే కాకుండా ఆంధ్రుల ఏకైకవాంఛఅయిన ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణ విషయంకూడా బహిర్గతంచేసివచ్చినారు. అంత దూరదేశం పోయి వూరికే తిరిగిరాకుండా అవకాశం చిక్కించుకొని ఆస్ట్రియా, ఇటలీ, హాలండు, జర్మనీ దేశాలు కూడా చూచి అచ్చటి అంతర్జాతీయ విషయాలను అవ

గతంచేసుకొని తమ రాజకీయజీవితాన్ని విస్తృతం చేసుకొని ప్రజాసేవకు దిగిన ధీశాలి. ఇంత యెందుకు? హేమా హేమీలు ఎంతమందో ఎగిరిపోయిన మొన్నటి యెన్నికలలో వారు చులకనగా గంజాం, విశాఖపట్టణం మండలాల తరఫున చెన్నపురిశాసనసభకు ప్రజాప్రతినిధిగా ఎన్నుకోబడ్డ సంగతే చాలు—వారిమీద ప్రజలకున్న ఆదరభావమూ, అభిమానమూ విశదంకావడానికి. ఇట్లా మన దేశాన్ని సేవించిసేవించి వృద్ధులై, యిటీవల బెంగుళూరులో యెవరో మిత్రులకు స్వాగతం యిస్తూ, ఆ స్వాగతస్థితిలోనే ప్రాణాన్ని కోల్పోయినారు జోగయ్య పంతులుగారు. ఈలాటి ఆకస్మికపు, అనాయాసపు మరణం సిద్ధులకుగాని సిద్ధింపదంటారు.

———



కీ. శే. చల్లా శేషగిరిరావుగారు

## శ్రీ చల్లా శేషగిరిరావుగారు

న్యాయవాది పరీక్షలో కృతార్థులై గుంటూరులో బోర్డును తగిలించారుగాని దృష్టిఅంతా దేశంమీద వుండింది. ఆ రోజులల్లో కీ. శే. జొన్నవిత్తుల గురునాథం గారు, చల్లా శేషగిరిరావుగారు మొదలైన యువక బృందం ఆంధ్రోద్యమాన్ని గురించీ, ఆంధ్రరాష్ట్రాన్ని గురించీ పత్రికలకు వ్రాస్తూ, కరపత్రికలను ముద్రిస్తూ దేశహితైకాభిలాషను ప్రకటిస్తూవుండేవారు. ఏదో ప్రజోపయోగమైన జీవితాన్ని అవలంబించాలనే ధ్యాసతోవున్న శేషగిరిరావుగారు ఆంధ్రదైనిక పత్రికా సంపాదకులుగా నియుక్తులయినప్పుడు వారి ప్రకృతికీ, ఆదర్శాలకూ తగిన వుద్యోగం దొరికిందన్నారు అంతాను.

శేషగిరిరావుగారు పదిహేడు సంవత్సరాలు ఏక దీక్షతో పత్రికాసంపాదకస్థానాన్ని ఆక్రమించి, మిక్కిలి శ్లాఘ్యంగా నిర్వహించారు. ప్రజాభిప్రాయంతో ఆంధ్ర పత్రికయున్నూ జరుగుతూ క్రమంగా కాంగ్రెసు పత్రికగా మారిపోయింది. దేశీయ విదేశీయ వార్తా ప్రకటనకు ఏర్పాట్లూ, ప్రతిముఖ్యస్థలమందున్నూ ప్రత్యేక లేఖకులూ గల ఆంధ్రపత్రిక కాంగ్రెసువార్తను చాట

డంలో ప్రాముఖ్యం వహించింది. ఆంధ్ర హృదయాన్ని ప్రతిబింబించింది, ఆంధ్రజాతీయతను విజృంభింపజేసింది.

ఆఫీసే యిల్లు, ఇల్లే ఆఫీసుగా చూచుకొంటూ, ప్రొద్దున మొదలు సాయంకాలంవరకు బల్లముందు కూరుచుండి, వేసిన కాలును కదల్పక, విరామం విశ్రాంతి లేక శ్రమిస్తూవచ్చిన శేషగిరిరావుగారి ఆరోగ్యం చెడి అకాలమృత్యువుపాలుకావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. వారు తమజీవితాన్ని ఆంధ్రులకూ, ఆంధ్రపత్రికకూ ధారపోశారు. వారు మొదటనుంచిన్నీ మితసంభాషి. దేశహితైకజీవి. గాంధీమహాత్ముడు నిర్ణయించిన నిర్మాణ కార్యక్రమాన్ని భక్తిపూర్వకంగా నిర్వహించిన కాంగ్రెసుభక్తుడు. తాము నూలువడకడంతోనూ, ఖద్దరు ధరించడంతోనూ తృప్తిచెందక యింటిల్లిపాదీ ఖద్దరును ధరింపజేసిన దీక్షాపరుడు.

శేషగిరిరావుగారు స్వభావసిద్ధంగా శాంతిప్రియులు. దూషించినా తనను కాదనుకొనిపోయే సౌమ్యులు. క్లిష్ట పరిస్థితులందుసహా అధైర్యాన్ని యెరుగని ధీరులు. సంగీతమంటేనూ, టెన్నిసు అంటేనూ చాలా అభిమానం.

# శ్రీ కె. కోటిరెడ్డిగారు

కోటిరెడ్డిగారు చిత్తూరుజిల్లాలో జన్మమందిన వారు. యాభై యేండ్లుంటాయి. చిన్నతనంలో మద్రాసు విశ్వవిద్యాలయపట్టంపొంది, బారిస్టరీ పరీక్షకు ఇంగ్లాండుకు బయలుదేరిపోయినారు. అప్పటికి ఆ కులంలో ఏ కొంద రోగాని పట్టపరీక్షలలో తేరినవారు లేరు. వారు కోరుకొని వుంటే గొప్ప సర్కారునౌకరీలు వారికి లభ్యమయివుం డేవి. కాని వారి దెప్పుడూ స్వాతంత్రదృష్టి. తన సంఘం వారికి,తన ప్రాంతంవారికి సేవచేయడమే ఆయనదృఢాభి ప్రాయం.ఎంత కాలంనుండియో రెడ్డిజనసంఘానికి కార్య దర్శి. ఎందరు రెడ్డిబిడ్డలకో ఉపకారంచేశారు. వారి భార్య సుద్దపల్లి రామచంద్రారెడ్డిగారి కూతురు. వారు గొప్పశ్రీమంతులు. కోటిరెడ్డిగారు చెన్నపట్టణంలో బారి స్టరీ చేస్తూవుండగా మామగారు పరలోకవాసు లైనందున వారి ఆస్తిని పరిపాలించడానికి కోటిరెడ్డిగారు కడప చేరు కొనిరి. ఆజిల్లా ప్రతినిధిగా మద్రాసుశాసనసభలో మొదటి నుండి సభ్యులుగా ఉన్నారు. కాంగ్రెసువారు శాసనసభల ప్రవేశ మామోదించినప్పుడు యునైటెడ్ నేషనలిస్టు

పార్టీతోగూడ రెడ్డిగారు కాంగ్రెసులోచేరి కడపజిల్లా పక్షాన కాంగ్రెసుప్రతినిధిగా ఏర్పడిరి.

వారికి రెడ్డిసంఘంతో సంబంధమున్నా వారు వెర్రి కులాభిమానాన్ని పాటించేవారు కారు. జస్టిసుపార్టీ యేర్పడినప్పుడే వారందులో చేరక కాంగ్రెసుఅభిమానులుగా ఉండినారు. కాంగ్రెసుపార్టీలో చేరినపిదప తమ ధర్మనిర్వహణంలో తొణకలేదని వారికి కీర్తి. రాయలసీమక్షామపరిస్థితులు వారి మనస్సును ద్రవింపజేస్తావుంటాయి. ఏనాటికైనా తుంగభద్రప్రాజెక్టు రాయలసీమను చక్కని పైరుపంటల నందనవాటిని గావిస్తుందని వారి విశ్వాసం. పట్టువదలక ఆందోళనచేయడంలో వారు అప్రతిమానులు. చిన్నచిన్న విషయాలలో వారికి పట్టింపులు లేవు. మదనపల్లి చల్లటి ప్రదేశం కాబట్టి అది ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థానంగా ఉండతగు నని వాదించినా, ఆంధ్రరాష్ట్రకేంద్రంగా ఉండతగునని కోరినా, ఒకటి విశాఖపట్టణానికి మారినా, మరివొకటి యింకొక చోట చేరినా, అవి వుచితస్థానాలని తోచినప్పుడు ఆక్షేపించునట్టి ప్రకృతికాదు వారిది. ప్రజాప్రభుత్వపక్షపాతులు కావున వారు మొట్టమొదటినుంచి ఆంధ్రోద్యమాన్ని గట్టిగా

రప _ ఇటీవల బెజవాడలో జరిగిన ఆంధ్ర

మహాసభకు అధ్యక్షులై ఆంధ్రరాయలసీమ సమస్యలను పరిష్కరించడంలో గొప్ప కృషి సలిపినారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ కార్యనిర్వాహక వర్గంలో సభ్యులైనారు.

వారు స్థానికవిషయాలలో కూడ మిక్కిలి స్వార్థ త్యాగబుద్ధితో నడచుకొన్నారు. తగాదాలు పడివుండిన యెడల ఏనాడో వారు జిల్లాబోర్డుఅధ్యక్షులయివుండే వారు. కాని వారి వితరణబుద్ధి వారిని అట్టి మార్గంలో నడువనీయ లేదు. అత్యాచారం, అత్యాశలు లేని నిష్కల్మషజీవి. కాబట్టి అతనికి వైరు లెచ్చటనూ లేరు. అందు చేతనే వారియెడల ప్రజల కెక్కువ ప్రేమ. మిత్రుల కెక్కువ ఆదరం.

కాంగ్రెసుపార్టీకి డిప్టీలీడరుగా నిర్వాచితుడయ్యు, 1926 లో కోటిరెడ్డి శ్రీ యస్. సత్యమూర్తిగారికొరకు రాజీనామాయిచ్చి తొలగిరి. తరువాతి ఎన్నికలలో లీడరు, డిప్టీలీడరులు అందరూ మారినప్పుడు పార్టీవారు వారినే డిప్టీలీడరుగా ఎన్నుకొనిరి. ఆయనత్యాగబుద్ధికి ఈ నిదర్శనమొక్కటే చాలు.

వారికి సమమగు సుగుణవంతురాలు వారి భార్య శ్రీమతి రామసుబ్బమ్మగారు. ఎలెక్షనులలో స్వతంత్రంగా పనిచేసి భర్తను గెలిపించుకొన్నది. భర్త చేసే వ్యయా

లకూ, త్యాగాలకూ అడ్డుచెప్పక ఆయనప్రజాహిత జీవనంలో తానుకూడ పాల్గొంటున్నది. ఆయమ్మ విదుషీ మణి. వితరణశీల. జిల్లాయెడ్యుకేషనల్ కౌన్సిలుకు, జిల్లాబోర్డుకు అధ్యక్షురాలు. ఈ కీర్తి మన ఆంధ్రస్త్రీలలో ఆమె యొక్కతెకే దక్కింది.

———

## శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు

ఆచార్య రంగాగారు సర్వోత్తమరావుగారినిగురించి 'మన గాడిచర్ల'అను శీర్షిక క్రింద వ్రాస్తూ "ఈ గృహస్థు ప్రజల పండితుడు" అని వర్ణించారు. సర్వోత్తమరావు గారు రాజమండ్రిబోధనాభ్యసనకళాశాలలో విద్యార్థిగావుండిన రోజు లవి. బిపినచంద్రపాలు రాక, రాజమండ్రివిద్యార్థులపై హంటరు ధాక, విద్యార్థుల సమ్మె, కళాశాల నిర్గమనము, క్షత్రియమహాజనప్రబోధము, ఆంధ్ర దేశమున యువకనాయకత్వము, స్వరాజ్ ప్రకటన, కారాగార జీవితము—అన్నీ ఆయనవే.

ఇప్పటికి ముప్ఫయియేండ్లు కావచ్చినాయి. రెండేండ్లు విజ్ఞానచంద్రికలో, మూడేండ్లు ఆంధ్రదినపత్రిక ప్రథమసంపాదకుడుగా, ఏడాది విజ్ఞానసర్వస్వంలో, ఏడాది స్వరాజ్యపార్టీలో, ఏడాది గ్రామపంచాయితీ సంపాదకుడుగా ఏకొద్ది వుపకారభృతి పొందినాడోగాని తక్కిన జీవితమంతా స్వయంకృషిచే 'దినబత్తెము' ను సంపాదించుకొని గడుపుతూ, కష్టాలనూ, నష్టాలనూ భరిస్తున్న గాఢాభిమాని యీ సర్వోత్తముడు.

సారస్వతము అతనిని వలచింది. విజ్ఞానచంద్రిక ప్రథమసంపాదకుడు. ప్రథమ గ్రంథకర్త. విజ్ఞాన సర్వస్వానికి తోడుతంఢ్రి. ప్రపంచచరిత్రకు పాదుచేసినాడు. కృష్ణదేవరాయలను సాహిత్యచక్రవర్తిగా లోకానికి ప్రసాదించిన విమర్శ పటిష్ఠుడు. బహుగ్రంథనిర్మాత. ఆంధ్రజాతీయవిద్య కాదిమాహుతి. ఆంధ్రజాతీయవిద్యా పరిషత్తుకు మొదటి కార్యకర్త. జాతీయవిద్యాప్రణాళిక నిర్మాణసంఘాధ్యక్షుడు.

1906–వ సంవత్సరంనుంచి 1930 వరకు జరిగిన ఆంధ్రచరిత్రలో హరిసర్వోత్తమరావు అంతర్యామి. 12 తెలుగు జిల్లాలలోనూ అధమం యెనిమిదింటనైనా అతడు పల్లెపల్లెకూ తిరిగి, వందేమాతరయుగం, ఆంధ్రోద్యమ యుగం, హోమ్‌రూలుయుగం, సత్యాగ్రహయుగం, ఎన్నికల యుగం—అన్నిటా ప్రబోధం కల్పించాడు.

మాతృభాషను నిరర్గళంగా ఉపన్యాసవేదికపై ఉపయోగించి, వినువారల నుఱ్ఱూతలూపడంలో అప్రతిమానప్రసిద్ధిజెందిన వక్తలలో సర్వోత్తమరా వొకడు. మాతృభాషయం దతని కెంత పటిమగల వాక్కో, ఇంగ్లీషులోనూ అంతే పటిమగలది. తమిళ, కన్నడములలోనూ నిరాఘాటోపన్యాసధోరణి కలదు.

బీదలనినా, మహాజనమనినా అతని కారాధనీయ మూర్తులు. చెన్నపట్టణంలో ఉండగా 18 యేండ్ల క్రిందట పాకీపనివారి సంఘానికీ, అచ్చుపనివారి సంఘానికీ అధ్యక్షుడుగావుండి అతడు కావించిన దీక్షాబద్ధమైన సేవను నేటికీ వారు స్మరించుకొని ఆనందిస్తున్నారు. కర్నూలు జిల్లాప్రతినిధిగా శాసనసభయందున్న కాలంలో అతడు రైతుబిడ్డలతో పల్లెలూ, చేలూ, అడవులూ తిరిగి వారికొరకు చేసిన కృషి, అప్పటి అధికారులకు కలిగించిన సత్యభీతి ఆ జిల్లా రైతులు—ముఖ్యంగా బీద తాలూకాలవారు—ఎన్నటికీ మరచునట్లులేదు. ఆరోగ్య వారాలు, కలరానివారణకార్యక్రమం, గ్రంథాల యోద్యమం, దేశీయవైద్య పునర్నిర్మాణం, రామదండు, అఖలభారత హిందూస్థానిసేవాదళం, కోఆపరేటివు ఉద్యమం, పంచాయితీఉద్యమం మున్నగు అన్ని ఉద్యమాలూ అతని సేవను పొందినాయి.

రాజకీయవిషయాలలో అతడు చేసిన సేవ అపారము. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘానికి సంవత్సరముల తరబడి అతడు సంయుక్తకార్యదర్శి. హోమ్ రూలులీగుకు ఆంధ్రరాష్ట్రకార్యదర్శి. అఖలభారతకాంగ్రెసుసంఘంలో సంవత్సరాలతరబడి సభ్యుడు. మొదటి సత్యాగ్రహ

రాజధానిసభకు సంయుక్తకార్యదర్శి. ఆంధ్రరాష్ట్రీ కాంగ్రెసుమహాసమావేశము మద్రాసులో జరిగినప్పుడు అధ్యక్షుడు. ఆంధ్రమహాసభకు అనంతపురంలో అధ్యక్షుడు. ఖరగ్పురంలో జరిగిన రాష్ట్రేతరాంధ్ర సభాధ్యక్షుడు. బొంబాయిఆంధ్రసమావేశాని కధిపతి. కాకినాడలో కాంగ్రెసు జరిగినప్పుడు కార్యదర్శివర్గంలో ఉన్నవాడు.

అతడు ఖండితవాది. ఎంతటివారినీ లక్ష్యపెట్టని తలబిరుసువాడని కొందరంటారు. కాని గాంధీయంతటివాని నాక్షేపించి "ది బ్రేవ్ హరిసర్వోత్తమరావ్" అని ఆయనచేత వ్యాఖ్యానం వ్రాయించుకొన్నాడు. ఇతరులడ్డుపడి రచ్చచేయుచోటునుండి లేచిపోవడం అతని గుణము. తన లాభనష్టముల గణన అతని కంతగాలేదు. ఈరెండు సందర్భాలూ అతనిని ప్రజాహితజీవనప్రమహా ప్రవాహంనుండి ఒక్కొక్కప్పుడు దూరస్థునిని చేస్తూవుంటాయి. కాని, నిజంగా ప్రజాహితజీవితంనుండి అతడెప్పుడూ దూరస్థుడు కాడు; కాలేదు.



శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు



శ్రీ రాజా పెద సుబ్బరాయశ్రేష్ఠిగారు

# శ్రీ రాజా పెదసుబ్బరాయ శ్రేష్ఠిగారు

నంద్యాలకు పోయి "మీవూళ్లో చెప్పదగిన ప్రజాభిమానపాత్రు లెవ"రని ఎవరిని అడిగినా సుబ్బరాయ శ్రేష్ఠిగారిపేరే చెపుతారు. ఈ పేరు వారికి ఉరికే రాలేదు. వేసవిలో త్రాగుటకు మంచినీరు దొరకక కష్టపడే బాటసారులకు చలివేంద్రలు పెట్టించీ, కలరా రోజులలో బీదలకు వుచితంగా మందులు పంచిపెట్టించీ, మహానందికి వెళ్లే యాత్రికులకు భోజనపానీయాది సౌకర్యాలు ఏర్పాటుచేయించీ—యీ విధంగా పేరుపడ్డారు. రాయలసీమలో దేశహితైకజీవనాభిలాషులు తక్కువ. అయినప్పటికీ పెద సుబ్బరాయశ్రేష్ఠిగారు నంద్యాలవారికిమాత్రమేకాకుండా రాయలసీమవారి కందరికీ మార్గదర్శులుగా ఉన్నారు. మహానందిలోజరిగిన ఆర్యవైశ్య మహాసభ, నంద్యాలలోని కృష్ణదేవరాయ పరిషత్సభలు జయప్రదంగా నెరవేరినాయంటే, ఆ సభలకు శ్రేష్ఠిగారు కార్యదర్శిగావుండి చేసిన కృషి, పడిన శ్రమ కారణాలు.

వారి ప్రజాసేవ ఇంతటితో నిలిచిపోలేదు. సుబ్బారాయశ్రేష్ఠిగారికి దేశీయవ్యాయామమంటే చాలా అభిమానం. దీనిని యువకులలో వ్యాపింపజేసేనిమి-

త్తమై మారుతి వ్యాయామమండలిని స్థాపించి, దానిని ప్రోత్సాహపరుస్తున్నారు. సామాన్యప్రజలకు విశేషంగా సంబంధంగల ఇర్రిగేషన్ బోర్డుకు, పంచాయితీ సభకు అధ్యక్షులయి బీదసాదల కష్టసుఖాలను జాగ్రత్తగా కనిపెట్టుతున్నారు. ఇప్పటికి రెండు తడవలనుంచీ నంద్యాల మునిసిపల్ సభకు ఉపాధ్యక్షులుగా ఉండి నగరాభివృద్ధికి సంబంధించిన యేర్పాట్లకు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. ఆర్యవైశ్య సంఘ స్థాపకులు, కన్యకాపరమేశ్వరీ ప్రతిష్ఠాపకులు, ప్రజాసేవకులు, రాయలసీమకు ఆభరణప్రాయులు అయిన రాజా పెద సుబ్బరాయ శ్రేష్ఠిగారు దేశహితైకజీవనాన్ని పుష్టిపరచే భారాన్ని సంతోషపూర్వకంగానూ, జయప్రదంగానూ నిర్వహిస్తూ నంద్యాలను ముందుకు నెట్టుకుపోతున్నారు.

---

## రాజాబహాదరు వెంకటరామారెడ్డిగారు, ఓ.బి.ఇ.

మోటారుకార్లు భుమ్ భుమ్ అని ఘీంకారాలు చేస్తూ వస్తూవున్నాయి. ముసల్మానులు, గుజరాతీలు, మార్వాడీలు, ఆంధ్రులు ఒక్కరొక్కరే వచ్చి వసారా లోని కుర్చీలమీద కూర్చుంటున్నారు. ఎనిమిదింటికి పది నిమిషము లుంది. తెల్లటి లాగు, కోటు వేసుకొన్న ఒక నౌకరు వచ్చి కాగితాల బుట్టను, ఫవున్ టెన్ కలాన్ని, సులోచనాల జోడును బల్లమీద పెట్టి వెళ్లిపోయాడు. సరిగా యెనిమిది గంటలు కొట్టేసరికి బంగాళాలోపల నుంచి ఒకరువచ్చి బల్లదగ్గరవున్న కుర్చీలో కూర్చున్నారు. వారు రావడంతోనే కుర్చీలమీద కూర్చున్నవారంతా లేచి, మొగలాయిపద్ధతిని ముమ్మారు తలవంచి సలాం చేసి తిరిగీ కూర్చున్నారు. బంగాళాలోపలనుంచి వచ్చిన పెద్దకు సుమారు 50 సంవత్సరాలపైన వయస్సు. పరి మాణంలో పొట్టి. కాస్త స్థూలశరీరం. నలుపురంగు. కుచ్చుల్రవేలాడే యెర్రటి ఫెజ్ టోపీ. తెల్లటి వదులు లాగు. నీలపురంగుగుడ్డమీద తెల్లని చారలు, కఫ్సు వున్న పొడుగైన షర్టు. వారే హైదరాబాదు కొత్వాలుగా వుండిన రాజాబహద్దరు వెంకటరామా

రెడ్డి ఓ.బి.ఇ. గారు. వారి విగ్రహంలో ఆకర్షణీయమైన అంశమేమీ లేదుగాని వారి సులోచనాల అడుగున దాక్కొనివున్న ప్రకాశమైన ఆ నేత్రాలు, దయా సంకలిత హృదయాన్ని సూచించే ఆ నిష్కల్మషపు ముఖ వికాసం, దృఢసంకల్పాన్ని ప్రకటించే ఆ చెక్కిళ్లు చూపఱులకు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. వారు పోలీసు వుద్యోగీయు లయినప్పటికీ భయంకరమైన ఆకృతి యేమీ లేక శాంతి, ప్రేమ, దయాళుత్వమే అధికంగా వారి ఆకారంలో కనిపిస్తున్నాయి. బల్లదగ్గర వారు కూర్చుండిన రెండు నిమిషాలకు కొందరు కరానీలు వచ్చి సర్కారు కాగితాలను కట్టలకు కట్టలు వారిముందుంచి, ఒక్కొక్క దానిమీదనే వారిసంతకం పుచ్చుకొన్నారు. చేవ్రాలు చేయవలసిన కాగితాలు యెన్ని వున్నప్పటికీ ప్రతికాగితాన్నీ శ్రద్ధగాచూచి సంతకం చేశారుగాని చదువకుండా, సంగతి గ్రహించకుండా మాత్రం చేయలేదు. ఒకవేళ గుమాస్తాలు వేసుకొని వచ్చిన వుత్తరువులు తమకు తృప్తికరంగా లేనప్పుడు వాటిని మారుస్తూ వచ్చినారు. ఈ ప్రకారం ప్రొద్దున 8 గంటలకు, సాయంకాలం 4 గంటలకు తమ ఆఫీసుపని పూర్తిచేసుకొన్న తర్వాత వారి దర్శనార్థమై వచ్చినవారు ఒక్కరొక్కరే వారి వద్దకు

వెళ్లి, మాటలాడవలసిన సంగతులు మాటలాడి పోతూ వచ్చినారు. రహస్య విషయాలు మాటలాడవలసినవా రుంటే అట్టివారిని లోపలికి తీసుకొనిపోయి యేకాంతంగా మాటలాడి పంపివేశారు. ఎంతమంది వచ్చినాసరే, నిదానంగా, నెమ్మదిగా మాట్లాడి పంపిస్తూ వచ్చినారు గాని విసుగు జెందలేదు. తొందరపడలేదు. చెప్పిన సంగతులే తిరిగి తిరిగి చెప్పడం, కాలహరణం చేయడం మన వారి స్వభావం. అయినా చెప్పేమాటలను ఓపికతో వింటూవచ్చినారుగాని "కాలహరణమయింది. వెళ్లి రండి" అనేమాట వినబడలేదు. అధికంగా, యెక్కువ సేపు మాటలాడదలచినవా రుంటే రాత్రి యెనిమిది గంటల ప్రాంతంలో ప్రత్యేకదర్శనమిచ్చి మాట్లాడుతూ వుంటారు. మోటార్లమీదా, గుఱ్ఱపుబండ్లమీదా తిరుణాలకు వచ్చినట్టు వచ్చే ప్రజయావత్తూ ఒక తరగతివారు, ఒకపనికై వచ్చినవారు కాదు. పెద్ద వుద్యోగులు, లకూధికారుల మొదలు వుద్యోగాలకు, శిఫారసులకు, రాజ్యవ్యవహారసంబంధమైన సంప్రదింపులకు, స్కూలు జీతాలకు, విరాళాలకు—అది ఇది అని విడదీయడం యెందుకు, అన్నివిధాల సహాయానికీ వచ్చేవారుగా వుంటారు.

వెంకటరామారెడ్డిగారికి ఆంగ్ల విద్యాపరిచయం

స్వల్పం. నవనాగరికసంప్రదాయం అభ్యాసం కాలేదు. పాశ్చాత్యదేశాలకు పోయి ఆధునిక పోలీసుపద్ధతులను పరిశీలింపలేదు. రాజ్యాంగశాస్త్రాన్ని పఠింపలేదు. ఈలాటి శిక్షణ యేమీ లేకపోయినప్పటికీ ముస్లిము రాష్ట్రానికి ప్రధాననగరమున్ను, అనేకజాతుల ప్రముఖులకు నివాసస్థానమున్ను అయిన హైదరాబాదు కొత్వాలు పని–అనగా పోలీసు కమీషనరుపదవిని యెట్లా నిర్వహించారు? నైజాము ప్రభువుయొక్క ప్రత్యేక విశ్వాసానికీ, గౌరవానికీ యెట్లా పాత్రులయినారు? గొప్ప సమర్థులు, రాజనీతిజ్ఞులు అనే ప్రతిష్ఠను యెట్లా గడించారు? ఈప్రశ్నలకు వచ్చే సమాధానమునుబట్టే వెంకటరామారెడ్డిగారి పరిపాలనాదక్షతయొక్క రహస్యం గ్రాహ్యమవుతుంది. ఆధునిక విద్యావంతులలో మంచితనం, పరోపకారబుద్ధి లేవనిచెప్పను గాని వెంకటరామారెడ్డిగారికి ఆధునిక నాగరికత విశేషంగా అబ్బక పోవడంమీదనే వారిలో అధికంగా కనుపించే ప్రాచీనుల నిగర్వం, సేవానురాగం, ప్రజోపయోగ కార్యనిరతి, కల్మషరహితమైన వర్తనం, సర్వజనశ్రేయోభిలాష, జయప్రదమైన పాలనమూ ఆధారపడివున్నాయని నా విశ్వాసం. విద్యవల్ల లభింపని యోగ్యత, సామర్థ్యం,

పరిపాలనాదక్షతలు అనుభవంవల్లనూ, స్వయంశిక్షణ వల్లనూ లభించినాయి. వారు కేవలం స్వశక్తివల్ల నే వున్నత స్థితికి వచ్చినారు.

హైదరాబాదు సంప్రదాయం విశేషంగా ముస్లిమ్ నాగరికానికి సంబంధించివుంది. అయినా, రాజ్యాంగంలో హిందువులున్ను ప్రాముఖ్యస్థానాలను వహిస్తున్నారు. బ్రిటిషుప్రదేశంలోకంటె హైదరాబాదులో హిందూ–ముస్లిం సఖ్యత అధికంగా వున్నదని ప్రతీతి. ఎంతవున్నా అప్పుడప్పుడు విషమపరిస్థితులు యేర్పడకపోవడంలేదు. ఇటువంటి విషమపరిస్థితులు యేర్పడినప్పుడల్లా మన కొత్వాల్ సాహెబ్‌గారు చూపుతూవచ్చిన వివేకం, దూరదృష్టి, కార్యదక్షతలు ప్రజయొక్క, ప్రభుత్వంయొక్క ప్రశంసకు పాత్రమయినాయి. వారు కమీషనరుగా వుండినంతకాలం హిందూ–ముస్లిమ్ కలహాలు లేక శాంతంగా గడచిపోయింది. రెడ్డిగారు మతరీత్యా హిందువులున్ను, జాతీయులుగా ఆంధ్రులున్ను అయినప్పటికీ హిందూ–ముస్లిమ్ సఖ్యభావాన్ని వారు పోషించినంతగా మరెవరూ పోషింపలేదు. వారు స్వజాతీయుల విశ్వాసాన్ని, ప్రేమనూ యెంతగా గడించారో అంతగానే జాతీయుల విశ్వాసాన్ని, ప్రేమనూకూడా గడించారు.

దీనికి వారి నిష్కల్మషహృదయం, నిష్కాపట్యస్వభావం, ప్రజాభిమానం కారణంగా యెంచవచ్చును. వివాదగ్రస్తమైన ముస్లిమ్‌వ్యవహారాలనుసహా వెంకటరామారెడ్డిగారి పరిష్కారానికై ప్రభుత్వంవారు నిర్ణయించడాన్నిబట్టి యీ ఆంధ్రుని న్యాయబుద్ధియందు ప్రభుత్వంవారికిన్ని, ముస్లిమ్ మహాజనులకున్ను యెంతపూజ్యభావం గలదో విశదం కాగలదు.

పరిపాలనాదక్షతకు ఆంగ్లవిద్యగాని, విదేశీయ శిక్షణగాని అవసరం లేదనే సంగతికి వెంకటరామారెడ్డిగారి చరితమే మనకు నిదర్శనంగావుంది. వారిలో మనకు గ్రాహ్యంకాని యేదో మంచితనం, గొప్పశక్తి లేనియెడల హైదరాబాదు శాసనసభయందు, మునిసిపల్ కార్పొరేషనులో, డివలప్‌మెంటు ట్రస్టులో సభ్యతను వహించి ఆయా పదవులనెల్లా తెలివితేటలతోనూ, శక్తిసామర్థ్యాలతోనూ, ప్రజానుకూలంగానూ నిర్వహించడమే సంభవించివుండదు. దీనజనసేవానురాగమే లేనియెడల కుష్ఠువుల, వృద్ధుల, అనాధబాలబాలికల శరణాలయాల నిర్వాహకభారాన్ని వహించి వాటి వున్నతికై శ్రమచేయడమే పొసగివుండదు. ఒకవైపున ప్లేగు, ఇంకొకవైపున ఇన్ఫ్లూయంజా బయలుదేరి ప్రజను నాశ

నం చేస్తూవున్న సమయంలో తమ ప్రాణానికైనా లెక్క-చేయక వీథి వీథీ తిరిగి, బీదలకు ఔషధపానాదుల సమర్చి, అత్యుత్సాహంతో ప్రజాసేవకు దిగివుండరు. ఇంకా రివెన్యూ, జ్యుడిషల్, మునిసిపల్ వుద్యోగీయుల, పోలీసు ట్రెయినింగుస్కూలు విద్యార్థుల, ప్లీడరీ పరీక్షా ర్థుల పరీక్షకులుగా వుండి ప్రసిద్ధిగాంచివుండరు. ఇట్లా ప్రభుత్వాన్నీ, ప్రజనూ, దేశాన్నీ సేవిస్తూవచ్చిన రెడ్డి గారిని కొత్వాలుస్థానంనుండి నిర్గమింపజేయడానికై యెంద రెంత ప్రయత్నించినప్పటికీ నైజాముప్రభువు వారి ఉద్యోగకాలాన్ని హెచ్చిస్తూవచ్చిన సంగతి ఒక్కటే చాలు వారి యోగ్యతనూ, న్యాయశీలాన్నీ, ప్రజా సేవనూ నిర్ణయించడానికి.

చివరకు వెంకటరామా రెడ్డిగారు పింఛను పుచ్చు కొని, తమ వుద్యోగంనుంచి మరలవలసివచ్చినప్పుడు ప్రజలు దీనిని ఒక నష్టంగా తలచి, బహు దుఃఖించారు. ఈ సందర్భంలో పోలీసువారూ, ఆయాసంస్థల నిర్వాహ కులూ, పౌరులూ తమ విచారాన్ని ఒక ప్రక్క, రెడ్డి గారిపైగల ప్రేమనూ, అభిమానాన్నీ, పూజ్యభావాన్నీ యింకొక ప్రక్క తెలుపుతూ సమర్పించిన అసంఖ్యాకము లైన పత్రములే నిదర్శనాలు. కాని, ప్రజలు ప్రకటిం

చిన సద్భావంకంటె నైజాముప్రభు విట్టి ప్రజాభిమాని యైన వుద్యోగియుని వదలుకోవడానికి యిష్టంలేక తమ సొంత యెస్టేటుపైన సరఫ్–ఈ–ఖాస్ వుద్యోగిగా నియమించి ప్రకటించిన గౌరవభావం మహత్తరమైన విషయం ; మరువ తగనిది. నైజాము ప్రభువుకును వెంకటరామారెడ్డిగారికిని గల సన్నిహిత సంబంధాన్నిబట్టి యీా గౌరవభావం సహజంగానే వుంది.

హైదరాబాదు రాష్ట్రంలోని 1 కోటి 44 లక్షల ప్రజలోను 70 లక్షలమంది ఆంధ్రులు. విశ్వవిద్యాలయ పండితులు, లాయర్లు, డాక్టర్లు, వర్తకులు, ధనవంతులు యెందరో వున్నారు. కాని వారందరిలోనూ ఆంగ్లవిద్యా పరిచయం లేనట్టి, ఆధునిక నాగరకం అబ్బనట్టి, వట్టి సామాన్యవ్యక్తిగా తమజీవితాన్ని ప్రారంభించినట్టి కొత్వాలు వెంకటరామారెడ్డిగారియంతగా ప్రజయొక్క, ప్రభుత్వంయొక్క, నైజాంప్రభువుయొక్క గౌరవానికీ అనుగ్రహానికీ పాత్రమై, అపారమైన తమ పలుకుబడిని ప్రజోపయోగకార్యాలకై వినియోగించినవారు మిక్కిలి తక్కువ. ఈ గౌరవాన్ని పుట్టించింది వుద్యోగమా? కాదు. విద్యా? కాదు. భాగ్యమా? కాదు. వెంకటరామారెడ్డిగారియందు సహజంగావున్న శక్తి

సామర్థ్యాలూ, సమదృష్టీ, న్యాయశీలమూ, సేవాభిలాషా ప్రబలకారణాలని నా నమ్మకం. నైజాం రాష్ట్రంలోని 70 లక్షల ఆంధ్రులలోను ప్రజకు సహాయంచేసేవారు, చేస్తూవున్నవారు వెంకటరామారెడ్డిగారే. వారి స్వభావం చేతనైన ఉపకారం చేయడంగాని తీయని మాటలు చెప్పి పంపడంకాదు; ఉద్యోగీయులమని ప్రజకు దూరంగా వుండడమూ కాదు. వారితో కలిసి, వారి కష్టసుఖాలను గ్రహించి, వారికి తోడ్పడుతూఉండడమే రెడ్డిగారి ఆశయం. హైదరాబాదులో ఆంధ్రులకు గౌరవప్రతిష్ఠ లేమైనా కలిగినట్లయితే అవి కొత్వాలు వెంకటరామారెడ్డిగారియొక్క పేరునే ఆశ్రయించి వున్నాయి.

మొత్తాన హైదరాబాదురాష్ట్రీయాంధ్రులలో ప్రత్యేకవ్యక్తిత్వం, జాత్యభిమానం, స్వయంసహాయకృషి అంటూ వొకటివుంటే అవి రెడ్లలోమాత్రం వున్నాయి. వారిలో విద్యవుంది, ద్రవ్యంవుంది, నాయకత్వంవుంది. పరోపకారపారీణులాంధ్రగు గద్వాల్, వనపర్తి రాణులున్నారు. అన్నిటికంటె ప్రధానమైన రాజాబహద్దరు వెంకటరామారెడ్డి గారున్నారు. హైదరాబాదులో సుమారు రెండులక్షల రూపాయలను వెచ్చించి, 150

మంది విద్యార్థుల నివాసభోజనాదులకు వసతిభవనాలు నిర్మింపబడినాయంటే, 250 మంది బాలికల విద్యాభివృద్ధికై ప్రశస్తమైన ఒక బాలికోన్నత పాఠశాల స్థాపితమై జయప్రదంగా నిర్వహింపబడుతూవుండంటే, కవులు, గాయకులు, పండితులు సన్మానింపబడుతున్నారంటే, ఈలాటి ప్రజోపయోగకర కార్యాలలో వెంకటరామారెడ్డిగారు ప్రకటించే అభిమానం, చూపే శ్రద్ధ, చేసే శ్రమ ముఖ్యకారణాలుగా కనిపిస్తున్నాయి. వారు సహాయంచేయని సంస్థ లేదు; ఆదరింపని పండితుడు లేదు; దాతృత్వానికి పాత్రుడుకాని ఆశ్రితుడులేడు. డెబ్బయిలక్షల ప్రజకు మిత్రులు, నాయకులు, ఉద్ధారకులు, ప్రజయొక్క ప్రభుత్వంయొక్క అనురాగానికి పాత్రులు మన రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు.

---



రాజా బహద్దరు వెంకటరామారెడ్డిగారు ఓ. బి. ఇ.



శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు

## శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారు

హైదరాబాదు రైతుబిడ్డ. ఆంగ్లవిద్యయొక్క వాసన తగులలేదు. ఉర్దూలోనే న్యాయవాదిపరీక్షలో వుత్తీర్ణులై, యిప్పటికి 30 యేండ్లనుంచి వున్నతన్యాయస్థానంలో న్యాయవాదులుగా ఆరితేరిన చేయి.

వృత్తిచేత న్యాయవాదులు. గృహాన్ని చూస్తే రైతుగృహంలాగున యింటినిండా జనమే. వచ్చేచుట్టం, పోయేచుట్టం. ఇక ప్రజోపయోగకరమైన యే కార్యం వచ్చినాసరే తృణమో పణమో కొంత పడవలసిందే. శాసనసభ్యులైన తర్వాత యిది మరీ హెచ్చింది. హైదరాబాదు ప్రాతశాసనసభకు అసలు యెన్నికలే తక్కువ. ఉన్న స్థానాలన్నీ 21. వీటిలో రెండు స్థానాలుమాత్రం లాయర్లయొక్క, మరి రెండుస్థానాలు జాగీరుదార్లయొక్క నిర్ణయానికి వదలివేయబడ్డాయి. భాగ్యానికీ, అధికారానికీ విశేషప్రాముఖ్యంగల యీ రాష్ట్రంలో శాసనసభాప్రవేశం సులభమైన కార్యం కాదు. అయినా వెంకటరంగారెడ్డిగారికి యీ అపూర్వగౌరవం లభించింది.

పాదునగరంలో జరిగిన అయిదవ ఆంధ్రమహాసభాధిపత్యం వహించి విద్యాపరిస్థితులను, వ్యవసాయ

దారుల స్థితిగతులను గురించి వుత్తేజకమైన వుపన్యాస మిచ్చి వారు తమ శాసనసభాసభ్యత్వాన్ని సార్థకపరుచుకొన్నారు. హైదరాబాదురాష్ట్రంలో చదువ నేర్చిన వారు నూటికి అయిదుగురుకన్నా హెచ్చుగాలేరనీ, ఖాస్గీ పాఠశాలలను గురించి జారీచేయబడిన నియమాలు జనసామాన్యంయొక్క విద్యావ్యాప్తికి ఆటంకంగా వున్నాయనీ, ప్రైమరీవిద్యను మాతృభాషలోనూ, సెకండరీవిద్యను వుర్దూలోనూ నేర్పవలెనని చేసిన నిర్ణయం పారిశ్రామికవిద్యార్జనాభిలాషులకు ప్రతిబంధకంగావున్నదనీ ప్రస్తుతవిద్యావిధానంలోని బలహీనపుపట్టులను చక్కగా వివరించారు.

వెంకటరంగారెడ్డిగారు శాసనసభయందు ప్రవేశించినతర్వాత ఒకటికాదు రెండుకాదు, పదిహేడు బిల్లులను ప్రవేశపెట్టినారు. శాసనసభవారు వీటిలో ఒకదానిని ఆమోదించినా చాలు, ఈలాటి బిల్లులకు నూతనరాజ్యాంగ శాసనసభలో తగినంత అవకాశం లభించవచ్చు. వెంకటరంగారెడ్డిగారి సేవాభిలాష, ప్రజాభిమానం, నిగర్వం యువజనులకు మార్గదర్శకంగా వుంటున్నాయి.

## శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు

మహాఘనతవహించిన నైజాంప్రభువుయొక్క రాష్ట్రంలో సగంవంతు ప్రజలు ఆంధ్రులు. అక్కడి 16 మండలాలలోనూ సగంవంతుమండలాలు పూర్తిగా తెలుగువారివే. తక్కినవాటిలోనూ ఆంధ్రప్రాముఖ్యం లేకపోలేదు. కాని, కాకతీయసామ్రాజ్యంనాటినుండి నైజాం ప్రభువునే కనిపెట్టుకొని, ప్రభుభక్తితో మెలగే అమాయకపు తెలంగాణావారు వెనకకుపడడం, నిన్నగాక మొన్న వచ్చిన మరాటీలూ, కన్నడులూ ముందుకునెట్టుకొనిపోవడం జరుగుతూవుంది. దీనికి కారణం ప్రభుత్వంలో ఆంధ్రులకు తగినంత పలుకుబడి లేకపోవడమో, తక్కినవారిదానికంటె ఆంధ్రుల దేశహితైకజీవనం బలహీనంగా వుండడమో ఏదోవొకటి అయివుండవచ్చు. ఇందువల్ల ఆంధ్రమండలాలలో వ్యవసాయక్షేత్రాలు, పరపతినిధులు, వైద్యశాలలు, విద్యకూ పోస్టుకూ సంబంధించిన సౌకర్యాలు వుపేక్షింపబడుతున్నాయంటారు.

ఇక ప్రజాహితజీవనంచూస్తే, వాక్స్వాతంత్ర్యానికీ, ప్రజాసమావేశానికీ ప్రతిబంధకాలు కనిపిస్తున్నాయి. సభ జరుగుటకు పూర్వమే తీర్మానాలను, వుపన్యాసాలను,

వుపన్యాసకులపేర్లను అధికారులకు పంపాలి. హైదరా బాదీయులుకానివా రెవరూ సభాధిపతిగా వుండగూడదు; ఉపన్యసించగూడదు. కోర్టులలో ఆంధ్రభాషకుప్రాధాన్యం లేదు. ఖాస్గీపాఠశాలలకు ప్రోత్సాహం లేదు. అధికార మంతా వుగ్రరూపంలోవుంది. ఈలాటి క్లిష్టపరిస్థితులలో బయలుదేరింది ఆంధ్రమహాసభ. ఈ ప్రతిబంధకా లన్ని టికీ తలవంచి శాంతమహాసముద్రంలోని మంచుబండ లాగ ఆంధ్రసంఘం కదులుతూవుంది. ప్రజలో నూతన సంచలనం వుత్పన్నమయింది. ఈ శుభోదయానికి మాడ పాటివారి నిరంతరకృషి, విసుగులేని పరిశ్రమ, చలనం లేని దీక్ష, ప్రజాభిమానం తోడ్పడ్డంతగా మరేదీ తోడ్పడలేదు.

సంకుచితదృష్టిగల అధికారులూ, ప్రజల నీడను చూచి సందేహించే వుద్యోగీయులూ ఆంధ్రమహాసభలో ఏదో వుపద్రవం వున్నట్టుగా తలచడంలో న్యాయంలేదు. కారణమూలేదు. రాజ్యాంగసంబంధమైన కష్టాలను ప్రభుత్వానికి తెలుపుకోవడం రాజద్రోహం కాదు. "ఆంధ్రమహాసభ అనగా తెలంగాణా దేశవుగ్రామవాస్త వ్యులగు వ్యవసాయదారుల మహాసభ" అని ప్రభుత్వ సభాకార్యదర్శులగు మౌల్వీ సయ్యదు మహమ్మదు

మొహిదీన్ సాహెబుగారు నిర్వచనంచేసి చాలా వుపకా రంచేశారు. దీనిలో గ్రామ పునరుద్ధరణ సమస్యయావత్తూ యిమిడివుంది. ఈ రహస్యాన్ని నిజామాబాదు సభాధ్య క్షులగు మందుములవారు గ్రహించి గ్రామోద్ధరణను పూరించారు. సభయొక్క దృక్పథాన్ని త్రిప్పినారు.

నందిగామలోజరిగిన కృష్ణామండలసభ యెక్కడ? మొన్న నిజామాబాదులోజరిగిన ఆంధ్రమహాసభ యెక్క డ? అప్పటినుంచి యిప్పటివరకున్నూ మాడపాటివారు ఆంధ్రసభలకు పోతున్నారు. ఉపన్యాసా లిస్తున్నారు. పుస్తకాలు ప్రచురిస్తున్నారు. వారి హృదయం యావత్తూ వేడిఆవిరులతో, ఆవేశంతో, ఆశలతో పొంగి, వారు ఆంధ్రగీతాన్ని పాడుతూవుంటున్నారు. ఈ గీతగోవిందంలో మాడపాటివారు గౌరవాలను కోరలేదు. ఉద్యోగాలను అపేక్షించలేదు. హనుమకొండలో రాజరాజనరేంద్ర భాషానిలయాన్ని, హైదరాబాదులో శ్రీ కృష్ణదేవరాయ భాషానిలయాన్ని సేవించినా, శాసనసభయందలి ద్విభా షీ వుద్యోగాన్ని వదలి వున్నత న్యాయస్థానపు న్యాయవా దిగా ప్రతిష్ఠింపబడ్డా వీటి యన్నిటిఅడుగునా నిష్కల్మష మైన, నిర్మలమైన సేవ, అతులితకార్యదీక్ష స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆంధ్రమహాసభయొక్క కష్టాలు గట్టెక్కేరోజులు దగ్గరలోనే వున్నాయి. హైదరాబాదు రాష్ట్రీయశాసన సభ విస్తరింపబడ్డది. నూతనరాజ్యాంగశాసనసభలో ప్రజాప్రతినిధులు ప్రశ్నలు, తీర్మానాలు, బిల్లులద్వారా నూ, బడ్జెటు చర్చసందర్భంలోనూ హైదరాబాదురాష్ట్రం లోని 70 లక్షల ఆంధ్రమహాజనులకు యెంత వుపకార మైనా చేయవచ్చు. ప్రజాప్రతినిధులకున్ను, అధికారుల కున్ను కలిగే పరిచయంద్వారా యెంతప్రయోజనాన్ని అయినా నెరవేర్చవచ్చు. ఆంధ్రుల సంఖ్యయొక్క ప్రయోజనాన్ని, ఆంధ్రమహాసభయొక్క వ్యవసాయ ప్రయోజనాన్ని రాబోయే యెన్నికలలో పూర్తిగా విని యోగించుకొని బూరుగులవారు, మందుములవారు, సుర వరంవారు, కొండావారు, మాడపాటివారు హైదరాబాదు ఆంధ్రుల జీవనాన్ని సౌఖ్యకరమైనదిగానూ, దుఃఖరహిత మైనదిగానూ మార్చగలరు. అప్పుడు ఆంధ్రజాతి తిరిగీ సహజమైనకాంతితో ప్రకాశింపగలదు.



శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు

## శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు

హైదరాబాదురాష్ట్రం దేశీయసంస్థానాలలోనాయక స్థానమందున్నది. రాజ్యాంగవిధానం క్రమంగా మారుతూవుంది. అక్కడి 1 కోటి 44 లక్షలపైచిలుకు జనంలోనూ తెలుగువారు 70 లక్షలకుపైగా వున్నారు. జనులున్నారుగాని జనసంఖ్యకు తగిన ప్రాముఖ్యం తెలుగు వారికి లేదు. సామాన్యజనాభ్యున్నతికై కృషిచేసే వుద్యమాలూ, ప్రజాభిమానాన్ని సంపాదించుకొన్న నాయకులూ చాలా తక్కువ. భాగ్యవంతులకు తక్కువలేదు గాని భాగ్యవంతు లొక ప్రక్క, బీదలు యింకొక ప్రక్కనూ చీలి సాంఘికభేదాలు గడ్డకట్టుకొనిపోయి నాయి. సాంఘికవాతావరణం ధనాఢ్యులతోనూ, అధికార ప్రియులతోనూ క్రమ్మి సామాన్యజీవులను వెనక్కు యీడ్చివేస్తూవుంది.

ఈలాటి స్థితిలో ఆంధ్రోద్యమం బయలుదేరింది. కాని, యిది భాగ్యవంతుల అభిమానాన్నీ, అధికారుల ప్రాపకాన్నీ సంపాదించుకొన్నట్లు కనపడదు. ఉభయ పక్షాలవారున్నూ యీ వుద్యమాన్ని కొంతవరకు అనుమానంతోనే చూస్తున్నారు. అయినా, ప్రతివుద్యమ

మున్నా ఆరంభంలో అనుమానంపాలు కాకతప్పదు. ధనాఢ్యుల వుపేక్షకూ, అధికారుల అనుమానాలకూ పాత్రమైన యీ వుద్యమాన్ని మాడపాటివారు, సురవరం వారు, బూరుగులవారు, కొండావారు, మందుముల వారు మొదలైనవారు యెట్లాగో శ్రమపడి లాక్కొని వస్తున్నారు.

ప్రతాపరెడ్డిగారు న్యాయవాదులు. అయినా, ద్రవ్యసంపాదనపరిశ్రమయందే పెనగులాడే న్యాయవాదులు కారు. ప్రజాభ్యున్నతికై శ్రమించే దేశహితైకాభిలాషులు. పత్రికలులేని కాలంలో, ఒకరి సంగతి వొకరు గ్రహించడానికి వీలులేని రోజులలో 'గోలకొండ పత్రిక'ను స్థాపించి, సామాన్యజనంలో స్వాభివృద్ధికరమైన ప్రయత్నాలను పురికొల్పుతున్నారు. ఆంధ్రమహాసభయొక్క స్థాయిసంఘ కార్యదర్శియై, మహాసభయొక్క నిర్మాణ కార్యక్రమాన్ని, సాంవత్సరిక సమావేశ కార్యభారాన్ని అత్యుత్సాహంతో నిర్వహించుకొనివస్తున్నారు.

ప్రతాపరెడ్డిగారు ఆధునికవిద్యావంతులు. అయినా, వారియందు ఆధునికుల దంభంకంటె పూర్వీకుల వినయం, ఆంగ్లవిద్యావంతుల స్వప్రయోజనాభిలాషకంటె ప్రాచీ

నుల పరోపకారశీలం పాదుకొని వారిని ప్రజోపయోగ జీవనానికి పురికొల్పుతున్నాయి. అనేక నిర్బంధాలు, షరతులు, అనుమానాలతో జోగిపేటయందు సమావేశమైన ప్రథమాంధ్రమహాసభయొక్క నిర్వహణభారాన్ని ప్రజలు వారిమీద పరిపూర్ణవిశ్వాసంతో వేసినప్పుడు వారు జంకలేదు, తడవుకోలేదు ; ఆ భారాన్ని నిర్విఘ్నంగా, జయప్రదంగా నిర్వహించి తమ ప్రజ్ఞావిశేషాన్ని, ధీరత్వాన్ని ప్రకటించారు. యువకుల సాహసాన్ని, పెద్దల బుద్ధిబలాన్ని, న్యాయవాదుల నేర్పరితనాన్ని, దేశసేవకుల సేవానురక్తినీ సమృద్ధిగాగల ప్రతాపరెడ్డిగారు యీ గుణాలన్నిటినీ తెలింగాణా ఆంధ్రోద్యమ విజృంభణకై, సామాన్యజనుల అభ్యున్నతికై వినియోగించి ప్రజను సుస్థితికి తేగలరు. హైదరాబాదీయ ఆంధ్రులకు సమానప్రపత్తిని కల్పింపగలరు.

## శ్రీ మందుముల నరసింగరావుపంతులుగారు

తెల్ల ఖద్దరుపైజామా, తెల్లని షేర్వానీ, తెల్లని గాంధీటోపీ ధరించి పలచటి శరీరం గల యువకు లొకరు కుర్చీలో కూర్చున్నారు. బల్లమీద ఏవో పుస్తకాలు, పత్రికలు, ప్రభుత్వంవారి ప్రచురణాలు కుప్పలుగా వున్నాయి. స్వచ్ఛమైన ఆ ఖద్దరుదుస్తులే వారి పరిశుద్ధ హృదయాన్ని, డాంబికత్వంలేని వర్తనాన్ని, అచంచల మైన సేవాభిలాషనూ విశదీకరిస్తున్నాయి.

"ఎందుకు మనకీ పేపర్లు? పరాయివాళ్ల గొడవ యెందుకు మనకు? కాలుమీద కాలువేసుకొని కూర్చుంటే జరగదూ, నాయనా, నీకు?" అని తల్లి చెప్తున్నా నరసింగరావుగారి దృష్టి వుద్యోగంమీదా లేదు; ప్లీడరీమీదా లేదు; ద్రవ్యంమీదా లేదు. హైదరాబాదు రాష్ట్రీయాంధ్రులమీదా, వెనకదిక్కు లేక, కష్టాలు చెప్పుకోవడానికి ధైర్యంలేక, నాగలికొయ్యతో పెనగులాడే రైతుమీదా పోయి, వారి మనస్సు వారిని వున్నదానితో తృప్తిపడి కూర్చోనీయలేదు. వారి దేశహితైక కార్యాభిలాషే లాయరుబోర్డుకు బదులు రైతుబోర్డును తగిలించేటట్టు చేసింది. ఆంధ్రుల హృదయాన్ని గ్రహించి,

వారి కష్టసుఖాలయందు సానుభూతికలిగి, దిక్కులేని రైతుకు దిక్కయి, అతని బరువును మోస్తూవున్న ప్రజాభిలాషులలో, అతని కష్టాన్ని తమ కష్టంగా యెంచే సేవాభిలాషులలో హైదరాబాదులోని 70 లక్షుల ఆంధ్రులలో మందుములవారికి మొదట చేతులు యెత్తాలి.

నరసింగరావుగారివంటి బుద్ధిమంతులకు, పలుకుబడిగల యువకులకు కావలిస్తే నైజాంప్రభుత్వంలో వుద్యోగం దొరకదా ? బోర్డు తగిలిస్తే కేసులు రావా ? ఈ సదుపాయాలన్నీ వున్నా రైతుబోర్డును తగిలించుకొని, క్లిష్టమైన రైతుసమస్యలను పరిశోధించి, ప్రభుత్వం వారు చూడడానికి వీలులేని భాషలోగాక రాజభాష అయిన వుర్దూలో రైతును సేవించడానికి పూనుకోవడం లోనే వారి దూరదృష్టి, వివేకం, రాజనీతీ కనిపిస్తున్నాయి.

నరసింగరావుగారికి ప్రజలు తొడిగిన గౌరవాలు యేమీ లేవు. ప్రభుత్వంవారున్నూ ఏమీ తొడగలేదు. రైతువలెనే తెలంగాణా దుక్కి దున్నుతున్నారు. హైదరాబాదు ఆరవ ఆంధ్రమహాసభాధిపత్యాన్ని వహించి చేసిన వుపన్యాసమే ప్రభుత్వానికి వెన్నెముకగానూ, సంఘానికి మణిపూసగానూ వుండే రైతుపై గల అభిమానాన్నీ, అతని సమస్యల పరిశీలనానుభవాన్నీ తెలుపుతూ

వుంది. "గ్రామాదులు మూర్ఖులై, మూఢవిశ్వాసప్రియు లైన కర్షకులకు ఆటపట్టు లవుతున్నాయి. భూము లు చిన్నచిన్న తునకలుగా చీలిపోతున్నాయి. భూమి యొక్క ధాన్యోత్పత్తి తగ్గుతూవుంది. పశువులు క్షీణించి పోతున్నాయి. శీతజ్వరం, స్ఫోటకం మొదలైన వ్యాధులే కాదు, క్షయ, కుష్ఠు, నారిపుండ్లుకూడా ప్రబలుతున్నాయి. ప్రాచీన ఆయుర్వేద వైద్యులు అంతమొందుతున్నారు. ప్రజల జీవితపరిమాణం తగ్గిపోతూవుంది" అని అధ్యక్ష పీఠంనుంచి పూరించిన వాక్యాలు, "ఆంధ్రోద్యమం ఉచ్చతరగతివారిదే కాదు, జనసామాన్యానికి సంబం ధించినది సుమా" అని నుడివిన న్యాయం చాలు, వారిని రైతుఉద్యమనాయకస్థానంలో కూర్చుండబెట్టడానికీ, ఆం ధ్రోద్యమంయొక్క నిజస్వరూపాన్ని గ్రహించిన ప్రము ఖునిగా పరిగణించడానికీ.

నరసింగరావుగారిమీద రైతులేకాదు, ప్రభుత్వం వారున్నూ కన్నువేసి వున్నారు. నైజాంరైలును కంపెనీ వద్దనుండి నైజాంప్రభుత్వంవారు తీసుకోవడానికి వుద్యు మించిన రోజులలో రైతు పట్టింది భూమిలోకి దిగని తెలింగాణానాగలికొయ్య కాదు, బలరాముని నాగలి. ఆ రోజులలో రయ్యత్ ప్రభువుపతాౕన వుగ్రరూపం ధరిం

చింది. అప్పుడే కాదు, యిప్పుడున్నూ రైతు జీవనసమస్యలను ప్రభుత్వానికి తెలుపుతూ, ప్రభుత్వాన్నీ రైతునూ దగ్గరగా చేరుస్తూ, నరసింగరావుగారు చేసే సేవకు ప్రజలేకాదు, ప్రభుత్వంవారున్నూ ఋణపడివున్నారు. హైదరాబాదు రాష్ట్రంలోని హిందూ-ముస్లింసమాఖ్యకు యీ రయ్యత్ పత్రిక కంతగా మరేపత్రికా తోడ్పడడం లేదు. ఆంధ్రుల అభ్యున్నతికై నరసింగరావుగారు చేసే సేవ సర్వజనాదరణీయం కాగలదు.



## రావుసాహేబు అనంతపద్మనాభస్వామిగారు

శ్రీఅనంతపద్మనాభస్వామిగారు సుప్రసిద్ధులగు గుమ్మిడిదల లక్ష్మీనారాయణసేటుగారి పుత్రులు. లక్ష్మీనారాయణగారు రంగులవ్యాపారం చేసి వెనుకటి యుద్ధసమయంలో చాలాధనాన్ని గడించి దాతలుగా పేరు పడ్డారు. అన్నవస్త్రదానం, దేవాలయనిర్మాణం అంటే లక్ష్మీనారాయణగారికి యెంతో యిష్టం. సికింద్రాబాదులోని వారిసత్రంలో వేసే విస్తరి, తీసే విస్తరి. పొమ్మనడం లేదు. ఇక వారు కట్టించిన ఆలయంయొక్క ఉన్నత శిఖరం వారికీర్తిని దూరప్రదేశాలకుసహా చాటుతూ, పెద్ద జ్ఞాపకచిహ్నంగా ప్రకాశిస్తూవుంది.

అనంతపద్మనాభస్వామిగారు యువకులు. ఉత్సాహవంతులు. కార్యోత్సాహులు. బొంబాయి-సికింద్రాబాదుల మధ్య రయ్యిరయ్యిన వారు ఆకాశ విమానాలలో ప్రయాణాలు చేసినట్టుగానే వారి భావాలున్నూ పరుగెత్తుతూవుంటాయి. విద్యాలయాలు, వైద్యాలయాలు, బీదసాదలకు సహాయం—యీలాటి కార్యాలకు తడుముకోకుండా యిస్తూవుంటారు. కింగు యెడ్వర్డు మెమోరియల్ వైద్యశాలకు, కేవున్నతపాఠశాలకు, బీహారు

భూకంపనిధికి వారిచ్చిన భూరివిరాళాలే వారి యౌదార్యానికి నిదర్శనంగా వుంటున్నాయి.

అనంతపద్మనాభస్వామిగారు కవికుమారులు. గుజ...షలో హృద్యమైన అనేకగీతికలను రచిం...ంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, స్విడ్జర్లాండు దేశాలలో దీర్ఘయాత్రచేసి, అక్కడి ప్రము...ర్శనభాగ్యం కలిగి, తమ అనుభవాలను విస్త...తమ భావాలకు మెరుగుపెట్టుకొన్నారు. ...త్వంవారు అనంతపద్మనాభస్వామిగారి వుదార...మా, ధర్మగుణాన్ని గ్రహించి రావుసాహేబు...త్కరించివున్నారు. ఈలాటి సత్కారాలింకా ...ంతపద్మనాభస్వామిగారిని ఆశ్రయించుకొని

## డాక్టరు గంటి సత్యనారాయణగారు

గోదావరిజిల్లాబోర్డు వైసుప్రెసిడెంటు, సుప్రసిద్ధ న్యాయవాదులు, ఒకటవ తరగతి ఆనరరీమేజస్ట్రేటు, కాంగ్రెసుఅభిమానిగా ప్రసిద్ధిచెందిన గంటి సుబ్బారాయడుగారి పుత్రులు, సత్యనారాయణగారు. పిఠాపురంరాజావారి కళాశాలలో విద్యాభ్యాసం చేస్తూవుండగా బయలుదేరిన సహాయనిరాకరణోద్యమసమయంలో ఇతరవిద్యార్థులవలె వారున్నూ కళాశాలను మానుకొన్నారు. విద్యార్థిగా వుండినకాలంలో విద్యార్థి సంఘాన్ని స్థాపించి, విద్యార్థుల పక్షాన కాలేజీ అడ్వయిజరీబోర్డులో ప్రతినిధిగావుండి, డిబేటింగుసొసైటీలో ప్రాముఖ్యంపొంది—యిట్లాగున అప్పటికే నాయక లక్షణాలను చూపుతూ ముందుకు నెట్టుకొనిపోగల యువకులుగా పరిగణింపబడుతూవచ్చినారు.

తరువాత కాకినాడ వదలి, బొంబాయి... కాలలో వైద్యశిక్షణపొంది, ఆ బొంబాయిమహానగరంలో భాగంగావున్న దాదరులో ఒక స్వతంత్రచికిత్సాలయాన్ని స్థాపించడం, దానిని జయప్రదంగా నిర్వహించడం, పారశీకులు, గుజరాతీయులవంటి పరాయి

వారిని ఆకర్షించడం సామాన్యవిషయంకాదు. వారి చికిత్సాలయం చుట్టుపట్ల 200 లకు పైగా వైద్యులున్నారు. దూరదేశంనుంచి వెళ్లిన ఒక ఆంధ్రుడు ఇంతమందిని ముందుకు త్రోసుకొనిపోగలిగినాడంటే ఆయనలో ఒక చికిత్సానైపుణ్యంమాత్రమే కాదు, ఇతరులను ఆకర్షించే సాంఘికలక్షణాలున్నూ వుండాలి. ఈలాంటి గుణాలన్నీ సత్యనారాయణగారిలో సమృద్ధిగా వున్నాయి.

వారు తమ వైద్యప్రయోజనాన్ని సాధ్యమైనంత మందికి లభింపజేసేవుద్దేశంతో ఒక్క దాదరులోనేగాక మాతుంగాలోనూ ఒక చికిత్సాలయాన్ని స్థాపించివున్నారు. వారు కేవలం ద్రవ్యాన్నే ప్రధానం చేసుకొన్నవారు కారు. కింగ్సుసర్కిల్ వద్ద దగ్గరవున్న పోలీసువారికీ, విక్టోరియాజూబిలీటెక్నికల్ ఇన్‌స్టిట్యూటు విద్యార్థులకూ ఆనరరీవైద్యులుగా నియమితులై ప్రజయొక్క, ప్రభుత్వం యొక్క కృతజ్ఞతకు పాత్రులైనారు. బొంబాయివుత్తర ప్రాంతంలోని వైద్యసంఘాలలో ముఖ్యమైన ఒక సంఘానికి నాయకులుగా ప్రసిద్ధిపొందడమే చాలు వారి పలుకుబడినీ,మంచితనాన్నీ, తెలివినీ,సామర్థ్యాన్నీ తెలుపడానికి.

వైద్యవృత్తికి సంబంధించిన యింత పనిని, బరువును మీదవేసుకొన్నప్పటికీ వారు బొంబాయిఆంధ్రు

లను మరువలేదు. బొంబాయిరాష్ట్రీయఆంధ్రమహా సభకు కొంతకాలం కార్యదర్శిగాను, మరికొంతకాలం వైస్‌ప్రెసిడెంటుగాను, ప్రెసిడెంటుగాను వుండి ఆ సభ యొక్క ప్రయోజనాన్ని, ప్రాముఖ్యాన్ని యెంతమట్టుకు కలుగజేయాలో అంతమట్టుకు కలిగించారు. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి యాజమాన్యంక్రింద జరిగిన సంస్కరణసభయొక్క సన్మానసంఘాధిపత్యభారంకూడా వారిమీదనే పడి, ఆ సభయొక్క జయానికెంతో తోడ్పడ్డారు. అప్పుడేకాదు యిప్పటికీ గోదావరిమండలవాసులకు ప్రియమైన సంఘసంస్కరణమంటే సత్యనారాయణగారు అత్యంతాభిమానంతో పనిచేస్తూవుంటారు.ఆంధ్రుల కష్ట సుఖాలకు సంబంధించిన కార్యాలన్నిటను శ్రద్ధవహిస్తూ, తమ సహాయం కోరివచ్చేవారికి తోడ్పడుతూ, బీదలకు తమ వైద్యసహాయాన్ని లభింపజేస్తూ, బొంబాయిఆంధ్రుల జీవితాన్ని బలవంతమైందిగానూ, ప్రకాశమైంది గానూ చేస్తున్నారు.



డాక్టరు గంటి సత్యనారాయణగారు

## శ్రీ కంచర్ల జానకిరామయ్య అందు సన్ను

సుమారు యాభై సంవత్సరాలక్రిందట బందరు నుండి బొంబాయికి వెళ్లి, అక్కడ ఒక ఆంధ్రవర్తకుని వద్ద చిన్నవుద్యోగిగా ప్రవేశించి, కేవలం బుద్ధిబలంచేత, పరోపకారబుద్ధిచేత, వ్యాపారనైపుణ్యంవల్ల ప్రాముఖ్య పదవికి వచ్చి, జన్మస్థానమైన బందరుకేకాదు, ఆంధ్ర దేశానికంతకూ బొంబాయిలో పెద్ద ప్రతిష్ఠను సంపా దించారు జానకిరామయ్యగారు.

వ్యాపారంనిమిత్తం, ఇతరపనులకొరకు, షికారు లకు ఆ కాలంలో బొంబాయికి పోతూవుండిన ఆంధ్రులు "కంచర్లవారి యిల్లు యెక్కడ, యెక్కడ" అని విచారిం చి, బొంబాయిలో వుండినన్ని రోజులూ వారి అతిథులు గానే వుండి, జానకిరామయ్యగారి పరోపకారశీలాన్నీ, అతిథిసత్కారాన్నీ పొగడుతూవచ్చేవారు. జానకిరా మయ్యగారు పేదరికంలోనుంచి వున్నతస్థితికి వచ్చిన వారు కావడంచేత యెంతకీర్తినీ, ధనాన్నీ గడించినప్ప టికీ చివరవరకూ బీదలను మరచినవారు కారు. బొంబా యివంటి నగరానికిపోతే అక్కడ బంగారపు కొండను త్రవ్వుకొనిరావచ్చుననే గంపెడాశతో వెళ్లి, చివ

రకు వుండడానికి స్థలం, పూటకూళ్లకు రొక్కం లేక చిక్కులుపడుతూవుండే తెలుగువారికి జానకిరామయ్య గారియొక్క, కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారియొక్క తోడ్పాటే లేకుండివుంటే యేమయిపోయెడి వారో చెప్పనక్కరలేదు.

జానకిరామయ్యగారు వర్తకులైనప్పటికీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు బొంబాయిఆంధ్రుల సాంఘికసమావేశాలను యేర్పరచిన రోజులలో మొట్ట మొదటి సమావేశాన్ని నిర్వహించే గౌరవం జానకిరామయ్యగారికే యిచ్చారు. ఇంతకుపూర్వం ఆంధ్రులు - ఆంధ్రసమావేశాల ప్రసక్తిలేని దేశం కావడంచేత యీ అల్పాహారసభకు అందరూ వెళ్లడం, జయప్రదంగా జరగడం ఏర్పడింది.

జానకిరామయ్యగారు నిరాడంబరులు. సనాతన ధర్మాభిలాషులు. ఆంధ్రాభిమానులు. గుంటూరు శారదా నికేతనం, బందరుఆంధ్రజాతీయకళాశాల, తోటపల్లి కొండలమీది శాంతిఆశ్రమం, రామలింగయ్య గారి వైశ్యశరణాలయం, బొంబాయిఆంధ్రసభ—యీ లాటి సంస్థలు వారి సహాయానికి పాత్రమవుతూవచ్చి నాయి. ఆంధ్రదేశీయుల మన్ననలను పూర్తిగా పొంది,



శ్రీ కంచర్ల వెంకటరత్నంగారు

తమ జీవితాన్ని కీర్తివంతంగా గడపి, వారు చివరకు తమ 68-వ యేట యీ లోకాన్ని విడిచిపోయినారు.

జానకిరామయ్యగారికి యిద్దరు పుత్రులు—వెంకట రత్నంగారు, రామకృష్ణయ్యగారు. వెంకటరత్నం గారు బొంబాయిలో బి. కామ్. పరీక్షలో కృతార్థులై, తండ్రిగారి వ్యాపారంలో ప్రవేశించారు. రామకృష్ణ య్యగారికి వ్యాపారమంటే యెంతయిష్టమో దేశ హితైకకార్యాలంటేనూ అంత అభిమానం. బొంబాయి ఆంధ్రమహాసభ పుట్టినప్పటినుంచిన్నీ వారే కోశాధి కారులు. అనేక చిల్లరసంఘాలను స్థాపించి సంఘ బలాన్ని చీల్చివేయడంకంటె బలవంతమైన సంఘం ఒకటి వుంటే చాలుననీ, దానివల్ల అధికమైన ప్రయోజనం కలుగుతుందనీ వుద్దేశంతో రామకృష్ణయ్యగారు చిల్లర సంఘాలన్నిటినీ యేకంచేసి కేంద్రసంఘ స్థాపనకై కృషి సలిపి చివరకు తమ ప్రయత్నంలో జయంపొందగలి గారు. ఈలాటి సంఘాలకు ప్రారంభదశలో కలిగే ఒడు దుడుకుల నన్నిటినీ నెమ్మదిగా తప్పించి, ఆంధ్రమహా సభకు బలాన్నీ, వూతనూ కలిగించడంలో రామకృష్ణ య్యగారు చేసిన కృషి మరువతగిందికాదు. ఇప్పటికీ కంచర్ల సోదరులు ఆంధ్రమహాసభపైన ఒక కన్ను వేసి

దాని వున్నతికై కావలసిన ప్రయత్నాన్నీ, సహాయాన్నీ చేస్తూనేవున్నారు. ఈ సోదరులు తమ తండ్రిగారి అడుగు జాడలయందే నడుస్తూ, జానకిరామయ్య అండు సన్సు అను పేర నే తమ వ్యాపారాన్ని జరుపుతూ, అతిథి అభ్యాగతులకు తోడ్పడుతూ, బొంబాయిఆంధ్రులలో ప్రాముఖ్యస్థానం వహించి, ఆంధ్రుల గౌరవాన్ని పోషించుకొనివస్తున్నారు.

---

# శ్రీ శిష్ట్లా వెంకటరావుగారు

ఒక పెద్ద కార్యస్థానానికి అధికారులయి, సామాన్యంగా యూరోపియనుల స్వాధీనంలోవుండే ఒకవృత్తిని స్వాధీనపరచుకొని, పదుగురు ఆంధ్రులకు ఉద్యోగాలు కల్పిస్తూ కీర్తిప్రతిష్ఠలు వహిస్తున్న బొంబాయిఆంధ్రులలో ముఖ్యులు శిష్ట్లా వెంకటరావుగారు. వస్తువిక్రయానికీ, వస్తుప్రకటనలకూ కావలసిన వ్రాతసదుపాయాల నమర్చుటకై హారన్‌బీరోడ్డులో స్థాపింపబడిన కార్యస్థానానికి అధికారులు.

వెంకటరావుగారు యీ సంస్థను ప్రారంభించక ముందు యీలాటిపని యావత్తూ యూరోపియనులకుగాని మనవారికి సాధ్యంకాదనే అభిప్రాయం ఒకటి వుంటూ వుండేది. దీనిని మొట్టమొదట ఛేదించిన ఆంధ్రులు వెంకటరావుగారు. మొదట వారు జి. ఐ. పి. రైల్వేఉద్యోగిగా ప్రవేశించారు. ఆవుద్యోగాన్ని చేస్తూనే వస్తువిక్రయానికీ, ప్రకటనలకూ కావలసిన ప్రత్యేకశిక్షణ సంపాదించుకొన్నారు. అందుకు సంబంధించిన పరీక్షలలో కృతార్థులయినారు. వారి శక్తిసామర్థ్యాలకూ, కల్పనాశక్తికీ, నైపుణ్యా

నికి మెచ్చి లండనులోని వర్తకప్రముఖులు వారిని 'ఇన్ కార్పొరేటెడ్ సేల్సు మేనేజర్సు అసోసియేషన్' అనే సుప్రసిద్ధ సంస్థకు సభ్యులుగా యెన్నుకొని వారియెడల తమకుగల గౌరవాభిమానాలను ప్రకటించారు. మన దేశంలో ఈలాటి గౌరవం పొందినవారు వా రొక్కరే.

శిష్ట్లావారు చేస్తూవున్నపని చాలా కష్టమయింది. అయినా యూరోపియనుప్రమాణానికి తగ్గకుండా తమ కార్యాన్ని జయప్రదంగా నిర్వహిస్తూ వస్తున్నారు. ద్రవ్యాన్ని సంపాదిస్తున్నారు. ఆంధ్రులకు జీవనోపాధి కల్పిస్తున్నారు. బొంబాయిఆంధ్రసభకు అధ్యక్షస్థానం వహించి ఆంధ్రుల కీర్తిప్రతిష్ఠలను విస్తరింపజేస్తున్నారు.



## శ్రీ పాత్రుని వెంకటనారాయణగారు

పశ్చిమగోదావరిలోని నరసాపురం నివాసులగు పాత్రుని లక్ష్మీనారాయణ శాస్త్రిగారి పుత్రులు. శాస్త్రి గారు చాలాకాలం బొంబాయిలోనే వుంటూవచ్చి నారు. పండితులు. జీవితాంతంవరకూ అతిథులను సత్కరిస్తూ, నరసాపురంలోని తమ స్వగృహాన్ని సహా సత్రం క్రింద మార్చివేసి, దాని శాశ్వతపోషణకై కొంత భూమినికూడా యిచ్చి కీర్తిని గడించిన పురుషులు.

వెంకటనారాయణగారున్ను వితరణలో తమ తండ్రిగారి మార్గాన్నే అనుసరించి బొంబాయిఆంధ్రులలో పేరుప్రతిష్ఠలు గడించుకొన్నారు. పాతికేండ్ల క్రిందట ఒక చిన్న వుద్యోగంలో ప్రవేశించి, క్రమంగా ప్రాముఖ్యమైన ఒక ఆంగ్లేయవాణిజ్యసంస్థలో చేరి, ఆంధ్రులకు అందుబాటులోలేని వస్తువిక్రయశాఖాధికార పదవిలో వున్నారిప్పుడు. ఒక గొప్ప ఆంగ్లేయవ్యాపార సంస్థలో బాధ్యతతోగూడిన యీలాటి వుద్యోగాన్ని పొందడం, ఆ తర్వాత దానిని జయప్రదంగా నిర్వహించడం సామాన్యవిషయంకాదు. వెంకటనారాయణ గారికి తీరిక అంతగా లేకున్నా, దేశహితైకకార్యాలనూ,

ఆంధ్రుల మంచిచెడ్డలకు సంబంధించిన వ్యవహారాలనూ వెనుక వేయలేదు. ఈ పనులన్నిటియందును సంబంధం కల్పించుకొంటున్నారు. బొంబాయిఆంధ్రమహాసభకు అధ్యక్షపదవి వహించారు. బొంబాయి ఆంధ్రపరపతి సంఘానికి అధ్యక్షులై: దానిని జయప్రదంగానూ, జనోప యోగకరంగానూ నడుపుతూవచ్చారు. వారి ఆంధ్రాభి మానం, స్నేహపాత్రత ప్రజను ఆకర్షిస్తూ, బొంబాయి ఆంధ్రులకు కీర్తిని సమకూరుస్తున్నాయి.



# శ్రీ మల్లాడి సత్యలింగం నాయకరుగారు

రంగూనుకు యెందరో తెలుగువారు వస్తున్నారు, పోతున్నారు. కాని, తమ ద్రవ్యాన్ని లక్షలకులక్షలు దాన ధర్మాలకు వినియోగించినవారిలో సత్యలింగం నాయకరు గారు వొక్కరినే వ్రేలుపెట్టి చూపవచ్చు. ఆ రోజులలో నాయకరుగారు రంగూనుకు రావాలంటే స్టీమరు కేవు లేదు. అందుకని చాపవోడలో ప్రయాణం చేయవలసి వచ్చింది.

రంగూనుకువచ్చి, పడవలసిన కష్టాలన్నీ పడి, చిన్న చిన్న పనులనుండి పెద్దపెద్ద పనులకు ప్రాకి, భూములు, యిండ్లు, వస్తువాహనాదులు, పడవలు, లాంచీలు సంపాదించి ధనవంతులనీ, ధర్మాత్ములనీ కీర్తిని సంపాదించుకొన్నారు. వారు చనిపోయేటప్పటికి వారియాస్తి యావత్తూ 20 లక్షలవిలువ వుండింది. అందులో 8 లక్షలను వొక్క కలంగీటుతో ధర్మాలకై వినియోగించిన మహోదారసంపన్నులు వారు.

1912–వ సం॰ సెప్టెంబరు 20–వ తేదిని వ్రాసిన ఆఖరు మరణశాసనం గనుక చూస్తే వారి హృదయం యేలాటి

అభిమానంతో వ్యాగులాడిందో, వారి ప్రజాభిమానం యేలాగున నడిపించిందో తెలుస్తుంది.

1. విశాలమైన ఆటస్థలాలతో, జిమ్నాషియము యేర్పాటుతో, కాకినాడలోని జగన్నాధపురంలో ఒకస్కూలు కట్టడానికి,
2. కాకినాడసమీపమందున్న చొల్లంగిగ్రామంలో స్థిరమైన వసతులతో ఒక దేవాలయాన్ని నిర్మించడానికి,
3. జగన్నాధపురంలో స్కూలుదగ్గరగా బీదలకుఅన్నదానం నిమిత్తమై ఒక సత్రాన్ని యేర్పరచడానికి

లక్షరూపాయలను వినియోగించవలసిం దన్నారు. మిగిలిన ఏడులక్షలమీాద వచ్చే వడ్డీబాపతునుంచి పై ధర్మకార్యాలను పోషించవలసిం దన్నారు. జగన్నాధపురంసత్రంలో జాతిమత వివక్షతలు లేకుండా, ప్రతిరోజూ 200 మందికి కాయగూరలతో కూడిన భోజనం పెట్టడానికిన్నీ, పాఠశాలలో అన్నిజాతుల పిల్లలనూ చేర్చుకొని పై 9మరీవరకు చదువు, వడ్రంగం, నేత, కుండలు చేయడం మొదలైన చేతిపనులను నేర్పుటకున్నూ ఏర్పాటులు చేయించవలసిం దన్నారు. భోజనానికి తగినంతమంది రాకుంటే అధమం వందమందికైనా అన్నదానం చేయవలసిందనీ, ఇందులో 25 గురు విద్యార్థులనుకూడా కలుపవలసిందనీ షరతు పెట్టినారు.

సత్యలింగంనాయకరుగారికి విద్య లేకపోయినా, ఇతరులకు పై[ై]మరీచదువు, చిన్న చిన్న చేతిపనులు నేర్పుటలో తృప్తిపడలేదు. చెన్నపురిరాజధాని హిందువులలో ఒకరికి వున్నతవిద్యకొరకో, లేకుంటే పారిశ్రామికవిద్య కొరకో యూరోపు, అమెరికా, జపాను మొదలైన దేశాలలో విద్యాభ్యాసనిమిత్తమై ప్రతిసంవత్సరమూ ఏడు లక్షలమీద వచ్చే వడ్డీబాపతునుండి 4,000 రూపాయలను ఖర్చుచేయవలసిందన్నారు.

ఈలాటి కార్యాలకు మన ఆంధ్రదేశంలో యిన్ని లక్షలను సామాన్యపుతరగతివారు యెవ్వరూ యివ్వలేదు. సత్యలింగం నాయకరుగారిని యీ విధమైన మరణశాసనం వ్రాయించింది బారిష్టరు మణిఅయ్యరని చెప్పతారు. ఇంతకూ నాయకరుగారి ధర్మాలను ధర్మకర్తలు యెంతవరకూ నెరవేరుస్తున్నారో సరిగ్గా తెలియదు. అయినా, సత్యలింగం నాయకరుగారివంటి మతాభిమాని, విద్యాభిమాని, ప్రజాభిమాని యింకొకరు బర్మా ఆంధ్రసంఘంలో పుట్టలేదు.

## శ్రీ దొమ్మేటి వెంకటస్వామిగారు

బర్మాశాసనసభ్యులు, రంగూనుకార్పొరేషను కౌన్సి లరు, ఆనరరీ మేజస్ట్రేటు, ఆంధ్రమహాజనసంఘ అధ్య క్షులు, ఆంధ్రనాయకులు అగు దొమ్మేటి వెంకటస్వామి గారు యీ లోకాన్ని విడచి యిప్పటికి ఆరేండ్లు కావ స్తూవుంది. వెంకటస్వామిగారికి పూర్వం ఆంధ్రులలో సంఘాలకు అధ్యక్షపదవులను వహించినవారువుండవచ్చు. విద్యాభివృద్ధికి పాటుపడినవారూ వుండివుంటారు. దాన ధర్మాలకు ఖ్యాతికెక్కినవారికీ లోటు లేకపోయివుండ వచ్చు. ఎవ రెంత ప్రసిద్ధిచెందినా, ప్రజాక్షేమానికై ఎంత కృషిచేసినా, ఆంధ్రజాతియొక్క కీర్తిని వెంకట స్వామిగారియంతగా విస్తరింపజేసినవారు లేరు. నాయకు నికి కావలసిన విద్య, సేవాభిలాష, భాగ్యము—యీ గుణాలన్నీ వెంకటస్వామిగారిలో సమృద్ధిగా వుండడం చేత ఆంధ్రనాయకత్వం వారిని వరించింది.

బర్మాఆంధ్రుల ప్రజాహితజీవనాన్ని మనము పరిశీ లించినట్టయితే వెంకటస్వామిగారి కాలంలో ఆంధ్రుల కీర్తి ఒకవిధంగా ఉచ్ఛదశను వహించిందని చెప్పవచ్చు. చులకనగానూ, ఔదాసీన్యంతోనూ చూడబడుతూ

వుండిన ప్రజలకు ప్రభుత్వంలోనూ, ప్రజాహిత జీవనం లోనూ కొంత పలుకుబడీ, ప్రాముఖ్యం ఏర్పడ్డాయి. ఆత్మరక్షణాన్ని మరచి నిద్రావస్థలోవున్న ఆంధ్రజాతి నక్షత్రమండలంలాగున సహజకాంతితో ప్రకాశించింది.

వెంకటస్వామిగారు గొప్పవక్తలుకారు. ఆర్భాట ప్రియులున్నూ కారు. కాకపోయినా, యుక్తిగా, నెమ్మదిగా, మంచితనంగా రంగూను కార్పొరేషనులో రంగూనునగరానికి చేసినంత సేవను, వుపకారాన్ని ఏ భారతీయ సభ్యుడున్నూ చేయలేదు. వారి కాలంలో క్రొత్తచోట్ల రోడ్లుపడ్డాయి. లాంతరు స్తంభాలు, నీటి కొళాయిలు ఏర్పడ్డాయి. మురుగునీటి వసతులు వృద్ధి చేయబడ్డాయి. రంగూనుబస్తీయొక్క సౌందర్యాన్నీ, పారిశుద్ధ్యాన్నీ, ఆరోగ్యాన్నీ వృద్ధిపరచడానికై తమ యావచ్ఛక్తినీ వినియోగించారు.కీర్తిని గడించుకొన్నారు. కలాబస్తీలోవున్న చిన్న వుద్యానవనానికి వారి పేరు పెట్టడమే కార్పొరేషనుఅధికారులకూ, సభ్యులకూ, నగరవాసులకూ వారియందుగల పూజ్యభావాన్ని తెలియజేస్తున్నది.

వెంకటస్వామిగారి పలుకుబడినీ, ప్రజావశీకరణ శక్తినీ నిర్ణయించాలంటే మునిసిపల్ యెన్నికల వంకా,

శాసనసభ యెన్నికలవంకా దృష్టిని పరచాలి. ఈ యెన్ని కలలో వారికి వస్తూవుండిన వేలకొద్దీ ఓట్లు ప్రతివానికీ దిగ్భ్రమను కలిగిస్తూవుండేవి. స్వామిగారిని వారి స్థానం నుంచి కదల్చడం దుర్ఘటమైన కార్యమని భారతీయులందరి లోనూ వ్యాపించిపోయింది. ఈలాటి నాయకుని అకాల మరణంవల్ల స్వకులస్థులు సంఘాభిమానినీ, ఆంధ్రజనులు నాయకునీ పోగొట్టుకొన్నారు. బర్మాఆంధ్రులకు తీరని నష్టం కలిగింది.

---



కీ. శే. శ్రీ దొమ్మేటి వెంకటస్వామిగారు

## శ్రీ రెడ్డి సన్యాసయ్యగారు

సుమారు 35 యేండ్ల వయస్సు, నలుపురంగు, చల్లని చూపు, మితసంభాషణ, విసుగులేని దాతృత్వం- యీ లక్షణాలుగల సన్యాసయ్యగారు హోటల్లోవున్నా, యువజనసంఘంలోవున్నా, ఆఫీసులో కూర్చున్నా, రేవు దగ్గర నిలబడ్డా, నాటకానికి పోయినా, సినిమాకు వెళ్లినా యెప్పుడూ వొకగుంపు వెంటవుంటుంది. ఈ గుంపును ఆకర్షించేది సన్యాసయ్యగారి మిత్రవాత్సల్యం, అతిథి సత్కారం.

సన్యాసయ్యగారు వృత్తిచేత కూలిమేస్త్రీ, లేదా లేబరుకాంట్రాక్టరు. రంగూనులో వారికి సంబంధం లేని సంఘంలేదు, సహాయంపొందని సంస్థలేదు. ఈ విషయమై వొకపత్రిక ముచ్చటిస్తూ "సన్యాసయ్య గారి సంఘసేవాపరాయణత్వాన్ని యెరుగని ఆంధ్రుడు బర్మాలో లేడని చెప్పడం అతిశయోక్తికాదు. ఆంధ్రులు మొదలుపెట్టే ఏ సత్కార్యమైనా సరే వారి సహాయం పొందవలసిందే. బర్మాకువచ్చి గడించుకొనేవారు యెందరో వున్నారు. సన్యాసయ్యగారి లాగున దానధర్మాలు చేసేవారుమాత్రం చాలాతక్కువ." అని వ్రాసింది.

దీనిలో పొల్లులేదు ; అతిశయోక్తిన్నీ లేదు. సన్యాసయ్య గారికి యివ్వడమనేది వొక అభ్యాసం. ఆపుదామన్నా ఆపలేరు. ఇస్తూవుండవలసిందే, యెవరికో వొకరికి.

రంగూనుఆంధ్రులలో సన్యాసయ్యగారికంటె విద్యావంతులూ, ధనవంతులూ లేకపోలేదు. ఉన్నా, అడిగినవారికి లేదనకుండా యివ్వడంలో సన్యాసయ్య గారినే ముందుగా చెప్పవలసివుంటుంది. ఆంధ్రదేశం నుండి కవులూ గాయకులూ రానీయండీ, హరిదాసులూ కళోపాసకులూ రానీయండి, గుళ్లుకట్టేవారూ చెరువులు త్రవ్వించేవారూ రానీయండి—యెవరు వచ్చినా సరే చేతినిండా యిచ్చేదీ, బ్యాడ్‌మింటన్ ఫుట్‌బాల్ టూర్న మెంటులు, స్వచ్ఛందసేవాదళాలు, విద్యార్థుల వక్తృత్వపు పోటీపరీక్షలు, శ్రీరామనవమివుత్సవాలు, పాఠశాలలు, సంఘాలు—యీలాటి కార్యాలకు పోషకులై ప్రోత్సాహపరచేదీ సన్యాసయ్యగారే.

వారి దాతృత్వానికి వొక హద్దు, వొక విరామం అంటూ కనుపించవు. ఆ యివ్వడంకూడా సణుక్కొని గొణుక్కొని, తిట్టుకొని తుమ్ముకొని, పుచ్చుకొనే వాళ్లకు కష్టాన్ని కలిగించి యివ్వడమనేది వారి తత్వంలో లేదు. స్వయంగానేకాదు, వుత్తరాలద్వారాను

వారిని విసిగించేవారు యెందరో వుంటారు. వారికి వచ్చే వుత్తరాలను చూస్తే రంగూనుఆంధ్రసంఘంలో యెంత దుఃఖం, యెంత దారిద్ర్యం వున్నాయో మచ్చుగా తెలుస్తాయి. "నాయనగారూ, నేను బీదవాణ్ణి. బర్మాలో అన్నం దొరుకుతుందని చాపచుట్టతో వచ్చాను. కడుపునొప్పిచేత జనరల్ ఆస్పత్రికి పోతే అక్కడ వారు పరీక్షించి, కడుపులో యేదో వుండ వున్నదనీ, శస్త్రంవల్లగాని నయంకాదనీ చెప్పేసరికినా ప్రాణాలు యెగిరిపోయినాయి. ఇంతకూ నా రోజులు దగ్గరకు వచ్చాయి. ఇక్కడ చస్తే, తగులవేసేవాళ్లుకూడా లేరు. ఈ దిక్కుమాలిన ప్రాణం దేశంలో గుటుక్కుమనడానికి దారిచూపి పుణ్యంకట్టుకోండి" అని వొకరోగి వ్రాస్తాడు.

"తండ్రీ, నేను ప్రైవురీప్యాసైనాను. నా తల్లి నన్ను యెవడో దిక్కుమాలిన ముండాకొడుక్కు కట్టింది. ఈ పెళ్లి యెందుకు వచ్చిందోగాని గుడ్డకూ, అన్నానికీ మొగం వాచిపోతున్నాను. చెప్పుకుంటే సిగ్గు. అన్నమైనా పెట్టలేని యీ దరిద్రపుముండాకొడుకుమాటలు చూస్తే ఆకాశాన్ని అంటుతాయి. రోజూ తిట్లే, దెబ్బలే. నేను కుళ్లి కుళ్లి చస్తున్నాను. చివరకు వొకరోజున చెప్పకుండా యెక్కడికో లేచిపోయాడు. చూస్తూచూస్తూ మానం

అమ్మకోలేక యెందులోనైనా.........మేలని అను కుంటున్నాను. దిక్కులేని యీ పక్షికి కాస్తసహాయం చేసి నిలబెట్టండి. యీలోగా ఏ పంతులమ్మ పనిఅయినా చూచుకుంటాను" అని యింకో బాలిక వ్రాస్తుంది. సన్యాసయ్యగారి స్వభావాన్ని తెలపడానికి యీ మచ్చు ముక్కలే చాలు. ఒక రోజున వారు యేటిదగ్గర స్నేహితు లతో మాట్లాడుతూ నిలబడ్డారు. దీపా లింకా పెట్టలేదు. ఇంతలో చింపిరిగుడ్డలు కట్టుకొన్న వొక మనిషి వచ్చి, ఒక చిన్న గుడ్డలమూటను వారి పాదాలదగ్గర పెట్టి "బాబయ్యా, యిది నా బిడ్డ. ప్రొద్దున చచ్చిపోయింది. మన్ను చేద్దామంటే దమ్మిడీలేదు. యెక్కడికి పోయినా పో పో అన్నారు."అని వెక్కివెక్కియేడుస్తూ "యీ బిడ్డను మన్నుచేయించండి, మన్నుచేయించండి" అని రెండు పాదాలమీదా తలపెట్టి, కాళ్లు పట్టుకొన్నాడు. ఈలాటి ప్రార్థనను యెవరు నిరాకరించగలరు? అందులో నూ సన్యాసయ్యగారా? ఆయన నెమ్మదిగా కాళ్లను వెనక్కు లాక్కొని, జేబులో చేయిపెట్టినారు. కాని, జేబులో యేమీ లేకపోయింది. అంతట దగ్గరవున్న వారిదగ్గర 20 రూపాయలు బదులుతీసుకొని, అతని చేతిలోపెట్టి పంపుతూ"చాలకపోతే మళ్లీ రా"అన్నారు.

క్వెట్టాలో భూకంపంవచ్చి వూరంతా తుడిచి పెట్టుకుపోయింది. చావగా మిగిలినవాళ్లు కట్టుకునే దానికి గుడ్డ, తినేదానికి అన్నం లేక బాధపడుతున్నారు. సన్యాసయ్యగారు తమ యువజనబృందాన్ని బయలు దేరదీసి, ప్రొద్దుటిపూట నగరసంకీర్తనం చేస్తూ, వీథి వీథీ తిరిగి 800 రూపాయల రొక్కాన్నీ, యిన్ని బట్టల తానులనూ వసూలుచేసి నైద్రాయిగారి నిధికి పంపి వారి కృతజ్ఞతకు పాత్రులయినారు. మోల్మీన్ యెక్కడో వుంది. చౌతలంలోని దేవాలయం మరమ్మతులు లేక పడివుంటే, తమ యువకమిత్రులతో మోల్మీన్ ప్రయాణం కట్టి, మాలపల్లి నాటకాన్ని ప్రదర్శించి, ఆ వచ్చిన ఆదాను యావత్తూ ఆలయనిర్మాణానికి సమర్పించి వచ్చారు. సన్యాసయ్యగారి సేవాభిలాషను పత్రికలు నుతించాయి. కవులు కీర్తించారు. ప్రజలు అభినందించారు. మోల్మీన్ ఆంధ్రయువజనసంఘంవారూ, రంగూను ఆంధ్రస్వచ్ఛందసేవాదళంవారూ చెప్పినట్టుగా సన్యాసయ్యగారు బర్మాఆంధ్రులకు సాటిలేనికీర్తిని ఆర్జిస్తున్నారు. ధనాధిపతులయెడ, బీదలయెడ సమత్వంచూపుతూ, అందరినీ ప్రేమిస్తూ, అందరికీ యథాశక్తినిసహాయం చేస్తూ, ఆంధ్రుల హృదయంలో స్థాపించుకుపోయారు.

## శ్రీ గూడూరు తాతయ్యసెట్టిగారు

రంగూనులో వేలకొద్దీ తెలుగువా రున్నారు. భాగ్యవంతులూ లేకపోలేదు. కాని, వీరి పేర చెప్పతగిన వొక పుణ్యకార్యమూ కనపడదు. ఈలాటి సంఘంలో బయలుదేరిన తాతయ్యసెట్టిగారు శ్రీరామునికి తమ ఆర్జితాన్ని యావత్తూ సమర్పించిన వృత్తాంతం బంగారపు అక్షరాలతో వ్రాయబడతగివుంది. తాతయ్యసెట్టిగారు శ్రీరామునికి దివ్యమైన ఆలయాన్ని నిర్మించి రంగూను ఆంధ్రుల కింత నామరూపాలను కల్పించారు. పూజలతో, వుత్సవాదులతో, సంతర్పణలతో, శ్రీరామస్మరణతో రంగూనుపరిసరాలన్నీ మ్రోగిపోయినాయి. శ్రీరాముడు తాతయ్యగారిని యెంతకఠినంగా పరీక్షిస్తూవున్నప్పటికీ ఆయన ఆత్మసమర్పణాన్ని తరతరాలవారికీ వ్రేలుపెట్టి చూపుతూనేవుంటాడు. ఎన్నికష్టాలుపడ్డా రామభక్తులు శ్రీరామనామం అమృతపానం అని గానం చేస్తూనేవుంటారు.

# శ్రీ వెలగల వెంకటరెడ్డిగారు

వెంకటరెడ్డిగారు రంగూనుకు వచ్చి 20 యేండ్లు అవుతుంది. అప్పట్లో బర్మాఆంధ్రులను కోరంగీలని పిలుస్తూ వుండేవారు. ఈలాటి స్థితిలో తను ఆంధ్రజాతీయ నాటక సభద్వారా ఆంధ్రత్వాన్ని విస్తరింపజేయడానికై వెంకటరెడ్డిగారు చేసినంత సేవ మరి యెవరూ చేయలేదు. "కోరంగీలంటే ఆంధ్రులే. వీరిలోనూ కవులూ, పండితులూ వున్నారు. వీరికీ సౌందర్యం వుంది. కళాభిమానం వుంది." అనే అభిప్రాయం చాలామటుకు వారి నాటక సంఘంమూలంగా బర్మాలో వ్యాపించింది.

ఆంధ్రజాతీయ నాటకసభ బర్మా అంతటా పేరు మోగి, బర్మాగవర్నరు ఘనతచెందిన సర్ హార్కోర్టు బట్లరుగారి ఆదరణకు పాత్రమయింది. సెనేసరిమ్ కమిషనరు బామ్‌గారు రెడ్డిగారి ప్రజోపయోగకార్యాలను శ్లాఘించారు. ఈ సభద్వారా ఆంధ్రత్వానికి ప్రతిష్ఠ యేర్పడడమే కాదు, అనేక ప్రజోపయోగసంస్థలకు ధనసహాయం లభించింది. ఆంధ్రసేవాసంఘంవారు రంగూనువిద్యాశాఖాధికారుల సహాయం లేకుండా ప్రజాభిమానంమీదనే ఆధారపడి, వుచితవిద్యావ్యా

ప్తిని పోషించారంటే యీ కృషికి వెంకటరెడ్డిగారి నాటకసభయొక్క సహాయమే విశేషంగా తోడ్పడింది. నా కార్మికపరిస్థితుల ప్రచారం సాగిందంటే అది వెంకట రెడ్డిగారి అధీనంలో వుండిన సునేరామ్ హాలుమూలం గానే మూలమూలలా పిక్కటిల్లిపోయింది. రంగూను ఆంధ్రాభ్యుదయప్రచారంలో వెంకటరెడ్డిగారినీ, సునే రామ్‌హాలునూ మరవడానికి వీలులేదు.

ఆంధ్రదేశంలో భాషాభిమానం, సారస్వతాభి మానం తరంగాలవలె పొంగి, గ్రంథమాలలూ, భాషాభి వర్ధనీసంఘాలూ బయలుదేరిన కాలంలోకూడా వెంకట రెడ్డిగారు ఆ భారంవహించినవారిలో ఒకరు. వారు స్థాపించిన ఇతిహాసతరంగణీగ్రంథమాలమూలంగానే ఆంధ్రుల చరిత్ర తృతీయభాగం దేశానికి లభించింది. ఆంధ్రప్రతిభ వెల్లడిఅయింది. వెంకటరెడ్డిగారు సర స్వతీసేవ చేశారు. కళాభివృద్ధిని పోషించారు. విద్యాభి మానాన్నీ, సేవాభిలాషనూ ప్రకటించారు. ప్రజోపయోగ కార్యాలకు తోడ్పడ్డారు. ఆంధ్రజాతీయతను బలపరచారు.



శ్రీ వెలగల వెంకటరెడ్డిగారు



శ్రీ సాలాపు బుల్లి అప్పన్నగారు

## శ్రీ గుత్తుల సూర్యనారాయణగారు

భూస్వాములు, పడవల యజమానులు, సెట్టిబలిజ యువజనసంఘాధ్యక్షులు, సెట్టిబలిజ శ్రీరామాలయ ధర్మకర్తలు అయిన గుత్తుల సూర్యనారాయణగారు బర్మా ఆంధ్రులలో సుప్రసిద్ధులు. వెంకటస్వామిగారి అనంతరం ఆంధ్రమహాసంఘం బలహీనమయింది. ఈ సంఘంయాజమాన్యంక్రింద నడుపబడుతూవున్న పాఠశాలలకు భంగంకలిగే పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈలాటి క్లిష్టసమయంలో సూర్యనారాయణగారు పూనుకొని, యీ సంఘానికీ, యీ పాఠశాలలకూ తోడ్పడకపోయి వుండినట్టయితే పర్యవసానం ఏవిధంగా వుండేదో?

మన దృష్టిని కాస్త తూర్పుగోదావరిజిల్లావైపుకు త్రిప్పుదాం పట్టండి. సూర్యనారాయణగారు కొంత కాలం ఆ జిల్లాబోర్డు వైసుప్రెసిడెంటుహోదాను వహించారు. బీదసాదలకు యీ అధికారాన్ని యెంతవరకూ వుపయోగించాలో అంతవరకూ వుపయోగించి ప్రజల మన్ననలకు పాత్రులయినారు. పాఠశాలలు లేనిచోట్ల పాఠశాలలను పెట్టించీ, రోడ్లు లేనిచోట్ల రోడ్లు వేయించీ, నూతులు లేనిచోట్ల నూతులు త్రవ్వించీ—యీలాగున గ్రామ

వాసులకు చేసిన వుపకారాలనుగురించి ప్రజలు యిప్పటికీ చెప్పుకుంటూనేవున్నారు. ఇంతటితో తృప్తిచెంది వూరుకొన్నారా? లేదు. బెల్లపుధరలు పడిపోయినాయి. బీదలు అల్లాడుతున్నారు. కాస్త ధరలను పెంచడానికిన్ని, బీదలను నిలబెట్టడానికిన్ని వారు నడుముకట్టి నిలబడకపోయినట్టయితే పెద్దసంక్షోభం బయలుదేరివుండేది. పెద్ద విపత్తును తప్పించారు.

సూర్యనారాయణగారు ధాం ధూం అని మాట్లాడినా బోళామానసి. బీదసాదలను ఆదరిస్తారు. ఏ మంచి పని వచ్చినా ఆనుకుంటారు. స్నేహపాత్రులు. బహ్మాఆంధ్రుల క్షేమాన్ని కోరుతూ, దానికై కృషిచేస్తూవున్న సూర్యనారాయణగారు వెనుకఅండగా వున్నారంటే అందరికీ ధైర్యమే, అందరికీ వుత్సాహమే.

## శ్రీ రామదేవు ఆదినారాయణగారు

బ్రిటిష్ ఇండియాస్టీమ్‌నావిగేషన్ కంపెనీగొప్ప నౌకా సంఘం. రంగూనులో యీ కంపెనీ తాలూకు ఓడలలో యెగుమతిదిగుమతిపనులను చేసుకొని చాలామంది ఆంధ్రులు జీవిస్తున్నారు. వీరికి రామదేవు ఆదినారాయణ గారు సర్దారు. కూలీసర్దార్.

ఆదినారాయణగారు కాపులు. పూర్వీకులది బందరు. వందలకొద్దీ జనులకు సర్దారుగా వున్నప్పటికీ గర్వంలేదు. దర్పంలేదు. ప్రతిపక్షులు పద్మవ్యూహంలో యిరికించి అన్ని వైపులనుంచి తీవ్రమైన బాణాలను విసురుతున్నప్పటికీ బెదరులేదు, అదరులేదు. ఇంతటి నేర్పరితనం, కార్యదక్షత, నమ్రత గల యింకొకరు బర్మాఆంధ్రులలో వున్నారో లేదో? మూడుతరాలవరకూ యెంత ధారాళంగా ఖర్చు చేసినప్పటికీ అన్నోదకాలకు లోటులేకుండా వసతులు కల్పించుకొన్నారు. సిరిసంపదలకు తక్కువలేదు. బీదసాద లనూ, చిన్నపెద్దలనూ కనిపెట్టినడచే నమ్రులు. జీతం లే దని యెవరో విద్యార్థి వస్తాడు. కేవులేదని యెవరో రోగిష్ఠి వస్తాడు. "బాబయ్యగారూ, నా పెనిమిటి చెప్పకుండా వెళ్లిపోయా" డని యెవరో స్త్రీ వస్తుంది. మహాభార

తాన్ని కథగా చెప్పే యెవరో హరిదాసు వస్తాడు. ఎవరు వచ్చినా, యెవరు అర్థించినా నలుగురితో పాటే కాదు, సామాన్యంగా అధికంగానే, ఆర్భాటం లేకుండానే, గోప్యంగా ఏదో చేతిలో పెట్టి పంపే దయాళువు.

బర్మా ఆంధ్రులను క్లిష్టపరిస్థితులు యెదుర్కొంటూ వున్న కాలం యిది. ఈలాటిస్థితిలో ఏ ఆందోళనను బయలు దేర తీసినప్పటికీ అది అనుకొనే సవరణకు బదులు అసలుకే మోసం తెచ్చే పరిస్థితులను కల్పించేటట్టుగా వుంటే ముందు వెనుకలను ఆలోచించవలసివుంటుంది. నిర్వీర్యంగానూ, నిస్తేజంగానూ పడివుంటూవున్న సంఘం తెలివి తెచ్చుకొని కార్యక్రమాన్ని నేర్పరితనంతో నిర్వహించవలసివుంటుంది.

ఆదినారాయణగారు యెప్పుడో చిన్నప్పుడే రంగూనుకు లేచివచ్చినారు. కష్టాలు పడ్డారు. మంచి స్థితికి వచ్చినారు. పలుకుబడిని సంపాదించుకొన్నారు. బర్మా ఆంధ్రసంఘాన్ని బలవంతమయిందిగానూ, పరిశుద్ధమయిందిగానూ చేయడానికై కావలసిన కృషికి ఇప్పుడు బందరుగాలి తగిలిన ఆదినారాయణగారే పూనుకోవలసిన అవసరం ఏర్పడింది.



శ్రీ రామదేవు ఆదినారాయణగారు



శ్రీ గూడా[illegible]కటరెడ్డినాయుడుగారు

# శ్రీ గూడాల వెంకటరెడ్డినాయుడుగారు

మునిసిపల్ సభ్యులున్నూ, ఆనరరీ మేజస్ట్రేటున్నూ, భూస్వాములున్నూ, వర్తకులున్నూ అయిన గూడాల వెంకట రెడ్డినాయుడుగారు ఒక మోల్మీన్ లోనేగాక బర్మా ఆంధ్రులందరిలోనూ ప్రసిద్ధివహించిన నాయకులు. వారికి సహజాలంకారాలుగావున్న వినయం, గర్వరాహిత్యం, నిరాడంబరత—యీలాటి గుణాలవల్ల, చొరవగా ముందుకుతోసుకొనిపోయే స్వభావం అంతగా లేకపోయినా వారి రాజభక్తి, వారి ప్రజాసేవ ప్రభుత్వంవారి ఆదరణకూ, ప్రజల అనురాగానికీ పాత్రమయినాయి. వెనక జర్మనీవారికీ, ఇంగ్లీషువారికీ యుద్ధం వచ్చినప్పుడు ప్రభుత్వంవారికి క్లిష్టపరిస్థితులు ఏర్పడ్డాయి. ప్రభుభక్తితో పని చేయగల ప్రముఖుల ఆవశ్యకత అప్పుడువిశేషంగా కలిగింది. ఈ స్థితిలో మన నాయుడుగారు ముందుకువచ్చి, ప్రభుత్వానికీ, రాజ్యానికీ చేసిన సేవ మరవడానికి వీలు లేదు. ప్రభుత్వానికి యుద్ధసమయంకన్నా క్లిష్టకాలం లేదు. అప్పుడు కలిగే అవసరాలకు అంతు ఉండదు. నాయుడుగారు పటాలాలకు శిపాయిలు కావలిస్తే చేర్చినారు.

యుద్ధనిధులకు ద్రవ్యం కావలిస్తే సమకూర్చినారు. రణరంగానికి పోయినవారికి సౌకర్యాలు ఏర్పాటుచేయించారు. దేవాలయాలలో అర్చనలుచేయించారు. సమారాధనలు జరిపించారు. పామరజనానికి బోధించారు. ప్రజలలో కలవరంపుట్టకుండా తమ పలుకుబడిని వినియోగించారు. ఇదీ అదీ అని లేదు, ఏ అవసరంవస్తే ఆ అవసరాన్ని నెరవేర్చినారు.

ఇంతసేవ గావించిన వెంకటరెడ్డినాయుడుగారిని ప్రభుత్వంవారు మరవడానికి వీలులేదు. అక్కడ లండనులో ఇండియాప్రభుత్వకార్యదర్శిగారూ, ఇక్కడ ఇండియాలో గవర్నరుజనరలూ, లెఫ్టినెంటుగవర్నర్లూ గౌరవంమీద గౌరవం, సన్మానంమీద సన్మానం కురిపించారు. 1918–వ సం. లో వారిసేవను మెచ్చుకొంటూ గవర్నరు జనరలుగారు ఒక సనదును పంపారు. 1920–వ సంవత్సరంలో యుద్ధశాఖాధికారులు ఒక పతకం బహూకారం చేసి తమకుగల గౌరవభావాన్ని విశదీకరించారు. స్థానికాధికారులు ఆనరరీమేజస్ట్రేటుపదవియిచ్చి తమ విశ్వాసం వెల్లడించారు. ప్రజలు మునిసిపల్ కౌన్సిలరుగా ఎన్నుకొని తమ అభిమానాన్ని ప్రకటించారు. ఒకదాని తర్వాత ఒకటి గౌరవాలు దొర్లుకుంటూ వచ్చినాయి.

నాయుడుగారి ప్రభుభక్తి యుద్ధసమయంలో ప్రభుత్వపుసేవగా పరిణమిస్తే, శాంతసమయంలో అది ప్రజాసేవగా విజృంభించింది. వారు ఆంధ్రమహాజనసంఘం ద్వారా విద్యాభివృద్ధిని ప్రోత్సాహపరచారు. మునిసిపల్ సభ్యులుగా నగరాభివృద్ధికి తోడ్పడ్డారు. ఆనరరీమేజస్ట్రేటుగా న్యాయాన్ని పాలించారు. వారి తీర్పులలో కొన్ని లారిపోర్టులలోకి సహా యెక్కినాయి. వారి ప్రజాసేవ ఇంతటితో పూర్తికావడంలేదు. సెంటుజాన్ ఆంబులెన్సు అసోసియేషను యావజ్జీవసభ్యులై వైద్యసౌకర్యాలకు తోడ్పడుతూ, శిశువుల ఆరోగ్యాభివృద్ధి శాఖలో సభ్యులై చంటిపిల్లల ఆరోగ్యాన్ని కాపాడుతూవస్తున్నారు. విక్టోరియా మహారాణి, యెడ్వర్డుప్రభువుల స్మరణప్రయత్నాలు వచ్చినాయనగానే నడుముకట్టి నిలబడ్డారు. టవాయిలో యిళ్లు కాలి ప్రజలు కష్టపడుతున్నారంటేనూ, గోదావరిజిల్లాలో వరదలువచ్చి పంటలుపాడైపోయినాయంటేనూ ఆపదలో వున్న ఆ బీదలసంగతి మరచిపోలేదు. చేతలం యాత్రికులు దారిలో త్రాగడానికి నీరు, భోజనసదుపాయం లేక కష్టపడుతున్నారంటే నూయి త్రవ్వించి, సత్రంవేయించి, అన్నదానంచేయించి యిబ్బందులు పోగొట్టినారు. పశువులసౌకర్యానికి తవుడు యేర్పాటు చేయించారు.

ఇన్ని విధాలుగా ప్రభుత్వాన్నీ, ప్రజలనూ సేవిస్తూ వున్న వెంకటరెడ్డినాయడుగారిని బర్మాగవర్నరుగారు శ్లాఘిస్తూ 1932–వ సంవత్సరంలో ఒక రివాల్వరును బహూకరించి గౌరవించివున్నారు. కాని యిది వారి సేవకు చాలిన సన్మానమని తోచదు. ఇంకా అధికమయిన గౌరవాలేమయినావుంటే వాటికి వెంకటరెడ్డిగారు అన్నివిధాలా అర్హులు.

—— ——

## శ్రీ పరిమి సోమరాజుగారు

మర్టబాన్‌లో రైల్వే కాంట్రాక్టరులు, కార్గో బోట్ల యజమానులు, ఆంధ్రమహాజనసంఘం ప్రెసిడెంట్లు అయిన పరిమి సోమరాజుగారు బర్మాఆంధ్రప్రముఖులలో ముఖ్యులు. వృత్తివల్ల కూలికాంట్రాక్టుదారులయినా తమక్రింద పనిచేసేవారియొక్క మాత్రమే కాక, మోల్మీనులోని తదితర కార్మికుల అనురాగానికీ, అభిమానానికీ, కృతజ్ఞతకూ పాత్రులైనవారిలో సోమరాజుగారిని ముఖ్యంగా చెప్పవలసిఉంటుంది. 1928-వ సంవత్సరంలో మోల్మీనులో బియ్యపు మరలలో పనిచేసే కార్మికుల కూలిరేట్లు తగ్గి, కార్మికులు తమ పనిపాటులను మానుకొని, పెద్ద సంక్షోభం ప్రారంభమయినప్పుడు సోమరాజుగారి తోడ్పాటు, అభిమానాల వల్లనే ఆ వ్యవహారం అనుకూలంగా పరిష్కారమయింది. బత్తెఖర్చులయినా లేక, అనేకకష్టాలు పడుతూవుండిన ఆ రోజులలో సోమరాజుగారే కార్మికులపక్షాన నిలువబడక పోయివుండినట్టయితే యీ ప్రయత్నం ఆరంభంలోనే చచ్చేది. తిరిగీ మొన్న బియ్యపుమరలలో రేట్లు పడిపోయి, కూలిజనులలో పెద్ద ఆందోళన ప్రారంభమై,

పనిపాటులన్నీ స్తంభించిపోనున్న సమయంలోకూడా సోమరాజుగారి కృషిచేతనే ఈ వుపద్రవం తప్పింది.

ఆంధ్రమహాజనసంఘంవారు చేస్తూవున్న పనులలో ముఖ్యంగా బాలబాలికల విద్యావ్యాప్తికై జరిగే కృషికి ప్రథమస్థానం యివ్వవలసిఉంటుంది. మోల్మినులో ఎన్నో సంఘాలు పుట్టినాయి, గిట్టినాయి. ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా ఆంధ్రమహాజనసంఘంమాత్రం యింతవరకూ సజీవంతోవుండి బాలబాలికల విద్యాభివృద్ధికై కృషి చేస్తూవున్నదంటే యీ కీర్తి చాలాభాగం సోమరాజు గారికి చెందవలసివుంది. పాఠశాల కింకా రికగ్నిషను రాలేక, చందాలవల్ల వచ్చే సొమ్ము పంతుళ్లజీతాలకే చాలక, పిల్లలు కూర్చోడానికి చాలినన్ని బల్లలు లేక, రుక్మానంద బాబుగారిచ్చిన గది చాలక ఆంధ్రమహాజన సంఘంవారు పెనగులాడుతూవుండినరోజులలోసోమరాజు గారే పూనుకోకవుండినట్టయితే యీ సంఘం, యీ పాఠశాల అప్పుడే అంతర్ధానమైవుండేవి. స్థలం లేక బడి యెగిరిపోయేసమయంలో నయాబస్తీలోని తమ సొంత మేడమీాది పై అంతస్తు వుచితంగా యివ్వకపోయి నట్టయితే యీ పాఠశాల అప్పుడే యెగిరిపోయివుండేది. చివరకు రికగ్నిషనుకు యీ స్థలం అడ్డంవస్తూవున్న

దంటే, శ్రీమతి సుందరమ్మాళ్ గారితో మాట్లాడి, వారి మేడను వుచితంగాయిచ్చే యేర్పాటుచేసుకొనివచ్చి పాఠశాలను నిలవబెట్టిందీ, రికగ్నిషన్ రావడానికి తోడ్పడ్డదీ సోమరాజుగారే. మాటలు చెప్పడానికేమిగాని, ప్రస్తుతం మోల్మీనులోని తెలుగుపిల్లల కింతచదువు అబ్బుతూవుందంటే యీ గౌరవంలో చాలాభాగం సోమరాజుగారికే ముట్టవలసిఉంది.

పొలాలు, పడవలు, స్టీములాంచీలు, యిండ్లు, పశువులు, ఏనుగులు మొదలైన వస్తువాహనాలనుకలిగి పెద్ద కాంట్రాక్టుపనులెన్నో చేయిస్తూ మోల్మీన్ ఆంధ్రులలో కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన సంపన్నగృహస్థు సోమరాజుగారు. వారి విద్యాభిమానం, ప్రజాభిమానం ఒక మోల్మీన్ నగరాన్నే అంటిపెట్టుకొనివుండడంలేదు. ఇతర చోట్లకున్ను వ్యాపించివుంది. వారి ఆదరణకు తెలుగువారెంతపాత్రులో బర్మనులున్ను అంత పాత్రులవుతూవున్నారు. మర్టబాన్ లోని బౌద్ధసన్యాసుల మఠానికి సరియైన దీపాలులేక చిక్కులుపడుతూవుంటే సోమరాజుగారే విద్యుద్దీపాలనుపెట్టించి ఆలోటును తీర్చినారు. థటూన్ లో బర్మనుపాఠశాలా వైద్యాలయమూ ద్రవ్యంలేక నీరసస్థితికివస్తే సోమరాజుగారే వాటిని లేవనెత్తి థటూన్

వాసులకు స్థిరమైన ఉపకారంచేశారు. మర్టబాన్‌లో ప్రొద్దుటిపూట సోమరాజుగారి యింటిముంగల భిక్షకు నిలబడే బౌద్ధసన్యాసులను, సన్యాసినులను కాస్తచూస్తే బర్మనులకు వారిపైన ఎంత అభిమానముందో విశదమవుతుంది. మర్టబాన్ యేటియివతలివ్రూరు. ప్రజాసౌకర్యాలు తక్కువ. అయినా అతిథిఅభ్యాగతులు వచ్చినారంటే సత్కారానికి పేరుపడ్డది సోమరాజుగారే. వెనుక శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు మోల్మీన్‌ను దర్శించినప్పుడు సోమరాజుగారి అతిథిగానేవుండి వారి ఆదరణకు యెంతో సంతోషించారు.

సోమరాజుగారి రాకకుపూర్వంమోల్మీన్‌లో ఆంధ్ర సంఘాలు లేవు. ప్రజాసమావేశాలు లేవు. పత్రికా పఠనం లేదు. పాఠశాలలు లేవు. వారువచ్చిన స్వల్పకాలంలోనే ఆంధ్రమహాజనసంఘం స్థాపింపబడ్డది. విద్య పోషింపబడుతూవుంది. ప్రజలు తమ కష్టసుఖాలను వెల్లడించడం నేర్చుకొంటున్నారు. సామాన్యజనులయందు మెల్లగా ఆత్మవిశ్వాసం, ఆత్మవిచారణ మొలకలెత్తి ప్రజాక్షేమానికి దోహద మొసగుతూవున్నాయి.

సోమరాజుగారు రామభక్తులు. సాధుపురుషులు. దాతలు. మోల్మీన్ ఆంధ్రులకు మణిపూస.

## శ్రీ కర్రి అప్పలస్వామిగారు

భూస్వాములు, రైసుమిల్లు యజమానులు, ఆంధ్ర మహాజనసంఘపు వైసుప్రెసిడెంట్లు, మోర్మిన్ స్థిరనివాసాంధ్రులు అగు కర్రి అప్పలస్వామిగారిని స్వయంగా చూచి కాకపోయినా వారి కీర్తిప్రతిష్ఠల వ్యాప్తిచేతనయినా వారి పేరు విననివారు మిక్కిలి తక్కువగా ఉంటారు. కొంచెం నలుపు. మితభాషి. భక్తిప్రధానమైన వాక్కు. ఏ సత్కార్యానికిన్నీ వెనుకడుగు లేదు. పాత్రాపాత్రతలను గుర్తెరిగి తోడ్పడే సంపన్నగృహస్థు.

ఆంధ్రమహాజనసభ జయప్రదంగా నడుస్తూవుందన్నా, చిన్నలకూ పెద్దలకూ సంఘట్టన పొసగకుండా ఆనుకూల్యంతో వ్యవహరించుకొంటూవున్నారన్నా, సంఘంవారి పాఠశాల ఇంతకాలం నిర్విఘ్నంగా సాగుతూవుందన్నా యీ గౌరవంలో చాలాభాగం అప్పలస్వామిగారికి చెందవలసిఉంటుంది. ఎన్నోసార్లు సంఘం విచ్ఛిన్నమయిపోయే సందిగ్ధావస్థ యేర్పడినప్పటికీ, పెద్దల నుండి యువకులు చీలిపోయే సన్నాహం జరిగినప్పటికీ అప్పలస్వామిగారి దూరదృష్టి, సమయోచితవర్తనం, చలనంలేని ప్రజాభిమానం, కల్మషరహితమైన మనస్సు-

యీలాటి లక్షణాలే, యోగ్యతే అట్టి విపత్తునుండి రక్షింపగలిగినాయి.

అప్పలస్వామిగారు లక్షాధికారులు కారు. కాకపోయినా, హృదయపూర్వకమైన సహాయం, సంతోషపూర్వకమైన తోడ్పాటు చేయడంలో అగ్రగణ్యులు. మోల్మీనుబస్తీకి పండితుడుగాని, భక్తుడుగాని, విద్యార్థిగాని, గ్రంథకర్తగాని—యెవరు వెళ్లినా ఆ సంబంధమైన చందాజాబితాలో అప్పలస్వామిగారి పేరు ముందు ఉండితీరవలసిందే.

ఈ మధ్య కొంతకాలంనుంచి అప్పలస్వామిగారు ప్రాపంచికగోష్ఠినుండి మరలి ధార్మికమీమాంసలోకి దిగారు. సాధువులతోనూ, పుంగీలతోనూ సాంగత్యం చేస్తున్నారు. గౌరవాలూ, ప్రాముఖ్యాలూ వచ్చి మీద పడుతూవున్నా తొలగిపోయే స్వభావంగలవారు. నిగర్వులు. వారి గృహంలో పిల్లలు మొదలు పెద్దలవరకూ అంతా శ్రీరామపూజలో, స్మరణలో నిమగ్నులై వుంటారు. వారి యింటిలో అడుగుపెట్టితే ఏదో వొకవిధమైన ధార్మిక వాతావరణమే కనిపిస్తూ వుంటుంది.

అప్పలస్వామిగారు తమ వ్యాపార వ్యవహారాలలో క్రమంగా ఒక మెట్టునుంచి యింకొక మెట్టుకు యెక్కి

తూవున్నారు. పెద్దబెయ్యపుమరకు అధిపతులుగావున్నా ంబికత్వంలేని వర్తనం. కల్మషమెరుగని హృదయం. వివేచనగల ధర్మం. ఈలాటి అప్పలస్వామిగారికి బర్మా స్థిరనివాసాంధ్రులలోనే కాదు, బర్మాఆంధ్రులందరి లోనూ అగ్రస్థానం యివ్వవలసివుంటుంది. వారు మోల్మినుఆంధ్రులకు వెన్నెముకగావుండి ఆర్భాటం కనుపించని వుపకారాన్నీ, స్వీయలబ్ధమైన జ్ఞానాన్నీ ప్రజా సమూహంలో వెదజల్లుతున్నారు.

# శ్రీ సాలాపు బుల్లి అప్పన్నగారు

నిండైన విగ్రహం, ప్రశాంతమైన మనస్సు, దయను ప్రకటించే చూపులు, ఊరిమీద వూరుపడ్డా ఏ గొడవకూ పోని వర్తనం గల బుల్లి అప్పన్నగారిని మోల్మీను ఆంధ్రులలో యెరుగనివారు లేరు. చాలాకాలంనుండి బి. ఐ. వారి యొక్క, ఈ మధ్య కొంతకాలంనుండి సిండియావారి యొక్క పనిపాటులను చేయిస్తూ, భోగభాగ్యాలకు ఖ్యాతి కెక్కినవారిలో ముందు వారిని చెప్పవలసిఉంటుంది.

బుద్ధి పుట్టిందాంటే, ఒక పనియొక్క ప్రయోజనం నచ్చిందాంటే ధారాళంలో వారికిచాలిన చెయ్యిలేదు. దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు మోల్మీనుకు వచ్చినప్పుడు యిల్లుకదలని అప్పన్నగారు ప్రత్యేకంగా మర్టబాన్ దగ్గరకు యెదురుగావెళ్లి, పంతులుగారిని ఆహ్వానించి, మోల్మీన్‌లో ఘనమైన స్వాగతాన్ని యేర్పాటు చేయడమే కాకుండా, వారికి అంగరక్షకులుగా వుండి, మోల్మీన్‌లోచేసిన ఉత్సవాన్నీ, పాఠశాలలో జరిగిన సభనూ, తర్వాత నిర్వహింపబడిన అల్పాహారపు విందునూ బహుజయప్రదంగా నిర్వహించి, తమయందు గర్భితంగా వున్న శక్తినీ, ప్రజపైగల వశీకరణశక్తినీ, దేశారాధకులపై

గౌరవాన్నీ, సమయము వచ్చినప్పుడు సత్కార్యా నడపగల సామర్థ్యాన్నీ ప్రకటించారు. నాగేశ్వరరావు లుగారు అప్పన్నగారి కార్యనిర్వాహక సామర్థ్యా న్ని శ్లాఘించారు.

రంగూనుమండల ఆంధ్రసభ వచ్చిందంటే, దీనికిన్ని మోల్మీనువారికిన్ని విశేషమైన సంబంధం లేకపోయినా, కేవలం ఆంధ్రాభిమానాన్నే, ఆంధ్రుల అభివృద్ధినే ప్రధా నంచేసుకొని, ఆలోచించకుండా, త్రిప్పకుండా, పెద్ద విరా ళంయివ్వడంతో తృప్తిచెందకుండా "యింకేమయినా తక్కువపడితే మళ్లీరండి" అని చెప్పిన వుదారహృద యులు. ప్రతిసంవత్సరం చేతలందగ్గర పెద్ద వుత్సవం జరు గుతూవుంటుంది. ఇక్కడికి వేలకొలది యాత్రికులు వస్తారు. ఉండడానికి సరియైన చోటు, త్రాగడానికి శుభ్రమైన నీరు లేకుండా ప్రజలు చాలా కష్టపడు తారు. ఈలాటి స్థితిలో అప్పన్నగారి మనస్సు దీని మీదకు పోయి, విశాలమైన ఒక సత్రాన్ని నూతితో సహా కట్టించి, దాని పోషణకై స్థిరమైన వసతిని యేర్ప రచి, యెంతోకాలంనుంచి వున్న యిబ్బందిని తొలగించి నందుకు సంతోషింపని, ఆయనపేరు తలచని యాత్రి కుడు లేడు. మోల్మీన్ ఆంధ్రులలో ఐశ్వర్యంలో అప్పన్న

గారికి సాటి అప్పన్నగారే. ఆయన ఎంత ఐశ్వర్యవం డో అంత నిగర్వి. ఎంత నమ్రతో అంత చొరవ నిదానమో అంత గాంభీర్యం. అప్పన్నగారివంటివా ఇక్కడ ఉండడంచేతనే మోల్మిన్ ఆంధ్రసంఘం నెమ్మ దిగా ఒడుదుడుకులు లేకుండా సాగిపోతూవుంది.

---